# చరితార్థుడు

[జార్జి వాషింగ్టన్ దివ్య జీవితం]

రచన:

మార్కస్ కన్‌లిఫీ

అనువాదం:

ధనికొండ హనుమంతరావు



ప్రచురణ:

యం. శేషాచలం అండు కో.

మద్రాసు : మచిలీపట్టణము : సికింద్రాబాదు

*Charitarthudu* (A Fascinating Biography of George Washington), Telugu translation of Marcus Cunliffe's *George Washington: Man & Monument*, by Dhanikonda Hanumantha Rao. Price Rs. 3-50.



ప్రథమ ముద్రణ, 1961

ప్రకాశకులు :

యం. శేషాచలం అండు కో

మద్రాసు : మచిలీపట్టణము : సికింద్రాబాదు

ముద్రణ :

వెల్డన్ ప్రెస్

146, తిరువొత్తియూర్ హైరోడ్డు,

మద్రాసు-21.

వెల : రూ. 3-50





# విషయ సూచిక

# చరిత్రార్థుడు

—:o:—

## 1. వాషింగ్టన్ స్తూపం

వాషింగ్టన్ పట్టణంలో, వాషింగ్టన్ జ్ఞాపకార్థం నిర్మించబడిన కట్టడం 555 అడుగుల ఎత్తున ఉన్నది; అంటే ఇది కొలోన్ కెథిడ్రల్ శిఖరంకన్నా, రోమ్‌లోని సెయింట్ పీటర్స్ శిఖరంకన్నా, పిరమిడ్స్‌కన్నా ఎత్తు. 1799 డిసెంబర్‌లో జార్జి వాషింగ్టన్ చనిపోయేనాటికే కొత్త ఫెడరల్ ముఖ్య పట్టణం ఆయన గౌరవార్థం వాషింగ్టన్ అనేపేరున పిలువబడుతోంది. ఈ గౌరవాన్ని మరింతగా చూపేందుకని ఆయన రాజకీయ, సైనిక జీవితాలలోని ముఖ్యఘట్టాల జ్ఞాపకార్థం ఒక పాలరాతి కట్టడాన్ని నిర్మించాలని ప్రజాప్రతినిధుల సమావేశం తీర్మానించింది. ఈ ఆలయానికి కిందుగా వాషింగ్టన్ శరీరాన్ని సమాధిచేయాలని వారు ఉద్దేశించారు. కాని, అర్థంకాని కొన్ని కారణాలవల్లా, తదితరకారణాలవల్లా ఆ కట్టడనిర్మాణం జరగలేదు. నేడు అంబరచుంబిగా ఉండే ఆ కట్టడం ఆ తరువాత (అంటే జార్జి వాషింగ్టన్ తన జాతికి విజయాన్ని చేకూర్చి, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను సంపాయించి ఇచ్చిన వంద సంవత్సరాలకు) నెలకొల్ప బడింది. దాని పునాదిలో కొన్ని వేలటన్నుల కాంక్రీటు వేయబడింది.

ఐనప్పటికీ ఏమహావ్యక్తి జ్ఞాపకార్థం అది నెలకొల్ప బడిందో ఆవ్యక్తి తాలూకు అస్థికలు అక్కడలేవు. అక్కడికి కొన్ని మైళ్ళదూరంలో, వాషింగ్టన్ నివసిస్తూండే మౌంట్ వెర్నన్ లోని భవనంలో అవి భద్రపరుచ బడినవి.

లెక్కలేనంతమంది యాత్రికులు మౌంట్ వెర్నన్‌ను దర్శిస్తారు. ఆప్రదేశం కన్నులకింపుగా, ఎంతో సక్రమ విధానంలో మంచి అభిరుచుల్ని వెల్లడించే పద్ధతిలో అమర్చబడి ఉన్నది. అక్కడి భూతాలు విజయవంతంగా తరిమివేయ బడినవి. మౌంట్ వెర్నన్‌ను భవనమనటంకన్న, పురాతన వస్తుసామగ్రిఉన్న ఆలయ మనటం సమంజసం. జార్జి వాషింగ్టన్ అక్కడ జీవితాన్ని గడిపారనీ, అక్కడే పరలోక గతుడయ్యారనీ మనకు తెలుసు. ఐతే స్ట్రాట్‌ఫర్డ్-ఆన్-ఏవన్ లో మనకు షేక్స్పియర్ ఉనికి ఏవిధంగా గుర్తుకురాదో, మౌంట్ వెర్నన్‌లో జార్జి వాషింగ్టన్ ఉనికికూడా అదే విధంగా గుర్తుకురాదు. ఈఇద్దరూకూడా మహానుభావులు. వారి వ్యక్తిత్వాలు అద్భుతమైనవీ, ఘనమైనవీను. వీరిద్దర్ని గూర్చి ఒకానొక అమెరికన్ రచయిత ఇలా రాశాడు. "ఇంగ్లండ్ ప్రపంచానికి చేసిన మేళ్లల్లో గొప్పది షేక్స్పియర్ రచనలు; అమెరికా ప్రపంచానికి ఇవ్వగలిగిన మహోత్కృష్టమైనది జార్జి వాషింగ్టన్ సౌశీల్యం". ఈ తూచట మనేది మానవులు నిర్మించిన తక్కెడలో జరగలేదు.

నిజానికి ఇందులో ఎంతో భేదమున్నది. షేక్స్పియరునుగూర్చి నిశ్చయంగా తెలిసిందంటూ దాదాపు ఏమీ

లేదు. కాని వాషింగ్టన్‌నుగూర్చిన అనేక వివరాలు లభ్య మౌతవి. షేక్స్‌పియర్ రూపురేఖా విలాసాలను వివరించే చిత్రం ఒక్కటే లభ్యమౌతుంది. కాని వాషింగ్టన్ చిత్రాల (వీటిల్లో కొన్ని ఆయన్ను యథాతథంగా చిత్రించగలిగినవి) జాబితాలు మూడు సంపుటాలవుతవి. షేక్స్‌పియర్ స్వదస్తూరీ అనేదానికి ఆధారాలేమీ లేవు. అవి లభ్యమూ కావు. కాని వాషింగ్టన్ రాసిన ఉత్తరాలూ, డైరీలూ అచ్చులో నలభై సంపుటాలవుతవి. షేక్స్‌పియర్ సమకాలి కులు షేక్స్‌పియర్‌నుగూర్చి వివరంగా చెప్పింది దాదాపు ఏమీలేదు. కాని జార్జివాషింగ్టన్‌ను ఎరిగినవారూ, పరి చయస్థులూ, మిత్రులూ, చూడబోయినవారూ సైతం తమ తమ అభిప్రాయాలను రాశారు. షేక్స్‌పియర్‌ను ఆవ రించి అనుమానపు మేఘం ఉన్నది. కాని వాషింగ్టన్ జగ త్కీర్తితాలూకు జ్యోతుల్లో కనిపిస్తాడు.

ఈ మహోన్నత, చారిత్రాత్మక వ్యక్తినిగూర్చి తెలుసుకునేందుకు ప్రయత్నిస్తూ జీవితచరిత్రలు రచించేవారు అనేకవిధాలైన అనుభూతుల్ని పొందారు. షేక్స్‌పియర్ విషయంలో కొంతమంది చరిత్రకారులు ఆయనపేరిట చలా మణి అయే రచనల్ని షేక్స్‌పియర్ రాయలేదని, అంతకన్న అర్హతఉన్న వారెవరా అని వెదికారు; బేకన్ లేక మార్లోవ్ వీరిలో ఎవరనే ప్రశ్న లేవదీశారు. ఇక వాషింగ్టన్ విష యంలో వారి అనుభూతి వేరువిధంగా ఉన్నది. ఇన్నిరుజువు లంటూ ఉండగా అసలు వాషింగ్టన్ అనే వ్యక్తేలేడని ఎవ్వరూ నటనైనా చేయలేరు; లేదా యీ కీర్తి మరొకరికి

చెందాలనీ అనలేరు. ఆయన పురాణ వ్యక్తిగా మారిపోయి పురాణాల్లోనే సమాధి చేయబడ్డారు. వాషింగ్టన్ కట్టడం అసలు వ్యక్తిత్వాలూకు రూపు రేఖా విలాసాలనే మరుగు పరుస్తోంది. కాలగమనంతోపాటు యీకట్టడంకూడా పెరిగింది - దారినపొయ్యే ప్రతివాడూ ఒక రాయివేస్తే అవన్నీ కలసి బ్రహ్మాండమైన గుట్టగా రూపొందిన విధాన.

నిజానికి వాషింగ్టన్ పురాణపురుషుడు కావటం మాత్రమే కాదు; ఊపిరాడని మత్తునిచ్చేటంత గొప్ప గౌరవాన్ని పొందటం, కీర్తి ప్రతిష్ఠల నార్జించటం జరిగింది. ఆ గౌరవాన్నిచ్చినమాటలూ, పదాల కూర్పులూ మొదలైనవాటిని విసుగుజెందకుండా చదవటమూ కష్టమే! అంత తీపి మొహం మొత్తకుండా, కాస్త పులుపుకూడా అవసరమనిపిస్తుంది; అందుకనే ఎమర్సన్ అన్న యీ మాటల్తో మనం ఏకీభవించాలని వాంఛిస్తాం: "...ఏనాయకుణ్ణిగూర్చి చదివినా చివరకు విసుగెత్తక తప్పదు. జార్జివాషింగ్టన్‌లోని సచ్ఛీలతల గూర్చి చదివి చదివి చివరకు 'పాపం శమించుగాక!' అనుకుంటాం——"

వాషింగ్టన్ జ్ఞాపకార్థం మనముందు నిలబడిఉన్న కట్టడాన్ని సైతం క్షణకాలం విస్మరించి, పై అగౌరవ సూచకమైన మాటల్తో మనం కాస్త గాలిపీల్చుకున్నప్పటికీ, ఇవన్నీకూడా వాషింగ్టన్ వ్యక్తిత్వ పరిశీలనలో లెక్కకురాక తప్పవు. ఏమైనా పురాణము, వ్యక్తిత్వము పరిపూర్ణంగా భేదించవనే అనుమానం మనకు కలగవచ్చు; వాషింగ్టన్

తత్వం, ఆయన బహిరంగ జీవితం మొదలైనవి తెలుసు కునేందుకు యీ సూచనలు సత్యంమీదనే ఆధారపడినవి.

ఈ మహోన్నతమైన కట్టడం వెనుకనున్న చరిత్రను పైకిలాగేందుకు ముందు—అదంతా ఒకపురాణయుగంగా ఉండినదనే సత్యాన్ని తెలుసుకునేముందు, వాషింగ్టన్ జీవించి ఉండగానే ఆ పురాణం మొపొంద సాగిందని మనం గుర్తించ వలసి ఉంటుంది. మరణశయ్యమీద రోమన్ చక్రవర్తి వెస్పా సియన్ "పాపం శమించుగాక! నేనొక దేవుణ్ని కాబోతు న్నానని అనుకుంటున్నాను!" అని గొణిగాడంటారు...అలాటి అల్పాలోచనా, మహోత్కృష్టతా మిళితమవటం జార్జి వాషింగ్టన్ కు చాలా దూరమనే చెప్పాలి. 1799లో మౌంట్ వెర్నన్ లో మరణశయ్యమీదఉండి ఆయనకూడా న్యాయంగా అలాగే ఆలోచించి ఉండాలి. 1775 లోనే పసిపాపలకు ఆయనపేరు పెట్టడం జరిగింది. ఆయన ప్రెసిడెంట్ గా ఉన్న ప్పుడే మైనంతో చేయబడిన ఆయన ప్రతిమల్ని కొని, వాటిని చూడాలని దేశీయులు ఎంతో కుతూహలపడేవారు. ఆయన్ను మెచ్చుకునేవారికి 'భగవత్ స్వరూపుడైన వాషింగ్టన్'గా ఆయన కనిపించేవాడు; ఆయనపేరు ప్రతిష్ఠల్ని భగ్నం చేయా లనుకునేవారు, తమలోతాము, సగందేవుడల్లే ప్రజలకు కనిపించే ఈయన్ను విమర్శించటం దేశద్రోహంకింద అవు తుందే అని మథనపడేవారు.

1783 లో ఏల్ యూనివర్సిటీలోని ఇజ్రాస్టైల్స్ ప్రార్థనాపూర్వకంగా ఇలా అన్నాడు: "వాషింగ్టన్! నీ

పేరంటే నాకెంత ప్రేమ! ఈ మానవ ప్రపంచానికే మకుటంగా ఉన్న నీలాటి పురుషోత్తముణ్ణి సృష్టించినందుకు ఆ భగవానుని నేను ఎన్నిసార్లు మెచ్చుకొని, శ్లాఘించాను!... నీ పేరు విన్నంతమాత్రానే శత్రువుల శతఘ్నులనుండి పిచ్చిగా వెలువడే గుళ్లు ఆగి పోతవి; అస్వతంత్రత కారణంగా అవమానించాలని ప్రయత్నించేవారు నీ పేరు విని నిశ్చేష్టులవుతారు. 'నేను రూపొందించిననాయకుణ్ణి ముట్టుకోవొద్దు—' అన్న ఆజ్ఞ స్వర్గంనుంచే వచ్చిందన్నంతగా శత్రువులు భయపడతారు. నీకీర్తివాయువు లిచ్చే సుగంధంలాటిది అరేబియన్ సుగంధ ద్రవ్యాలలో లభ్యమవదు. దేవదూతలే ఆ సుగంధాన్ని స్వర్గానికి కొనిపోయి, విశాలవిశ్వాన్నే సుగంధపూరితం చేస్తారు.''

పురాణం నిజంగా ఇక్కడే రూపొందసాగింది. ఆయన సమకాలికులు కురిపించిన మెచ్చుకోళ్లన్నీ జార్జి వాషింగ్టన్‌లో మానవాతీతశక్తులున్నవనే భావాన్ని వెల్లడిస్తున్నవి. ఈ విషయాన్ని నిరూపించేందుకు మనం ఎక్కువ శ్రమించ నవసరంలేదు. ఎందుకంటే భగవత్‌స్వరూపుడైన వాషింగ్టన్ మరణానంతరం మరింతగా పురాణపురుషుడయ్యాడు; ఆయన ఇంటిపేరిట ఒక రాష్ట్రమే వెలిసింది; ఏడు పర్వతాలకు, ఎనిమిదినదులకు, పదిసరస్సులకు, 33 జిల్లాలకు, ఎనిమిది అమెరికన్ కాలేజీలకు, 121 అమెరికన్ పల్లెలకు, పట్టణాలకు ఆయనపేరు వచ్చింది. ఆయన జన్మదినం చాలా కాలంగా జాతీయసెలవుదినంగా ఉంటూాన్నది. ఆయన

బొమ్మ నాణాలమీదా, బాంక్ నోట్లమీదా, పోస్టేజి స్టాంపులమీదా వెలువడింది. ఆయన ప్రతిమలు అనేక కార్యాలయాల్లో అలంకరించబడినవి. దక్షిణ డకోటాలో ఆయనతల—గడ్డందగ్గర్నుంచీ నెత్తిపెంకువరకూ—60 అడుగుల ఎత్తున ఒక పర్వతంలో తొలచబడింది. యునైటెడ్ స్టేట్స్ అంతటా-ప్రపంచమంతటా ఆయన విగ్రహాలు వెలిసినవి. ఆ విగ్రహాలను లండన్, పారిస్, బోనస్ ఎరిస్, రియోడీజనిరో, కారకస్, బుడపెస్ట్, టోకియోలలో చూడొచ్చు.

ఇవన్నీకూడా వాషింగ్టన్ నాయకత్వానికి ప్రపంచంలో కనిపించే బాహ్యాచిహ్నాలు. ఐతే మనం ఆయన జ్ఞాపకార్థం నిర్మించబడిన కట్టడంలోకి మరింత నిశితంగా చూడవలసిఉన్నది. ఉత్ప్రేక్షను మరింత పొడిగించినట్లయితే—యీ కట్టడానికి నాలుగుముఖాలున్నవి. ప్రపంచ భవిష్యత్తుకొరకై వాషింగ్టన్ ప్రదర్శించిన నాలుగుపాత్రలను ఇవి సూచిస్తున్నవి. ఆ నాలుగింటికీ గొప్పభేదమంటూ లేనప్పటికీ, ఈ పురాణానికి దారితీసిన అసలు సంఘటనల్ని తెలుసుకునేముందు, ఆ నాలుగు పాత్రల విశేషాలనుగూర్చి తెలుసుకోవటం మంచిది. ఇది జార్జివాషింగ్టన్ శ్లాఘనీయుడు కాదనేవాదాన్ని లేవదీసే ఉద్దేశంకాదు; ఆయన సుగుణసంపత్తి శ్రేష్ఠమైనదిగానూ, ద్విగుణీకృతంగానూ ఉంటున్నది. కాని నిజమైన ఆయన సుగుణాలను ఆకాశపుటంచులవరకూ ఎత్తటంవల్ల—ఇంతగా పెరిగిన వాషింగ్టనే మనకు,

ఆ పేరు వినగానే, కళ్లముందుంటాడు. ఆయన యీ కింద చెప్పిన నాలుగింటా ఒకదానిలో కానీ, అన్నింటిలో కానీ మనకు గోచరిస్తాడు: (i) కాపీపుస్తకాలలోకి పనికొచ్చే నాయకుడు. (ii) ప్రజలకు కన్నతండ్రిలాటివాడు (జాతిపిత). (iii) నిస్వార్థుడైన దేశభక్తుడు. (iv) విప్లవకారుడైన నాయకుడు.

నాయకుని పాత్రలు పైవిధంగా తటస్థపడుతవి. ప్రతి దానిలోనూ వాషింగ్టన్ ఒక మహోన్నతుడైన పురుష పుంగవుడు; ప్రతిఒక్క పాత్రలోనూ మహోన్నతి మీదపడగా కిందపడి, నలిగిపోయి, గౌరవమర్యాదలు పోగొట్టుకొన్న నాయకులు కూడా మనకు ఎదురవుతారు.

కాపీపుస్తకాల నాయకుడు:

వాషింగ్టన్ జీవితమంతా 18-వ శతాబ్దంలోనే గడిచిపోయింది. కాని మన మెరిగిన వాషింగ్టన్ 19-వ శతాబ్దంలోని ఆంగ్లభాష మాట్లాడే వారి సృష్టి; అంకితమైపోయిన, మతైకంగా మాహాత్మ్యమున్న వ్యక్తినిగూర్చిన ప్రశంస. నేటి ప్రపంచం ఛాంబర్స్‌మిసెల్లెనీస్, మాగఫీస్ రీడర్స్, శామ్యుయల్ స్మయిల్స్, హోరేషియోఆల్గర్ మొదలైన వారి పాఠ్యగ్రంథాలూ, ఉపన్యాసాలూ, ఆటోగ్రాఫ్ ఆల్బం లూ, బహుమతులు పంచటం మొదలైనవాటితో నిండి ఉన్నది. బజార్లూ, వాంతెనలూ తెరవబడుతూన్నవి; పునాదిరాళ్లు ప్రతిష్ఠించబడటం, పారితోషికాలూ, సర్టిఫికెట్లు ఇవ్వటం, తాగుబోతుల్ని కోప్పడటం, వారిని కాపాడటం,

శానిసలను బంధవిముక్తుల్ని చేయటం మొదలైన పనుల్లో ప్రపంచం నిమగ్నమై ఉన్నది. డేవిడ్ రైస్‌మన్ అన్నట్లుగా 'లోనివ్యక్తిత్వాన్ని ప్రకటించుకునే నిమిత్తం' అనబడే వీలుగా ఉండే పదజాలాన్ని నిరూపించటమే ఉద్దేశం. ఇలాంటిది శామ్యూయల్ స్మైల్స్ అనేకరచనల్లో—'సెల్ఫ్ హెల్ప్', 'థ్రిఫ్ట్', 'డ్యూటీ', 'కారెక్టర్' మొదలైనవాటిల్లో విరివిగా కనిపిస్తుంది. లేదా ఎమర్సన్ రచించిన చిన్నపద్య భాగంలో యీ 'కారెక్టర్' కనిపిస్తుంది. ఆ పద్యభావమిది:

"నక్షత్రాలు ఉదయించినవి; కాని అతని ఆశల్ని కేపలేదు. నక్షత్రాలు పైపైకి వెళ్ళినవి; ఆయన విశ్వాసం అంతకన్నా పైకి, అంతకు ముందే వెళ్ళింది. అంతులేని ఆకాశంలోకి నిశ్చలంగా చూస్తున్న అతని కనులు పురాతనమైనవిగా, ఎంతో లోతైనవిగా తోచినవి. ఆయన పడినపాట్లు ఆయన్ను కుంగదీసినా నేర్పుగల కాలపురుషుడు......"

లోగడ షేక్స్‌పియర్‌తో పోల్చి చూసినప్పుడు వాషింగ్టన్ మీాది అభిప్రాయాన్ని బలపరుస్తూ, కాపీపుస్త కాల నాయకుడుగా ఉండేందుకు అత్యవసరమైనది శీలమనే మాట మనం నమ్మవలసిఉన్నది. లార్డ్ బ్రూఘామ్ అభి ప్రాయంకూడా ఇలాగే ఉన్నది. "మానవులు అభ్యుదయ పథంలో పయనిస్తున్నారనేందుకు తార్కాణం వారు వాషింగ్టన్ శీలాన్ని శ్లాఘించటమే కాగలదు!" అన్నా రాయన.

విక్టోరియాశకంలో పార్సన్ వీమ్స్ వాషింగ్టన్‌ను గూర్చి రాసిన విధానమే ఆ శతాబ్దానికి ఏర్పరిచిన ఒక

పద్ధతిగా రూపొందింది. 1800 లో వీమ్స్ వాషింగ్టన్‌ను గురించి రాసిన కరపత్రంతాలూకు ఉద్దేశాలను ఆయన ఒక ప్రచురణకర్తకు వివరించాడు. అవి—ఆయన గొప్పసుగుణాలు: 1. దైవత్వాన్ని పూజించటం; లేదా మతనిబంధనల్ని గౌరవించటం. 2. ఆయన దేశభక్తి. 3. ఆయన ఘనత, లేక దివ్యత్వం. 4. ఆయన కష్టించి పనిచేసే తత్వం. 5. ఆయన తత్వం, శాంతగంభీరత్వం. 6. ఆయన న్యాయం—మొదలైనవి.

కాసీపుస్తకాలకు సరిపడే సుగుణాలన్నీ ఈమాటల్లో ఉన్నవి. అమెరికన్‌ల దృష్టిలో వాషింగ్టన్ ఎలా గోచరిస్తున్నాడో, వా రాయన్ను ఎలా పూజ్యభావంతో చూస్తున్నారో, వీమ్స్ మాటలు తదనుగుణంగా ఉన్నప్పటికీ వీటిని బట్టి వీమ్స్ సుదీర్ఘాలోచనలు చేయలేదని మనం గ్రహించవచ్చు. కనుకనే వీమ్స్ ఆ ప్రచురణకర్తతో తన కరపత్రం బహుజనాదరణను పొంది, తమకు డబ్బు గడించిపెట్టగలుగుతుందని చెప్పాడు.

ఏమైనా, కొన్ని సంఘటనల్ని కల్పించేందుకూ, లేదా తనను తాను మౌంట్ వెర్నన్ పారిష్‌కు రెక్టర్‌గా చిత్రించుకునేందుకూ వీమ్స్ వెనకాడలేదు. ఆయన కరపత్రం క్రమంగా ఒక గ్రంథరూపాన్ని ధరించింది. ఇందులో అత్యధికభాగం వీమ్స్ కల్పించిన, అసత్యంతో కూడిన సంఘటనలు. ఇందుకు ఉదాహరణలు కొన్ని ఇవిగో—

వాషింగ్టన్ ఛెర్రీచెట్టు కాండాన్ని చెక్కుతూ ("నేను అబద్ధం చెప్పను; నేను అబద్ధమాడలేనని మీకు తెలుసు; నేనే ఆ చెట్టును నరికాను"—అన్నాడు. "నా బాహువుల్లోకి పరుగెత్తు, ప్రియమైన పుత్రుడా!" అన్నాడాయనతండ్రి).

బడిలో పిల్లలు కొట్టుకునేందుకు సిద్ధపడుతూండగా—ఈ సంఘటన ఉత్తరోత్తరా పుస్తకంలోంచి మాయమైంది—బహుశా చిరాకుగా తోచటంవల్లనేమో—"ఇలాటి సంఘటనకు—ఏవగింపును కలిగించేదానికి—మీ రెప్పుడూ నా అనుమతిని పొందలేరు. ఇలాటి అసహ్యాకరమైన ఘట్టం కుక్కల్లోనూ, జానిసల్లోనూ కూడా ఏవగింపు కలిగిస్తుందే! అలాటిది బడిలో చదువుకునే పిల్లలు ఒకరినొకరు సోదరునివలె చూసుకోవలసిఉండగా, ఇలాటి సంఘటనకు పూనుకోవటం ఎంత అపచారం!"

యవ్వనంలో వాషింగ్టన్ రప్పహెనాక్ మీదుగా రాయివిసరటం (అంత తేలిగ్గా రాయి విసిరే మొనగాడు యీ రోజుల్లో దొరకటం చాలా కష్టం!)

బ్రాడాక్ అపజయంలో వాషింగ్టన్ భగవదనుగ్రహంతో తప్పించుకోవటం (ఒకానొక సుప్రసిద్ధుడైన ఇండియన్ యోధుడు ఆ ఘోరసంగ్రామంలో పెద్దపాత్రను ధరించినవాడు అనేకసార్లు ప్రతిజ్ఞపట్టేవిధంగా ఇలా అనటం జరిగిందట: "తుపాకిగుండుతో మరణించేందుకు వాషింగ్టన్ జన్మించాడని అనుకునేందుకు వీల్లేదు...ఎందుకంటే...

నేను పదిహేడుసార్లు ఆయనమీద తుపాకి కాల్చాను...
కాని ఆయన నేలగూలలేదు!")

గౌరవమర్యాదలున్న కుటుంబీకుడైన ఒకానొక క్వాకర్—పాట్స్ అనే ఆయన వేలీఫోర్జ్‌లో జార్జివాషింగ్టన్ దైవప్రార్థనలు చేస్తూండగా చూశాడట! ఆ ప్రదేశానికి వెళ్ళగా-తాను చూసిందెవరిని!...అమెరికన్ సైన్యాలకు ప్రధానసేనాధిపతి-మోకాళ్ళమీద వంగి దైవప్రార్థన చేస్తున్నాడు!...ఇంకా ఇలాటివే అనేకం!

పుస్తకమందంతటా హోరేషియో ఏల్జర్ బల్లగుద్ది చెప్పే, ఇచ్చే సందేశాల్లాటివి కనిపిస్తవి. వీమ్స్ కర్తవ్యమూ వీలూ, రెండూ కలిసికట్టుగా ఎలా ఉండగలవో చూపాడు. తన అన్నగారిపట్ల దయచూపటంవల్ల వాషింగ్టన్‌కు మౌంట్ వెర్నన్ ఎస్టేట్ సంక్రమించింది; ఎందుకంటే ఆ అన్నగారు ఒక రోగిష్ఠికొడుకును మినహా సంతానాన్ని కనలేదు కనుక. ఆదర్శప్రాయమైన ప్రవర్తన కారణంగా కుస్టిస్ విధవరాలిని ఆయన వివాహమాడగలిగాడు. ఆమె ఐశ్వర్యం కనీసం ఒకలక్ష డాలర్లన్నా ఉంటుంది! ఈ గ్రంథంలో చేయబడిన ధర్మోపదేశాలను కాదనలేము. 1825 నాటికి వీమ్స్ రచించిన జీవితచరిత్ర 40 ముద్రణలుపడింది.

సందర్భానుసారంగా ఇరికించిన చెర్రీచెట్టు సంఘటన మెగాఫీ ప్రచురించిన, బహుజనాదరణను పొందిన రీడర్స్‌లోకి వెళ్ళింది. దీనికి కాపీ పుస్తకాల్లో ప్రత్యేకాభిమానం చూపబడింది. కొత్తగా కనిపెట్టబడ్డదానికి, మరికొంత కొత్తగా

కనిపెట్టి జోడించటం జరిగి, మోరిసన్ హెడ్డీరచన–వాషింగ్టన్ సంగ్రహజీవితం, 'క్షేత్రంమీంది కుర్రాడు', 'ఆయన ఎలా సర్వసేనాధిపతి అయ్యాడు' (1863) మొదలుగా గలవి వెలువడినవి. హెడ్డీ తనరచనలో–ఒక చెట్టును కొట్టటంవల్ల ఒక నీగ్రోకుర్రవాడు ఎలా నిందపడ్డాడో, తానే ఆపని చేశానని చెప్పి, వాషింగ్టన్, నీగ్రోకుర్రాడు కొరడాదెబ్బలు తినకుండా ఎలా కాపాడాడో వివరించాడు. సర్వమానవ సమానత్వ మనేదాన్ని గుర్తించిన ఆ కాలంలో న్యూటన్, విలియమ్ టెల్ లు తమతమ ఏపిల్సుతోను, వాట్ తన నీళ్లుకాగబెట్టే పాత్రతోను, బ్రూస్ తన సాలీడుతోను, కొలంబస్ తన కోడిగుడ్డుతోను, కింగ్ ఆల్ఫ్రెడ్ తన కేక్స్ తోను, ఫిలిప్ సిడ్నీ తన నీటి సీసాతోను ఎలా కలిసి పోయ్యారో–వాషింగ్టన్ తన చెట్టుతోపాటు పైవరుసల్లోకి లీనమై పోయ్యారు.

ఐతే వాషింగ్‌టన్ సేవలన్నీ కోరబడటం, ఆయన భవిష్యత్ అంతా సేవకొరకై వొత్తిడి చేయబడటం కేవలం ఒక సంఘటనకాదు. విప్లవసమర సమయంలో ఐన ఖర్చులలెక్కల్ని ఆయన దాచారు. అది యథాతథంగా అచ్చుకాబడి, ఆయన దేశభక్తికీ, వ్యాపారదక్షతకూ తార్కాణగా ఉండిపోయింది. ఆయన మతైకాభిప్రాయాలు–19–వశతాబ్దానికి అనుకూలంగానూ, సర్వజనసమ్మతంగానూ ఉండేవిధంగా వీమ్స్, తదితర రచయితలచేత మార్పులు చేయబడినవి. ఆంగ్లికన్ చర్చిని వొదిలి ప్రెస్బిటేరియనిజమ్‌కు

ఆయన మాగాడనేది ఒకకథ, మరొక కట్టుకథప్రకారం ఆయన రహస్యంగా బాప్టిస్టులో చేరాడు. ఇలాటి అభిప్రాయాలన్నీ సారవంతమైన వీమ్స్ మెదడులోనో, లేక ఇతరుల తలల్లోనో బయలుదేరి ఉంటవే కాని-వీటిలో ఏవీ లోతులకు వెళ్తే నిజంకావనీ, చారిత్రకంగా చాలావరకు అసత్యాలనీ రూఢి అవుతుందనే విషయాన్ని నొక్కి చెప్పటం అనవసరం. పాఠశాలలకు ఉపకరించే ఆడంబర పద్ధతిని గూర్చి వారి అభిప్రాయాలేమోకాని—వీమ్సూ, ఆయన తరువాతి వారూ అంతగా పట్టించుకోలేదు. వారి లక్ష్యం మాత్రం ఇది. ఏదో కట్టుకథ అల్లి అందులో నీతిని ఎత్తి చూపేందుకు వారు బాహాటంగా ప్రయత్నించారు. హెన్రీ లీ అనే ఆయన వీమ్సును శ్లాఘిస్తూ వ్రాసిన వాక్యాలతో వీరు ఏకీభవిస్తారు. ''ఈ రచయిత ప్రధాన లక్ష్యం చిన్నపిల్లల మనసుల్లో సచ్ఛీలతపట్ల విశేషానురాగం ఉదయించేటట్లు చేయటం. అందుకనే మనరాష్ట్రాల ప్రజలకు అనురాగాస్పదుడైన వాని వ్యక్తిత్వాన్ని వీమ్స్ ఎన్నుకున్నాడు. జీవితచరిత్రల్ని రచించిన వారిలో, యీ ధోరణి అవలంబించిన వారిలో వీమ్స్ శ్లాఘనీయుడు.''

వాషింగ్టన్ సచిత్రజీవితచరిత్ర (1845) రచయిత హోరేషియో హేస్టింగ్స్‌వెల్డ్ అన్న యీ మాటలతో కూడా వీమ్స్ ఏకీభవిస్తాడు. ''చిన్నతనంలో మొట్టమొదట నేర్చేపదం అమ్మ. రెండోది నాన్న. మూడోది వాషింగ్టన్.''

వీమ్స్, మరికొందరు కాపీ పుస్తకాల్లోకి పనికివచ్చే నీతుల్ని ఏరగలసమర్థులూ వాషింగ్టన్ చిత్రణద్వారా, ఆయన నిజస్వరూపాన్ని మనం స్పష్టంగా చూడలేని విధంగా సృష్టించారని మా నమ్మకం. ఐతే వారి ప్రతి వాదనల ప్రకారం, వారుకూడా వాషింగ్టన్‌ను కేవలం విగ్రహరూపంలో ఉండే యోగిపుంగవుడుగా మాత్రం చిత్రించలేదు. ఈధోరణిని గూర్చి ఆ రచయితలకు స్పష్టంగా తెలుసు.

"వాషింగ్టన్‌ను గూర్చిన మెప్పుకోళ్ల తాలూకు అత్యద్భుతమైన ఉపన్యాసాల్లో, మనం వాషింగ్టన్‌లోని ఏభాగాన్నీ మేఘాలకింద చూడలేము. మహా నాయకుడైన వాషింగ్టన్, సగందేవుడనదగ్గ వాషింగ్టన్, మహాసభల్లో సూర్యరశ్మిని ప్రసరించే కిరణమనదగ్గ వాషింగ్టన్, యుద్ధరంగంలో తుపానుచెలరేపే వాషింగ్టన్ – వీరినే చూడగలం—" అని వీమ్స్‌రాశాడు.

వాషింగ్టన్‌ను మానవుడుగాను, కాపీ పుస్తకాలకు పనికివచ్చే శీలసంపదలతోను వీమ్స్ చిత్రించ దలిచాడు. జాతికంతకూ ఒక శతాబ్దంపాటు సరిపడేటంత పురాణ పురుషత్వంతో వీమ్స్ వాషింగ్టన్‌ను చిత్రించగలిగాడు. ఐతే ప్రజలు దీన్ని నమ్మలేని పరిస్థితుల్లో ఉండిన, లేదా అలాటిచిత్రణకు సమ్మతించని పక్షంలో–తాను అలా చిత్రించి ఉండకపోదునని వీమ్స్ అనవొచ్చు. వీమ్స్ మరొకమాట కూడా అనొచ్చు— "విధానమేదైతేనేమి–ఫలితంచూడు!"

ఏమైనా వీమ్స్ చిత్రణలో-వాషింగ్టన్ పౌరపాళ్లే పడనివ్యక్తి. 19-వ శతాబ్దానికి అనువైన సచ్ఛీలతలు-ధైర్యసాహసాలనుంచీ, సకాలానికి తన కార్యాలను నిర్వర్తించుకునే వరకూ, వినయంనుంచీ పొదుపు తనాన్ని చూపటంవరకూ - కలిగిఉండి, ఇవన్నీకూడా మానవాతీతమైనవి కావనీ, విజయాలకు సాధనాలనీ నిరూపించటం జరిగింది.

జాతి పిత :

ఏది ఏమైనప్పటికీ-చాలామంది దృష్టిలో వాషింగ్టన్ మేఘాల్లో నివసించే వ్యక్తనే! హెన్రీ లీ అన్నట్లుగా - యుద్ధరంగంలోనేమి, శాంతిస్థాపనలోనేమి, తన దేశీయుల హృదయాలలో పూజ్యుడవటంలోనేమి వాషింగ్టన్ మొదటివాడు - చారిత్రాత్మకంగాను, ఆవేశపూరితంగా కూడాను. అమెరికాకు మొట్టమొదటి సర్వసేనాని, మొదటి ప్రెసిడెంటూను. మొదటి దేశీయనాయకుడు. కనుకనే ఒక కొత్తదేశాన్ని రూపొందించేందుకు అత్యవసర వ్యక్తిత్వమైంది. 'జార్జ్ గ్యుల్ఫ్' (జఫర్సన్ వర్ణన) ను మార్చి జార్జ్ వాషింగ్టన్ అనవలసివచ్చింది. ఈ విధంగా రిప్‌వాన్ వింకిల్ 20 ఏళ్లపాటు నిద్రించి, తన గ్రామానికి తిరిగిరాగా, ఇతర మార్పులతోపాటు, పురాతనమైన డచ్ సత్రం ఇప్పుడు యూనియన్ హోటల్‌లో ఉండటాన్ని కనుగొన్నాడు. సత్రంతాలూకు బోర్డుమీద "అతను గుర్తించాడు...జార్జ్

రాజుగారి ఎర్రని మొహాన్ని. ఈ మొహంకిందనే అనేకసార్లు ప్రశాంతంగా తాను పైప్ కాల్చాడు. ఇదికూడా ప్రత్యేకమైన ఉత్ప్రేక్షే కావొచ్చు. ఎర్రనికోటుకు మారుగా నీలం బూడిదరంగుది ఉన్నది; చేతిలో రాజదండానికి మారుగా కత్తి ఉన్నది; తలమీద కిరీటానికి మారుగా కొనదేలిన టోపీ ఉన్నది; బొమ్మకుకింద పెద్దపెద్ద అక్షరాలలో 'జనరల్ వాషింగ్టన్' అని రాయబడి ఉన్నది.''

ఇదంతా సాహిత్యంలో; కాని న్యూయార్క్‌లో ఇలాటి మార్పు నిజంగానే చేయబడింది. మూడవ జార్జ్ విగ్రహంతాలూకు పునాది పాడవటంతో, అక్కడ వాషింగ్టన్ విగ్రహం స్థాపించబడింది. *

1815 లో అమెరికాను దర్శించిన యూరపియన్ యాత్రికుడు - పాల్ స్వినిన్ అనే ఆయన ఇలా రాశాడు: ''వాషింగ్టన్ ప్రతిమను తన నివాసంలో ఉంచుకోవటాన్ని ప్రతి అమెరికనూ ఒక పవిత్రకార్యంగా తలపోస్తాడు - మనం దేవదూతల విగ్రహాలను ఇళ్ళల్లో ఉంచుకున్నట్లు!'' సర్వజన సమ్మతుడైన యోగిపుంగవుడుగా, న్యాయరక్షణకు దీక్ష

* నసవ్ హాల్‌లోని ప్రిన్స్‌టన్ కాలేజీలో కీర్తిశేషుడైన బ్రిటిష్ చక్రవర్తి రెండవజార్జి విగ్రహం ఉండేది; ప్రిన్స్‌టన్ యుద్ధంలో అమెరికన్ ఫిరంగులనుంచి వెలువడిన ఒకగుండు ఆ విగ్రహాన్ని ఛిన్నాభిన్నం చేసివేసింది. 1783 లో ఛార్లెస్ విల్సన్ పీలేచే పంపబడిన కమీషన్ ట్రస్టీలు, రెండవజార్జి విగ్రహానికి బదులు జార్జి వాషింగ్టన్ విగ్రహస్థాపన జరగాలని సిఫారస్ చేశారు.

బూనిన పురుషోత్తముడుగా, కాలదోషమనేది దరిజేరని విధంగా, ఛార్లిమాగ్నే, సెయింట్ జోన్, నెపోలియన్ బోనపార్టి - యీ ముగ్గురి లక్షణాలూ మూర్తీభవించినవాని వలె, అమెరికన్‌లకు మొట్టమొదటి నిర్దోషిగా నిరూపించ బడినాడు వాషింగ్టన్.

ఆయన అనంతరం అబ్రహాం లింకన్ మాత్రమే అలాటి జాతీయగౌరవానికి పోటీ చేయగలిగాడు. కొన్ని విషయాల్లో వాషింగ్‌టన్‌కన్నా లింకన్ గొప్ప నాయకుడుగా పరిగణించబడుతాడు. వాషింగ్‌టన్ నిష్క్రమణోపన్యాసాన్ని ఓల్డ్ టెస్టమెంట్‌గా భావించినట్లయితే, లింకన్ రెండవ ప్రారంభోపన్యాసాన్ని న్యూ టెస్టమెంట్‌గా భావించవలసి ఉంటుంది. ఐనప్పటికీ లింకన్ మానవాతీతుడు కాకుండా, కాలదోషమనేది అంటే వాడుగా, కాలచక్రపు కోరల్లో నలిగిపోయినవాడుగా గోచరిస్తాడు. జాతీయ ముఖ్య పట్టణంలోని గుమ్మటాకారంలో ఉన్న బురుజుమీద, వాషింగ్టన్ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనూ, విజయాన్నీ సాధించిన పురుషపుంగవునివలె, బ్రుమిడీచే చిత్రించబడిన విధంగా - లింకన్‌ను ఎవ్వరూ ఊహించలేరు. లింకన్‌ను గూర్చిన ఊహాగానాలను లింకన్ విషయంలో (ఆమాటకొస్తే ఏ ఇతర అమెరికన్ నాయకుణ్ని గూర్చి అయినాసరే - ఒక్క రాబర్ట్ యీ. లీ మినహాగా) ఏ అమెరికన్ విమర్శకుడూ సహించడు. ఉదాహరణకు 'ది వర్జీనియన్స్' అనే థాకరీ పుస్తకంలోని విషయాలను చూడవచ్చు.

ఒకానొక విమర్శకుడు కోపంతో ఇలా రాశాడు: "అసత్యమనేదాని సారాంశమంతా ఇందులోనే ఉన్నది. వాషింగ్టన్ ఇతర పురుషుల్లాంటివాడు కాదు. అలాటి వ్యక్తిని సామాన్యజీవితంతాలూకు నీచమైన కామప్రవృత్తుల మట్టానికి దించిచూపటం అసత్యానికి పట్టంకట్టి మానవాళికే ద్రోహాన్ని తలపెట్టినట్లవుతుంది!"

మరొకవిమర్శకుడు థాకరీని ఇలా మందలించాడు: "వాషింగ్టన్ శీలం అత్యంత శుద్ధమైనదిగా మనకు లభ్యమైంది. గొప్పవారైన ఇతరుల్లో ఉండే కొద్ది లోపాలను నీవు ఆయనకు ఆపాదించినట్లయితే-నీవు ఉదాహరించిన కీవిగా ఉండే భూతం నీకు దర్శన మివ్వగలదు-హౌడన్ చెక్కిన శుద్ధమైన తెల్లని శిల్పరూపంలో. ప్రశాంతంగా ఉంటూ, మందలించే ఆ శిల్పంతాలూకు దృశ్యాలు నిన్ను గడ్డకట్టించి, నిశ్శబ్దాన్ని ఆరాధించేట్లు చేయగలవు."

ఇలాటివాక్యాలు-భయపెట్టే ధోరణిలో ఉన్నవాటిని మనం గమనించవచ్చు. ఒక శతాబ్దం క్రితం వాషింగ్టన్ పట్ల అమెరికనులకు ఎలాటిభావాలుండేవో ఈ వాక్యాలు తెలియజెపుతవి. 1830 లో వాషింగ్టన్ లేఖల్ని సంకలనం చేసేప్పుడు జారెడ్ స్పార్క్స్ కూడా ఇలాటి గౌరవమర్యాదల్నే, తానేదో కాపాడాలనే ధోరణిలో, వెలిబుచ్చాడు. ఆ తరువాత ఉన్నవిషయాన్ని వేరు విధంగా చిత్రించాడనీ, అందువల్ల వాషింగ్టన్‌ను మరింత హొయలతో చూపాలని ప్రయత్నించాడనీ నిందించబడ్డాడాయన. ఈనాటి అంత

స్తుల్ని బట్టి చూ స్తే, ఆయన అనుసరించిన సంకలన పద్ధతులు ఎంతో నిర్లక్ష్యతతో సాగి, ఏనియమావళితో కొనసాగించ బడినవో కనుక్కోవటం కూడా కష్టమే! కాని స్పార్క్స్ కొన్ని భాగాలను తొలిగించటం, లేదా మరికొన్ని భాగాలను మార్పులు చేయటం జరిగింది. నీచభావాలూ, తక్కువ అభిరుచులూ ఆయాభాగాల్లో కొద్దికొద్దిగా వ్యక్తమౌత వేమో నని అతను భయపడి ఉండొచ్చు. ఇందుకు ఉదాహార ణాలుగా యీ కిందివాటిని కొన్నిటిని పేర్కొన వచ్చు.

వాషింగ్టన్ 'ఓల్డ్ పుట్' అన్నచోట 'జనరల్ పుట్నమ్' అని మార్పుచేయబడింది. "కాని ఇప్పుడిది త్రుళ్లు పురుగుకాటల్లే ఉంది." అన్నది "ఇప్పటి మా అవసరాలకు బొత్తిగా చాలకుండా ఉన్నది" అని మార్పు చేయబడింది. అనేక విషయాల్లో సమర్థుడైన చరిత్రకారుడుగా గుర్తించ దగిన స్పార్క్స్, తెలిసో తెలియకో- అమెరికనులకు వాషింగ్టన్ పట్ల ఉండే భావాన్ని-వాషింగ్టన్ ఇతర పురుషులవంటివాడు కాదు అనేదాన్ని-తన రచనల్లో వెల్లడిం చాడు. కనుక ఆయన పొందిన అపజయాలను గూర్చి ప్రస్తా వించటం అమెరికానే ఎదుర్కొనటం లాటిదయింది. ఈ విష యంలో జె. పి. మార్గన్ కూడా విశ్వాసాన్ని కాపాడేం దుకు కంకణం కట్టుకొన్న వాడయ్యాడు. ఎందుకంటే 1920 లో తన ఆధీనంలోకి వచ్చిన వాషింగ్టన్ ఉత్తరాలు కొన్నిటిని-అవి పైస్థాయిల్లో లేవనే కారణంగా, పూడ్చిపెట్టాడు. కనుకనే బెనిడిక్ట్ ఆర్నాల్డ్ మొదలైన

మనుషులంటే, వారు వాషింగ్టన్‌కూ, స్వదేశానికీ ద్రోహంతలపెట్టినవారు కనుక, అమెరికన్‌లకే భయం. దేశద్రోహంతోపాటు వారు దైవనిందకూడా చేసినవారయ్యారు.

వాషింగ్టన్ పూజావిధానం వల్ల ఆయన దేశీయులు కొందరు-ముఖ్యంగా జాన్ ఆడమ్స్‌లాటి వారు - ఇబ్బందులు పడవలసి వచ్చింది. ఇది చాలా దూరం వెళ్లిందని వారు తలపోశారు. ముఖ్యంగా-వాషింగ్టన్‌కు సంతానం లేకపోవటమంటే అమెరికన్ జాతికంతకూ పితృ సమానుడుగా ఉండమని దేవుడే కోరాడనికూడా వారు అన్నారు. ఐతే ఆడమ్స్‌కూడా దేశీయ వస్తువులవలెనే, వాషింగ్టన్ గొప్పతనాన్ని సవాల్లుచేసే వారితో వాగ్వివాదాలు జరిపి, వాషింగ్టన్ పక్షంవహించేందుకు సిద్ధంగానే ఉన్నాడు. ఎందుకంటే వాషింగ్టన్ శీలమే అమెరికా సౌశీల్యం. అంతేకాని, దీనికి విరుద్ధమైన న్యాయంసబబు కాదని ఆయన నమ్మాడు. వాషింగ్టన్ చాలా గొప్పవాడు. ఎందుకంటే, ఆయన దేశంలోనే ఆగొప్ప గుణాలు పెంపొందించబడి, పరిపక్వదశకు రూపొందించబడినవి. ఇక్కడ వాషింగ్టన్ పట్ల మళ్లా రెండు అభిప్రాయాలు ఏర్పడుతున్నవి. మొదటిది వాషింగ్టన్ తనజాతిపిత; రెండోది-అమెరికాకు ప్రతినిధి. ఈ రెంటిలోను ఆయన తనదేశంనుంచి విడిపోవలసిన అవసరం అంతగా కలగలేదు. ''ఆయన దేశానికి మనస్సులాటి వారు. దేశం ఆయనకు ప్రతిరూపం, చిత్రణ.'' ప్రత్యేక పదజాలంలో చెప్పాలంటే

ఇది నిజమే! వాషింగ్‌టన్ పేరు అమెరికా అంతటా పాకిందని మనం ఇంతకు ముందు తెలుసుకునే ఉన్నాం. అది మనుషులకూ, ప్రదేశాలకుకూడా సంక్రమించింది. వాషింగ్టన్ ఇర్వింగ్ అని ఒకాయన ఉన్నాడు. వాల్ట్‌విట్‌మన్ సోదరుల్లో ఒకరు జార్జి వాషింగ్టన్ విట్‌మన్; పూర్వం బానిసగా ఉన్న ఒక కుర్రవాడు - బూకర్‌టలియఫెర్రో తన ఇంటిపేరును వాషింగ్టన్‌గా మార్చుకోవటంలోని ఉద్దేశం అమెరికన్ పౌరుడుగా మారాలనే ఆకాంక్ష.

## నిస్వార్థుడైన దేశభక్తుడు:

తన ప్రజలకు కన్నతండ్రితో సమానంగా ఉండిన వాషింగ్టన్ స్థానం కొంచెం అవతల ఉంటుంది; అందులో కొద్ది భాగాన్ని బెన్‌జమిన్ ఫ్రాంక్లిన్‌కు పంచవలసి ఉంటుందనే విషయాన్ని మనం సమ్మతించవలసి ఉంటుంది. (జాన్ ఆడమ్స్ కోపావేశంతో ఇలా రాశాడు: "మన విప్లవచరిత్ర మొదటినుంచీ చివరివరకూ తెంపులేని అసత్యం. దీని సారాంశమంతా ఇది: డాక్టర్ ఫ్రాంక్లిన్ తన విద్యుత్ కాష్ఠంతో నేలమీదకొట్టగా, జనరల్ వాషింగ్‌టన్ ఉద్భవించాడు. ఫ్రాంక్లిన్ విద్యుత్ ఘాతాన్ని పొందిన తరువాత, వాషింగ్‌టన్‌తో కలిసి - ప్రభుత్వధోరణులూ, చట్టాలూ యుద్ధకార్యక్రమం మొదలైనవి నిర్ణయించబడసాగినవి.")

నిస్వార్థులైన దేశభక్తుల జాబితాలో ఆయన ప్రథమశ్రేణికి చెందుతారు. అమెరికాలో రెండు ఉన్నతోద్యో

గాలు - గొప్ప అధికారాలు గలవాటిని నిర్వహించి, రెండు సార్లు ఆయన వాటినుంచి విరమించి వ్యక్తిగతజీవితంలోకి వెళ్లారు. ఇలాటి వినయాన్ని గూర్చి మనం నిజంగా ఆశ్చర్య పడవలసే ఉంటుంది. ఆయన్ను సిసిలీలో శాంతిని స్థాపించి, అక్కడే శేషజీవితాన్ని గడిపిన టిమోలియన్ ఆఫ్ కారిన్త్ తోనో, సిన్సిన్ నేటస్‌తోనో పోల్చవచ్చు. మేరీలాండ్ కవి ఛార్లెసు హెన్రీవార్‌టన్ 1779 లో వాషింగ్‌టన్ సన్మానంలో బహూకరించిన 'ఎ పొయిటికల్ ఎపిస్టల్'నుంచి కొన్ని వాక్యాలు యీకింద పొందుపరుస్తున్నాము.

"పిత్రార్జితమైన క్షేత్రంలో ఉండగా రోమ్ బలిష్ఠమైన సిన్సిన్నేటస్ బాహువుల్నికోరింది. ఆరైతు రణరంగానికి ఉరికాడు. ఉద్రిక్తుడైన వాల్‌సీకి లొంగిపోవటం మెలాగో బోధించాడు. దేశానికి గంభీరమైన, పవిత్రమైన విజయం దక్కింది...పూర్వంవలెనే అతను తన క్షేత్రాన్ని దున్నుకోసాగాడు."

లేదా, ఎడిసన్ నాటకంలోని యువకుడైన కాటో అన్నట్లు (అందులో రెండు వాక్యాలు ఇవి: 'జయాపజయాలు దైవాధీనాలు'; 'గౌరవనీయమైన వృత్తి అనేది వ్యక్తిగతమైన స్థానం' - యీ రెంటినీ వాషింగ్‌టన్ ఉదాహరిస్తుండేవారు). స్వార్థపరులైన దేశభక్తులు - సుల్లా, సీజర్, వాలెన్‌స్టయిన్, క్రామ్‌వెల్-వీరందరినీ మించిన, సమకాలికుడైన నెపోలియన్‌లనుంచి ఆయన్ను విడదీసి చూడవచ్చు. నెపోలియన్‌కూ, వాషింగ్‌టన్‌కూ ఉన్న భేదం ఆశ్చర్యకర

మైన తార్కాణం. ఈ సందర్భంలో వాషింగ్‌టన్‌నుగూర్చి బైరన్ ఇలా అన్నాడు: ''పశ్చిమ సిన్‌సిన్నేటస్''. ఈ మాటల్ని అనేకులు అనుకరించారు. అంతేగాక నిస్వార్థులైన దేశభక్తులుగా గణనకెక్కిన వారి జీవితాలు నిశితపరీక్షలకు నిలవజాలవు.

ఇతర గొప్ప సేనాపతుల పనులు - వారి కీర్తికి దోహదం చేసేవి- ఎప్పుడూ బలాత్కారం, బాధ, దౌర్జన్యాలతో కూడే ఉంటవి. కనుక నే కొంతమందికి తిట్లు ప్రాప్తించినవి; మరికొంతమందికి పశ్చాత్తాపమే శరణ్యమైంది.

ఈ మాటలు ప్లూటార్క్ టిమోలియన్‌ను శ్లాఘించినపుడు ఉపయోగించాడు. ఐతే ఆయన, టిమోలియన్‌కూడా ఒకసారి దుష్టస్వభావాన్ని ప్రదర్శించాడనికూడా ఒప్పుకున్నాడు. ఇలా ఏరి పారేయగా స్వచ్ఛమైన శీలంగలిగిన నిస్వార్థులైన దేశభక్తుల్లో వాషింగ్టన్‌తో పోటీ చేయగలవారు ఒకే ఒకరు. ఆయన సగం పౌరాణికవ్యక్తిఐన లూసియస్ క్వింక్టియస్ సిన్‌సిన్నేటస్ అని తేలుతుంది. ఈ తెగకు చెందిన వారందరూ మహాకావ్యాలలో చేర్చబడ్డారు (ఎపమినాండస్, ఎగెసిలాస్, బ్రూటస్. మరికొంతమందినికూడా ఇందులో మనం చేర్చవచ్చును) ఐతే ఇందులో వాషింగ్‌టన్ స్థానం మరింత ముందుకు పోతుంది. కాలదోషం పట్టని, స్వప్నాల్లో చూసే, వాస్తవికతకు దూరమైన వానివలె వాషింగ్టన్ మనకు కనిపిస్తాడు. అమెరికా 19-వ శతాబ్దారంభంలోని మహాకావ్యాల పునఃప్రతిష్ఠసిద్ధాంతానికి

ఆసవుగా ఆయన శీలం అతుకుతుంది. (ఐతే ఇది స్వదేశానికి ఎక్కువగా సంబంధించిన వీమ్స్ దృక్పథానికి కొంతవరకూ భేదిస్తుంది. 1840 లో హొరేషియో గ్రీనో మలిచిన వాషింగ్టన్ చలవరాతి ప్రతిమ హేళనచేయబడిందని మనం గుర్తుంచుకోవాలి. ఆ ప్రతిమను చూడబోయిన ఒకానొక యాత్రికుడు – ఎవరో క్రైస్తవమత విరోధి ఆ ప్రతిమ మీదికి ఎగబాకి, పొలంమీది రైతులు కాల్చే పెద్దచుట్టను ప్రతిమతాలూకు పెదవులమధ్య ఇరికించే శ్రమ తీసికోవటాన్ని కనుగొన్నాడు. "ఒలెంపిక్ జోవ్ కన్న తక్కువగా వాషింగ్టన్ కనిపించినప్పటికీ, ఆయనవలెనే ఆ ప్రతిమ కన్పట్టినప్పటికీ, గాలికి తిరిగే ఆ వ్యక్తి ఇలాటి నీచకార్యానికి వొడిగట్టే సాహసానికి పూనుకొని ఉండడని నా నమ్మకం" అన్నాడా యాత్రికుడు.

విప్లవ నాయకుడు :

జార్జి వాషింగ్టన్ విప్లవ నాయకుడనే అభిప్రాయం యునైటెడ్ స్టేట్స్‌కు బైటి ప్రపంచానికి ఉన్నది. ముఖ్యంగా ఆయన జీవితంలోని చివరి దశాబ్దంలోను, ఆ తరువాత ఒక శతాబ్దంవరకూ ఇదే అభిప్రాయం మారుమ్రోగింది. ఇలాటి అభిప్రాయానికి వెనుక బలవత్తరమైన ఆదర్శం ఉన్నది. వాషింగ్టన్ నాయకుడుగా, స్వాతంత్ర్యవీరుడుగా, జాతీయతను సంరక్షించేందుకు కంకణం కట్టుకున్నవాడుగా, ఆధునిక యుగంలో మొట్టమొదటి బ్రహ్మాండమైన విప్లవంలో విజయాన్ని సాధించినవాడుగా ఆయన భావించబడినాడు. ధైర్య

సాహసాలూ, వీరత్వమూ ఉన్న ఇతరసభ్యులు - లాఫయెట్టీ, థడ్డియస్, కోషిఙ్కో, టస్సియాంట్ లేవెర్ట్ యూర్, బోలివర్, గారిబాల్డీ * మొదలైనవారి బృందంలో అధ్యక్షుడుగా ఆయన తనపాత్రను వహించారు. ఇక ఫ్రెంచివారు అమెరికన్ పద్ధతిలో నడపాలనుకున్న విప్లవానికి వాషింగ్టన్‌కు ఒక ప్రత్యేక ప్రాముఖ్యత సహజంగానే ఇవ్వబడింది. వాషింగ్టన్ పేరును రకరకాలుగా ఉచ్చరించే ఫ్రెంచివారు ఆయన వ్యక్తిత్వసూచనను నాటకాల్లోకూడా ప్రవేశపెట్టారు. లాటిన్ అమెరికన్ ప్రాంతాలు స్పెయిన్ మీద తిరుగుబాటు చేసినప్పుడుకూడా వాషింగ్టన్ ఒక చిహ్నంగా భావించబడ్డారు. విప్లవ సమరానికి పూనుకున్న ప్రతిదేశానికీ వాషింగ్టన్ ప్రత్యేకమైన ఉద్వేగాన్ని ఇవ్వటం, ఒక పౌరసైనికుడు పౌరసైన్యానికి సేనాధిపతి కావటంగా భావించబడ్డారు. ఆంగ్లేయులు పేర్కొన్నట్లుగా ఆయన 'బందిపోటు ముఠా' వెంబడించబడటం, చెల్లాచెదరు చేయబడటం, ఒంటరి చేయబడటం, అత్యధిక సంఖ్యాకులు ఎదుర్కొన్నేట్లు చేయటం, శీతాకాలంలోకూడా వీరిని ఒకకంట కనిపెట్టిఉండటం జరిగినవి. 'పాదరక్షలూ, ఆహారం లేకుండా' గడపవలసివచ్చిన ఆయన సైనికులు మొండివాళ్లలాగు కన్పట్టి ఒకానొక కథ ప్రకారం ఫ్రెంచివారు ఆయా పేళ్లను ఉపయోగించసాగారు.

---

* 1860 లో సిసిలీలోని తిరుగుబాటులో గారిబాల్డీని బలపరచిన పతాకనౌక పేరు వాషింగ్టన్.

వాషింగ్టన్ ఎన్నుకొన్నదారి క్లిష్టతమమైనది. ఐతే టామ్ పైనీ రచనలు చదివి, తాను ఉద్దేశించిన విజయమే ఆయనకు అఖండ శక్తిసామర్థ్యాలను ఇచ్చింది. ఆయన చేతులుకట్టుకొని తలఎత్తి డిలావేర్ రాష్ట్రంలోని మంచు గడ్డలమీందినుంచి దాటిపోయ్యారు......సందర్భోచితంగా విజయలక్ష్మి ఆయన్ను వరించింది. అదంతా రిపబ్లికానిజమ్, కుట్ర, ఫ్రీమాసినరీ తత్వం (లాఫయెట్టే, మోజరత్‌లవలెనే విశాలదృక్పథమున్న యూరపియన్‌ల కోవకు వాషింగ్టన్ చెందుతారు) వీటితాలూకు కైపు తలకెక్కటంతో జరిగింది. దుస్తులధారణలో కొత్తకొత్త ఫాషన్స్ వచ్చినరోజులవి; కొత్త ప్రార్థనాగీతాలూ, కొత్త నినాదాలూ (వాషింగ్టన్‌ను గూర్చి చెప్పబడే పురాణాల్లో ఆయన బెట్సీరాస్‌తో కలిసి అమెరికన్ పతాకాన్ని సృష్టించటం జరిగింది) ఉద్భవించిన దినాలవి. 1789 జులైలో పారిస్‌లోని అల్లరుల కారణంగా ఎదుర్కొబడిన బాస్టిలీకోటతాలూకు తాళంచెవిని లాఫయెట్టే వాషింగ్టన్‌కు పంపారు. ఆ తాళంచెవి యీ నాటికీ వెర్నన్ మౌంట్‌లో శాశ్వతవిశ్రాంతిని తీసుకుంటూ, ఎవ్వరికీ ఎలాటి ఇబ్బందినీ కలిగించటంలేదు. ఎందుకంటే, బాస్టిలీ పడగొట్టి వేయబడింది. లాఫయెట్టే ఇలా రాశారు: "నా పెంపుడు తండ్రికి కుమారునిగా, నా జనరల్‌కు అంగరక్షకుడుగా, పితృసంతతి తాలూకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను సాధించిన వీరుడుగా నే నాయనకు సమర్పించగల బహూకరణ ఇది." 1792 లో స్వేచ్ఛాస్వాతంత్ర్య సాధకుడైన మరొకరు కూడా యీ పితృసంతతి నాయకునికి నమస్కరించాడు.

కేంబ్రిడ్జ్ యూనివర్సిటీలో అండర్ గ్రాడ్యుయేట్‌గా ఉంటూన్న కవి కోల్‌రిడ్జ్ 'ఆ రోజుల్లోని వామ పక్షీయుల కూడలిస్థానంగా ఉంటూన్న గదుల్లో నివసిస్తూన్న'ట్లుగా వర్ణించబడిన వ్యక్తి – సుస్థిరంచేయబడిన చట్టాన్ని ఎదుర్కొనే వాడుగా – ఆయన వాషింగ్టన్ గౌరవార్థం తాగేవాడు. ఈ విధంగా వాషింగ్టన్ ఆదర్శప్రాయుడైన చిహ్నంగా రూపొం దించబడ్డారు. విలియమ్ బ్లేక్ రచన 'అమెరికా'లో వాషిం గ్టన్ ప్రమత్తుడైన భావిని నిర్ణయించే వ్యక్తిత్వమేకాని నిజ మైన వ్యక్తి కాదనే ధోరణి ప్రస్ఫుటమౌతుంది.

వాషింగ్‌టన్ అన్నారు: "అమెరికావు మిత్రులారా! అట్లాంటిక్ మహాసముద్రంవైపు చూడండి.

స్వర్గంలో ఒక విల్లు వంచబడింది; ఎంతో బరువైన ఒక ఇనుప గొలుసు కిందికి జారుతూన్నది. ఆల్బియన్ శిఖరంనుంచి లింకు తర్వాత లింకుగా సముద్రంమీదనుంచి పయనించి – అమెరికాలోని సోదరులనూ, సుతులనూ మన మొహాలు పసుపువర్ణానికి దిగి వెలవెల బొయ్యేంతవరకూ బంధిస్తూన్నది. దాంతో మన తలలు వేళ్లాడవేయబడి, గొంతులు తడి ఆరి, కళ్లు నేల చూపులు చూస్తూ, చేతులు పని పాటులతో మురికి అవుతున్నవి; పాదాలు మాడిపొయ్యే ఇసుక నేలలమీద నడిచి రక్త సిక్తాలై, కొరడా దెబ్బలకు శరీరం నాగలిచాళ్ళవలె పగిలిపోతూ— ముందు తరాలవారు ఇదంతా మరిచిపోయినా, వారికీ బంధాలే అందివ్వబడుతవి."

కొద్దిసంవత్సరాల అనంతరం లాటిన్ అమెరికాలో వాషింగ్టన్ విప్లవనాయకుడుగా సేవలుచేయసాగారు. బొలి వర్ వాషింగ్టన్‌బొమ్మ ఉన్న మెడల్‌ను ధరించేవాడు.

తానూ యునైటెడ్ స్టేట్స్ కలిసి యూరపియన్‌ల బానిసత్వాలనుంచి విడివడే సన్నాహంలో మిగతా అమెరికన్ జాతులుకూడా ఆ పద్ధతుల్ని అనుసరించనచ్చు. ఆయన సిద్ధాంతం ఆయన ఆదర్శప్రాయుడవటంకన్న తక్కువదేం కాదు. వాషింగ్టన్ కడపటి ఉపన్యాసం చదవబడటం, అప్పుడప్పుడు పఠించబడసాగి, ఆయన దేశంలోవలెనే, అక్కడకూడా దాని పలుకుబడి విస్తరించింది. రాజకీయ నాయకులు ఆయన మాటల్ని పునరుద్ధరించారు. కొన్నికట్టడాలకు ఆయన పేరు పెట్టబడింది. వాషింగ్టన్ ధరించిన ఐదవపాత్ర తాలూకు సూచనరేఖలు – ఎప్పటికీ కనుగొనబడని అట్లాంటిస్ అనబడే పాన్ – అమెరికన్ విషయంలో ఆయన ప్రదర్శించి ఉండేవారు.

తరువాతి తరాలలో పాఠ్యగ్రంథాలద్వారా తమ తమ గొప్పతనాల్ని ప్రదర్శించిన గొప్పవారిలో వాషింగ్టన్ ఒకరు. ప్రతికాలమూ గడిచిపోయినకాలంనుంచి ఉద్వేగాన్ని పొందుతుంది. చనిపోయినవారిని మనం పునరుద్ధరించనట్లయితే వారు శాశ్వతంగా మృతులే; వారు మనలోనే బతుకుతూ, మనలోనుంచే జీవయాత్రసాగిస్తారు. మనకు ఏది ఇష్టమో దాన్ని వారినుంచి నేర్చుకోవాలని ప్రయత్నిస్తాము.

ఆక్షణంలోని స్థాయిలననుసరించి వాషింగ్టన్‌ను నిర్ణయించరాదు. కాని వారు ఎత్తుకున్నవిషయం ఎలాటిదైనప్పటికీ, వారిలో దాదాపు చాలామంది చేసిందిదే; కొంతమందికన్న మరికొంతమంది తాము చేసేపనిని సమర్థించు

కునేందుకుగాను మరిన్ని రుజువులను సేకరించారు. వీమ్స్, లేదా జారెడ్ స్పార్క్స్ చేసిన చారిత్రకమైన ఒప్పులకన్న అధికం గానే మన కాలానికి ఇంకా అధికమైనవి మిగిలిఉన్నవి. ఐతే నిష్పాక్షికమైన జీవితచరిత్ర - హిట్లర్‌కుకానీ, ఫ్రాంక్‌లిన్ రూజ్‌వెల్ట్‌కుకానీ, విన్‌స్టన్ చర్చిల్‌కుకానీ ఎన్నడున్నది?

అంతేకాదు - అత్యద్భుతపరిమాణాలకు పెంచబడే వ్యక్తిత్వాలలో జార్జ్‌వాషింగ్టన్ ఒక్కరే కాదు. 14-వ లూయిాచక్రవర్తి తన సమాధిని - పౌరాణికంగా ఎంతో పెద్దదాన్ని నిర్మించుకునే కార్యక్రమంలో ఎక్కువ శ్రద్ధాసక్తుల్ని చూపాడు. ఇక మార్లబరోవిషయమొస్తే ఆయనకు ఒక పెద్ద జమీందారీ ఇవ్వబడటమేగాక, ఒక గొప్ప రాజభవనంకూడా ఇవ్వబడింది. దీనితో పోలుస్తే వాషింగ్టన్ జ్ఞాపకార్థం నిర్మించబడిన కట్టడం తోటమాలి కుటీరంవలె కనిపిస్తుంది. * మార్లబరో వంశీకులలో ఒకరిని వివాహమాడిన మిస్ కాన్సిలో వెండర్‌బిల్ట్ అనే అమెరికన్ వనిత బ్లెన్‌హీమ్ రాజభవనంలోని భోజనశాలనుంచి వంటశాలదూరం 500 గజాలని వర్ణించింది (కనుక భోజన పదార్థాలమీద ఎన్నో చెడుఫలితాలు తప్పవన్నమాట!) కృతజ్ఞులైన స్వదేశీయులు నెల్సన్‌కు, ట్రిఫాల్గర్ యుద్ధా

---

* ఇటీవలి కాలంలో టెక్సాస్ ఆయిల్ కోటీశ్వరుడు హెరోల్డ్‌సన్ లాఫయెట్టీ హంట్‌చే ఈలోటు పూరించబడింది. డల్లాస్‌లోని ఆయన గృహం మౌంట్‌వెర్నన్‌లోని భవనానికి సరిగ్గా నకలుగా ఉండి, మూలానికి ఐదింతల పరిమాణంలో ఉన్నది.

నంతరం ఒక పెద్ద జవానీ ముట్టజెప్పారు; లండన్‌లోని ఒకానొక చతురస్రంలోని ఒక వరసలోని భవనాలన్నీ నెల్సన్ తాలూకు ప్రాముఖ్యతను కలిగిఉన్నవి. వెల్లింగ్టన్ ఒక జమీందారీనేగాకుండా ఎన్నో బహుమతుల్నీ, ఇతరగౌరవాలనూ (ఒక పెద్ద మ్యూజియమ్‌కు సరిపడే టన్ని) పొందాడు. వీరు తమ తమ పేళ్లను సైనికదళాలకూ, విద్యాలయాలకూ, పౌరగృహాలకూ, యుద్ధనౌకలకూ ఎరువివ్వటమేగాక, ప్రముఖులైన కొత్తవారికూడా (ఉదాహరణగా మిస్టర్ నెల్సన్ రాక్‌ఫెల్లర్, మిస్టర్ వెల్లింగ్టన్ మొదలైనవారికి) ఇచ్చారు. ఇప్పటికీ వర్ధిల్లే సంస్థకు నెపోలియన్ బోనపార్టీనామం ఉపయోగించబడుతూనే ఉన్నది. సాహిత్యపరంగా ఉండే అనేకవేలగ్రంథాలకు (వాషింగ్టన్‌ను గూర్చిన గ్రంథాల పరిమాణంకన్న 3, 4 రెట్లు ఉంటవని తేలిగ్గా ఊహించవచ్చు), అనేక రాజమార్గాలకు శాశ్వతమైన పేళ్లుండటం, నాణాలకూడా ఆపేరుంచబడటం, చట్టవిధానం ఆపేరున ప్రసిద్ధికెక్కటం - ఒక్కమాటలో చెప్పాలంటే జాతీయత అంతటా ఆపేరు మారుమ్రోగటం జరిగింది. ఇతర యూరపియన్ జాతీయతలనూట ఎత్తుకోనేలే దిక్కడ.

ఏమైనప్పటికీ చరిత్రలో వాషింగ్టన్ జ్ఞాపకార్థం నిర్మించబడిన కట్టడంలాటిది మరొకటిలేదు. ఆయన్ను గూర్చిన అభిప్రాయాలు అనేకం ఉండి తరతరానికీ మారుతూన్నవి. ఐతే వీటిల్లోని మూలాభిప్రాయాలు - ఆ కట్టడం తాలూకు ఆయావైపులు ఇతరభాగాలలో కలవకుండా

ఉన్నప్పటికీ, వీటిల్లో దేనికీ ప్రాముఖ్యత తగ్గలేదు. వాషింగ్టన్ కాలంలోకానీ, ఆతరువాత కానీ గ్లాడ్‌స్టన్ - వాషింగ్టన్ విషయంలో ఏర్పరుచుకున్న యీ క్రింది అభిప్రాయంతో. కాస్త ప్రమత్తతతో ఆలోచించిన వారెవ్వరైనాసరే ఏకీభవించి యీమాటల్ని అనగలరు:

"స్వచ్ఛందమైన, అత్యద్భుతమైన వ్యక్తిత్వాల జ్ఞాపకార్థం నిర్మించబడిన కట్టడాలో, చరిత్ర సరఫరా చేసినవాటిల్లో మిగతా అన్నిటికన్నా ఎత్తయినదాన్ని, ఒక్కక్షణంలో ఆలోచించి నన్ను చెప్పమంటే, ఆ కట్టడంలో ఉండదగిన వ్యక్తిత్వాన్నిగూర్చి ఎన్నుకోమంటే, గత 45 సంవత్సరాలలోనూ ఆ వెలుగు విస్తరించినా, అదిప్పుడు జాజ్వల్యమానంగా వాషింగ్‌టన్ మీదికి ప్రసరించి తీరుతుంది."

ఆయనగాక ఇతరు లెవ్వరికీ అంతగొప్ప గౌరవం లభ్యమవటంకానీ, పురాణ పురుషత్వం లభించటంకానీ జరగలేదు. నెపోలియన్ పేరు వినగానే-ఒక గొప్పసేనాధిపతి, నిరంకుశ పాలకుడు, దేశబహిష్కృతిలో విశ్రాంతినెరుగనివాడు, బహుశా అవిశ్వాసపాత్రుడైన భర్త తాలూకు చిత్రాలు స్ఫురిస్తవి. ఐతే ఆ చిత్రం ఎంత బ్రహ్మాండంగానూ, కళ్లు చెదిరేరంగులలోనూ సృష్టించబడినప్పటికీ నమ్మదగింది. దాన్నుంచి మనం అసలువ్యక్తిని గుర్తించగలం. నెల్సన్ విషయంలో కూడా యీ చిత్రం అంత బలవత్తరంగానూ ఉండి, పౌరధర్మ నిర్వహణలో దూసుకొనిపొయ్యే తత్వం, వ్యక్తిగత జీవితంలో ఎక్కువ మెరుగులు దిద్దబడి ఉండటం కనిపిస్తుంది. వెల్లింగ్‌టన్ విషయంలో కూడా ఇది సత్యమే.

ఉక్కులాటి తత్వముండిన ఈయన వాషింగ్టన్‌తో చాలవరకు సరిపోలుతాడు. వెల్లింగ్టన్ పేరు ఒక నాయకుణ్ణి, ఒక వ్యక్తిని, కఠినత్వాన్ని వహించి దరికి జేర లేని మనిషిని స్ఫురింప జేస్తుంది. ఏమైనప్పటికీ ఆయనకూడా మానవుడే మరి! ఐతే వాషింగ్టన్ పేరు దేన్ని స్ఫురింపజేస్తుంది? అది ఒక తావు, లేదా ప్రదేశమనే అర్థాన్ని ఇవ్వగలదు. ఐతే జార్జి వాషింగ్టన్ అనే అభిప్రాయమే ఐతే-అదివొక సంస్థపేరై ఉండొచ్చు. అలాగాక ఆ పేరుగల ఆసామినే ఉద్దేశించానని నీవు పట్టుబడితే-నీకు మిగిలింది ఏమిటి? ఆ ముందున్న సరంజామా అంతా దాదాపు అసత్యాలమయమై, నిజానికి సజీవమైనవిగా కూడా కనిపించవు. ప్రవర్తనలో అవధులు దాటి సుగుణాలున్న సంఘటనలు, రాజకీయపరిజ్ఞత ఉన్న వ్యక్తితాలూకు వాగుడు. వేరొకభాషలో చెప్పాలంటే-వాషింగ్టన్ జ్ఞాపకార్థం నిర్మించబడిన కట్టడం.

వాషింగ్‌టన్ నిజంగానే ఒక దృష్టాంతరం అనటమే విశదీకరణా? అనేక మంది రచయితలు మననునమ్మించిన విధంగానే ఆయన పరమపవిత్రుడా? ఆయన కేవలం తాటస్థ్యంగా ఉంచబడి, అధికారమివ్వబడగా, విజయానికి కారకుడవటంతో అత్యున్నతస్థాయికి పంపబడినారా? కేవలం పరిస్థితులను అనుసరించి, అమెరికన్లు ప్రీతి వహించిన వాటన్నిటికీ బాసటగా ఆయన నిలబడటం వల్లనే వారికి అంతగా గౌరవప్రదుడైనారా? రిపబ్లిక్ ఏర్పడిన ఆ తొలి దినాల్లో జాతీయచిహ్నంగా ఉంచేందుకు, లేదా ఆ అర్హతకు ఎదురైనాడు కనుక వాషింగ్టన్‌ను, జ్ఞాపకార్థం నిర్మించ

బడే కట్టడంగా వారు మార్చారా? ఇది సత్యమైతే ఈ విధానాన్ని గూర్చి ఆయనకు ఎంతవరకూ తెలుసు? దానికి ఆయన దోహదం చేసిందేమిటి?

ఈ కొద్ది వింతాభిప్రాయాలు మనను చీకాకుపరుస్తాంటవి. పుస్తకంతాలుకు చివరి అధ్యాయాల్లో కొన్ని జవాబులు సూచించబడే అవకాశాలు ఉండొచ్చు. ఐతే తరువాతి మూడు అధ్యాయాల్లోను వాషింగ్టన్ జ్ఞాపకార్థం నిర్మించబడిన కట్టడాన్ని గూర్చి మరిచిపొయ్యేందుకు మనం యాతన పడవలసి ఉంటుంది. ఆదర్శప్రాయంగా చెప్పాలంటే—మనం వాషింగ్టన్‌ను గూర్చి ఎన్నడూ వినలేదనీ, లేదా అమెరికన్ వలసరాజ్యాలు బ్రిటన్ మీద తిరుగుబాటుచేసి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలుండే జాతిగా రూపొందినవనే విషయాలను విస్మరించామనీ నటించవలసి ఉంటుంది.

మననుంచి కోరబడే యీ విషయాలు మనం భరించలేనివి ఐనట్లయితే, ఇవి వాషింగ్‌టన్‌నుంచి దాచివేయబడిన వనన్నా మనకు మనం తిరిగితిరిగి జ్ఞాపకం చేసుకోవలసి ఉంటుంది. వాషింగ్‌టన్ జీవితంలోని సంఘటనలవైపు తిరిగి చూడు; ఆయనకు స్తోత్రపాఠాలు వల్లించేవారు, విధి ఊపిరి తిరగకుండా పని చేస్తున్నట్లు కనుగొన్నారు! ముందుగానే విధిచే నిర్ణయించబడిన దానికి ఇక్కడ - ఇక్కడే ఆయా ఋజువు లున్నవని వారు అన్నారు; ఆయా ఫలితాలు రూపాలు ధరించి, ఉదాహరణలుగా ఉండితీరాలి మరి. విధి విలాసాన్ని గూర్చి వాషింగ్‌టనే అనేకసార్లు మాట్లాడారు;

దానికి బద్ధులయ్యారు. ఐతే ఆయన అన్నమాటలు నెపోలి యన్ అన్న ధోరణిలో లేవు. తాను విధిచే విడువబడిన వ్యక్తి అని అనలేదు; కాని ఏం జరుగనున్నదో అది జరిగి తీరుతుందని మాత్రమే అన్నారు. భావినిగూర్చి మాట్లా డేందుకు సాహసించిన సమయంలో, అదొక హెచ్చరిక అనే ధోరణినే కనబరిచారు; అమెరికన్‌లు తగిన జాగ్రతలు వహించి తమను తాము సంరక్షించుకోనట్లయితే, ఫలానా ఫలితాలు విషాదపూరితాలౌతవి – అన్న ధోరణిని వెలిబుచ్చారు. ఆయన నిశ్చయంతో ముందడుగులు వేసి నట్లు కనిపిస్తే ఆయన చీకటిలోనికి నడిచి, రెండవదృష్టి సహాయమే లేకుండా ఉండేవారు. కేవలం మానవుడు, కొద్ది కాలంలో – ఆశ్చర్యపరిచేటంత స్వల్పవ్యవధిలో – రేపనేది ఒక సమస్యయి, మరు సంవత్సరమనేది కఠినసమస్యగా ఉన్నా కూడా, సాధించేందుకు వెనుకాడలేదు. ఏది ఏమై నప్పటికీ మనం ఆయన్ను గూర్చిన విషయాల్లో ఇది ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవలసిన విషయం. తన కళ్లఎదుటనే చరిత్రను ఆయనచూశారు: అంతేకాని చరిత్రలో తాను కేవలం నామమాత్రుడుగా ఉండిపోలేదు. తాను చేయ గలిగింది శక్తివంచనలేకుండా ఆయన చేశారు.

# 2. గౌరవనీయుడు

ధగధగా మెరిసే ఆ నాగలికొర్రు, గోధుమపంటతో నిగనిగలాడే ఆ క్షేత్రాలు, చల్లగాలికి మెల్లిగా తలలూపే ఆ పసుపురంగు గోధుమ మొక్కలు, శిఖరాగ్రాలు శ్వేతవర్ణంతో వెలుగొందే ఆ కొండలబారులు, ఆ పచ్చని మైదానాలమీద హాయిగా తిరుగులాడే ఆలమందలు, శుభ్రమైన దుస్తులు ధరించిన ఆయన సేవకులు, పాటలు పాడుతూ, ఆటలు ఆడుతూ కోతలకు ఉపక్రమించిన ఆ జనాభా.—ఆయన అమితంగా ప్రేమించే ఇవన్నీ ఏవీ? ఇలాటిదృశ్యాలు... శాంతి, పుష్కలత, సుఖ సౌఖ్యాలకు పుట్టినిల్లయినవే వాషింగ్టన్‌కు ప్రీతికరాలు.

(' జార్జివాషింగ్టన్ జీవిత చరిత్ర'లో మాసన్ వీమ్స్—చిత్రమైన సంఘటనలతో తనను తాను గౌరవించుకుంటూ, తన దేశంలోని యువతీ యువకుల్ని ఉత్తేజపరిచాడు.)

## వర్జీనియా :

చిత్రప్రదర్శనలోని ఫిలిం వెనక్కు వెళ్లినమాదిరిగా, మనం వాషింగ్టన్ జ్ఞాపకార్థం నిర్మించబడిన కట్టడాన్ని పడగొట్టుతున్నాము. ఆయా విగ్రహాలూ, వాటికి సంబంధించిన ఇతర కట్టడాలూ మాయమౌతున్నవి; మౌంట్ వెర్నన్‌లోని భవనంతాలూకు ఇరుపక్కలూ విసిరివేయబడినవి; ఆ తరువాత పోర్టికోలోని ఫర్నిచరూ – చివరకు ఆ పునాదులే తీసివేయబడి, ఎలాటి చిహ్నాలూ లేకుండా చేయబడినవి; ఆయారోడ్లు తీసివేయబడి భూమట్టానికి దించబడినవి;

ఆయా క్షేత్రాలూ, సత్రాలూ, చర్చిలూ, కోర్టుగృహాలూ మొదలైనవి తుడిచివేయబడినవి. పురాతన వృక్షకాండాలు, తిరిగి చిగిర్చి, శాఖలుగా పెంపొంది, పచ్చని ఆకులతో వర్ధిల్లి, తిరిగి వెనక్కు పయనించి అంటుగా, విత్తులరూపాన్ని ధరిస్తుంది. ఆనాటి ఇండియన్స్‌తోపాటు వారు వేటాడే అడివి దున్నలూ తిరిగి సముద్రతీరంలో సాక్షాత్కరిస్తాయి. ఇనుప రేణువుల్ని అయస్కాంతం ఆకర్షించేవిధంగా, ఓడలు సముద్ర తీరానికి వచ్చి, అట్లాంటిక్ మహాసముద్రానికి తూర్పుదిశకు పయనమౌతున్నవి; ఆ ఓడల్లోని సరుకులు స్వస్థానాలనుంచి కదిలించబడి, దించబడుతున్నవి; సజీవమైన సరకుల్లో కనిపించే కాందిశీకులూ, సేవకులూ, నేరస్థులూ, బానిసలూ తీరాన దించబడుతూన్నారు. చీకటికోణాలనుంచి సూర్యాస్తమయానికిగాను సూర్యుడు పశ్చిమానికి ఎగబాకుతూ, మట్ట మధ్యాహ్నానికి ఎగబాకి, తూర్పున తెల్లవారుజామువైపు వాలిపోతూన్నాడు...

ఈ క్రమవిధానంలో జరిగిపోయ్యే కాలచక్ర గమనంలో - 1650 లో మొట్టమొదటి వాషింగ్టన్ కుటుంబీకులు వర్జీనియా వచ్చారు. తొలిసారిగా ఆ ప్రాంతాలకు వచ్చి స్థిరనివాసాలు ఏర్పరచుకొన్న బ్రిటిష్‌వారు అంతకు అర్ధ శతాబ్దంక్రితమే జేమ్స్ టౌన్‌ను నిర్మించారు. రోగగ్రస్తత, కరువుకాటకాలు, ఇండియన్‌లతో యుద్ధాలు, ప్రభుత్వాలలో మార్పులూ మొదలైనవి ఉంటూన్నప్పటికీ, క్రమంగా సముద్రతీరానా, పోటొమాక్, రప్పహెన్నాక్, యార్క్, జేమ్స్‌నదులకు ఎగువభాగాలా ఉత్తరదిశనుంచి దక్షిణానికి

స్థిరనివాసాలు విస్తరించసాగినవి. ఇక స్వదేశమైన బ్రిటన్‌లో అంతర్యుద్ధం జరిగి స్టూఆర్ట్ వంశీకుడైన మొదటి ఛార్లెస్ రాజు పదచ్యుతుడై మరణశిక్షకు గురయ్యాడు. రాజుగారి వలసగా ఉంటూన్న వర్జీనియా మొదట్లో స్టూఆర్ట్ వంశీకులను బలపరిచింది. తత్ఫలితంగా పార్లమెంట్ పరిపాలనను గుర్తించవలసివచ్చింది. ఐతే ఇందువల్ల వర్జీనియాలో పైకి కనిపించే మార్పేమీ రాలేదు. బాల్యదశలో ఉన్న, అడవులతో నిండిఉన్న ఆ దేశంలో ఆహారమూ, నివాసమూ, రక్షణా, భూమీ – ఆ క్షణంలో ఎంతో ప్రాముఖ్యమైనవిగా ఉన్నవి.

ఐతే స్వదేశంలో జరిగిన సంఘటనలు, అప్పటికప్పుడు కాకున్నా, ఆ తరువాతయినా వర్జీనియాకు ముఖ్యాంశాలుగానే పరిణమించినవి. వీటిలో విశేషఫలితాలకు దారితీసిన సంఘటన ఇది : 1649 లో – అంటే తనతండ్రి మరణానంతరం కొద్దినెలలకే – రెండవ ఛార్లెస్ తనకు విశ్వాసపాత్రుడుగా ఉన్న ఒకానొక అనుచరునికి ఉత్తరదిశలో పోటోమాక్, రప్పహెన్నాక్ నదులమధ్య ఉన్న పెద్దభూమిని మంజూరుచేశాడు. ఐతే ఇదొక విషాదపూరితమైన బహూకరణ ; ఎందుకంటే అప్పటికి యువకుడైన రెండవ ఛార్లెస్ దేశబహిష్కృతుడుగా ఉండి, ఉత్తరోత్తరా జీవితమేమిటనే సందిగ్ధంలో ఉండటంవల్ల, తన ఆజ్ఞలను అమలు జరిపించటం సందేహాస్పదంగా ఉన్నది. తనదికాని ఐశ్వర్యాన్ని ఆయన దానంచేశాడు ; ఆయన కానీ, కొత్తగా యాజమాన్యాన్ని వహించిన వ్యక్తికానీ ఆ

బహుమతిని అంతవరకూ చూసి ఎరుగరు; బహుశా ఎప్పటికీ చూడలేరేమో?

ఇంగ్లండులోని అంతర్యుద్ధం తాలూకు మరొక చిన్న సంఘటన – అనేక వేలమంది జీవితాలమీద దెబ్బతీసిన చిత్రమైన ఘట్టం–1643 లో ప్యూరిటన్‌లు ఒకానొక ఆంగ్లికన్ మతగురువును ఉద్యోగంనుంచి తొలగించటం. ఆ మతగురువు పేరు లారెన్స్ వాషింగ్టన్. ఆయన కుటుంబానికి నార్త్ ఆంప్టన్‌షైర్‌లోని సల్‌గ్రేవ్ స్వభూమిగా ఉండేది; ఆయన ఆక్స్‌ఫర్డ్‌లోని బ్రాసినస్ కాలేజీలో పూర్వం 'ఫెల్లో'గా ఉండేవారు. మొత్తంమీద ఆయన కుటుంబం సుఖజీవనాన్ని గడుపుతూండేది. కాని యీ సంఘటనతో ఆయన కుటుంబం అష్టకష్టాలు పడింది. 1653 లో ఆయన మరణానంతరం, ఆయన కుమారుల్లో ఇద్దరు వర్జీనియాలో నూతన జీవితాన్ని ఆరంభించేందుకు నిర్ణయించుకున్నారు. వీరిలో ఒకరైన జాన్ ఓడమీద ఆఫీసర్‌గా వచ్చి, వర్జీనియాలోని ఒకానొక భూస్వామి కుమార్తెను వివాహమాడి, సగం యాదృచ్ఛికంగానే వర్జీనియాలోనే స్థిరనివాసాన్ని ఏర్పరుచుకున్నాడు. ఆయన బాగానే వర్ధిల్లాడని చెప్పవలసిఉంటుంది. ఆయన కొంతభూమిని సంపాయించాడు; శాంతిభద్రతలు కాపాడే న్యాయమూర్తిఅయ్యాడు; వర్జీనియా జనరల్ ఎసెంబ్లీ తాలూకు దిగువ సమితిలో సభ్యుడయ్యాడు.

వాషింగ్టన్ వంశం సుస్థిర [illegible]; ఐతే ఇప్పటికీ దాన్ని 'వంశం'గా పేర్కొనటే [illegible] రుల్లో ఎవ్వరూ కూడా గొప్ప ఐశ్వర్యవంతు [illegible] ప్రమాద

భరితంగానూ, మోటుగానూ ఉంటూ దినదినగండంగా సాగుతూన్నది. ఉదాహరణకు జాన్‌కు ముగ్గురు భార్యలు; వీరిలో చివరిభార్య అప్పటికే ముమ్మారు విధవరికాన్ని భరించింది; జాన్ 1677 లో చనిపొయ్యేనాటికి ఆమె నలభయ్యోపడిలో మధ్యవయస్కురాలుగా ఉండేది.

ఏమైనప్పటికీ వర్జీనియాలోని బైర్డ్, కార్టర్, కార్బిన్, ఫిడ్జిహగ్, హారిసన్, లీ, పేజ్, రాండాల్ఫ మొదలైన వంశీకులపేళ్లకు వాషింగ్టన్ పేరుకూడా మెల్లిగా కలిసింది. జాన్ జ్యేష్ఠకుమారుడు లారెన్స్ వంశోద్ధారకుడై, ఆనాటి వలసల్లోని చట్టాలప్రకారం వంశపారంపర్యమైన ఆస్తికి హక్కుదారుడయ్యాడు. లారెన్స్‌కూడా వర్జీనియా జనరల్ ఎసెంబ్లీ తాలూకు దిగువసమితిలో సభ్యుడయ్యాడు. కాని తన పరిసరాలమీద తగినంతపట్టు చేజిక్కకుండానే ఆయన 1698 లో తన 39-వ ఏట మరణించాడు. ఇప్పుడీ కథ విశాలభూభాగంమీదికి విస్తరించి, ఆస్తి తగాదాలూ, భూమి తగాదాలూ, అనేకవివాదాలకులోనై, వలసరాజ్యమైన వర్జీనియా చరిత్రలో క్లిష్టతమమైనదిగా రూపొందింది. లారెన్స్ సంతానాన్ని వారితల్లి ఇంగ్లండ్‌కు తీసుకొని వెళ్లింది; ఆనాటి ఆచారాలప్రకారం వెనువెంటనే పునర్వివాహితఅయింది.

కుటుంబంలోని ఇద్దరు కుర్రాళ్లూ విద్యాభ్యాసానికై వెస్ట్‌మోర్ లాం[illegible] ఏపిల్‌బీ విద్యాలయానికి పంపబడ్డారు. వారి[illegible]వారిని ఇంగ్లండ్‌లోనే ఉంచినట్లయితే, [illegible]స్తులు చేయి జారిపొయ్యేవి.

ప్తమైనా, వారి తల్లి మరణించాక, వారు తిరిగి వర్జీనియాకు వచ్చారు. ఆ ఆస్తులమీది వారి హక్కులు క్రమంగా సరళరూపాన్ని ధరించినవి. ఈ కుమారులలో ఒకరైన ఆగస్టెయిన్‌కు 1715 లో జేన్ బట్లర్ అనే ఆమెను వివాహమాడే సమయానికి దాదాపు 21 సంవత్సరాలవయస్సు. ఈ వివాహంలో సజీవుడైన మొదటి కుమారునికి తన తాతగారి, ముత్తాతగారి పేరైన లారెన్స్ పేరు పెట్టబడింది.

ఆగస్టెయిన్ చాలా కష్టపడి పనిచేసి గొప్పఆసక్తిని ప్రదర్శించాడు. తన తాతగారివలె, తండ్రిగారివలెనే ఆయన కూడా జిల్లాలో న్యాయాధిపతిగా ఉండేవారు. తన ఆస్తి, భార్య ఆస్తి కలిసి ఉత్తరదిశలో ఆయనకు 1750 ఎకరాల భూమి ఉండేది. 1726 లో అక్కడ స్థిరనివాసాన్ని ఏర్పరుచుకొన్న తన తాతగారైన జాన్ తాలూకు 2,500 ఎకరాలభూమి – పోటోమాక్ నదీతీరంలోదికూడా ఆయనకు సంక్రమించింది. ఒక ఇనుపకొలిమిలో ఆయన కుతూహలాన్ని చూపాడు.

1729 లో ఆగస్టెయిన్ భార్య చనిపోయింది. రెండేళ్ల తరువాత ఆయన తిరిగి పెళ్లి చేసుకున్నాడు. ఆయన ద్వితీయ కళత్రంపేరు మేరీబాల్. ఆమె అనాథ; 23 సంవత్సరాల వయస్సులో ఏదో కొద్ది ఆస్తితోనూ, సాధారణంగా ఉండే బంధుజనాలతోనూ జీవిస్తుండేది. 1650 లో వర్జీనియాకు వచ్చిన విలియం బాల్ అనే లండన్ న్యాయవాది కుమారుని వంశీకురాలామె. తన సంరక్షకుడైన ఒకా

నొక న్యాయవాది – జార్జ్ ఎస్క్రిడ్జ్ మీద ఆమెకు ఎంతో ఆపేక్ష. బహుశా యీ కారణంవల్లనే ఆమె తన మొట్ట మొదటి సంతానానికి జార్జ్ వాషింగ్టన్ అని ఆ సంరక్షకుని పేరు పెట్టింది. అలాకానిపక్షంలో ఆయనకు కుటుంబనామమైన జాన్ వచ్చి ఉండేది.

వెస్ట్ మోర్ లాండ్ జిల్లాలోని ఒకానొక ప్లాన్ టేషన్ లో (తరువాత దానిపేరు వేక్ ఫీల్డ్ ఐంది) జార్జ్ జన్మించాడు. ఈ ప్రదేశాన్ని పోప్స్ క్రీక్ అనీ, బ్రిడ్జెస్ క్రీక్ అని కూడా పిలిచేవారు; ఎందుకంటే అది యీ రెండు వాగుల మధ్య ఉన్నది. హంటింగ్ క్రీక్ ప్రాపర్టీ నుంచి కొంత దిగువ భాగాన యీ రెండు వాగులూ పోటొమాక్ నదిలోకి పోయి పడుతవి. జార్జ్ 1732 ఫిబ్రవరి 11-వ తారీకున జన్మించాడు (1752 లో కాలెండర్ లో జరిగిన మార్పుల కారణంగా మరో 11 రోజులు కలిసి, క్రొత్త కాలెండర్ లెక్కన ఇది ఫిబ్రవరి 22-వ తారీకు అవుతోంది). జార్జ్ తరువాత మరో ఐదుగురు పిల్లలు త్వరితగతిన జన్మించారు: ఎలిజబెత్, శామ్యూల్, జాన్ ఆగస్టెయిన్, ఛార్లెస్, మిల్ డ్రెడ్. చివరిశిశువు బాల్యంలోనే 1740 లో మరణించాడు.

అప్పటికి జార్జ్ తన మూడో ఇంట్లో చిన్నతనాన్ని గడుపుతూన్నాడు. 1735 లో ఆయన తండ్రిగారు ప్రిన్స్ విలియమ్ జిల్లాకు మారారు. మూడేళ్ల అనంతరం రపహాన్నాక్ నదిమీది ఫ్రెడరిక్స్ బర్గ్ అనే చిన్నస్థిరనివాసాలదగ్గిర ఫెర్రీఫారమ్ కు మళ్లీమారారు. తండ్రిగారికి ఇనుపకార్ఖానా

విషయంలో ఎంతో ఆందోళనా, నిరాశా ఎదురైనవి. ఏమైనా ఆయన వర్జీనియాలో శిఖరాగ్రాల్లో ఉన్న వ్యక్తుల జాబితాలో కాకపోయినా, పైతరగతి వ్యక్తుల జాబితాలోనే ఉన్నాడు. ఆయన 50 మంది బానిసలకు యజమాని. ఆయనకు విశేషభూవసతి – ఆయన వీలునామాలో పేర్కొన్నట్లు 10,000 ఎకరాలకు పైగా – లభించింది. తన మొదటి భార్య పుత్రులు – లారెన్స్, అగస్టెయిన్‌లను తాను చిన్నతనంలో విద్యాభ్యాసంచేసిన విద్యాలయం–ఉత్తర ఇంగ్లండులోని ఏపిల్‌బీకి పంపాడు. ఇందువల్ల వర్జీనియాలో పెద్దమనిషిగా చలామణీ అయ్యేందుకు అవసరమైన విశాల దృక్పథం, సంస్కృతీ అలవడుతవని ఆయన ఆశించాడు, పోతే అదృష్టం కలిసివొస్తే కొంచెం జాగ్రత్తగా పెట్టుబడులు పెట్టటంవల్లా, మంచి సంబంధాన్ని వెతుక్కొని పెళ్లాడటం వల్లా తమ ప్రవర్తనకూ, హోదాకూ తగినంత ధనాన్ని వారు పోగుచేసుకో గలుగుతారని ఆయన భావించాడు.

ఐతే ఆసమయంలోనే ఆ చిత్రమంతా మారిపోయింది. జార్జ్ 11 వ ఏట ఆయన తండ్రి–అగస్టెయిన్ చనిపొయ్యాడు. ఆస్తిలో అత్యధికభాగం తన సవితి సోదరులైన లారెన్స్, అగస్టెయిన్‌లకు సంక్రమించింది. జార్జికి వయసు వచ్చాక ఫెర్రీఫారమ్ సంక్రమిస్తుంది. ఈలోగా జార్జి తన తల్లితో జీవిస్తూ, ఆవలసలు విస్తరించే రోజుల్లోని ధోరణిలో తన యవ్వనదశలో కొద్దిభాగాన్ని–పిల్లతనం చేష్టలుమాని అనుభవించి, త్వరితగతిన పెద్దరికాన్ని పొందవలసి వచ్చింది. ఆయన చిన్నతనపు సంఘటనలు చాలా వరకు ఊహించవల

సిందే లేదా పార్సన్ వీమ్స్ మొదలైన వారు వర్ణించిన దాన్నిబట్టి చిత్రీకరించుకున్న వాటిని అంగీకరించవలసిందే! ఒకానొక కథప్రకారం—జైలుశిక్షను అనుభవించే ఒక సేవకుణ్ణి ఆయన తండ్రిగారు ఉపాధ్యాయుడుగా తీసుకురాగా ఆయన దగ్గర జార్జి చదువను, వ్రాయను నేర్చాడని! ఇలాటిది సాధ్యమేమరి. ఎందుకంటే, శిక్షార్హులైన వారూ, తలబిరుసు తనంలో ఉండే సేవకులూ అత్యధిక సంఖ్యాకులు వర్జీనియాకు పంపబడు తూండేవారు. వీరిలో కొంతమంది, శిక్షను అనుభవించినవారు, విద్యాధికులైన వారు. నిజంగానే వారినేరాలు నీచమైనవీ కావు. ఏమైనా యీ కథకు తగినాన్ని ఆధారాలు లేవు. ఫ్రెడరిక్స్ బర్గ్‌లోని ఒకే ఒక విద్యాలయానికి – రెవరెండ్ జేమ్స్‌మేరీ నడిపేదానికి – జార్జి వెళ్లాడనే విషయాన్నికూడా నిశ్చయంగా చెప్పలేము. అందుకని మొదటికథే నమ్మదగిందిగా కనిపిస్తుంది. ఏమైనా జార్జి తన 7-11 సంవత్సరాల వయస్సులో కొంత విద్యాభ్యాసాన్ని చేయటంమాత్రం జరిగింది. జార్జిని ఏపిల్‌బీకి విద్యాభ్యాసానికై పంపాలనే ఊహను గూర్చిన ప్రస్తావనే ఎక్కడా కనిపించదు. ఇది చాలా వ్యయంతో కూడినది కావటం, ఇందువల్ల దీర్ఘకాలం తల్లికీ బిడ్డకూ వియోగం భరించవలసి ఉండటం కారణాలు కావచ్చు. కారణాలు ఏమైనప్పటికీ, జార్జి విద్యాభ్యాసం అనేక విధానాల్లో రాష్ట్రానికి సంబంధించినదిగానే ఉండిపోయింది.

తండ్రిగారి మరణానంతరం జార్జి ఒకరకం శిక్షణను పొందుతున్నట్లు స్పష్టమైంది. యవ్వన ప్రాంగణంలో ఆయన

ఉపయోగించిన నోట్ పుస్తకాలు లభ్యమై, లాటిన్ భాష ప్రాథమిక పాఠాలూ, లెక్కలూ ఆయన నేర్చారనీ, సత్ప్రవర్తనకు సంబంధించిన విషయాలను, కొంత ఆంగ్లసాహిత్యాన్ని కూడా వంటబట్టించుకున్నారనీ మనకు తెలియవచ్చింది. ఐతే యూరపియన్ స్థాయిలను అనుసరించి చూసినట్లయితే, పెద్దమనిషిగా రూపొందవలసిన వ్యక్తికి ఇదంతా కేవలంచూచాయగా ఉండే విద్యాభ్యాసమనే అనాలి. ఎందుకంటే ఆయన సమకాలీనులవలె, వర్జీనియా ముఖ్య పట్టణమైన విలియమ్స్ బర్గ్‌లోని విలియమ్ అండ్ మేరీ కాలేజీ చదువులకు ఆయన వెళ్లనందువల్ల, ఇదంతా లాంఛన ప్రాయమైన విద్యాభ్యాసంగానే ఉండిపోయింది. ఆయన కాలేజీ విద్యాభ్యాసానికై ఎందుకు వెళ్లలేదో మనకు తెలియదు. బహుశా ఆయన తల్లి తన కుమారుణ్ణి దూరం చేసుకునేందుకు ఒప్పుకొని ఉండకపోవటమే కారణం కావచ్చు. మొత్తంమీద జార్జివాషింగ్టన్ ఉన్నత విద్యా సంస్కారాన్ని పొందలేదు. తదనుగుణంగా అత్యంత మేధావిగా ఏనాడూ గణనకు ఎక్కనూ లేదు. జాన్ ఆడమ్స్‌లాటి మేధావులైన అమెరికన్లతో వాషింగ్టన్ భేదిస్తారు, ఉత్తరోత్తరా జాన్ ఆడమ్స్ "వాషింగ్టన్ పండితుడు కాదనేది నిశ్చయంగా చెప్పవచ్చు. ఆయన అలంకరించిన స్థానాన్ని బట్టిచూస్తే ఆయనను విద్యాగంధంలేని వాడుగా, తగినంత చదువుసంధ్యలు లేనివాడుగానే పేర్కొనవలసి ఉంటుంది. ఆయన కీర్తికూడా వివాదగ్రస్తమే!" అన్నాడు.

వర్జీనియాలోని సమకాలీనులైన థామస్ జఫర్‌సన్, జేమ్స్ మాడీసన్ లాటివారి మేధస్సుతోను, మనోశక్తితోను వాషింగ్‌టన్‌ను పోల్చలేము. కొన్ని సంవత్సరాల అనంతరం వాషింగ్‌టన్‌కు యీ లోటు కనిపించింది. ఏదైనా విషయంలో తీవ్రమైన చర్చవస్తే ఆయనకు చాలా ఇబ్బందిగా ఉండేది. తాను చెప్పదల్చుకున్నది స్పష్టంగాను, శక్తివంతంగానూ – దీర్ఘకాలం అభ్యసించటంవల్ల–ఆయన కాగితంమీద పెట్టగలిగేవాడు. ఇందువల్ల వ్రాతలోని తప్పులైతే చాలా వరకు సర్దుకున్నవి కాని, ఆయన ప్రతిభావంతుడైన రచయిత కాలేదు.* పరిపక్వదశను అందుకున్న వాషింగ్‌టన్ జీవితంలో ఆయన చూపిన కొద్ది ఓర్పుకూ ఆయన మేధస్సు తాలూకు నియమితి కారణమని చెప్పవచ్చు. ఆయన యువకుడుగా ఉన్నప్పుడే ఫ్రెంచిభాష రానందువల్ల చాలా బాధ పడవలసి వచ్చింది. ఆ తరువాత ఫ్రాన్స్‌కు రమ్మన్న ఆహ్వానాన్ని ఆయన నిరాకరించవలసీ వచ్చింది. ఎందు

---

* మంచి మర్యాదల నియమాలు – ఆయనతాలూకు చిన్ననాటి నోట్‌బుక్‌నుంచి సేకరించబడినవి – ఆయన రచనలుగానే ఒక్కోసారి చెప్పబడినవి. కాని ఆయన వేరొక తావునుంచి వాటిని కాపీచేశారు. ("...గొప్పవారితో మాట్లాడేప్పుడు వారివైపు వంగకు, లేదా వారిని తేరిపార చూడకు...వారికి మరీ దగ్గరకుపోకు...వారితోపాటుగా పయనిస్తూ అల్లంతదూరాన ఉండు...") ఆయన పరిపక్వత పొందిన సంవత్సరాలలో పై అభిప్రాయాలు ఆయన నోటినుంచే వెలువడినవి; కాని ఆయన పనితొందరలో ఊపిరి తిరక్కుండా ఉంటూండటంవల్ల, వాటి పదజాలం ఆయన కార్యదర్శులచే సమకూర్చబడింది. వీటిలో కొన్ని అత్యుత్తమ ఖండాలుగాకూడా ఉన్నవి.

కంటే, తాను మాట్లాడేదానికి భాషాంతరీకరణం చేసే వ్యక్తుల సహాయం అవసర మౌతుంది కనుక. జఫర్‌సన్, ఆడమ్స్‌లవలె ఆయన ఎన్నడూ యూరప్‌ను అందుకోలేక పోయ్యారు.

ఐతే' యీ విషయాన్ని గూర్చి మనం మరీ నొక్కి-చెప్పరాదు. వర్జీనియాలో జఫర్‌సన్, మాడీసన్‌లు అందుకున్న మహామేధావుల అంతస్తు అపురూపమైనది. మహా ఐశ్వర్యవంతులైన ప్లాంటర్స్‌కూడా పుస్తకపఠనంలో కానీ, సంస్కరణను పొందటంలో కానీ ఎక్కువ శ్రద్ధాసక్తుల్ని చూపలేదు. వెస్టోవర్‌లోని విలియమ్ బైర్డ్ తన 3,000 గ్రంథాల గ్రంథాలయంతో వర్జీనియాలోని పెద్దమనుషుల జాబితాలో ఒక ప్రత్యేకస్థానాన్ని అలంకరిస్తాడు. వారు సుఖంగా, హాయిగా ఇంగ్లీషు జమీందార్లవలె జీవిస్తూ, మంచి ఆహారం, మద్యాలను సేవిస్తూ, పరదేశాలనుంచి దిగుమతిచేసిన మేలురకం దుస్తులూ, ఫర్నిచర్‌లంటే చెవి కోసుకుంటూ ఉండేవారు. ఐతే ఆనాటి కొన్ని చరిత్రలు స్ఫురింపజేసే విధానికి భిన్నంగా నాగరికతతో అంతగా మెరుగెక్కిన జీవితాలుకావు వారివి. యూరపియన్ దృష్టికి వీరి తాలూకు భూమి అపరిశుభ్రంగానూ, అక్రమంగానూ ఉండి, కాలాన్నిబట్టి చూసినా, స్థలాన్నిబట్టి చూసినా అడివికి దరిదాపుల్లో ఉన్నట్లుండేది. వారు కనబరిచిన వ్యాపార ధోరణీ, భావప్రాధాన్యతా మాతృదేశాన్ని జ్ఞాపకంచేసేవి; మసాచుసెట్స్‌లోని వారివలె ముక్కుతో మాట్లాడకుండా (అక్కడి

వారు తమ పిల్లలు నీగ్రో బానిస కుర్రాళ్ళతో మాట్లాడి వారి ఉచ్చారణను అలవర్చుకున్నారని అంటారు) వీరి ఉచ్చారణ మాతృభాషకు దరిదాపుల్లో ఉండేది.

ఇక ఇతర విషయాలలో 18-వ శతాబ్దపు మధ్య భాగంలో వర్జీనియా అదొక ప్రత్యేక ప్రపంచంగా ఉంటూ, యూరప్‌నుంచీ, పట్టణ నాగరికతకూ చాలా సుదూరంలో ఉంటూండేది. ఒకసారి వాషింగ్టన్ తన యవ్వనదశలో విలియమ్స్‌బర్గ్‌ను 'గొప్ప రాజధాని నగరం' అని హాస్యధోరణిలో అన్నారు. బోస్టన్ లేదా ఫిలడెల్ఫియా (ఆమాటకొస్తే లండన్‌నుకూడా వాషింగ్టన్ అలాటి పద జాలంతోనే వర్ణించారు) లతో పోలిస్తే, విలియమ్స్ బర్గ్ ఒక చిన్న పట్టణం. ఆ రోజుల్లో ఇతర పట్టణాలు పెంపొందుతూన్నప్పటికీ, విలియమ్స్‌బర్గ్, యార్క్‌టౌన్, హాంప్టన్, నార్ఫోక్‌లు సుమారైన పట్టణాలుగా రూపొందినవి. వర్జీనియా ఒక పల్లెప్రాంతంగా ఉంటూ, పల్లీయ అభిరుచులతో నిండి ఉండేది. అది ఒక పెద్దవలసగా, గర్వించదగినదిగా ఉన్నప్పటికీ— ప్లాంటేషన్, పారిష్, జిల్లా మొదలైనవి – దాని సజీవతను ప్రకటించేవి స్థానికమైనవిగానే ఉండేవి. విలియమ్స్‌బర్గులోని ఎసెంబ్లీకి వెళ్లేసభ్యులు కొద్దికాలంపాటు కులాసాగాఉండే పట్టణజీవితాన్ని నాట్యాలలో, విందులలో, పేకాటలలో, నాటకాలలో గడిపేవారు. ఇవి మినహాగా వర్జీనియా ప్లాంటర్ – జనాభాలో అత్యధిక సంఖ్యాకులైన బీదవారైన రైతులను మినహాయిస్తే – ఒక పల్లీయుడుగా, ఊపిరితిరగని

పనితో ఉండే చిన్న భూస్వామిగా, సానికమైన శక్తిసామర్థ్యా లున్నవాడుగానే జీవించేవాడు.

ఆతని ఆశలన్నీ భూమినిగూర్చే. ఒక సామాన్యుడైన ప్లాంటర్‌కు అనేక భూఖండాలుండేవి. ఒక ఎస్టేట్‌ను స్వయంగా సేద్యంచేసుకుంటూ, పొగాకును ముఖ్యమైన పంటగా ఉంచు కొనేవాడు. మిగత భూఖండాలను కవులుకు ఇచ్చేవాడు; ఇంకామిగిలినవి – పశ్చిమభాగాన ఉన్నవి – మిట్టపల్లాలతో, అనేక చెట్లు పెరిగి ఉంటూ సేద్యానికి యోగ్యం కాకుండా ఉండేవి. వాటిని ఎవ్వరూ ఆక్రమించకుండా ఉంటే వాటి సంగతి ఆలోచించవలసి ఉండేది. ఈ విధంగా అతని ఐశ్వర్య మంతా భూమిమీదనే ఆధారపడి ఉండేది. అతని భావీ, అతని కుటుంబ భవిష్యత్ కూడా అతనింకా సంపాయించ వలసిన భూమి మీదనే ఆధారపడి ఉండేది. వర్జీనియాలోని గొప్పవారు–నోమినీలోని ఏ రాబర్ట్ కార్టర్ లాటి వారో–తమ ఐశ్వర్యాన్ని వేల ఎకరాలలో లెక్కించుకునేవారు. ఆ తరు వాత ఒకశతాబ్దానికి కాలిఫోర్నియాలో బంగారుగనులు కనుగొనబడ్డాక, బంగారంమీాది మమత ప్రజలకు అత్యధి కమై, తీవ్రజ్వరరూపాన్ని దాల్చింది. వలసగా ఏర్పడిన వర్జీనియాలోని క్షేత్రంమీాది ఆపేక్ష అంత తీవ్రజ్వరరూపాన్ని దాల్చకపోయినా, దానిఫలితాలు మాత్రం–బంగారాన్ని గూర్చిన తీవ్రజ్వరంతాలూకు ఫలితాలకు తీసిపోయినవి కావు.

వర్జీనియా వాసికి భూమిమీాది మమత ఒక్కోసారి విస్తారంగానూ, నిర్లక్ష్యంగా కూడా ఉండేది. వర్జీనియా

ప్లాంటర్ తనకు తెలిసినంత వరకూ వ్యవసాయాన్ని సాగించే వాడేకాని, యూరపియన్ రైతువలె సూక్ష్మమైన పొదుపరితనాన్ని అమలు జరిపేవాడు కాదు. పొగాకు పండించి పండించి భూమి నిస్సారమైతే, విచారిస్తూ కూర్చునేవాడు; ఐతే సారవంతమైన భూమి – అంతకుముందు పంటలు పండించనిది, వేరొక ఎస్టేట్ – సిద్ధంగా ఉండనే ఉండేది.

కనుక యీ కొత్తభూమే ఇప్పుడు వర్జీనియా వాసి సుఖస్వప్నం–పేచీలతోనూ, పోటీలతోనూ, అశాంతితోనూ, హెచ్చరికలతోనూ, ప్రమాదాలతోనూ, నైచ్యాలతోనూ కూడుకున్నది. ఏమైతేనేమి అదొకవిధమైన ఆశయమేమరి! ఎన్నో ప్రమాదాలతో కూడుకొని, ధైర్యసాహసాలకు అగ్నిపరీక్షగాఉంటూ, నెగ్గుతే గొప్ప లాభాన్ని పొందే అవకాశాలున్నదే వర్జీనియా వాసి జీవితానికి సంబంధించిన వర్ణన. ఐతే ప్రాథమికమైన మానవ అవసరాలను గూర్చి, ఆయా సమయాల్లో ఆలోచించవలసిన సమస్యలుకూడా ఇందులో ఇమిడేఉన్నవి. ఈరకం జీవితంలోకి జొరబడే ప్రతివారూ ఎలా వాదించాలో, తమ అభ్యంతరాలను ఎలా తెలియపరచాలో తెలుసుకొనే ఉంటారు.

తాను కష్టించి పనిచేసిన రోజునుంచే ప్లాంటర్ వినోదాలుకూడా ఉద్భవించినవి. దీర్ఘకాలం గుర్రపుస్వారీ చేయవలసిన అవసరాన్ని అతను ఆనందిస్తాడు. కొలొనెల్ విలియమ్‌బైర్డ్ ఇలా అన్నారు: "ప్రియమైన నా దేశీయులు గుర్రపుస్వారి అంటే చెవికోసుకుంటారు; స్వారీ చేసేందుకు

గుర్రం దొరుకుతుందంటే అనేక సందర్భాలలో వారు రెండు మైళ్లన్నా నడిచేందుకు సిద్ధంగా ఉంటారు. గుర్రాలు పరుగెత్తటాన్ని చూడటం (గుర్రపు పందాలు కాయటం కూడాను), నక్కల్ని వేటాడటం, జంతువుల్ని తుపాకులతో కాల్చటమంటే ప్లాంటర్‌కు ఎంతో ఇష్టం. అప్పుడప్పుడు చాలా మోటుపద్ధతిలోనే కోడిపందాలు జరుపుతూ, ధనవ్యయంచేసే వాడు. బలాతిశయంతోనూ, పోరాటంతోనూ బతికే జీవితమది. అందుకనే ధైర్యసాహసాలనేవి ఆ జీవితాలకు అత్యావసరాలైనవి. ఇతర వలసలలో వలెనే ఇక్కడకూడా ఇండియన్ల తలలకు బహుమతులు ఇవ్వబడేవి. అనేక సందర్భాలలో ఇంగ్లండులోని కఠిన శిక్షాస్మృతిని పోలిన ఇక్కడి శిక్షాస్మృతి అక్కడికన్న దారుణంగా లేకపోయినా – నీగ్రోల విషయంలో కార్పణ్యం వహించింది. పెద్దనేరాలకు నీగ్రోలను ఉరిదీయటం, ఒక్కొక్కసందర్భంలో బతికి ఉండగానే నిప్పుల్లో కాల్చిచంపటం జరుగుతూండేది.

### వర్జీనియా పలుకుబడులు :

ఇది యువకుడైన వాషింగ్‌టన్ తాలూకు వర్జీనియా. ఆయన అభ్యసించిన విద్యలు ఆయన అవసరాలను తీర్చేవిగానే ఉండినవి. ఆయన మంచి గురిగాడు ; చక్కని గుర్రపు స్వారీ చేయగలరు. ఆయన వయస్సుకు అవి గొప్పగానే భావించబడినవి. ఆయన పొడుగ్గా, బలిష్ఠంగా ఎదిగి చాలా హుషారుగా ఉండేవారు. ఐతే జార్జ్ పిచ్చెత్తినట్లు పరుగులిడలేదు. ఆయన తల్లినుంచి ఉత్తమ సంస్కృతిని పొందలేదన

టం సత్యమే! ఆమెను వీరమాతగా శ్లాఘించినప్పటికీ – ఆమె సంకుచితత్వంతో, గొణుగుతూ, దూరంపోని ఊహాలతో ఉండే జీవిగా కనిపిస్తుంది. తరువాతి సంవత్సరాలలో జార్జి ఆమెపట్ల విశేష గౌరవాన్ని ప్రదర్శించాడేకాని, దానికి కొంత అనురాగాన్నీ, ఆపేక్షనూ జోడించలేదు. యవ్వన ప్రాంగణంలో అడుగిడిన జార్జి విషయంలో ఆమె తీసుకున్న చర్య సముద్రంమీదికి నౌకాధిపతి హోదాలో వెళ్లేందుకు చెప్పిన అభ్యంతరంగా కనిపిస్తుంది.

ఐతే అదృష్టవశాత్తూ ఆ కుటుంబంలో ఇతరపలుకుబడులు – ముఖ్యంగా ఆయన సవితిసోదరుడు లారెన్సుది ఉన్నది. జార్జికన్న లారెన్సు 14 సంవత్సరాలు పెద్ద. ఆయన సౌహార్ద్రం హృదయపూర్వకమైనది. ఇంగ్లండ్‌లో విద్యాసంస్కారాన్ని పొందిన ఆయన ఎంతో ఆకర్షణీయంగానూ, ప్రాపంచికానుభవాలు తెలిసినవాడుగానూ ఉంటూ, జార్జి పొందిన పితృవియోగాన్ని పూరించే వ్యక్తిగా ఉండేవాడు. జార్జి 8 సంవత్సరాల వయస్సులో ఉండగా, లారెన్సు కాప్టెన్‌గా వెస్ట్ఇండీస్‌కు, కొత్తగా ఏర్పడిన అమెరికన్ నౌకాదళంతో వెళ్లి, కార్టజీనాదగ్గిర స్పానిష్ పటాలాలను ఎదుర్కొనేందుకు ఎడ్మిరల్ వెర్నన్ పథకంలో పాల్గొన్నాడు. ఎడ్మిరల్ లోపా లేమీ లేకపోయినా యీ పథకం అపజయాన్ని పొంది విశేష ధనవ్యయానికి కారణభూతమైంది. అమెరికన్ సైనికపటాలం సైనికులు చాలామంది ఎల్లోఫీవర్‌తో చనిపొయ్యారు. సజీవులైన మిగతా

వారిలో లారెన్స్ కాస్త ముందుగానే సగంజీతంమీద పింఛను పుచ్చుకునే ఉద్దేశంతో ఇంటికి తిరిగి వచ్చాడు; తదనుగుణంగా ఆయన దరఖాస్తు పెట్టాడు. కాని ఉత్తరోత్తరా వర్జీనియా సేనలో ఒక ఉన్నతోద్యోగిగా ఆయన నియమించబడ్డాడు. ఒక విశిష్టరూపాన్ని దాల్చిన పలుకుబడికై - వాషింగ్టన్ మీద పనిచేసినదానికై మనం ఎదురుచూస్తున్నట్లయితే, అది మిలిటరీకి సంబంధించిందిగా ఇక్కడ మనకు లభ్యమౌతుంది. లారెన్స్‌కు సైనిక గౌరవాలేమీ లభ్యమవకపోయినా, గొప్ప సాహసికకృత్యంగా పరిణమించవలసిన దానితో ఆయనకు మంచి పరిచయం ఏర్పడింది. పోతే ఎడ్మిరల్ మీద లారెన్స్‌కు గొప్ప గౌరవభావం ఏర్పడి, హంటింగ్ క్రీక్ మౌంట్ వెర్నన్‌లోని తన ఎస్టేట్‌కు ఆయన పేరు పెట్టటమేగాక, అక్కడ ఆయన నిర్మించిన భవనాన్ని ఎడ్మిరల్ చిత్రపటంతో అలంకరించాడు.

లారెన్స్ తాలూకు రెండో పలుకుబడిని సామాజికమైనదిగా చెప్పుకోవలసి ఉంటుంది. తండ్రిగారు చనిపోయిన సంవత్సరంలో - అంటే, 1743 లో ఆయన నిజంగా కోరదగిన సంబంధాన్ని చేసుకున్నాడు. మౌంట్ వెర్నన్‌ను దాదాపు ఆనుకొనిఉన్న ఎస్టేట్ అధిప... కల్నల్ విలియమ్ ఫెయిర్‌ఫాక్స్ ఆఫ్ బెల... రె ఏనీ ఫెయిర్‌ఫాక్స్ లారెన్స్ ఎన్ను... ఫెయిర్‌ఫాక్స్ వర్జీనియాలో... వివాహానంతరం ఆయన

చారు; ఆ వలసలోని పన్నెండుమంది ప్రముఖులున్న వర్జీనియా జనరల్ ఎసెంబ్లీలో ఆయన సభ్యుడయ్యాడు. లారెన్స్ సహాయంతో ఫెయిర్‌ఫాక్స్ జార్జ్‌లోని అభివృద్ధిలో ముఖ్యభాగాన్ని రూపొందించటంలో ప్రముఖపాత్రవహించాడు. జార్జికి 16 ఏళ్ల వయస్సు – లేదా ఆ దరిదాపు – ఉండగా ఆయన మౌంట్ వెర్నన్‌లోనే నివాసానికి వచ్చాడు. జార్జికి బిలియర్డ్స్, విస్ట్ యీ మొదలైన ఆటలాడటం నేర్పాడు; నాట్యమాడటం కూడా నేర్పబడింది. కొంత కులాసాకూ, మరికొంత దహించివేసే ఆతురతకూ జార్జిలోనై, అమ్మాయిలను ఆకర్షించేందుకు నాట్యాన్ని నేర్చుకున్నాడు. ఆయన ఉత్తరాలూ, ఇతర రచనలూ ఉద్రిక్తంగానూ, చిత్రంగానూ ఉండి, తక్కువ అంతస్తులో ఉన్న అందమైన అమ్మాయిలనుగూర్చి ఉన్నవి. ఈ విషయాలమీద జీవితచరిత్రలను వ్రాసినవారు ఇదమిత్థంగా ఏమీ చెప్పలేదు; సందర్భవశాత్తు ఆయన 20 ఏళ్లవయస్సులో బెట్సీ ఫాంట్లిరోయ్ అనేఆమెతో చేసిన విఫలప్రణయాన్నిగూర్చికూడా వారేమీ చెప్పలేదు. ఇలాంటి సంఘటనలు చిత్రంగా ఉంటవి మరి! ఎందుకంటే యువకుడైన వాషింగ్టన్‌కూడా మానవమాత్రుడేననీ, ఆయా సంఘటనల్లో [illegible]న్న వ్యక్తులు చీకటికోణాల్లోనివారనీ ఇవి రుజువు[illegible]తే డ్రాయింగ్‌రూమ్స్‌లో జరిగే ప్రణ[illegible] లేదా అంత అందగాడేమీ [illegible] సంఘటనలు ఏవిధంగానూ [illegible]కూలంగా ఉంటూ, హాస్య

రసపోషణలో వెనుకబడి, పరిపక్వత పొందని దశలో ఉన్నాడు; లేదా స్థానికమైన పోటీదారులకోవలో జేరక, విశిష్టతను ప్రదర్శించి ఉండొచ్చు.

కాని ఆశ పుట్టించే చిక్కుసమస్యకు సంబంధమున్న సంఘటన సారా (శాలీ) కారీ తాలూకుది; హాంప్టన్‌కు సమీపంలో ఉన్న జేమ్స్‌నదీతీరంలోని ఎస్టేట్‌కు అధిపతి ఐన కలొనెల్ విల్సన్ కారీ కుమార్తె యీ సారాకారీ. ఆమె 1748 డిసెంబర్‌లో – తన 18–వ ఏట – కలొనెల్ ఫెయిర్ ఫాక్స్ జ్యేష్ఠకుమారుడు జార్జి విలియమ్‌ను పెళ్లాడి, బెల్ వోయిర్‌లో తన నివాసాన్ని ఏర్పరుచుకున్నది. ఆమెభర్త జార్జి విలియమ్ ఆకర్షణీయంగా ఉండేవాడు; వాషింగ్‌టన్ ఆయన్ను తన మిత్రబృందంలో చేర్చుకున్నాడు. కొన్ని నెలలకు ముందు ఆయన తన డైరీలో విలియమ్‌నుగూర్చి గౌరవపురస్సరంగా 'మిస్టర్ ఫెయిర్‌ఫాక్స్' అని ఉదాహరించారు. ఆ తరువాత కొన్ని సంవత్సరాలవరకు శాలీ అందచందాలను చూసి ముగ్ధుడౌతూ, అప్పుడప్పుడు ఆమెకు ఉత్తరాలు రాస్తూ, బహుశా ఆమె ప్రేమలోకూడా పడిపొయ్యాడు. ఆయన ఆమెకు రాసిన ఉత్తరాలలో – ఆమె అంటే ఆయనకు ఎంతో ఇష్టమనీ, ఆమె స్నేహాన్ని అమూల్యంగా ఆయన భావించాడనీ, ఏమైనా ఆమె విషయంలో తనకు చాలా ఇబ్బందిగా ఉన్నదనీ రాసిన విషయాలు సుస్పష్టం. ఆయన ఆరాధన ఆమెకు ఎంతో ఆనందాన్నిచ్చేదనీ, పరిహాసానికీ, సరసానికీ మధ్య తేడాలేకుండా

ఆమె చేసిందనే విషయాలు ఆమె రాసిన ఉత్తరాలలో సుస్పష్టం. ఐతే వాషింగ్టన్ ఆమె ప్రేమలో చిక్కుకున్నాడా? ఈ విషయంలో దొరికిన రుజువుల్లో పరిపూర్ణత లేనందువల్ల మనం నిర్ధారణగా ఏమీ చెప్పలేము. ఒక వేళ ఆయన ఆమె ప్రేమపాశంలో బంధితుడై ఉన్నట్లయితే, వారిమధ్యఉన్న సంబంధబాంధవ్యాలు కేవలం భావప్రధాన మైనవిగానూ, వ్యక్తిగతంగా ఏకాంతంలో ఎవరికివారుగా ఆనందించేవిగానూ మాత్రమే ఉండేవి.

ఏది ఏమైనప్పటికీ – శాలీ, విలియమ్‌జార్జి, లారెన్స్, ఏనీఫెయిర్ ఫాక్స్‌లు జార్జ జీవితంలో ఆనంద రేఖలుగా రూపొందారు. ఆయన ప్రవర్తన కాస్త అనుమానాస్పదంగా ఉన్నట్లయితే – ఇంతా ఏడుస్తే ఆయన చిన్నవాడు; విశేషించి సవితి కొడుకుకూడా అవటంవల్ల పెద్దవాళ్లు మనసు కష్టపెట్టుకొనేవారు కారు. ఆయన సంబంధ బాంధవ్యాలు ఉపయోగ కరమైనవి. ఆయనేం ధనహీనుడూ కాదాయె. సిండ్రెల్లా కథలోని అందవిహీనలైన సోదరిలతో బతికిన విధంగా వాషింగ్టన్ లారెన్స్, ఆగస్టైయిన్‌లతో జీవించవలసిన పరిస్థితులు కావు. ఐతే తాను అక్కణ్ణుంచి కదిలి పోవాలని, లేదా కనీసం తనకు ఎదురయ్యే అవకాశాలను సద్వినియోగం\ చేయాలనే సత్యాన్ని ఆయన గ్రహించి ఉండాలి. సందర్భోచితంగానూ, యాదృచ్ఛికంగానూ ఆయన పరిస్థితులు ఆయన్ను బాగా ముందుకు నడిపినవి. పోలికలువేసిచూస్తే ఫెయిర్‌ఫాక్స్ కుమారులు

కొంచెం చెడిపోయ్యారు. ఉత్తరోత్తరా జార్జ్ సవితిబిడ్డలూ, వారి సంతానమూ చెడిపోయినట్టు! * ఏదో కొంత దైన్యం పరిసరాల్లో వేళ్లాడుతున్నదని జార్జి వాషింగ్‌టన్‌కు తోచి ఉండాలి. కనుకనే ఆయన ఆశయాలు చల్లారేందుకుమారుగా పదును దేలినవి. అందుకనే 1755 లో ఆయన తన చిన్న సోదరుని విషయంలో ఇలాటి సలహాను బలవత్తరంగా జారీ చేశాడు :

"నీవు బెల్‌వోయిర్‌లో ఆకుటుంబీకులతో కలిసి మెలిసి హాయిగా ఉంటున్నట్లు తెలుసుకొని ఎంతో ఆనందించాను; అనేక సందర్భాలలో ఆకుటుంబీకులు మనకు చేదోడు వాదోడుగా ఉంటూనే ఉన్నారు. మన చిన్నతనంలో మనకు సహకారాన్నివ్వటమే వారి గురి. ఐతే నీవు అక్కడికి వెళ్లినప్పుడల్లా మరొక్క అడుగు ముందుకు వేస్తూ ఉండాలని నా సలహా."

జీవితారంభదశలో ఉన్న జార్జ్‌మీద పనిచేసిన మూడో పలుకుబడి - లారెన్స్, ఫెయిర్‌ఫాక్స్ కుటుంబీకులనుంచి లభ్యమైనదానిని సరిహద్దులకు సంబంధించిందిగా పేర్కొనవచ్చు. 1750 లో ఒకానొక వర్జీనియా నాయకుడు ఇంగ్లండ్‌లోని బోర్డ్ ఆఫ్ ట్రేడ్ వారికి ఒక విన్నపం చేశాడు. అందులో వర్జీనియా వలసరాజ్యం తాలూకు సరి

---

*వాషింగ్‌టన్ సవితి కొడుకు జాక్‌నుగూర్చి ఒకానొక ట్యూటర్ ఇలా అన్నాడు: "ఇంత తలబిరుసుతనం, దురాశా ఉన్నవాళ్లను నేనెన్నడూ చూడలేదు. బహుశా ప్రకృతి—ఆసియాలో ఏరాజకుమారుడో అయ్యేందుకు ఇతన్ని సృష్టించి ఉంటుందని ఎవ్వరైనా అనుకోవలసి ఉంటుంది."

హద్దు పశ్చిమాన దక్షిణ సముద్రం (పసిఫిక్ మహాసము ద్రం) వరకూ వ్యాపించి ఉన్నదనీ, ఇందులో కాలిఫోర్నియా కూడా కలవాలనీ ఆయన విన్నపం. ఐతే స్వామ్యాధికారం సువిశాలమైనదేగాక, నిర్ధారణలేనిదికూడాను. కొన్ని సంవత్సరాలక్రితం జార్జివాషింగ్టన్ విద్యాలయంలో రాసిన కాపీ పుస్తకాలలో కాలిఫోర్నియా ఉత్తర అమెరికాకు సంబంధించిన పెద్ద ద్వీపాలలో ఒకటిగా, ఐస్ లెండ్, గ్రీన్ లెండ్ మొదలైనవాటికోవకు సంబంధించిందిగా జాబితా లోకి ఎక్కి ఉన్నది. అంతేగాక ప్రతి వర్జీనియా వాసికీ - పశ్చిమాన బ్లూరిడ్జ్ పర్వతశ్రేణి ఉన్నదన్న విషయంకూడా తెలిసిందే! ఆ పర్వత శ్రేణుల వెనుక సారవంతమైన షెనాండోవ్ లోయ ఉన్నదనీ, దానికి సమానాంతరంగా ఎల్లె ఘనీస్ పర్వతాలు అడ్డుగా ఉన్నవనికూడా తెలుసు. షెనాండోవ్ కు దిగువన పశ్చిమోత్తర దిశలోఉన్నస్థలం వివాదగ్రస్తమైనది ; అంటే ఓహియోలోయ క్రమంగా మిసి సిపీనదికి దారితీస్తున్న ప్రదేశమిది. ఇదంతా సంక్రమిస్తే తనకూ, తన తరువాతితరంవారికీకూడా అత్యంత ఐశ్వర్య వంతమైన బహూకరణ లభించినట్లే అవుతుంది! ఏమైనా వలసదారులు తమ హక్కుల్ని పొందులుకొనే ఉద్దేశ్యంలో లేరు. ప్రతివలసదారుడూ తన హక్కును అనేక మార్గా లలో నొక్కి వక్కాణిస్తూనే ఉన్నాడు, వర్జీనియా, మేరీ లాండ్, ఇరాక్వియన్ ఇండియన్ల మధ్య 1744 లో జరిగిన రాజీసంప్రదింపుల ప్రకారం శ్వేత జాతీయుల స్థిరనివాసా లకు సంబంధించిన పశ్చిమ సరిహద్దు పూర్వం ఇండియన్లు

గుర్తించిన బ్లూరిడ్జ్ పర్వత శ్రేణులకు మారుగా, ఇప్పుడు ఎల్లెఘనీస్ ఐంది. ఈ విధంగా షెనాండోవ్ లోయ స్థిర నివాసాలకుగాను ఎదురు చూస్తున్నది. ఆ తరువాత కొద్ది మాసాలకు లండన్ లోని ప్రీవీకౌన్సిల్ రెండవ ఛార్లెస్ రాజు చేసిన వాగ్దానాన్ని - 90 సంవత్సరాలనాటి దాన్ని గూర్చి చెవిని బెట్టసాగింది. రెండవ ఛార్లెస్ రాజు సింహాసనమెక్కటం జరిగింది కనుక ఆయన అనుచరుడు అదృష్టవంతుడై, నార్దరన్ నెక్ కు అధిపతిగా గుర్తించ బడటం జరిగింది. వంశపారంపర్యత ననుసరించి 1744 లో ఆ ఆస్తి హక్కుదారుడు థామస్ లార్డ్ ఫెయిర్ ఫాక్స్. ఆయా హక్కులను గూర్చి ప్రీవీకౌన్సిల్ దీర్ఘంగా ఆలోచించి, ఫెయిర్ ఫాక్స్ కు అనుకూలంగా ఉండే నిర్ణయాలను చేసింది. ఆయనభూమి తాలూకు హద్దులు తిరిగి నిర్ణయించబడి పోటామాక్ ఎగువభాగానికీ, రెప్పహెన్నాక్ కీ మధ్యఉండే సువిశాలమైన భూమిగా రూపొందింది.

లార్డు ఫెయిర్ ఫాక్స్ దాయాదే కలోనెల్ ఫెయిర్ ఫాక్స్. ఈయన లార్డు ఫెయిర్ ఫాక్స్ ఏజెంట్ గా ఉంటూ, తద్వారా గొప్ప అధికారాన్ని చేజిక్కించుకున్నాడు. యజమాని కుశాగ్రబుద్ధి కాడు సరికదా, ఎప్పుడూ అనుమానాలతో సతమతమయేవ్యక్తి కావటంవల్ల - ఒక్కోసందర్భాన చెప్పబడిన విధంగా గాక, జార్జికి ఎలాటి సహాయ సహకారాలనూ చేయలేదు. ఆయన కేవలం పురాణపురుషుడుగా భావించబడుతూండే వాడు. అందుకనే తన ఆస్తిపాస్తుల్ని

కళ్లారా చూసుకునేందుకు ఆయన 1748 లో వర్జీనియాకు వేంచేసినప్పుడు, అక్కడివారికి ఎంత ఉద్వేగానికి కారకుడై ఉండేవాడో మనం తేలిగ్గా గ్రహించవచ్చు. ఇక్కడి జీవితారంభానికి ఆయన మొదట్లో బెల్‌వోయిర్‌లో నివాసాన్ని ఏర్పరుచుకున్నాడు. ఈ సమయానికి లారెన్స్, మరి కొంతమంది సాహసికులూ కలిసి ఓహియో కంపెనీని స్థాపించారు. తద్వారా పోటోమాక్ ఎగువ భాగంలో పెద్ద భూమిని మంజూరు చేయించుకోవటం వారి ఆశయం. సరిహద్దు ప్రాంతం సాగిపోతూ ఉన్నది; నిజానికి గొప్ప ఆశలతోను, ఆశయాలతోనూ మరొక సాహసికబృందం లాయల్ కంపెనీ అనేదాన్నికూడా ఆసమయంలోనే స్థాపించింది.

భూమిని విస్తరింపజేసుకునేందుకు ఏర్పడిన యీపెద్ద సంస్థలకూ, వాషింగ్‌టన్ మొట్టమొదటి ఉద్యోగానికీ మధ్య ఉన్న సంబంధాలు సుస్పష్టం. భూమి ముఖ్యమైంది; వాషింగ్‌టన్ సర్వేయర్ అయ్యాడు. ఇందుకు బహుశా లారెన్స్‌దే కొంతవరకూ బాధ్యత. ఆయన జార్జివిషయంలో దయగా ఉన్నప్పటికీ, అతను సోమరికాకుండా తగిన శిక్షణను ఇచ్చాడు. జార్జివాషింగ్‌టన్‌ను సముద్రంమీదికి పంపాలని లారెన్స్ అనుకొని ఉండొచ్చు; ఐతే అది మంచి భవిష్యత్ ఉన్న ఉద్యోగమేమీకాదు (జార్జి పినతండ్రి చెప్పిన సలహా ఇది). అదంతా కేవలం అవకాశాలమీద ఆధారపడింది. ఐనప్పటికీ పెద్ద విశదీకరణల అవసరంలేదు. బహుశా ప్రతి వర్జీనియా ప్లాంటర్‌కూ సర్వేనుగూర్చి కొద్దో గొప్పో

తెలుసు – ఎందుకంటే చిన్నతనంలోనే యీ విషయాలు బోధించబడేవి; అదేవిధంగా జార్జి కుర్రవాడుగా ఉన్నప్పుడు విక్రయదస్తావేజు ఎలా రాయాలో, పవర్ ఆఫ్ ఎటర్నీ, లేదా ప్రామిసరీనోటు ఎలారాయాలో నేర్చుకున్నాడు.

జార్జి 16 ఏళ్ల వయస్సులోనే భూమి సర్వేనుగూర్చి బాగా తెలుసుకొనేఉన్నాడు. 1748 లో ఫెయిర్‌ఫాక్స్ పటాలాలు షెనాండోవ్ ప్రదేశానికి కదిలి వెళ్లినప్పుడు వారితోకూడా వెళ్లి, భూమిసర్వే చేశాడు; ఇదే వాషింగ్‌టన్ బ్లూరిడ్జ్ పర్వతశ్రేణులమీదుగా చేసిన మొట్టమొదటి ప్రయాణం. ఆ మరుసటిసంవత్సరంలో మౌంట్ వెర్నన్‌కు కొద్దిమైళ్ల ఉత్తరాన, పోటొమాక్ తీరాన నిర్మించబడిన కొత్తపట్టణం బెల్‌హెవెన్ (ఆ తరువాత దీనిపేరు అలెగ్జాండ్రియాగా మారింది)కు సహాయకుడైన సర్వేయర్‌గా ఆయన నియమించబడ్డారు. లారెన్స్ వాషింగ్‌టన్ అలెగ్జాండ్రియా ట్రస్టీలలో ఒకరు. ఈవిధంగా జార్జి కుటుంబ పర్యవేక్షణక్రిందనే పని ప్రారంభించాడు. ఆ తరువాత కొద్దికాలానికే కల్‌పెప్పర్ జిల్లాకు సర్వేయర్‌గా నియమించబడ్డారు. ఇప్పుడు సుమారైన జీతంమీద ఆయన వర్జీనియా ఉత్తరదిశలోని కొత్త కొత్త ప్రదేశాలకు సర్వేయర్‌గా వెళ్లాడు. 1750–వ సంవత్సరాంతానికి 18 ఏళ్ల వయస్సు వాడైన వాషింగ్‌టన్, మూడు భూఖండాలు – 1,450 ఎకరాల విస్తీర్ణానికి సంబంధించింది, షెనాండోవ్ దక్షిణ దిశలో ఉన్నదానిమీద తన హక్కును అమలుజరిపే ప్రయత్నాలుచేశాడు. త్వరలోనే ఫెర్రీఫారమ్ తనకు హస్తగత

మాతుంది కనుక, భవిష్యత్ కాస్త ఆశాజనకంగానూ, తృప్తికరంగానూ కన్పట్టింది. గొప్ప తెలివితేటలుగలవాడు కానీ, గొప్ప అదృష్టానికి నోచుకున్నవాడు కానీ తాను కాకున్నా, శక్తిసామర్థ్యాలుగల, ఆధారపడదగిన వ్యక్తిత్వాన్ని ఆయన కలిగి ఉన్నారు.

1751-వ సంవత్సరాంతంలో సాగిపోతున్న ఆయన ఉద్యోగానికి దెబ్బతగిలింది. లారెన్స్ వాషింగ్టన్ మొదటి ముగ్గురు కుమారులూ చనిపొయ్యారు; జార్జి వాషింగ్టన్ను దగ్గు పీడిస్తూ, అది రోజురోజుకూ క్లిష్టతమ మవ సాగింది. వైద్యులు దొరకటమూ కష్టమే; చికిత్సలభ్యం కావటమూ యాతనే! నిరాశతో ఆయన బార్బడాస్కు వెళ్దామనుకున్నారు. అక్కడి శీతోష్ణాలు అంతదారుణంగా ఉండవుకనుక, వాటివల్ల చికిత్స జరుగుతుందని ఆయన ఆశించారు. లారెన్స్భార్య నాలుగో పసిబిడ్డ దగ్గర ఉండ వలసి రావటంవల్ల, జార్జి లారెన్స్తో వెళ్లాడు (వాషింగ్టన్ యునైటెడ్ స్టేట్స్ దాటివెళ్లిన ప్రయాణం ఇదొక్కటే). ఐతే ప్రయోగం విఫలమైంది. లారెన్స్ ఆరోగ్యం బొత్తిగా బాగాలేదు; జార్జికి మశూచికూడా సోకింది. మశూచి నుంచి బైటపడ్డాక, వెలవెలబోయ్యే ముఖంతో ఆయన ఒక్కడే వర్జీనియాకువచ్చి, లారెన్స్ ఆరోగ్యం బొత్తిగా బాగాలేదనీ, తాను కూడా బెర్మూడాకు వెళ్లి చికిత్సలను గూర్చి వెదుకుతాననీ అన్నారు. ఈలోగా జార్జి తిరిగి తన పాత ఉద్యోగం-సర్వేయర్ గా ఉంటూనే ఉన్నాడు. పెనాం

డోవ్‌లోని మరొక భూఖండాన్ని ఆయన కొనటంతో, ఆయన 2,000 ఎకరాల భూస్వామి అయ్యారు.

అలాకానట్లయితే 1752 ఒక విషాదవత్సరం. జార్జి ఫ్లూరసీతో మంచాన పడ్డాడు. పాన్ ఫైరాయ్ కన్యతో ఆయనకు కలిసిరాలేదు. ఆసంవత్సరంలోనే లారెన్స బెర్ మూడా నుంచి క్షయవ్యాధితో ఇక్కడ మరణించే నిమిత్తం తిరిగి వచ్చాడు. మానవులమీద మృత్యుదేవత విలయతాండవమాడేందుకు గజ్జె కట్టిందనిపించింది. ఐనప్పటికీ ఎదురుచూడని ఓదార్పులేవో కాచుకొని ఉన్నవి. లారెన్స ఆస్తిపాస్తులూ, లారెన్స చూపిన దిశల్లోని అవకాశాలూ లభ్యమైనవి. లారెన్స వ్రాసిన వీలునామాప్రకారం ఆయనభార్య-ఆయన కుమారునికి సంరక్షకురాలుగా ఉంటే జీవితాంతంవరకూ మౌంట్ వెర్నన్‌ను ఉపయోగించుకుంటూ, ఆ ఆదాయాన్ని అనుభవించవచ్చు. ఐతే ఆ బిడ్డ నిస్సంతుగా చనిపోయినట్లయితే మౌంట్ వెర్నన్ జార్జికి సంక్రమిస్తుంది. అంతేకాదు తన విధవ చనిపోయ్యాక, ఫెయిర్ ఫాక్స జిల్లాలోని ఇతర ఆస్తులు జార్జికి సంక్రమిస్తవి. జార్జి వాషింగ్‌టన్ విషయంలో యీ వీలునామా చాలా ఉదారతను చూపింది. విశేషించి లారెన్సతాలుకు చివ్వరిబిడ్డ కూడా త్వరలోనే మిగతా బిడ్డలను – సమాధుల్లో – జేరగా, పెద్దఆస్తికి వాషింగ్‌టన్ అధిపతి అయ్యారు. అదీగాక లారెన్స మరణంతో వర్జీనియాలో ఆయనచేసే ప్రత్యేక సైనికోద్యోగ మొకటి ఖాళీ ఐంది. ఆ ఉద్యోగానికి జార్జి దరఖాస్తుపెట్టుకొని, అలాటి

నలుగురు ఉద్యోగుల్లోను ఆయన ఒకరుగా నియమించ బడ్డారు. ఉత్తరోత్తరా యీ వలసరాజ్యం నాలుగుభాగాలు చేయబడింది.

1753 కు, యీడు వచ్చే సమయానికి యువకుడైన వాషింగ్టన్ మంచి స్థానంలో సుస్థిరుడయ్యారు. సరిగ్గా ఆసమయంలోనే ఆయన ఫ్రెడరిక్స్‌బర్గ్‌లోని కొత్తలాడ్జిలో ఫ్రీమాసన్‌గా నిర్ణయించబడ్డారు. జిల్లాలో ఆయన సర్వేయర్‌గా ఉంటూ ఏటా 50 పౌనుల స్టయిపెండ్‌ను ప్రతిఫలంగా పొందేవారు. షెనాండోవ్‌లోని 2,000 ఎకరాలు గాక, మరో 4,000 ఎకరాల ఆస్తి ఆయనకు వచ్చింది. ఇది గాక జిల్లాలోని ప్రత్యేక సైనికోద్యోగిగా మిలిటరీలోని మేజర్ అంతస్తులో, ఏటా 100 పౌనుల వేతనం లభించేది. కొద్దికాలంలోనే ఫెర్రీఫారమ్‌లో స్థిరనివాసం ఏర్పరుచుకునేందుకుమారుగా, తన ఒదినగారిదగ్గర్నుంచి మౌంట్ వెర్నన్‌ను బాడుగకు తీసుకున్నారు. ఇప్పటినుంచీ అదే ఆయన నివాసం. కొద్దికాలంలోనే అది ఆయనకు సంక్రమించింది. అక్కణ్ణుంచి 40 ఏళ్ల వరకూ ఆయనదృష్టిలో ఇది కేంద్రస్థానంగా ఉంటూండేది. గృహనిర్మాణం తాలూకు పరిపూర్ణతను అందుకునేందుకు ఆయనకు కావలసిందల్లా ఒక భార్య మాత్రమే!

## యువసైనికుడు :

ఐతే, కొద్దికాలంపాటు యీ తృష్ణ దూరాన ఉంచబడింది. ఎందుకంటే, యువకుడైన ఆప్లాంటర్ దృష్టి వేరొకదానిమీద – సైనిక గౌరవం – లగ్నమైంది. వాషింగ్టన్

జీవితంలోని యీ ఘట్టం ఐదేళ్ళపాటు సాగింది. దీన్ని గూర్చి కాస్త వివరంగా తెలుసుకోవటం ఉచితమనిపిస్తుంది.

1753 లో ఉత్తర అమెరికాలోని బ్రిటిష్ వలస రాజ్యం తూర్పు సముద్రతీరాన అల్లెఘనీస్‌వరకూ విస్తరించి ఉండేది. ఫ్రెంచ్ వారికింద ఉత్తర అమెరికాలోఉన్న సామ్రాజ్యం ఉత్తరానికీ, పశ్చిమానికీ ఒక పెద్ద అర్ధ వృత్తంవలె విస్తరించి, సెయింట్‌లారెన్స్ నదివరకూ, గ్రేట్‌లేక్స్‌గుండా మిసిసిపీ దిగువ భాగంవరకూ న్యూఆర్లియన్స్‌దాకా ఉండేది; అర్ధశతాబ్దంవరకూ బ్రిటిష్‌వారూ, ఫ్రెంచివారూ యుద్ధాలలో పాల్గొంటూనే ఉండేవారు. ఐతే ఫ్రెంచ్‌వారు తమ తమ స్థావరాలను బలపరుచుకొని ఉన్నట్లయితే, వర్జినియా, మరికొన్ని వలసలూ సముద్రతీరాన్నే ఆశ్రయించుకొని ఉండిపొయ్యేవి. అలా కాకుండా బ్రిటన్ ఓహియోలోయను స్వాధీన పరుచుకున్నట్లయితే ఫ్రెంచ్‌వారి అర్ధ వృత్తాన్ని ఛేదించటం జరిగి, చివరకు మిసిసిపీకూడా ఫ్రెంచ్‌వారినుంచి చేకొనబడి ఆక్రమించబడేది. వర్జినియా–అంతకన్న ఓహియో కంపెనీ యీ పోరాటంలో పాల్గొన వలసిన అత్యవసర పరిస్థితి ఏర్పడింది. సిద్ధాంత రీత్యా చూసినట్లయితే యీ రెండు జాతులూ 1748 వ సం. నుంచీ శాంతిని ఆశ్రయించే ఉన్నవి. కాని నిజానికి ఏక్షణంలోనైనా గొడవలు రేగవచ్చు. ఎందుకంటే, శాంతిఅనేది సాయుధ బలాలు ఒకదాన్ని మరొకటి ఎదుర్కోకుండా ఒక పద్ధతి మీదనే నడుచుకుంటూన్నది; అంతకుతప్ప ఉభయపక్షాల

లోనూ వేరొక విధమైన శాంతిలేదు. మోనోన్‌గహేలా, అల్లెఘనీ నదులు సంగమమైన తావులో ఓహియోనది చీలినచోట ఒకకోట నిర్మించాలని ఓహియోకంపెనీ నిశ్చయించుకున్నది. వీరి తాలూకు స్కౌట్లు ఆప్రాంతాలను పర్యవేక్షించివచ్చి ఫ్రెంచ్‌వారు ప్రిస్క్‌-ద్వీపం, లీబోయిఫ్, వెనాన్‌గో, లాగ్స్‌టౌన్ మొదలైన తావుల్లో ఈరీసరస్సునుంచి దక్షిణదిశలో ఓహియోనది వరకూ గొలుసుకట్టలే కోటలను నిర్మిస్తున్నారని చెప్పారు. వర్జీనియా లెఫ్టనెంట్ గవర్నర్ రాబర్ట్‌డిన్ విడ్డీ అల్టిమాటమ్ వ్రాశారు; దాన్ని మేజర్ వాషింగ్‌టన్ తీసుకొని వెళ్లారు.

గౌరవప్రదంగానూ, కాని ఖచ్చితంగానూ ఉన్న డిన్‌విడ్డీ ఉత్తరాన్ని తీసికొని, ఆ ప్రదేశానికి సంబంధించిన ఫ్రెంచ్‌సేనానికి దాన్నిచేర్చేనిమిత్తం వాషింగ్‌టన్ 1753 అక్టోబర్‌లో పోటొమాక్‌తీరాన్నే ప్రయాణమయ్యారు. దారిలో ఆయన సరిహద్దుప్రాంతాలమీద కాపలా ఉండే క్రిస్టఫర్ గిస్ట్ అనే ఆయన్నూ, వాన్‌బ్రామ్ అనే డచ్ ఆఫీసర్‌నూ (ఈయనకు ఫ్రెంచ్‌వచ్చు కనుక భాషాంతరీకరణకు ఉపయోగపడతాడని), మరొక నలుగురు మనుషుల్నీ తనవెంట తీసుకొనివెళ్లారు. రెండున్నరమాసాలతరువాత వాషింగ్టన్ లీబోయిఫ్‌కోటనుంచి గౌరవపురస్సరమైన, తాము పంపిన లేఖకు నిష్కర్షలో తగ్గని జవాబు తీసుకొని, విలియమ్స్‌బర్గ్‌కు తిరిగి వచ్చారు.

వాపుగాలిలో ఎంతో కష్టపడి ప్రయాణం చేయవలసి వచ్చింది. ఆయన తన అనుచరులతోపాటు కొంతదూరం

డింగీలోను, మరి కొంతదూరం గుర్రాలమీదా ప్రయాణించ వలసివచ్చింది. ఓహియో కంపెనీవారిచే నియమించబడి, దారిని సరిజేస్తున్న గిస్ట్ ఆధ్వర్యంలో ఉన్న ప్రాంతాన కొంత దూరమూ, ఆ తరువాత అడవుల్లోనూ వారు ప్రయాణం చేశారు. పోటొమాక్ నదినిదాటి యోగియో ఘెనీలోయలో జొరబడి, ఆతరువాత యోగియో ఘెనీ, మొనోన్‌గహేలా నదిలో కలిసే తావువరకూ – షానోపిన్స్‌టౌన్ వరకూ (ఇదొక ఇండియన్‌ల స్థిరనివాసం; ఓహియోనది చీలిన చోటికి దాపులో ఉన్నది), అక్కణ్ణుంచి లాగ్స్‌టౌన్, వెనాన్‌గో, అక్కణ్ణుంచి లిబోయిఫ్ – అంటే దాదాపు ఈరీ సరస్సుప్రాంతంవరకూ వెళ్లారు. ప్రతివిషయమూ వాషిం గ్టన్‌కు కొత్తే! అడవుల్లో మజిలీలు మజిలీలుగా ప్రయాణం చేయటం, ఇండియన్‌ల విచిత్రమైన ఆచారాలూ, తమకు ఓహియోను స్వాధీనపరుచుకొనే దృఢనిశ్చయమున్నట్లూ, తామాపని తప్పక నిర్వహిస్తామనీ ఫ్రెంచ్‌వారు నిక్కచ్చిగా చెప్పటం మొదలైనవన్నీ వాషింగ్టన్‌కు కొత్త అనుభూతుల నిచ్చినవి. ఈ దుర్వార్తను మోసుకొని వెనువెంటనే వెళ్లవలసినతొందరలో, వాషింగ్టన్ గిస్ట్‌తో కలిసి ముందుకు ఉరికారు. వారెంతో ప్రయాసపడుతూ అనేకప్రమాదాలను ఎదుర్కోవలసివచ్చింది.

ఒకానొక ఇండియన్ దరిదాపుల్లోనుంచే వారిని కాల్చాడు. అదృష్టవశాత్తూ అతని గురి తప్పింది. ఆ ఇండియన్ బారినుంచి తప్పించుకునేందుకు, గుడారంవేసి తాము మజిలీ

చేస్తున్నట్లుగా నటించి, ఆ రాత్రంతా, మర్నాటి పగలంతా ప్రయాణాన్ని సాగించారు. సగం గడ్డకట్టిపోయిన అల్లెఘనీ నదిని దాటేందుకు వారొక తెప్పను నిర్మించుకోవలసివచ్చింది. మధ్యలో జార్జి నదిలో పడిపోయి, దాదాపు మునిగి చని పోయ్యే పరిస్థితినుంచి ఎలాగో బతికి బైటపడి, ఆ తడిగుడ్డల తోనే ఆరాత్రి గడిపి చలికి బిగుసుకొనిపోయ్యే పర్యంతమైంది. చిత్రమేమంటే మంచుదెబ్బకు గురైంది జార్జి కాదు–గిస్ట్.

ఈ దీర్ఘకాల ప్రయాణాన్ని ఏదోవిధంగా ముగించు కొని విలియమ్స్‌బర్గ్ చేరాక, ఈ ప్రయాణాన్ని గూర్చిన వివరాలనన్నిటినీ డిన్‌విడ్డీకోరగా వాషింగ్టన్ వ్రాశారు. డిన్‌విడ్డీ ఈ కథను అచ్చువేయించి, ఎసెంబ్లీకి యీ క్లిష్టపరి స్థితి అర్థమయ్యేట్లు చేయాలనుకున్నాడు. ఇది లండన్‌లో మూడు విడివిడి ప్రచురణలద్వారా పునర్ముద్రించబడి, వాషింగ్టన్‌కు సముచితగౌరవాన్ని సంపాయించి పెట్టింది. నిజానికి ఎసెంబ్లీలో ఈ ప్రయాణవృత్తాంతం అలజడి కలి గించి, ఆయనకు 50 పౌనుల గ్రాంటుమంజూరుకు కారణ మైంది. ఈవిధంగా డిన్‌విడ్డీలో ఒక క్రొత్త ప్రాపకం ఆయ నకు లభించింది; మేజర్ వాషింగ్టన్ రాశిచక్రం ఊర్ధ్వ గతిలో పయనించసాగింది.

ఆ తరువాతి సంఘటనలు విధినిర్ణయించి, దానికిగాను ఆయన్ను ఎన్నుకున్నదనేవిషయాన్ని రుజువుచేసినవి. డిన్‌విడ్డీ ఓహియో భూమిని కాపాడేందుకు సంసిద్ధుడై, వర్జీనియా సైనికదళంలో ఒకానొక లెఫ్టెనెంట్‌కు ద్వితీయుడుగా

వాషింగ్టన్ ఎన్నుకోబడినారు. వాషింగ్టన్ తనసైన్యాన్ని సమకూర్చుకుంటూన్న సమయంలో – గిస్ట్, ఓహియో కంపెనీ తాలూకు మరొక ఏజెంటైన విలియమ్ ట్రెంట్ సరిహద్దు ప్రాంతాల్లో మోనన్‌గహెలానదీతీరంలో కంపెనీకి సంబంధించిన ఒక సరుకుల గిడ్డంగినీ, ఓహియోనది చీలినతావులో కంపెనీవారికి ఒక కోటనూ నిర్మించటంలో నిమగ్నులై ఉన్నారు. ట్రెంట్‌కు కాప్టెన్ పదవి ఇవ్వబడి, సరిహద్దు రక్షణదళాల్ని సమకూర్చుకొమ్మనే ఆదేశం ఇవ్వబడింది. లెప్టినెంట్‌కలోనెల్ వాషింగ్టన్ ట్రెంట్‌దళాలకు మరో రెండు దళాలను సహాయంగా పంపమని ఆదేశించబడినారు.

ఈ పనిమీదనే ఆయన 1754 ఏప్రిల్‌లో అలెగ్జాండ్రియా నుంచి బయలుదేరారు. ఆయనతోపాటు మరో 8 మంది సహోద్యోగులున్నారు (వీరిలో వాన్‌బ్రామ్ ఒకరు. ఆయనకు ఒక స్థానాన్ని వాషింగ్‌టన్ కల్పించారు); ఒక శస్త్రవైద్యుడూ, మరొక స్వీడిష్ స్వచ్ఛందసేవకుడు కూడా ఉన్నారు ; వీరుగాక 150 మంది సైనికులున్నారు. మూడువారాలపాటునడవగా నడవగా ఆయన తన మనుషుల్తో పోటోమాక్ ఎగువభాగాన ఉన్న విల్స్‌క్రీక్‌కు (తరువాత ఇది కంబర్లాండ్‌కోట నిర్మించబడిన స్థలమైంది) చేరారు. ఇక్కడొక భయానకమైన లోకవార్త వినవైంది. బలవత్తరమైన ఫ్రెంచిసేనల తాకిడికి తట్టుకోలేక ఓహియోనది చీలినతావులనుంచి ట్రెంట్ నిష్క్రమించి, విల్స్‌క్రీక్‌వైపు వస్తున్నాడని తెలిసింది. ఏమైనప్పటికీ ఆ పరిసరాల్లో ఉన్న

ఇండియన్స్ తాము విశ్వాసపాత్రులుగా ఉంటామని నమ్మకంగా చెప్పారు. వీరి విశ్వాసంతో ఉత్సాహితుడై, తన సామర్థ్యాన్ని రుజువుచేసుకోవాలని నిశ్చయించుకొని తన ఆఫీసర్లను సమ్మతింపజేసి, మొనోన్‌గహేలాలోని సరుకుల గిడ్డంగివరకూ ముందుకు సాగాలని వాషింగ్టన్ నిశ్చయించారు. ఇలా జరిగినట్లయితే, ఓహియోనది చీలికలైన చోటికి వీరు 40 మైళ్ళకన్న తక్కువదూరంలో ఉంటారు; ఇలాటి ముఖ్యస్థానంలో ఫ్రెంచివారు డ్యూక్వెస్నీ అనే కోటను నిర్మించటంలో నిమగ్నులై ఉన్నారు.

మొనోన్‌గహేలా చేరేందుకు దారి అడవులగుండా ఉన్నది. అధిక ప్రయాసతో కూడిన ప్రయాణం కావటం వల్ల అది చాలా నెమ్మదిగా సాగింది. 20 మైళ్ళ దూరం 15 రోజులపాటు ప్రయాణం చేయవలసి వచ్చింది. ఐనప్పటికీ వాషింగ్‌టన్ ముందుకుసాగారు. గ్రేట్ మెడోస్ గుండా లారెల్ పర్వతంవరకూ వెళ్లారు. అక్కడికి రాచ్చేప్పటికి గిస్ట్‌వచ్చి ఆదాపులోనే ఫ్రెంచ్ సేనలు దాగి ఉన్నవనే వార్త చెవినవేశాడు. మర్నాటి ఉదయం వాషింగ్టన్ ఫ్రెంచ్‌వారితో బాహాబాహి పోరాడవలసి వచ్చింది. ముందు ఎవరు కాల్పులు చేశారనేది చెప్పలేము. ఈరెండు దేశాలూ యుద్ధరంగంలో ఉన్నట్లుగా భావించబడటం లేదు కనుక, ఎవ్వరూ కాల్చిఉండకూడదు. ఐతే వారు రణప్రాంగణంలో ఉండి ఉండటంవల్ల ఈ విషయానికి ప్రాధాన్యతే పోయింది. నిజమేమిటంటే, వాషింగ్టన్ తన అను

చరులతో ఫ్రెంచ్ వారిమీద మెరుపుదెబ్బతీసి 10 మందిని చంపటం, మరో 20 మందిని ఖైదీలుగా పట్టుకోవటం, మిగతావారిని పారద్రోలటం జరిగినవి. ఫ్రెంచ్ దళాధిపతి మాన్సియర్ డీ జుమోన్ విల్లీ హతుల్లో ఒకరు. హతులైన వారిలో చాలామంది తలలను ఇండియన్స్ కోసిపారేశారు. వాషింగ్టన్ సైన్యంలోని నష్టాలు బహుకొద్ది; ఒకరు చావటం, మరో ఇద్దరు ముగ్గురు గాయపడటం జరిగింది.

ఇదంతా మేమాసాంతంలో జరిగింది. వాషింగ్టన్ తన ఖైదీలను వర్జీనియాకు పంపారు. ఆయన చర్యలు ప్రజారంజకాలైనవి; ఆయన కమాండర్ చనిపోనటంవల్ల, వర్జీనియా సేనలన్నిటికీ వాషింగ్టన్ పరిపూర్ణమైన కలోనెల్ అయ్యారు; ఇతర వలసలనుంచి సైన్యాలను పంపుతామనే వాగ్దానాలైతే ఉన్నవి. వాటి విషయం వేరు. నిజానికి అలాటివాటిల్లో ఒక్కటే వచ్చింది. అందువల్ల వాషింగ్టన్ స్థానంలో చెప్పుకోదగ్గ మార్పేమీ రాలేదు. 1754 జూన్ మాసాంతానికల్లా వాషింగ్టన్ నానా రకాలవారూ ఉన్న వర్జీనియా సైనికదళాలకూ, ఉత్తర కరొలినా సైనిక పటాలాలకూ, ఇండియన్ల దళాలకూ నాయకుడుగానూ, బాధ్యత వహించే వ్యక్తిగానూ రూపొందారు.

డ్యూక్వేస్నే కోటలో బలవత్తరమైన ఫ్రెంచ్ సేన తనను ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉన్నదనే వార్త వాషింగ్టన్‌కు ఇప్పుడు చేరింది. తినుబండారాలు తక్కువ కావటం వల్ల చాలామంది ఇండియన్స్ ఆయన్ను విడిచారు. ఇలా

సమస్యలు ఆయన్ను పీడిస్తున్నవి. త్వరితగతిన తనసేనలన్నిటినీ సమీకరించి, వాటిని గ్రేట్ మెడోస్‌లోని కాత్రగడకు చేర్చి, దాని కాయన 'నెసెసిటీకోట' అని పేరుపెట్టారు. జూలై 3-వ తారీకున, అంటే అప్పటికి వాషింగ్టన్ దళాల్లో ఉన్న ఇండియన్స్ చాలావరకు నిష్క్రమించిన సమయంలో ఫ్రెంచ్ సేనలు ఆయన కోటను ముట్టడించినవి. లోగడ జరిగిన యుద్ధంవలెగాక యీ పోరాటం కుంభపోతగా వర్షం పడుతూండగా రోజులో చాలాభాగం జరిగింది. ఫ్రెంచ్‌వారు ఘోరంగా కాల్పులు చేస్తూ, మరింత దగ్గరవసాగారు. నెసెసిటీకోట తగినంత రక్షణను ఇవ్వటం లేదు; వాషింగ్టన్ సేనలు చాలా నష్టపోతున్నవి; వారి పశువులూ, గుర్రాలూ ఫ్రెంచ్‌వారి కాల్పులకు బలులైనవి. వాషింగ్టన్ సేనలు నిస్సహాయ స్థితిలోకి వచ్చినవి; వారి దగ్గరున్న ఆహార పదార్థాలూ, మందుగుండు సామానూ బహుకొద్ది. శత్రు సేనలు అత్యధిక సంఖ్యాకులు. వాషింగ్టన్ దారి ఇవ్వవలసిన వొత్తిడికి గురయ్యారు. ఫ్రెంచివారు వాషింగ్టన్ సేనలోని ఇద్దరు ఆఫీసర్లను మాత్రం బందీలుగా ఉంచి, వాషింగ్టన్ తన మిగతసేనతో సాయుధ శత్రువుల మధ్య వర్జీనియాకు తిరిగి పొయ్యేందుకు అనుమతించారు. ఇలా బందీలుగా ఉంచబడిన ఆఫీసర్లలో ఒకరు వాన్‌బ్రామ్. ఆయనే ఫ్రెంచ్‌వారు వ్రాయించిన ఓటమి పత్రాన్ని ఆంగ్లంలో తర్జుమా చేసి వాషింగ్‌టన్‌చే చేవ్రాలు చేయించాడు.

ఈ యువ సైనికాధిపతికి ఇదొక విషాదమైన ఓటమి. పరిస్థితులను అవగాహన చేసుకోవటంలో ఆయన తెలివితేటలు

కనబరచలేదని కొంతమంది అభిప్రాయ పడ్డారు. ఐతే ఆయన శక్తి వంచన లేకుండా, చేయగలిగిందంతా చేశారు. మొత్తంమీద ఆయన చర్యలు ఇక్కడ విలియమ్స్ బర్గ్ లోనూ, అక్కడ లండన్ లోనూకూడా శ్లాఘించబడినవి. అంత చిన్నవయస్సును బట్టి చూస్తే ఆయన కీర్తిని ఆర్జించాడనే చెప్పవలసి ఉంటుంది. హోరేస్ వాల్ పోల్ తానీ విషయాన్నిగూర్చి రెండవ జార్జ్ రాజుతో మాట్లాడినట్లు కూడా అన్నారు. వాషింగ్టన్ తన యువకోత్సాహాన్ని కనబరుస్తూ సోదరునికి రాసిన ఉత్తరంలో ఇలా ఉన్నది: "మాకు ఘంటాపథమైన విజయం లభించింది. తుపాకిగుళ్లు ఈలలువేస్తూ దూసుకొని పోవటాన్ని నేను విన్నాను. నమ్మ్తావో లేదోకాని ఆ శబ్దం ఎంత ఆహ్లాదకరంగా ఉన్నదని!" ఇక జార్జ్ రాజు యీమాటవిని వాల్ పోల్ తో ఇలా అన్నారట: "ఇంకా చాలాతుపాకిగుళ్లు దూసుకొని పొయ్యేప్పుడు చేసే శబ్దాలను వాషింగ్టన్ విని ఉన్నట్లయితే ఆ శబ్దాలు ఆహ్లాదకరంగా ఉంటవని బహుశా అని ఉండడు!" ఐతే రాజుగారన్న యీమాటలు ఆనాడు వాషింగ్టన్ కు కానీ, వర్జీనియాలోని సమకాలీనులకు కానీ తెలియరాలేదు. ఐతే ఇక్కడ జరిగే ప్రతి సంఘటననుగూర్చి పారిస్ లోనూ, లండన్ లోనూకూడా తీవ్రమైన చర్చలు జరుగుతున్నవని మాత్రం వాషింగ్టన్ కు తెలుసు. తాను సాధించిన ఆ స్థానిక సంఘటన ప్రపంచంలో ఒకముఖ్య సంఘటనగా రూపొందిందని తెలియగానే, యువకుడైన వాషింగ్టన్ కు మత్తుపదార్థాన్ని సేవించి నట్లయింది.

వాషింగ్టన్ మొదటిసారి ఫ్రెంచ్ సేనను ఎదుర్కొన్న సంఘటన తాలూకు వివరాలు—నెసెసిటీ కోటలో పొరపాటున విడిచివేయబడిన వాటిని ఫ్రెంచ్ వారు ప్రచురించటం వల్ల కొద్దికాలంపాటు వాషింగ్టన్ దుశ్చరితునివలె భావించబడ్డారు. ఎందుకంటే ఫ్రెంచ్ వారు ప్రచారంకొరకై యీ విషయాలను ప్రచురించి యీ సరిహద్దు ప్రాంతాల జరిగిన పోరాటాలలో బ్రిటిష్‌వారిదే తప్పనీ, వారే దురాక్రమణదారులనీ రుజువుచేసే ప్రయత్నాలు చేశారు; జుమోన్‌విల్లీ వాషింగ్టన్ వలెనే శాంతిదూతగా కొద్ది నెలల క్రితం వచ్చాడనీ, అలాటి వ్యక్తికి వాషింగ్టన్ ముందు వెనుకలు ఆలోచించకుండానే 'ఘాత' అయ్యాడనీ ఫ్రెంచ్ వారు అన్నారు. ఈ 'ఘాత' అనే దారుణమైన పదం అనేకసార్లు వచ్చినా, వాన్‌బ్రామ్ గమనించని కారణంగా, వాషింగ్టన్ తన ఓటమి పత్రంమీద సంతకం చేయటం జరిగింది. ఈవిధంగా వాషింగ్టనే తన నేరాన్ని ఒప్పుకుంటూ ఆ సంతకం చేశారని ఫ్రెంచ్ వారు అన్నారు. ఐతే వాషింగ్టన్‌ను క్రూరుడుగా చిత్రించి, సందర్భోచితంగా ఒక పెద్ద పద్యకావ్యాన్ని రచించి ఫ్రెంచ్ వారు ప్రచురించినా, ఈ కారణంగానే స్వదేశీయులు వాషింగ్టన్‌ను మరింతగా బలపరిచారు. ఆయన సంతకంచేసిన ఓటమిపత్రం చాలా హడావిడిలో జరిగిందనీ, చాలావొత్తిడికి గురైందనీ బ్రిటిష్ వారు అన్నారు. పోతే ఆ పత్రంలో సూచించిన విధంగా మొదటిసారి యుద్ధంలో వాషింగ్టన్‌కు బందీలుగా చిక్కిన ఫ్రెంచ్ సైనికుల్ని విడుదల చేయటం ఒకషరతు; కాని

వర్జీనియాలోని అధికారులు దానికి కట్టుబడి ఉండకపోవటం. నిజంగానే వాషింగ్‌టన్ తప్పు అవనేరదని ఆయన దేశీయులు అభిప్రాయ పడ్డారు.

క్రమంగా యీ గొడవంతా అణగిపోయి, కొన్ని నెలలుగడచినవి. సరిహద్దు ప్రాంతంలోని సమస్యలు ఎంతో చికాకుగాను, చిక్కులతో కూడినవిగాను ఉండటంవల్ల 1754 లో వాషింగ్‌టన్ తన పదవికి రాజీనామా ఇచ్చారు. ఐతే 1755 వ సం. వసంతకాలంలో ఆయన తనకు పరిచయమున్న దారిన ఓహియోనది చీలినవైపుకు పయనమయ్యారు. యీసారి ఆఫీసర్ హోదాలోగాక, స్వచ్ఛందసేవకుడుగా బయలుదేరాడు. ఈ అవకాశం మంచిభవిష్యత్ ఉన్నదిగానే కన్పట్టింది. విశేషానుభవం, మంచి తీర్పూ, నేర్పూ ఉన్న జనరల్ ఎడ్వర్డ్ బ్రాడాక్ అనే ఒకానొక సైనికోద్యోగి వర్జీనియాకు వచ్చాడు. ఆయనకింద రెండు బ్రిటిష్ సైనిక దళాలున్నవి. బ్రిటిష్ అమెరికాలోని ఫ్రెంచ్‌వారిని పార దోలటం ఆయనపని. జీతంబత్తెం లేకుండా తన అంగ రక్షకుల్లో ఒకరుగా ఉండేందుకు ఆయన వాషింగ్టన్‌కు ఆహ్వానం పంపాడు.

మామూలుగానే ఎంతో ఆలస్యం జరిగింది. చివరకు 1775 మేనెలలో, బ్రాడాక్‌సైన్యం కంబర్లండ్ కోటనుంచి బయలుదేరి, 150 మైళ్లదూరంలో ఉన్న డ్యూక్వెస్నీ కోటవైపు సాగారు. వెంట తీసుకొనివెళ్లే సరుకులూ, మందుగుండు సామానూ, ఫిరంగులూ మొదలైన వాటి

భారంవల్ల యీ ప్రయాణం మరీ మందంగా జరిగింది. వాషింగ్టన్ చెప్పినట్లు - సైన్యంలో మెల్లిగా కదిలే భాగాలు వెనుకబడినవి. వాషింగ్టన్ యీ ఫిరంగులతో పాటు నెమ్మదిగా ప్రయాణం సాగించారు. ఒకపక్క బంకవిరేచనాలతో బాధపడుతూ, ఆరువారాలు గడిచాక, ఒకనాడు తుపాకిగుళ్లు దూసుకొనిపోగా, ఇదివరకటంత ఆహ్లాదకరమైన శబ్దాలు చేయలేదని ఆయనకు తోచింది.

బ్రాడాక్‌కు ముందుగా వెళ్లిన రక్షకులు డ్యూక్వేస్నీ కోటను కొద్దిమైళ్ల దూరాన అడవులగుండా ఎంతో జాగ్రత్తగా దూసుకొని పోతూఉండగా - హఠాత్తుగా ఫ్రెంచ్‌వారూ ఇండియన్లూ ఉన్న పటాలాలు వారిని ఎదుర్కొన్నవి. వారందరూ ఇండియన్లవలె దుస్తులుధరించి, ధైర్యసాహసాలున్న ఒక ఫ్రెంచ్ ఆఫీసర్ ఆధ్వర్యంలో చెట్లమధ్యనుంచి హఠాత్తుగా బైటపడి, అధికారిచేసిన సూచనకు అనుగుణంగా విస్తరించి, కాల్పులు జరిపారు. కొద్దిసేపటి వరకూ బ్రిటిష్ వారు యీ సంఘటనను తమ అదుపాజ్ఞల్లో ఉంచుకొని, ఫ్రెంచ్‌వారి దాడిని ఛిన్నాభిన్నం చేసేట్లు కనిపించారు. ఆ తరువాత యుద్ధవిజయం ఫ్రెంచ్‌వారి పక్షం వహించేట్లు మొగ్గింది. స్పష్టంగా కనిపించే దుస్తులతో గుమికూడి ఉండి, తమకు అదృశ్యులుగాఉన్న శత్రుసేనలు గురితప్పక కాల్చగలుగుతూండగా, తాముపొందిన శిక్షణననుసరించి తమనుతాము క్రమపద్ధతిలో అమర్చుకోలేని పరిస్థితుల్లో, ఎర్రని దుస్తులు ధరించిన బ్రిటిష్ సైనికులు క్రమంగా

నిస్సహాయస్థితిలోకి మారిన ఒక జనప్రవాహంగా, పిచ్చెత్తి నట్లు ప్రవర్తిస్తూ, అత్యధికసంఖ్యాకులుగా కూల సాగారు. తమ సైనికులను క్రమపద్ధతిలో ఉంచేందుకూ, బారుల్లో అమర్చేందుకూ నానాఅవస్థా పడిన ఆఫీసర్లలో ముప్పాతిక భాగం గాయపడ్డారు. బ్రాడాక్ ధైర్యసాహసాలతోను, చిరాకుతోను, కోపంతోను అరుస్తూ గుర్రంమీద అటూ ఇటూ తిరుగుతూండగా గాయపడ్డాడు. వాషింగ్టన్ చెప్పిన దాన్నిబట్టి-వర్జీనియా సైనికులు చిరాకుపడకుండా ప్రవర్తించ గలిగారు. త్వరలోనే వాషింగ్టన్ తన సేనలతో ఆప్రదేశం చేరాడు. ఆయనశ్రమా, ఇతరుల తోడ్పాటూకూడా ఏవిధం గానూ అక్కరకు వచ్చేట్లు కనిపించలేదు. నిజానికి ఆయన బతికి బైటపడటమే ఒక అదృష్టం. ఆయన స్వారీచేసే రెండుగుర్రాలు కాల్చివేయబడినవి. ఆయన దుస్తులు తుపాకిగుళ్ల కారణంగా తునాతునకలైనవి. చాలామందికి యీ మాత్రం అదృష్టం కూడా దక్కలేదు. ఆ అటవీప్రదేశాలు బలిపీఠాలైనవి. బ్రాడాక్ తాలూకు మనుషులు దాదాపు 900 మంది దాకా మరణించటమో గాయపడటమో జరిగింది. పిచ్చికేకలువేసే ఇండియన్లకు మానవకపాలాలు కుప్పతిప్పలుగా లభ్యమైనవి. ఇది ఇలా ఉండగా పిరికిపడిపోయిన మిగతావారు కాళ్లకు బుద్ధి చెప్పారు.

బ్రాడాక్ తరువాతిసేనాని మిగతావారిని కూడగట్టు కొని, తిరిగి డ్యూక్వెన్సీమీద దాడిచేసి ఉన్నట్లయితే యీ దారుణం ఇంత తీవ్రరూపం దాల్చి ఉండకపోను. అలా జరు

గుతే – నిజంగానే విజయలక్ష్మి రెండోవైపు మొగ్గిఉండేది. ఐతే జనవాక్యం చెప్పినంత మూర్ఖంగా బ్రాడాక్ ప్రవర్తించి ఉండలేదు. కేవలం హఠాత్తుగానే వారు ఎదుర్కొబడలేదు. ఫ్రెంచివారి సైన్యంకన్న బ్రిటిష్ పటాలాలలోని సంఖ్య అధికం. ఏమైనా గతజలసేతుబంధనంలాటి యీ వివరాలన్నీ కలిసినా సిగ్గుచేటుగా పరిణమించిన అపజయాన్ని మార్చ లేవు. డ్యూక్వేస్ని ఇంకా ఫ్రెంచివారికిందనే ఉన్నది; వర్జీనియా సరిహద్దుల్లో విజయోత్సాహులైన ఇండియన్ల దాడులకు ఎలాటి ఆటంకాలూ లేని స్థితి దాపరించింది.

వాషింగ్టన్‌కు కొంత ఓదార్పు ఉన్నది. ప్రజాభిప్రాయం ఎలా ఉన్నప్పటికీ ఆయన కీర్తికి దెబ్బ తగలలేదు. అనారోగ్యంగా ఉన్నప్పటికీ ఆయన ధైర్యసాహసాలను ప్రదర్శించాడనే విషయం అందరికీ తెలిసిందే! ఉత్తరకరోలినా గవర్నర్ ఇలా రాశారు: "ఇటీవల మీరు తప్పించుకొన్న సంఘటనకూ, లోగడ ఓహియోనదీతీరంలో తాము సంపాయించిన శాశ్వత గౌరవానికీ మిమ్ము అభినందించేందుకు నన్ను అనుమతించండి." ఇలాటి ప్రశంసలున్న ఉత్తరాలు చాలా వాషింగ్టన్‌కు చేరినవి. తిరిగి కలొనెల్‌గా వర్జీనియా సేవకు ఆయన తిరిగి వచ్చారు. ఐతే యీసారి వర్జీనియా సేవాదళాలకు ముఖ్యసేనానాయకుడుగా – తన 23 వ ఏట 1755 ఆగస్టులో నియమించబడినారు.

ఈ ఉద్యోగపు అంతస్తేమో గొప్పదే. కాని పని మాత్రం ఎంతో కష్టభూయిష్ఠమైంది. కొన్నివందలమంది

సైనికులతో ఆయన 350 మైళ్ల పొడుగున్న సరిహద్దును రక్షించవలసిఉన్నది. స్థిరనివాసం ఏర్పరుచుకున్నవారివీ, భావిమీద భారం మోపినవారివీకూడ ఆశలు చెల్లాచెదరయ్యేట్లు కనిస్తున్నవి. 1756 మే వరకూ బ్రిటిష్, ఫ్రెంచి వార్లమధ్య అధికారపూర్వకంగా యుద్ధమైతే ప్రకటించబడలేదు. ఆ తారీకుకు ముందుగా గానీ, ఆ తరువాత కానీ వీరుభయుల ముట్టడులూ ఉత్తరఅమెరికాలోని ఇతరభాగాల్లో జరిగినవి. వాషింగ్టన్, ఆయన అనుచరులూ పశ్చిమసరిహద్దు రక్షణలో ఉండి, ఆ సరిహద్దునూ, తమనూ అందరూ మరిచిపోయినట్లున్నారని భావించారు. 1757 అంత్యభాగంలో వాషింగ్టన్ తిరిగి బంకవిరేచనాలతో అనారోగ్యాన్ని అనుభవించారు. రానురానూ అస్వస్థత అత్యధికమై ఆయన తన స్థానాన్ని విడనాడి, మౌంట్ వెర్నన్‌కు తిరిగి రావలసినట్లు పరిణమించింది. ఇప్పటికీ అవివాహితుడుగానే ఉండటంవల్ల తన వంశాన్ని నిలబెట్టగల వంశోద్ధారకుడు ఆయనకు లేడు. మౌంట్ వెర్నన్ తగినవిధంగా కాపాడబడక, నిర్లక్ష్యం చేయబడింది. ఆయన ఇతర వ్యవహారాలుకూడా అదేస్థితిలో ఉన్నవి. రెండుసార్లు వర్జీనియా దిగువసమితి సభ్యుడుగా ఆయన ఎన్నికలకు నిలబడ్డారు; కాని, రెండుసార్లూ ఓటమిని ఎదుర్కోవలసివచ్చింది.

ఏమైనప్పటికీ 1758 వసంతకాలంనాటికి ఆయన తగినంత ఆరోగ్యాన్ని పొంది, తిరిగి మరొకదాడికి సిద్ధంగా ఉన్నారు. ఉత్తరఅమెరికాలో ఉన్న అనేక బ్రిటిష్ పటాలాల

లోని కొంత సైన్యం, బ్రిగేడియర్ జనరల్ ఫోర్బ్స్ ఆధ్వ ర్యంలో మరొకసారి డ్యూక్వేస్నీ కోటమీదికి దండెత్తేందుకు సిద్ధంగా ఉన్నది. ఈ దారిన నడవటానికి వాషింగ్టన్ కిది నాలుగోసారి. ఐతే ఫోర్బ్స్ బాగా తెలిసిన యీ దారిగుండా గాక, పశ్చిమదిశకు వెళ్లి అక్కడ పెన్సిల్వేనియాలోని రేస్ టౌన్‌గుండా మరొక కొత్తమార్గాన వెళ్లాలని నిశ్చయిం చాడు. ఈ విషయం వాషింగ్టన్‌కు భయానకంగా తోచింది. తనకు తెలిసిన దారినిగూర్చి వాషింగ్టన్ ఎంత నచ్చజెప్పేం దుకు ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది; ఫోర్బ్స్‌దే తుది నిర్ణయమైంది. దీని ఫలితాన్ని ముందుగానే ఊహించి నిరాశపడిన వాషింగ్టన్ పరిస్థితుల్ని చూస్తూనే ఉన్నారు; వారాలు, నెలలవరకూ దేకినవి; ఎండాకాలం గడిచి పోయినా ఫోర్బ్స్‌సైన్యం ఓహియోనది చీలిన ప్రదేశంవైపు ఇంకా సాగిపోతూనే ఉన్నది. ఆ చలికాలానికి యీ ముట్టడిని వాయిదావేద్దామని బ్రిటిష్‌వారు దాదాపు నిశ్చయించుకున్న సమయంలో – 1758 నవంబరు మాసాంతంలో ఫ్రెంచివారు చివరకు ఓహియో లోయలోని తమ హక్కులను వదిలే సేందుకు నిశ్చయించుకొని, ముట్టడి జరిగేదాకా ఆగకుండా, డ్యూక్వేస్నీ కోటకు నిప్పుముట్టించి, అది బూది అవుతూం డగా వెళ్లిపొయ్యారు. రక్తపాతం జరగని యీ విజయంలో 'ఏంటీ క్లయిమాక్స్' లేకపోలేదు. ఏమైనా, కోరిన ఫలిత మేదో లభ్యమైంది. డ్యూక్వేస్నీకోట బూడిదైనచోట బ్రిటిష్ వారి కోట – పిట్‌కోట నిర్మించబడి, అది బ్రిటిష్‌వారికి పట్టు

కొమ్మయి, వర్జీనియా సరిహద్దులో విజయోత్సాహం నాట్య మాడింది.

ఇతర తావుల్లో ఫ్రెంచివారితో పోరాటాలు సాగుతూన్నప్పటికీ వాషింగ్టన్ వ్యక్తిగతంగా అస్త్రసన్యాసం చేసేందుకు సిద్ధపడ్డారు. గత పోరాటంలో ఆయనకు మిగిలింది గౌరవనీయమైన బ్రిగేడియర్ స్థానం; 1758 లో ఫ్రెడరిక్ జిల్లాకు దిగువసమితి సభ్యుడుగా ఆయన విజయుడయ్యారు. అప్పటికి ఆయన వివాహం నిశ్చితార్థాన్ని పొందింది. ఆయన అస్త్రసన్యాసం చేస్తాడనే విషయాన్ని విని వర్జీనియా సైనికాధికారులు - మరొక సంవత్సరంపాటు ఆగమని ప్రార్థనాపూర్వకంగా ఇలా రాశారు:

"—ఈలాటి గొప్ప సేనానిని, విశ్వసనీయుడైన స్నేహితుణ్ని, మిత్రరత్నాన్ని కోల్పోతే అది ఎంతకష్టదాయకంగా మేము పరిగణించవలసి ఉంటుందో కదా! మాకే కాదు-మా దేశానికే ఇది తీరని కష్టంగా కూడా పరిణమిస్తుందంటే అది మరింత దుఃఖపూరితం కాగలదు. సైనిక వ్యవహారాలు ఇంతబాగా తెలిసిన మరొకవ్యక్తి మాకెక్కడ లభ్యమౌతాడు? దేశభక్తి, ధైర్యసాహసాలు, ప్రవర్తనలకు ఇంత ప్రసిద్ధికెక్కినవాడు ఎక్కడ దొరుకుతాడు?...మావిశ్వాసాలన్నీ మీమీదనే ఉన్నవి. గొప్ప ప్రమాదాలు మీలాటి వ్యక్తిసమక్షంలో దూరమౌతవి; మాకష్టాలూ, ఇక్కట్లూ మరిచిపోగలం; మాకు ప్రేమాస్పదుడైన మీలాటి వ్యక్తి నాయకుడుగా ఉండాలని మాకోరిక."

ఇలాటి ప్రశంసాపత్రంలోని నిజాయితీ ఏ విధంగానూ అనుమానించదగింది కాదు. 1757 లో వాషింగ్టన్ డిన్విడ్డీకి ఇచ్చిన వివరణలోని సత్యాన్నికూడా ఏమరి ఉండలేము.

"నాలో తప్పిదాలూ పొరపాట్లూ బహుశా ఎక్కువగానే ఉన్న వనేదాన్ని నేను కాదనను. పరిపూర్ణత మాటకు వస్తే, నిరాశా, శూన్యతలు నాకూ, మిగతా ప్రపంచానికీకూడా కనిపిస్తవి...కాని నాకు తెలిసిందీ, నాకు ఎంతో ఓదార్పునిచ్చేదీ ఇది: ప్రజాహితకార్యాలకొరకూ, ప్రజాసేవకొరకూ నియోగించబడి, ప్రజల విశ్వాసమంతా కేంద్రీకరించబడిన ఏవ్యక్తీ నాఅంత నిజాయితీతో, దేశక్షేమం విషయంలో నా అంత పట్టుదలా, ఉత్సాహాలతో తన బాధ్యతలను నిర్వర్తించలేదని నేను చెప్పగలను."

ఐతే యీ వివరణలో ఏదో కొద్ది విచిత్రం ఉన్నదనీ, కనుక కలోనెల్ వాషింగ్టన్ విరమించే జీవితంతాలూకు కథలో మరికొంత పరిశీలన అవసరమనీ మనకు తోస్తుంది. ఈ పంచవర్ష కాలంలోనూ వాషింగ్టన్ తాలూకు ఇతర ఉత్తర ప్రత్యుత్తరాలలో – ఆ కాలం ఆయన మరింత కుంగిపొయ్యేందుకూ, తన తక్కువతనాన్ని గుర్తించేందుకూ ఉపయోగపడిందనే సంగతి మన గమనానికి వస్తుంది. ఒకో సమయంలో ఆయన ఉద్రిక్తుడయ్యారంటే ఆ తప్పులన్నీ ఆయనవనీ అనలేము. సరిహద్దుప్రాంతాలలో జరిగే యుద్ధరీతులలతో ఆయనకు ఎంతో పరిచయమున్నది; యీ విషయాన్ని ఆయనకింద ఉన్న ఆఫీసర్లే నొక్కివక్కాణించగలరు; దూరానఉన్న విలియమ్స్‌బర్గ్‌లోని చట్టనిర్మాతలకన్నా అత్యధికంగానే ఆయనకీ విషయాలు తెలుసు. ఫ్రెంచ్‌వారు బలశాలురు కాకముందే వారిని వదిలించి, ఓహియోరాష్ట్రంలోని ఇండియన్లందర్నీ జయించాలని ఆయన ఆత్రుత కనబరిచారు. ఐతే ఆయనదారికి ఎదురైన అడ్డంకులు ఆయనకు

పిచ్చెత్తించినవి. 'దేశక్షేమం' అనే విషయంలో ఎసెంబ్లీ తన అంధత్వాన్ని ప్రదర్శిస్తూన్నట్లు ఆయనకు తోచింది. దిగువసమితి సభ్యులు ఓహియోలో ఫ్రెంచ్ వారికి హక్కున్న దనికూడా అన్నారు. డిన్విడ్డీనీ, గవర్నర్‌కు సంబంధమున్న ఓహియో కంపెనీనికూడా ఎసెంబ్లీవారు అనుమానించి, తగిన ఆర్థికసహాయాన్ని మంజూరు చేయించలేదు. వ్యక్తిగతమైన పథకాలనుమాత్రమే డిన్విడ్డీ తయారుచేసుకోసాగాడే కాని, ఇతరవిషయాలలో ఆయన నిస్సహాయస్థితిలో ఉన్నారు. ఈ విధంగా ఆయన క్రమంగా వాషింగ్టన్ విషయంలో స్నేహాన్ని తగ్గించాడు.

సైనిక సంబంధమైన ఆధ్వర్యాన్ని వహించిన వాషింగ్టన్‌కు కృతజ్ఞతకూడా చూపబడలేదు. ఆహారపదార్థాలూ, ఇతర సౌకర్యాలూ ఎంతో లోపించినవి. సైనికుల్ని చేర్చుకోవటమనేది చాలా మందగతిన సాగింది; సైన్యంలో చేరేందుకు వచ్చినవారు ఆధారపడదగిన వ్యక్తులుకారు; వారికి సమయంలో వెన్నుచూపటం మినహా మరొక చాతుర్యం ఉన్నట్లు తోచదు. తత్ఫలితంగా కొద్దికాలంపాటు తాత్కాలికంగా సైన్యంలో చేరటమనే విషయంమీద వాషింగ్టన్‌కు ఏవగింపు జనించింది. నిజానికి ఆయన వర్జీనియా నుంచి వచ్చిన పెద్దమనిషి కావటంవల్ల - సైన్యంలో చేరిన వారందరూ సామాజికంగా నాసిరకం మనుషు లనే అభిప్రాయంలో ఉండేవారు. ఐతే ఆయన వారందర్నీ పరిశీలిస్తూ సైనిక నిబంధనలను అతిక్రమించినవారికి కఠినశిక్షలు విధి

స్తూండేవారు. 1757 ఆగష్టులో డిన్విడ్డీకి వాషింగ్టన్ యీ విధంగా రాశారు:

"జనరల్ కోర్ట్ మార్షల్ జరిగిన వివరాలు తమసన్నిధికి పంపుతున్నాను...ఇగ్నాషియస్ ఎడ్వర్డ్స్, విలియమ్స్మిత్ అనేవారు మరణశిక్ష విధించబడి, గత గురువారంనాడు ఉరిదీయబడినారు... వీరిని కాల్చి చంపకుండా, ఉరితీయించినందుకు తాము నన్ను క్షమిస్తారుగాక! ఈ విధానం ఇతరులందరినీ ఎంతో భయపెట్టింది. నిజానికి ఇదొక దృష్టాంతంగా ఉండాలనే యీ పద్ధతిని మేము అనుసరించాము...వారు బాధపడదగినవారు; ఎడ్వర్డ్స్ ఇదివరకు రెండుసార్లు సమయంలో పారిపోయాడు; ఇక స్మిత్ యీ భూఖండంమీద ఇంతగొప్ప దుర్మార్గుడు మరొకడుండని రుజువుచేశాడు. కొరడాదెబ్బల శిక్షకు అర్హులైనవారు ఆవిధంగానే సత్కరించబడినారు. పోతే మిగతావారినిగూర్చి ఏంచేయాలని మీరు నిశ్చయించుకున్నారో నాకు తెలియపరచ గోరుతాను."

ఆ 'మిగతావారు' ఉత్తరోత్తరా క్షమించబడినారు. వాషింగ్టన్ వారిని చీకటిగదిలో, ఇనుప కటకటాలకు వెనుక బంధించి ఉంచారు.

అనేక సందర్భాలలో ఆయనకు చేరిన ఆజ్ఞలు ఖచ్చితమైనవి కావు. 1756 డిసెంబర్‌లో ఆయనచేసిన ఫిర్యాదిది: "నాకు వచ్చే ఆజ్ఞలు అనుమానాలతో, అనిశ్చయాలతో కూడిఉంటూన్నవి. ఈనాడు అంగీకరించిన విషయమే రేపు ఖండించబడుతున్నది." నిజానికి ఆయన స్థానమే తటస్థంగా ఉన్నట్లు తోస్తుంది; కేవలం పై అధికారులు తమ అధికార దర్పాన్ని ప్రదర్శిస్తున్నారే కాని, సరైన ఆధ్వర్యాన్ని వహిస్తూన్నట్లు ఆయనకు తోచేదికాదు. ఇతర వలసల్లోఉన్న

సైనికులకూ, సైనికాధికారులకూ ఇవ్వబడే వేతనాలకన్నా 1754లో వాషింగ్టన్‌కూ, ఆయన దగ్గిరున్న సైనికులకూ ఇవ్వబడిన వేతనాలు తక్కువ. ఆయన కలొనెల్ ఐనప్పటికీ, రాయల్ కమీషన్ (లేదా రెగ్యులర్) లోని ప్రతి కాప్టెన్ కన్నా, మిలిటరీరీత్యా, తక్కువస్థానంలోనే ఉండేవారు. 1754లో ఉత్తర కరోలినానుంచి కొంత సైనికపటాలాన్ని వెంటబెట్టుకొని వచ్చిన కాప్టెన్ మాకే అనే ఆయన కలొనెల్ వాషింగ్టన్‌ను తన పై అధికారిగా అంగీకరించలేదు; ఆ తరువాత కొద్దినెలలకు వచ్చిన కాప్టెన్ డాగ్‌వర్ది (కేవలం తన రాయల్‌కమీషన్ పాత జ్ఞాపకంగామాత్రమే ఉన్న వాడు. తాను పింఛను పుచ్చుకున్నాక, ఆ పింఛను హక్కును అమ్ముకున్నవాడు.) కూడా వాషింగ్టన్‌ను తన నాయకుడుగా అంగీకరించలేదు. ఈ విధంగా రెగ్యులర్ ఆఫీసర్లుగా ఉన్న వారికి రాష్ట్రీయ సేనానాయకులంటే ఏవగింపనే విషయం వాషింగ్టన్‌కు పరిపూర్ణంగా అర్థమైంది. వీరిలో ఒకాయన వర్జీనియా సైనికాధికారిని 'జాకీ' అనటమూ, మరొకాయన రహస్యంగా – ప్లాంటర్‌గా ఉన్నవ్యక్తిని నాగలినుంచి విడదీసి, తెల్లవారేప్పటికి ఆఫీసర్ను చేయటమూ సబబైన పని కాదని అన్నాడు.

ఇదంతా వాషింగ్టన్‌ను ఎంత చీకాకుపరిచి ఉంటుందో మనం తేలిగ్గా అర్థంచేసుకోవచ్చు. చిత్రమేమంటే – అది అంతకన్న ఎక్కువ కల్లోలాన్నే లేవదీసింది; ఆయన్ను దహించివేసి కోపంతో వెర్రెత్తిపొయ్యేట్లు చేసింది. ఆయన

సమర్థుడూ, నిజాయితీ గలవాడనే విషయాలు సమ్మతించ బడినవే కనుక, ఆయన వాటిని అనేక సందర్భాలలో డిన్ విడ్డీకీ, తదితరులకూ వ్రాసిన ఉత్తరాలలో ఉదాహరించటం కూడా జరిగింది. వీటిని బలపరిచే ఒక సంఘటన–1753 లో డిన్ విడ్డీ ఫ్రెంచివారికిచ్చిన నిశ్చయమైన పత్రాన్ని భరించి ఆయన స్వచ్ఛంద సేవకుడుగా వెళ్లారు. ఇలాటిది ధైర్య సాహసాలూ, దేశభక్తీ ఉన్న వర్జీనియా వాసి చేయవలసిన పనే అన్నట్లయితే, ఎన్నో పెద్దఆశలూ, ఆశయాలూ ఉన్న యువకుని పని అనికూడా అనవలసి ఉంటుంది. ఆ తరువాతి ఆయన పనులూ, ఉత్తరప్రత్యుత్తరాలనుబట్టి చూస్తే, ఆయన సాహసికకృత్యాలతో వెర్రెత్తిపోతున్నారని అన లేము. ఫిరంగులముందు రొమ్మిచ్చి కీర్తిపొందుదామని ఆయన ఆశయమైతే, అది కేవలం నీటిబుడగలాటిది కాదు; ఘన పదార్థరూపాన ఉండి, గుర్తించబడి, తగినవిధంగా బహూక రించబడటాన్ని ఆయన ఆశించారు. సరిగ్గా చెప్పాలంటే 'సేనాపతిత్వం ఒక కళ'గా ఆయన ఆరాధించదలిచారు. కేవలం ప్లాంటర్‌గా ఉండటం ఒకటి; రెండోవైపు చూస్తే కళ్లు మిరుమిట్లుగొలిపే కాంతిలో 'గౌరవం', 'రాజ సత్కారం' (ఉన్నతోద్యోగం) అనేవి ఆయనకు స్పష్టంగా కనిపించినవి.

ఈ కాలంలోని వాషింగ్టన్ ఉత్తరప్రత్యుత్తరాలలో 'ఉన్నతోద్యోగం' అనేమాట అనేకసార్లు దొర్లింది. వర్జీ నియాలోకూడా సరైనవారిని తెలుసుకోవటం ఎంతో

ముఖ్యం ; పోతే విశాలవిశ్వంలో తన సుగుణసంపత్తికి దేశ భక్తినికూడా జోడించనిదే లాభంలేదు. డ్యూక్ ఆఫ్ మార్లబరోతోపాటు స్వచ్ఛందసేవకుడుగా పనిచేసిన డానియల్ పార్క్ అనే ఆయనకు ఏనీరాణి 1,000 గినీలనూ, తన చిత్రపటమున్న చిన్నబొమ్మ, వజ్రాలమధ్య పొదిగిన దాన్ని - 1704 లో బ్లెన్‌హీమ్ యుద్ధవిజయాన్ని చేరేసినందుకు ముట్టజెప్పింది. ఇలాటి అదృష్టం చాలా అరుదైంది ; ఎందుకంటే ఆ తరువాత పార్క్ లీవర్డ్ ద్వీపాలకు గవర్నర్‌గా నియమించబడ్డాడు. వాషింగ్టన్ ఆశలైతే అంతఎత్తు ఎగరలేదు. కాని రాష్ట్రోద్యోగిగా ఉండటంవల్ల ఉన్నతోద్యోగమనే నిచ్చెనమెట్లల్లో చాలాకింద తాను ఉండిపోవలసి వచ్చిందనిమాత్రం ఆయనకు తెలుసు. బహుశా ఆ మెట్ల మీదకూడా తానింకా నిలువలేదేమో ?

కనుక రెగ్యులర్ కమీషన్‌లో తాను చేరాలి. నిజానికి తన సోదరుడు లారెన్స్‌కు అలాటి ఉద్యోగం ఉండేది ; దాన్ని సంపాయించినప్పుడే తనకొక గుర్తింపు. ఒకపందెపు బహుమతి ఏర్పడుతుంది. 1754 లో ఆయన ప్రపంచ దృష్టిని ఆకర్షించారు. అది తాత్కాలికమే ఐనా సామ్రాజ్యవాదుల నాటకంలో బ్రిటన్, ఫ్రాన్స్‌ల మధ్య ఆయనొక ముఖ్య పాత్ర వహించారు. 1755 లో బ్రాడాక్ అంతరంగికుల్లో ఒకరుగాఉండి, తిరిగి మరొకసారి ముందువరుసల్లో నిలబడ్డారు. ఆ తరువాతకూడా ఆయన సేవలు గుర్తించబడే విధంగానే ఉన్నవి. జీవితాన్ని వెనక్కుతిరిగి చూసుకుంటూ యీ

వర్జీనియావాసి కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించుకోవటంలో మధ్య తెంపు లేకుండానే ఉన్నదనే విషయం సుస్పష్టం. ఇతర జీవిత చరిత్రకారులవలెనే మనంకూడా యీ కిందిసంఘటనను నొక్కి వక్కాణించవచ్చు. 1755 లో మొనాన్గహేలా విషాద సంఘటననుగూర్చి చెప్పిన ఒకానొక మతగురువు కలొనెల్ వాషింగ్టన్‌ను విడదీసి, అమెరికన్ నాయకుడుగా ఆయన్ను పేర్కొని, 'బహుశా అనేక గొప్ప పనులు చేసేందుకు విధి ఆయన్ను సృష్టించిందేమో'నని అన్నాడు. ఐతే వాషింగ్టన్ దృష్టిలో ఈకాలమంతా అడవుల్లో వృథా ఐపోయిందిగానే ఉండేది. ఆయన సేవలు గుర్తించబడలేదు. అదృష్టమూ కలిసిరాలేదు. బ్రాడాక్ మరణించాడు; బ్రాడాక్ స్థానంలోకి వచ్చినవారిని వాషింగ్టన్ పనులు ఆకర్షించలేదు. మరి తన ఉనికిని ఆయ నెలా తెలియపరచ గలరు? ఆయన అపజయాన్ని పొందుతే, అది ప్రయత్న లోపంకాదు. 1757 జనవరిలో లార్డ్ లౌడౌన్ ఉత్తర అమెరికాకు ప్రధాన సర్వసేనాని ఐనప్పుడు వాషింగ్టన్ ఆయనకు ఇలా రాశారు:

"...తమ దివ్యసముఖానికి నా పేరు తెలియకపోయినా, ప్రపంచంలోని ఇతర ప్రదేశాలలో తాము చేసిన రాజసేవనుగూర్చి తెలియటం వల్ల, తమ నామధేయం నా చెవికి సుపరిచితం. నేను తమను శ్లాఘిస్తున్నానని అనుకోవద్దని కోరుతున్నాను. తమ ఉన్నతోద్యోగాన్ని గౌరవించటం. తమపట్ల నాకున్న గౌరవభావాలతో, నేను తమను ముఖస్తుతి చేయటం నా ఉద్దేశ్యంకాదు. స్వభావసిద్ధంగా నేను ఉన్నదున్నట్లు అనటానికీ, నిజాయితీగా, నిష్కల్మషంగా మెలగటానికీ అలవడినాను...

ఇక నా విషయం-జనరల్ బ్రాడాక్ దురదృష్టవశాత్తూ ఎదుర్కొన్న అపజయమే సంభవించనట్లయితే, నా కోర్కెలకు అనుగుణంగా ఉన్నతోద్యోగం నాకు లభించి ఉండేది. నిజానికి ఆయన ఆమాటను నాకు వాగ్దానం చేసి ఉన్నారు. తాను ఉద్దేశించని వాగ్దానాలను చేయటం ఆయన తత్వం కాదని నానమ్మకం.”

1758 వసంతకాలం నాటికి సైనికోన్నత ఉద్యోగం లభిస్తుందనే ఆశలన్నీ ఆయనకు అడుగంటినవి. ఏమైనా తనకు కాస్త పరిచయమున్న బ్రిటిష్ రెగ్యులర్ ఆఫీసర్లకు ఆయన ఉత్తరాలు రాస్తూ, ‘మామూలు రాష్ట్రోద్యోగుల కోవలో కాకుండా తనకు కాస్త ప్రత్యేకతనిమ్మని జనరల్ ఫోర్బీస్‌కు సిఫారస్ చెయ్యమని కోరారు. 1758 జూన్‌లో డిన్‌విడ్డీ స్థానంలోకి వచ్చిన లెఫ్టినెంట్ గవర్నర్ ఫౌక్వియిర్‌ను వాషింగ్ ఆహ్వానించి కొంత సిగ్గుపడుతూనే తగినంతగా శ్లాఘించారు.

ఇంకోవిధంగా చెప్పాలంటే ఉన్నతోద్యోగాన్ని సాధించేందుకు ఆయన చేయగలిగిందంతా చేశారు; 1756 లో బోస్టన్‌వరకూ గుర్రంమీద ప్రయాణమైవెళ్లి, సర్వసేనాని సముఖంలో కాప్టెన్ డాన్‌వర్డీమీద తాను ఎన్నికైన వాడననే విషయాన్ని సుస్థాపితం చేశారు. 1753 – 1758 మధ్య వాషింగ్టన్‌మీద అయిష్టం ఏర్పడటంలాటి దేదో జరిగింది. దారికి అడ్డంగా వచ్చేవాడుగా, తన గౌరవానికి అత్యధికమైన స్థానాన్ని ఇచ్చేవాడుగా, ప్రతి చిన్నవిషయాన్నిగూర్చి ఫిర్యాదులు చేసేవాడుగా, తన ప్రమోషన్‌ను గూర్చి చాలా కలత చెందేవాడుగా ఆయన కనిపించారు.

ఐనప్పటికీ ఆయనకు నిజమైన బాధలున్నవి. ఆయన సమర్థుడు. దృఢ నిశ్చయం గలవాడూను. ఆయన లోపమల్లా యీ విషయాలను ఇతరులతో అనేకసార్లు అనటమూ, ముందుగా ఎంతో సంచలనాన్ని కలిగించినా క్రమంగా ఆ ఆశలన్నీ నిరాశలు కావటంతో ఆయనలో పీడించబడుతున్న ధోరణి కనిపించటమూను. 1757 అక్టోబర్‌లో ఆయన డిన్‌విడ్డీకి ఇలా రాశారు : "నా చేతలూ, వారి ఉద్దేశ్యాలూ కక్షలతో కూడిన కఠిన విమర్శలకు లోనైనవన్న విషయంలో నాకు నమ్మకం కుదిరింది." ఓర్పునివ్వగల విజ్ఞానాన్ని ఆయనింకా సాధించవలసి ఉన్నది; లేదా ఆయన దాన్ని ఎంతో బాధావహంగా నేర్చుకుంటున్నారు.

అలా కానట్లయితే ఆయనలోపాలను ఆయన సుగుణాలు మరుగుపరిచి ఉండవలసింది. ఆయన దృక్పథం వర్జీనియావాసి దృక్పథంవలెనే సంకుచితమైనది. యుద్ధాన్ని పరిపూర్ణ రూపంలో ఆయన ఊహించలేదు; 1758 లో ఫర్బ్స్ రేస్‌టౌన్ దారిని ఎన్నుకున్నప్పుడు వాషింగ్టన్ దాదాపు తల వంచలేని స్థితిలో పడ్డారు. పెన్సిల్వేనియన్ల యుక్తికి ఫర్బ్స్ ఎరయి తమ ప్రతిపక్షీయులైన వలసదారులు వెనుక నుంచివచ్చి ఓహియో సరిహద్దులలోని వ్యాపారాన్ని తప్పక కైవసం చేసుకుంటారని వాషింగ్టన్ అభిప్రాయ పడ్డారు. ఐతే తానువేసిన పథకంవల్ల వర్జీనియా వాసులే ఇలాంటి యుక్తిని పన్నారని ఇతరులు అనుకుంటారేమోననే ఊహ ఆయనకు రాలేదు. ఏది ఏమైనా ఆయన వర్జీనియాకు విశ్వాస

నీయుడుగానే ఉన్నారు. ఆశయపూర్వకంగా ఆయన కోరిం దేమంటే - రెగ్యులర్ కమిషన్ ; అప్పుడే తాను మరింత ఉత్సాహంతో వర్జీనియాను రక్షించగలడు. ఏ ఇతరమార్గా ల్లోనైనా ఆయన రాయల్ కమిషనును కోరి ఉన్నట్లయితే యువకుడైన బ్రియన్ ఫెయిర్ ఫాక్స్‌వలెనే ఆయనకూడా దాన్ని కొనుక్కొని ఉండేవారు.

ఉన్నతోద్యోగాన్ని కోరటంతోపాటుగా కీర్తి ప్రతి ష్ఠల తృష్ణకూడా ఆయనలో అధికమైంది. ఒకోసారి వాషిం గ్టన్ యీ రెంటికీ ఒకేరకమైన నిర్వచనాన్ని చెపుతూండే వారు. తన పరిచయస్థులపట్ల స్నేహపూర్వకంగా ఉండటాన్ని కూడా ఆయన ఉద్దేశించారు. వాషింగ్టన్ పెద్దయ్యాక జీవిత మంతా 'కీర్తి'ని విడనాడకుండానే గడిపారు. ఒకవిధంగా చూస్తే ఆయన చమత్కార ధోరణిలో ఇదొక భాగమని పిస్తుంది ; లేదా తగినంత జాగ్రతపడే విషయంగా కనిపిస్తుంది ; ఎందుకంటే ఆయన చేసిన పనులూ, ఆయనపట్ల చేయబడిన వాటన్నిటికీ తగిన వ్రాతపూర్వకమైన వివరాలు ఉన్నవి. ఇదిగాక వాషింగ్టన్ ప్రజాప్రీతిని సంపాయించవలసి ఉన్నది. ఏది సరైనదో, ధర్మమో దాన్నే తానుచేయాలని ఆయన నిశ్చయించు కున్నారు ; తన పనులతాలూకు ఫలితాలు చెడుగా ఉన్నప్పటికీ, తాను ఎన్నుకున్న మార్గాన్ని అందరూ గుర్తిస్తారని ఆయన ఆశించారు. అంత్య ప్రయత్నాలలో గౌరవం ఆయనకు ఉన్నతోద్యోగంకన్న ఎన్నుకో దగిం దిగా ఉన్నది. ఐతే కలొనెల్ వాషింగ్టన్ దీన్ని అందు

కునేందుకు సంసిద్ధు డౌతున్నాడేకాని, ఆయన మంచి మర్యాదలు తెలిసినవాడు. ఆయనకు సైనికపరంగాఉన్న ఆశయాలు తగినంతవిగాఉన్నప్పటికీ, అవి ఎన్నడూ అక్రమమైనవిగాలేవు. కనుకనే ఆయన వాటన్నిటినీ తన మనోసీమలో ఒకమూలకు నెట్టివేశారు. అవి ఎంతలోతున భూస్థాపితమైనవో మనం చెప్పలేము. కాని 1759 లో ఆయన మౌంట్ వెర్నన్‌ను అలంకరించ సాగినప్పుడు, ఆరు చిత్రపటాలకుగాను లండన్‌కు ఆర్డర్ పంపారు. ఆ చిత్రపటాలివి: అలెగ్జాండర్ దీ గ్రేట్, జూలియస్ సీజర్, స్వీడన్ ప్రభువు 12–వ ఛార్లెస్, ప్రష్యాప్రభువు రెండవ ఫ్రెడరిక్, యువరాజు యుజీనీ, డ్యూక్ ఆఫ్ మార్లబరో. అందరూ రణరంగ వీరులే! ఆయన ఏజెంట్ వీటని సరఫరాచేయలేకపోయాడు; వీటికి మారుగా వేదాంతులూ, కవుల చిత్రపటాలు ఇవ్వబడినవి కాని, వాషింగ్టన్ వాటిని అంగీకరించలేదు.

వాషింగ్‌టన్ నిరాశాపూరితుడైన సమయంలో కల్నల్ ఫెయిర్‌ఫాక్స్ ఆయన్ను ఇలా ఓదార్చాడు: "సీజర్ అభిప్రాయాలను తెలుసుకొని, బహుశా క్విన్‌టస్ క్యూర్షియస్ ('అలెగ్జాండర్ ది గ్రేట్' రచయిత) భావాలను అర్థంచేసుకొన్న నీకు– ఇంతకన్న కష్టాలూ, గొణుగుడులూ, తిరుగుబాట్లూ, అభిప్రాయభేదాలూ మొదలైనవి వారికి ఎదురైనవని తెలియకపోలేదు; వాటితో పోల్చి చూసుకుంటే నీ భాగానికి వచ్చిన కష్టాలు ఒక లెక్కలోవే కావు. అథవా అలాటి కష్టాలు ఎదురైనా నీవు కిమ్మనకుండా

వాటిని భరించి, నీ నాయకులు చూపిన విశాలత్వాన్ని నిరూపించవలసి ఉంటుంది.''

తాను ఉద్యోగంనుంచి విరమించే సమయానికూడా ఇంకా ఓదార్పు అవసరమైతే - సీజర్ హత్యచేయబడినాడనీ, అలెగ్జాండర్ తన 19-వ ఏటనే రాజైనప్పటికీ, 32-వ ఏటనే మరణించారనే విషయాలను జ్ఞాపకం చేసుకుంటే చాలు. తన సమకాలీనుడైన జనరల్ వుల్ఫ్ ప్రతిభావంతమైన జీవితాన్ని గడిపినప్పటికీ క్విబెక్‌ను పట్టుకుంటూండగా, తన 32-వ ఏట మరణించాడు. పోతే వాషింగ్‌టన్‌తో పాటు పనిచేస్తున్నవారిలో ఎవ్వరూకూడా ఆయనకన్న పైఅంతస్తుకు పోలేదు. నిజానికి కొంతమంది అవమానాల పాలయ్యే పనులుకూడా చేశారు. మిగతావారు చనిపోయ్యారు. ఉదాహరణకు క్రిస్టఫర్ గిస్ట్ మశూచి వ్యాధితో మరణించాడు. బార్బడాస్‌లో తాను మశూచి వ్యాధికి గురికావటం కొంత అదృష్టం - ఎందుకంటే ఆ వ్యాధికి తాను తిరిగి బలికానవసరంలేదు.

## ప్లాంటర్ విరమణ :

ఇప్పుడాయన తృప్తిపడేందుకు ఎక్కువ ఆధారాలున్నవి. ఫెయిర్‌ఫాక్స్ కుటుంబీకులు ఇప్పటికీ ఆయనకు ఆప్తులే. ఆయన ఆస్తిపాస్తులు విలువైనవి. ఫ్రెంచ్‌వారి గొడవలు వొదిలిపోతే యీ ఆస్తి ఇంకా పెరిగే అవకాశాలూ, ఆశలూ ఉన్నవి. వీటన్నిటినీ మించి ఆయన బ్రహ్మచారిగా గడిపేరోజులు అంత్యదశలో పడినవి. ఆయన

వధువు గుణవంతురాలు; వర్ధిల్లే ఆస్తిపాస్తులున్న యువతి. ఐతే విధవరాలు. ఆమెపేరు మార్తా డాన్‌డ్రిడ్జి కస్టిస్. ఆమె మొదటి భర్త బ్లెన్‌హీమ్ విజయాన్ని ఏనీరాణికి జేరవేసి రాజాదరణపొందిన డేనియల్‌పార్క్ వంశీకుడు. మార్తా వాషింగ్టన్‌కన్న కొద్దినెలలు పెద్ద. ఆమె మొదటి భర్తకు ఇద్దరు సంతానాన్ని కన్నది. వాషింగ్టన్ ఆమెను ఎప్పుడు కలుసుకున్నారో, లేదా వీరిద్దరిమధ్య ప్రణయ మెలా వర్ధిల్లిందో నిశ్చయంగా చెప్పలేము. 1758 ఎండాకాలంలో ఆయనచే పంపబడినదని చెప్పబడే ప్రేమలేఖ ఫోర్జరీగా కనిపిస్తుంది. ఐతే యీ ప్రధానం జరిగిన సమయంలోకూడా శాలీ ఫెయిర్‌ఫాక్స్ విషయంలో వాషింగ్టన్ మానసికావేదనను అనుభవిస్తున్నాడనేందుకు కొంతవరకూ రుజువులు ఉన్నవి. ఆమెకు వ్రాయబడిన ఒక ఉత్తరంలో తన ప్రణయాన్ని నిస్సందేహంగా ఒప్పుకున్నట్లే ధ్వనిస్తుంది. ఐతే ప్రణయసాహిత్యాన్ని రాసే రచయిత వాషింగ్టన్ మార్తాల ప్రణయవృత్తాంతాన్ని అర్థంచేసుకొనేవిధానంలో ఇది అనుమానాస్పదమైనదిగానే ఉండొచ్చు. ఎందుకంటే, ఉభయులకూ ఇది లాభసాటి బేరమే. ఇతరవిషయాలమాట అటుంచి, ముఖ్యంగా మార్తాకు ఆమె ఆస్తిపాస్తుల ఆధ్వర్యాన్ని వహించే వ్యక్తి లభ్యమయ్యాడు; పోతే వాషింగ్టన్ ఒక ఐశ్వర్యాన్ని వరించాడు. ఐతే ఇది కేవలం ఒకరి వీలుకు మరొకరు చేసుకొనే వివాహంమాత్రమే ననేందుకు ఎలాటి కారణమూ దొరకదు, లేదా శాలీమీది నిరాశతో వాషింగ్టన్ మార్తావైపు ఆకర్షించబడినా రనేందుకూ వీల్లేదు. ఆ

రోజుల్లో సజీవులుగా ఉన్నవారెవ్వరూ వీరిది అనుకూల దాంపత్యంకాదనికానీ, యీాడు జోడు కాదనికానీ అన లేదు. వారిద్దరిమధ్య ఏమాత్రం భేదాభిప్రాయాలు వచ్చినా లోకులు తీవ్రంగా విమర్శించి ఉండేవారు.

1759 జనవరిలో వాషింగ్టన్ వివాహమాడారు. అదే సంవత్సరం సెప్టెంబర్‌లో లండన్‌లోని ఆయన తన జ్ఞాతి కొకాయనకు ఒక ఉత్తరం రాశారు. అందులో ఆయ నిలా అన్నారు :

“నేనిప్పుడు ఇక్కడే స్థిరనివాసం ఏర్పరుచుకున్నాను. నాకు జీవితంలో కోరుకున్న ప్రియురాలు దక్కింది. విశాలవిశ్వంలోని రొద నుంచి బైటపడి, మరింత సుఖపడేందుకు బహిరంగ జీవితంనుంచి కొన్నాళ్ళపాటు నిష్క్రమిస్తే బాగుంటుందని నా నమ్మకం.”

అదే ఉత్తరంలో ఆయన అనేకసంవత్సరాలనుంచీ ఉన్నకోర్కె – లండన్ రావాలనే దాన్ని తీర్చుకోలేక పోయినందుకు విచారిస్తున్నాననీ, ఎందుకంటే ఇప్పుడు తాను బంధించబడినవ్యక్తి కనుక, వ్యక్తిగతమైన కోర్కెలకు ప్రాధాన్యత ఇవ్వరాదనికూడా వివరించారు. వేరే సంద ర్భంలోకూడా మార్తాతోడి దాంపత్యజీవితం ఆయనకు ఇబ్బందిగా ఉన్నదనే సూచనలు కానరావు. కంబర్లండ్ కోటలోని జీవితంలాటిదాన్నుంచి, సరిగ్గా అందుకు విరుద్ధంగా ఉన్న జీవితవిధానంలోకి ఎంతో త్వరగా మారగలిగి, తదను గుణంగా సరిపెట్టుకోగలగటం జరిగింది.

దీని వివరణ ఇలా ఐఉండొచ్చు; నిజానికి వాషింగ్‌టన్ తాను చెప్పినవిధంగానే, సైనికోద్యోగంతో విసుగెత్తటం, ఉన్నతోద్యోగ ఆశయాలవిషయంలో నిరాశచేసుకోవటం జరిగింది. పోతే తాను గుర్తించబడేందుకు అడ్డంకులులేని మరొకమార్గం ఉండనే ఉన్నది. ఇది భూస్వామిగా వర్ధిల్లటం. ఇక రెండవ వివరణ – వాషింగ్టన్‌కు ఊపిరితిరగని పనిపాటు లుండటం. తాను అక్కడ చాలాకాలంగా ఉండనికారణాన, మౌంట్ వెర్నన్‌లోని భూములు నిస్సారమై, ఎన్నో మరమ్మతులకు ఎదురుచూస్తున్నవి. ముఖ్యంగా భవనంలో విశేషంగా ఫర్నిచర్ ఉంచవలసి ఉన్నది; తదనుగుణంగా లండన్‌కు అనేకఆర్డర్లు – 'ఒక 7½ అడుగుల పరిమాణమున్న మంచం', 'వ్యవసాయంమీద అధునాతనంగా శాస్త్రీయ దృక్పథంలో వెలువడినగ్రంథం', 'నీగ్రోసేవకులకు ఎండాకాలానికి ఉపయోగపడే దుస్తులకుగాను 40 గజాల ముతక గుడ్డ', 'చిన్నపిల్లలు విద్యాభ్యాసానికి పూనుకొన్నప్పుడు ఉపయోగపడే 6 చిన్నపుస్తకాలూ' మొదలైనవన్నీ కోరబడినవి. ఈ విద్యాభ్యాసాన్ని ఆరంభించవలసిన చిన్నపిల్లలు వాషింగ్టన్ సవితిపిల్లలు – జాన్‌పార్క్ (జాకీ), మార్తాపార్క్ (పాట్సీ), కస్టిస్. వీరికోరకై ఆటవస్తువులుకూడా ఆర్డర్ చేయబడినవి. నిజానికి యీ పిల్లలతోనూ, తన వృత్తంలోకి వచ్చిన ఇతరపిల్లలతోనూ ఆయనకు ఎడతెగని ఇబ్బంది కలిగింది. జాకీ, పాట్సీలు ఆనందదాయకమైన బరువుభారాల్ని ఆయనమీద మోపారనీ, వారితల్లి ఎంతో ఐశ్వర్యాన్ని వెంటబెట్టుకొచ్చిన కారణంగా ఆయన ఇలాటి బాధ్యతల్ని

భరించవలసివచ్చిందనీ మానవద్వేషులు అనవచ్చు. ఐతే ఆయన్ను గూర్చి మనకు తెలిసిన ఇతరవిషయాలను పరిశీలిస్తే ఇలాటి అభిప్రాయం కఠినమైన తీర్పుగా తోస్తుంది.

27 సం॥లున్న ఉత్సాహవంతుడైన ఈ యువకుణ్ణి 'మూలపురుషుడు' అనటం అసందర్భంగా కనిపిస్తుంది. ఐతే ఆయన జీవితపు బాటలోనే యీ మూలపురుషత్వంలాటి దేదో ఉంటూనే ఉన్నది. క్రమంగా వాషింగ్టన్ వంశానికి మౌంట్ వెర్నన్ మూలస్థానమైంది. తనసోదరీ సోదరుల్లో జార్జి వాషింగ్టన్ విజయుడుగా భావించబడుతూ, ఆయన సలహాల కొరకై వారు ఎల్లప్పుడూ ఎదురుచూడటం జరిగింది. తన కుటుంబవిషయాలలో నిమగ్నుడవకపోయినప్పుడూ, కష్టాలను అనుభవించే తన పరిచయస్థుల విషయం ఆలోచించనప్పుడూ - ఆయన మార్తాతాలూకు ఆస్తిపాస్తుల ఆధ్వర్యాన్ని చూడవలసిఉన్నది. దిగువసమితి సభ్యుడుగా ఆయన విలియమ్స్‌బర్గులోని సభలకు వెళ్లివస్తూ, తనను ఎన్నుకొన్న వారిని తృప్తిపరచవలసి ఉన్నది. వివాహానంతరం కొద్ది కాలానికే ఆయన జిల్లా మేజస్ట్రేట్‌గా చేరారు. ఆ తరువాత తన తండ్రిగారి అడుగుజాడల్లో ట్రూరో పారిష్ ఆధ్వర్యంలో పాలుపంచుకొని, ఆ తరువాత చర్చి వార్డెన్ కూడా అయ్యారు. 1766 లో అలెగ్జాండ్రియా ట్రస్టీలలో ఖాళీవస్తే ఆ స్థానాన్ని ఆక్రమించారు. ఇదిగాక ఆస్తిపాస్తుల్ని వర్ధిల్ల జేసుకునే వ్యక్తిగా, సమయం చిక్కినప్పుడల్లా ఆయన భూమి కొనసాగారు. 1754 లో స్వచ్ఛందసేవకులుగా పనిచేసిన

వాటికి 15,000 ఎకరాల భూమి వాగ్దానం చేయబడింది. అలాటిదానికి తనకున్న హక్కులనుగూర్చి ఆయన ఎంతో పట్టుపట్టారు కాని, విజయులవలేదు. దక్షిణ వర్జీనియాలోని డిస్మల్ శ్వాంప్ కంపెనీ, మిసిసిపీ కంపెనీ (ఈ కంపెనీ మిసిసిపీ నదిమీదున్న ఒక భూఖండాన్ని అభివృద్ధిచేయాలనే పథకంవేసింది) మొదలైన భూమి విస్తరణ కార్యక్రమాల్లో పాల్గొన్నవాటిలో ఆయన చేతులు కలిపారు. ఆయన వయసు మళ్లినవాడు కాకున్నా, బాధ్యతల విషయంలోమాత్రం వృద్ధాప్యం వచ్చిపడినట్లే భావించారు.

ఆయన తన 40 వ పడిలో - వర్జీనియాలో కాస్త ఉన్నవారి కోవలో చేరగలిగినా, అత్యంత అధికారాన్ని చలాయించేవారి కోవలోకి ఇంకా రాలేదు. బహుశా తన సైనికోద్యోగపు రోజులను కొంత నిరాశా, దుఃఖమూ కలగా పులగమైన భావంతో ఆయన ఇప్పటికీ జ్ఞాపకం ఉంచుకొనే ఉండాలి. 1772 లో తన చిత్రపటాన్ని గీయించేందుకు సిద్ధపడి, ఆయన ఛార్లెస్ విల్సన్ పియరీ ఎదుట వర్జీనియా కలోనెల్ యూనిఫారం వేసుకొని నిలబడటంలో కొంత ప్రాముఖ్యత ఉండిఉండొచ్చు. ఐతే ఆయనకు మంచి దుస్తుల మీద ఉండే అభిలాషా, ముఖ్యంగా మిలిటరీ యూనిఫారం వేసుకుంటే తాను మరింత ఆకర్షణీయంగా ఉంటాననే భావమూ దీనికి మరింత సబబైన కారణాలుగా కనిపిస్తవి. ఈ చిత్రపటంలోనుంచి మనను చూసే ముఖం పరిపక్వత పొందిన వ్యక్తి ప్రపంచశాంతిని సాధించిన విధంగా ఉంటుంది.

పరిపూర్ణమైన, ఉత్సాహకరమైన జీవితాన్ని గడుపుతూ, తదనుగుణంగా విసుగెత్తిపోయి, సోమరితనంతో కూడుకోని – ఈర్ష్యవల్ల కానీ, దురాశవల్ల కానీ భంగపడని, లేదా అప్పుల భారంతో రాత్రంతా నిద్రలేక బాధపడని, లేదా ద్రోహ చింత జరుగుతుందేమో ననే భయంతో వొణికిపోని, కల్మషాత్మతో కుంగిపోని, ప్రశాంతమైన ముఖారవింద మది! సమాజంలో ఉత్తమశ్రేణికి సంబంధించిన ఒకస్థానం ఉన్నట్లు ఆ వదనం సూచిస్తుంది. అదొక కుటుంబీకుని ముఖం.

నిజానికి వాషింగ్టన్ చాలావరకు ఇలాగే ఉండేవారు కనుక, దీన్ని మనం సరైన చిత్రపటంగానే చెప్పుకోవాలి. ఆయనకు స్వసంతానం లేదు. ఐతే మార్తాపిల్లల విషయాన్ని బట్టి చూస్తే ఆయన కుటుంబీకుడే. ఆమె రోగిష్ఠికూతుర్ని కాపాడేందుకు తగిన అనురాగాన్నీ, అందాలుచిందే, కాని కాస్త పెడదార్లు పట్టిన ఆమె కుమారుని విషయంలో రక్షణ బాధ్యతనూ ఆయన విస్మరించలేదు. ఆ అమ్మాయికి మూర్ఛలు వచ్చి, వాళ్లు తెలియని స్థితిలో ఉన్నప్పుడు వారి ఆత్రుత శిఖరాగ్రాన్ని అందుకున్నది. కాని వారిని దుఃఖసముద్రంలో ముంచి ఆమె 1773 లో తన 17 వ ఏట మరణించింది. ఏమైనప్పటికీ కొద్దినెలల తరువాత జాకీ మేరీలాండ్‌లోని నెల్లీ కాల్వర్టు అనే అందమైన అమ్మాయిని వివాహమాడాడు. సంరక్షకుడుగా ఉన్న సవితితండ్రి వాషింగ్టన్ హఠాత్తుగా కుదిరిన యీ పెళ్లివిషయంలో ఫిర్యాదుచేశారు. కాని జాకీ తన కాలేజివిద్య పూర్తయేవరకూ వేచివుండే స్థితిలో ఉండని

కారణంగా నిర్లక్ష్యతను సూచించే చిరునవ్వుతో అంగీకరించారు. కొద్దికాలానికే జాకీకి ఇద్దరుబిడ్డలు జన్మించి, వాషింగ్టన్‌నుంచి తాతగారి అనురాగాన్ని ఆశించారు. ఈ విధంగా ఆయన చాలామంది ఇతర పిల్లలపట్ల 'బాబాయి' లేదా తాతగా పరిణమించారు.

పియరీ రచించిన చిత్రపటానికి తోడుగా మరొక చిత్రపటం-అంతకన్నా ముందుకాలానిది-ఉంటే బాగుండునని చాలామంది గాఢంగా కోరుతారు.* ఏ 1757 లోనో మనం వాషింగ్టన్‌ను చూసి ఉన్నట్లయితే, ఒకానొక వ్యక్తి పరిపూర్ణతను అందుకోనివారిని చూసిఉండేవాళ్ళం. 1772 లో ఆయనపట్ల 'వివేకవంతుడు' మొదలైన ఉత్ప్రేక్షలు అత్యధికంగా ఎందుకు ఉపయోగించబడినవో మనం తేలిగ్గా అర్థం చేసుకోగలం. ఆయన ప్రశాంతచిత్తంతో తనమీదా, తన పరిసరాలమీదా అధికారాన్ని సంపాయించి వీటిని అదుపాజ్ఞల్లో ఉంచుకోగలిగారు. ఐతే 1757 లో ఆయన సమర్థుడుగా కనిపించినా, దాదాపు ఆ స్థితిని అందుకోగలిగారనే సూచనలుమాత్రమే మనకు కనిపించేవి.

---

* నిజానికి 1757 లో జె. ఎస్. కాప్లీ రచించిన మరొకచిన్న చిత్రపటం-ముమ్మూర్తులా వాషింగ్టన్‌ను పోలి ఉన్నదని భావించబడేది చాలాకాలంగా-ఉన్నది. ఐతే ఇప్పుడిది ఆయనపోలికలు ఉండనిదిగా భావించబడుతోంది. ఏమైనా ఆ చిత్రపటం చాలా అసందర్భంగా ఉండటంవల్ల, అది ఎవర్నిగూర్చి వ్రాసినదైనప్పటికీ, మూల పదార్థలక్షణాలను అది వివరించి ఉండలేదు.

ఆ తరువాతి సంవత్సరాలలో నైతికంగా ఎంతో అభివృద్ధి అయ్యారని తెలుస్తుంది. ఐతే ఆయన హఠాత్తుగా ఎంతో మారిపొయ్యారని కాదు. ఆయన తిరిగి మౌంట్ వెర్నన్‌కు ఏర్పరుచుకున్న దారి డెమాస్కస్‌కు ఆయన ఏర్పరుచుకున్న రహదారి కాదు. పాంప్లోనాలో స్మారకం లేకుండా పడిఉన్న సమయంలో ఇగ్నాషియస్ లొయలా తాను రక్తపాతంతో విసుగెత్తిపోయిన యోధుణ్ణని తలిచాడు. అదేవిధంగా ఫ్రాన్సిస్కో- బెర్నార్డోన్ ముట్టడి మధ్యలో వెనుదిరిగివచ్చి, ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సీసీగా కొత్త జీవితాన్ని ఆరంభించదలిచాడు. జార్జి వాషింగ్టన్ ఆ విధంగా రాలేదు. ఒక్క క్షణంకూడా ఆ పురాతన జీవితాన్ని గూర్చి ఆయన బహిరంగపరచలేదు. వర్జీనియన్ ప్లాంటర్ అర్థం చేసుకునే విధంగా ఆయన క్రిస్టియన్. ఐతే ఆయన ఎప్పుడూ దైవప్రసాదమనేదాన్ని స్వీకరించినట్లు కనిపించదు; మోకరించి ప్రార్థనచేయటానికి మారుగా ఆయన నిలబడే ప్రార్థించేవారు. బహుశా ఆయన రోగగ్రస్తతే ఇందుకు కారణమై ఉండొచ్చు. 1757–1758 సం॥లలోని చలికాలంలో ఆయనకు ప్రమాదకరమైన జబ్బుచేసింది. తిరిగి అలాటి వ్యాధి 1761 లో ఎదురైనప్పుడు ఆయనిలా రాశారు: "నా శక్తి సామర్థ్యాలన్నిటినీ రాజుగారు ఉపయోగిస్తారనీ, ఒక గొప్ప పనికోసం నా ప్రాణాల్ని బలిపెడతాననీ భావించానే కాని, యీ విధంగా మృత్యువుకు తల ఒగ్గుతానని అనుకోలేదు." మృత్యుదేవత కబళిస్తుందనే భావం ఆయన మస్తిష్కంలో వర్ధిల్లసాగింది.

ఐతే యోధుడు, మునీశ్వరుడుగా రూపొందేందుకు ప్రయత్నించినట్లు చూడవలసినందుకు తగిన ఆధారాలేమీ లేవు. లొయలా, లేదా సెయింట్ ఫ్రాన్సిస్‌లవలె ఆయన వర్ధిల్లేందుకు తగిన సామర్థ్యాన్ని చూపారని మాత్రం మనం చెప్పగలం. ఆయన ప్రవర్తన ఎంతో అభివృద్ధి జెందింది. కాని పరమ పవిత్రతవరకూమాత్రం కాదు. 1759 వరకూ వాషింగ్టన్ జీవితచరిత్రను వ్రాసేవాడు ఈ విధంగా ఆయన పెదవుల బిగింపునూ, ముఖ్యంగా డబ్బువిషయంలో ఆయన చూపే పిసినిగొట్టుతనాన్నికూడా కనుగొనవచ్చు. ఉదాహరణకు - నెసెసిటీ కోటదగ్గర వాన్ బ్రామ్‌ను శత్రువులకు బందీగా అప్పగించినప్పుడు, తన ఒక యూనిఫారమ్‌ను బ్రామ్‌కు అమ్మాడాయన. అలా కానట్లయితే ఆ మోతను తానే భరించి ఉండవలసింది. ఇది సిగ్గుపడవలసిన విషయం కాకున్నా, చురుకుదనం వ్యక్తమయే విషయం. ఐతే ఉద్యోగ విరమణానంతరం ఆయన తన ధనాన్ని విశాలహృదయంతో అప్పులిచ్చారు; అనేక సందర్భాలలో తాను అప్పిచ్చింది తిరిగి చేతికివస్తుందనే హామీ లేకపోయినా ఆయన వెనుకాడ లేదు. ఒకో సందర్భంలో ఆయన కోరబడకుండానే, వ్యక్తిగతమైన సహాయాలు చేశారు. ప్రాపంచిక విజయాలనేవి చాలామందిని చెడగొడుతవి; కాని వాషింగ్టన్ విషయంలో అవి ఆయనకు విషమించలేదు.

కనుక పియరీచేసిన చిత్రరచనలోని వాషింగ్టన్ 1770 తొలిభాగానికి సంబంధించిన వ్యక్తిగా-తృప్తికరమైన జీవి

తాన్ని సూటిమార్గాన నడిపేవాడుగా మనం గుర్తించ వలసి ఉంటుంది. ఆ కాలానికీ, ఆ దేశానికీ అమరగల మనిషి ఆయన. పావు శతాబ్దం తరువాత ఆయన వ్రాసిన వీలునామాలో ఆయన విశాల హృదయం కనిపిస్తుంది. తనకిందఉన్న బానిసలందరూ మార్తా మరణానంతరం విడుదల చేయబడి స్వేచ్ఛను పొందాలని ఆయన ఆదేశించారు. ఐతే 1766 లో బానిసత్వమనేది వాషింగ్‌ దృష్టిలో ఒక నైతిక సమస్యగా లేదు. తానూ తన ఇరుగుపొరుగులూ ఏం చేయటం ఉచితమని భావించేవారో ఆయన అదే చేశారు. అదేమేడు ఒకానొక పొగరుమోతూ, మాట్లాడితే పారిపొయ్యే ఒకానొక నీగ్రో బానిస టామ్‌ అనేవాణ్ణి వెస్ట్‌ఇండీస్‌లో అమ్మేందుకు నిశ్చయించి, ఓడమీది కాప్టెన్‌కు వాణ్ణి అప్పగించి, ఓడ సముద్రం మీద ప్రయాణిస్తూ ఉన్నప్పుడు మినహా, మిగతా సమయాల్లో వాడికి సంకెళ్లువేసి ఉంచమనిచెప్పి, అక్కడ వాణ్ణి అమ్మగా వచ్చిన పైకంతో రమ్‌, చింతపండు, నిమ్మకాయలు మొదలైన వస్తుసామగ్రి కొని తెమ్మని చెప్పారు. వాషింగ్‌టన్‌ బానిసల విషయంలో చేసిన నేరం తాలూకు సంఘటన ఇదొక్కటే; సమకాలీన స్థాయిల్ని బట్టి చూస్తే, ఆయన్ను మంచి మర్యాదలు తెలిసిన యజమానిగానే చెప్పుకోవాల్సి ఉంటుంది. అంతేగాక ఆయన అసాధారణంగా కష్టించి పనిచేసే, తెలివి తేటలున్న ప్లాంటర్‌ కూడాను. ఐతే ఆయన పద్దుపుస్తకాలు అంత ఖచ్చితమైనవి కావు; ఉత్తరోత్తరా ఛార్టర్డ్‌ ఎక్కౌంటెంట్‌ విధించిన విధంగా అవి ఉండకపోవచ్చు. ఐతే ఆయన ఇరుగుపొరుగుల లెక్కల పుస్త

కాలంతో అవి సరితూగుతవి. పొగాకు నాటటం అంత లాభసాటి వ్యవహారంకాదని గ్రహించి, భూమిని సారవంతంచేసి ధాన్యాదుల్ని పండించాలని ఆయన ప్రయత్నించారు; ముఖ్యంగా భూమికి ఎరువులు అవసరమనీ, గోధుమలూ, గోధుమల్ని పిండిగొట్టటం, పోటోమాక్ నుంచి చేపలు పట్టటం, ఇంటిదగ్గర బట్టలు నేయించటం మొదలైనవాటి ద్వారా మౌంట్ వెర్నన్ ఎస్టేట్ కాస్త లాభదాయక మవగలదని ఆయన గ్రహించారు. ఆయన ఈవిషయాలమీద ఒకకన్ను వేసే ఉంచారు; వ్యవహారాలు సంతృప్తికరంగాకూడా ఉన్నవి. యార్క్ నదీ తీరంలో ఉన్న మార్తాతాలూకు భూములమీద వారి ఐశ్వర్యంవర్ధిల్లింది. ప్లాంటేషన్స్‌ను తణిఖీచేయనప్పుడూ, ఇతర బాధ్యతలు అంతభారంగా ఉండనప్పుడూ ఆయన నాట్యాలూ, పేకాటా, గుర్రపు స్వారులవైపు తన దృష్టిని మరల్చుతూండేవారు. బంధు మిత్రులకు పెద్దఎత్తున విందులు చేస్తూండేవారు. 1775 వరకూ జరిగిన 7 సంవత్సరాల కాలంలోనూ 2,000 మంది అతిథులు మౌంట్ వెర్నన్‌కు వచ్చారు. వీరిలో చాలామంది రాత్రిభోజనాలదాకా ఉండటం, ఆరాత్రి అక్కడే గడపటంకూడా జరిగింది. పనుల మీద విలియమ్స్ బర్గునేగాక — సరదాగానూ వ్యాపార నిమిత్తమూ ఆయన అన్నాపొలీస్, ఫ్రెడరిక్స్ బర్గు, డిస్మాల్ శ్వాంప్, ఇంకా ఇతర తావుల్నికూడా దర్శిస్తుండేవారు. 1770 లో ఆయన సుదూరప్రయాణం సరిహద్దు ప్రాంతాల్లో చేశారు; పిట్‌కోటకు పైవరకూ వెళ్ళి ఓహియోనదిమీద డింగీలో ప్రయాణించి అక్కడి భూములమీది తన హక్కు

విషయమై పరిశీలనలు చేశారు. 1775 లో మరొకసారి పశ్చిమానికి ప్రయాణ పథకాలు వేశారు.

ఐనప్పటికీ 1775 ఎండాకాలంలో, పశ్చిమప్రయాణం విషయంలో వివరాలు సేకరించేందుకు మారుగా ఆయన ఉత్తర దిశకు - బోస్టన్ వైపుకు బయలుదేరారు. గౌరవనీయుడైన జార్జి వాషింగ్టన్ ఇప్పుడు జనరల్ వాషింగ్టన్. విశ్వసనీయుడైన యీ వర్జీనియా పెద్దమనిషి ఇప్పుడొక తిరుగుబాటుదారుడు, సైనిక నాయకుడు - ఒక్క వర్జీనియాకే కాదు, జార్జియానుంచి మసాచుసెట్స్ వరకూ ఉన్న 13 అమెరికన్ వలసలకూను !

## దేశభక్తుడు :

సంశయింపజేసే ఈ అభివృద్ధి తాలూకు వివరాలను విశదీకరించేందుకు ఇక్కడ తగినంత తావు లేదు. క్లుప్తంగా చెప్పాలంటే వలసల విషయంలోని తగాదాలకు మూడు ముఖ్య కారణాలున్నవి. మొదటిది—1756 - 1763 సం. లమధ్య ఇంగ్లీషువారికీ, ఫ్రెంచ్ వారికీ మధ్య జరిగిన యుద్ధాలలో ఇంగ్లీషువారు విజయులవటం, ఫ్రెంచ్ వారి భయం రూపుమాయటం జరిగినవి. 1763 లో జరిగిన సంధిషరతుల ప్రకారం ఫ్రెంచ్ వారు ఉత్తర అమెరికాలోని తమ హక్కులన్నిటినీ వదులుకున్నారు. ఈ విధంగా వీరి అధికారం సన్నగిలటంతో, వీరు మాతృదేశంమీద మరింతగా ఆధారపడవలసి వచ్చింది. మొదటిదాన్ని అనుసరించే రూపొందిన రెండో కారణమిది: బ్రిటన్ తన వలస సామ్రాజ్యాన్ని

గుర్తించేందుకు ప్రయత్నించటం. బ్రిటన్ కనెడియన్ రాష్ట్రా లను జయించి ఉండటంవల్ల ఏదో విధమైన గుర్తింపు తప్పని సరి ఐంది. ఈ సామ్రాజ్యంలో లోగడ ఫ్రెంచ్ వారికింద ఉంటూన్న భూభాగాలుకూడా బ్రిటిష్ వారికి సంక్రమించటం, అల్లెఘనీస్, మిసిసిపీల మధ్య ఉండే భూమిని ఇండియన్లకూ, ఫర్ వ్యాపారులకూ ప్రత్యేకించటం జరిగినట్లు వలసదారులకు కనిపించింది. 1763 లో విడుదల చేయబడిన ఆజ్ఞాపత్రంలో అల్లెఘనీ జలాలకు అవతల శ్వేతజాతీయులెవ్వరూ స్థిరని వాసాలను ఏర్పరుచుకోరాదని ప్రకటించబడింది. 1774 లోని క్విబెక్ చట్టం ఓహియోనదికి ఉత్తరదిశలోనున్న భూభాగాన్ని కెనెడియన్ భూభాగంగా గుర్తించింది. ఈ రెంటి ఉద్దేశ్యాలూ వలసదారులు ఏర్పరుచుకున్న అభిప్రాయాలకు దోహదమిచ్చినవి. ఈలోగడ సంవత్సరాలలో మాతృదేశం సామ్రాజ్య తత్వాన్ని మరింత పకడ్బందీగా ఏర్పరిచేందుకు గాను పాతభూమితోపాటు కొత్త భూభాగాల్నికూడా యీ కోవలోకి దించింది. సముద్రతీరాల్లో ఉన్న వలసలు యీ సామ్రాజ్యానికయే ఖర్చులో తమ తమ భాగాలు చెల్లించమని ఇప్పుడు కోరబడినవి. ఐతే ఇంతకు పూర్వమే వ్యాపార సంబంధమైన పన్నులను వారు చెల్లిస్తూ ఉన్నారు. ఈ పాత పద్ధతిప్రకారం వలసలు ముడిసరుకుల్ని బ్రిటన్‌కు సరఫరా చేయటంద్వారా బ్రిటిష్ ఉత్పత్తి దారులకు మార్కెట్‌ను సృష్టించారు. ఐతే ఇప్పుడు విధించబడాలనుకున్న పన్నులు అంత భారమైనవేమీ కావు. మొత్తంమీద యీ వలసలన్నీ కూడా వర్ధిల్లుతూనే ఉన్నవి.

ఇక మూడో కారణం: ముఖ్యంగా అమెరికన్ వలస దారుల్ని బాధపెట్టిన విషయమేమంటే, వారి భూఖండాలు బ్రిటన్‌లోని భాగాలు కావు; బ్రిటన్‌కు సంబంధించిన ఇతర ఆస్తి పాస్తులు మాత్రమే! ఇక సత్యాసత్యాన్వేషణలకువస్తే జీవితవిధానంలోను, స్వప్రభుత్వ స్థాపనకు అనుగుణమైన అల వాట్లలోనూ వారు పరిపూర్ణత్వాన్ని సంపాయించారు. ఐతే వీరి మాతృదేశం మాత్రం వీరి నింకా పసి బిడ్డలవలెనే చూస్తూ, అణిగి మణిగి ఉంటే మిన్నకుండటం, కాస్త ఎదురు తిరుగుతే తన్నులు ప్రసాదించటం చేస్తూనే ఉన్నది. దేశ భక్తులైనవారు తమ ఉపన్యాసాలలో ఏమి చెప్పి నప్పటికీ, హృదయపు లోతుల్లో తరిచి చూచినట్లయితే అది నిరంకు శత్వంకాదు. కాని తమమాతృదేశం గజిబిజిపడుతూ, తల బిరుసుతనంతోనూ, కొందరిపట్ల ప్రత్యేకాభిమానాన్ని చూపుతుండటంతోనూ చిన్నచిన్న లోపాలు భయంకరమైన రూపాలకు దారితీసినవి. ఐతే బిడ్డగా పరిగణించబడే యీ దేశం, యీడువచ్చి తన ఇష్టానుసారంగా బతికే సామర్థ్య తను కలిగి ఉన్నది. 1776 లో 'లోకజ్ఞానం' అనబడే కర పత్రంలో టామ్‌పైనీ "పిల్లవాడి జీవితాంతమూ తండ్రి సంరక్షకుడుగానే ఉండాలా?" అని ప్రశ్నించాడు. ఆతరువాత పదేళ్లవరకూ ఇదేప్రశ్నను ఇతరులుకూడా అడుగుతూ, రక రకాల సమాధానాల్ని పొందారు.

కొన్ని విశాల దృక్పథాలు అన్నీ వలసలూ, లేదా అందులోని సమానులైన నాయకుల విషయంలో సర్వసాధార

ణంగా ఉన్నవి. బోస్టన్‌లోని వ్యాపారి ఫిలడల్ఫియాలోని వ్యాపారిని అర్థంచేసుకోగలడు. న్యూయార్కులో యజమానిగా సుస్థిరస్థానాన్ని అందుకున్న వ్యక్తితో దక్షిణదేశంలోని ప్లాంటర్ సమానస్థాయిని తీసుకోగలడు. నిజానికి ఏ 1756 లోనో, న్యూయార్కుగుండా ప్రయాణంచేస్తూ, జార్జ్‌వాషింగ్టన్ వారికుమార్తెల్లో ఒకామెమీద దాంపత్యోద్దేశ్యంతో కన్నువేయనూవచ్చు. అన్నిస్థలాల్లోని లాయర్లూ ఒకేరకమైన భాష మాట్లాడేవారు. అంతకన్న తక్కువ ప్రజ్ఞ ఉన్న సువిశాలమైన సరిహద్దుప్రాంతాలలోని జనంకూడా అలాటి భాషే మాట్లాడేవారు. ప్రతి వలసలోనూ ఒక ప్రత్యేక మూలంనుంచి రూపొందిన అసంతృప్తి ఉన్నది. సముద్రతీరాన ఉన్న వర్జీనియా భయంకరమైన, అస్థిరమైన ఆర్థికవిధానంతో బాధపడుతోంది. ఎంతో జాగ్రతగా నడపబడే మౌంట్‌వెర్‌మౌంట్ ప్లాంటేషన్లుకూడా దాని యజమానికి చాలా తక్కువ లాభాలను సంపాయించి పెడుతూన్నవి. (ఐతే వాషింగ్టన్ తన భూవసతిమీది ఆదాయానికి తోడుగా ఒకపిండిమరను స్థాపించీ, పోటోమాక్‌లో పట్టిన చేపల్ని పీపాలలోవేసి ఎగుమతిచేసీ మరికొంత సంపాదన చేయగలిగారు) పొగాకు ధరలు పడిపోవటం, పొగాకుపంట వల్ల భూమి నిస్సారమవటం జరిగినవి. ప్రభుత్వం విడుదల చేసే కరెన్సీనోట్లు చాలా అరుదుగా కంటికి కనిపించేవి. వర్జీనియా అమ్మేవస్తువుల విలువకన్న కొనే వస్తువుల విలువ అత్యధికంగా ఉండేది. తదనుగుణంగా ప్లాంటర్స్ (వీరిలో వాషింగ్టన్‌కూడా చేరుతారు) [illegible]టిష్ వ్యాపారులకు ఎంతో

ఋణపడి పోయారు. బ్రిటిష్ వ్యాపారులు సమయం చిక్కినప్పుడల్లా నిస్సహాయస్థితిలో ఉన్న యీ ప్లాంటర్స్‌ను మోసం చేస్తూనే ఉంటారనే ప్రతీతి ఉండేది. తన ఆదాయమంతా వ్యయపడిపోకుండా ఉండేందుకు వాషింగ్టన్ తన భూమిమీద గోధుమ పండించసాగారు. అంతకన్న కాస్త జాగ్రతపడే ప్లాంటర్ పశ్చిమదేశంవైపు దృష్టిసారించాడు; ఐతే బ్రిటిష్ వారి ఆజ్ఞాపత్రాలు యీ ప్లాంటర్ పశ్చిమానికి సాగకుండా అరికట్టినవి; పోతే వాల్‌పోల్ గ్రాంట్ ద్వారా లభ్యమైన హక్కులలో బ్రిటిష్ వ్యాపారులు, యీ ప్లాంటర్‌తో పోటీ చేయగలుగుతున్నాడు. ఓహియో కంపెనీ హక్కులను బ్రిటన్ గుర్తించలేదు ; ఆస్థానంలో పెన్సిల్వేనియావారి హక్కుల్ని గుర్తించింది.

ఐతే యీ చిత్రాన్ని మరీ ఘోరంగా చిత్రించరాదు. వర్జీనియా ఐశ్వర్యం విషయంలోని బాధ్యతలన్నీ మాతృదేశానివే కావు; తీవ్రమైన అభిప్రాయ భేదాలు బహిరంగపడినప్పటివరకూ మాతృదేశానికే అన్ని బాధ్యతలూ అనటం కూడా సబబుకాదు. మాతృదేశం భూమివిషయంలో పట్టిన పంథా కొంత ఆందోళనకరంగా ఉన్నప్పటికీ, అది వర్జీనియా లోని వ్యాపారాన్ని నొక్కి పారెయ్యలేదు; స్థిరపడిన నివాసాలు ఏర్పడిన తావులోని 12,000 ఎకరాలూగాక, వాషింగ్టన్ ఓహియో కనవ్‌హా లోయల్లోని మరో 24,000 ఎకరాల భూమిని తనొక్కడికే హక్కు ఉండేట్లు చేసుకున్నారు. బ్రాడాక్ పొందిన అపజయం కారణంగా బ్రిటిష్‌వారి మాన

మర్యాదలు తీవ్రంగా దెబ్బతిననూలేదు. వాషింగ్టన్, ఆయన వర్జీనియా సహచరులూ వారి వలసలో జరిగిన సంఘటనలమీదనే తమదృష్టిని కేంద్రీకరించినప్పటికీ, లూయిస్‌బర్గ్, క్విబెక్‌లలో బ్రిటిష్‌వారు చూపిన మహోన్నతమైన యుద్ధనైపుణ్యం సంగతి వారు ఏమరి ఉండలేరు. 1763 తరువాత మూడవజార్జి ప్రభువు తాలూకు ఒకానొక పౌరుడు, ప్రపంచంలోకల్లా బలవత్తరమైన జాతిలో సభ్యుడుగా ఉన్నాడనీ వారికి తెలుసు. వర్జీనియావాసి 'నాదేశం' అన్నాడంటే దాని అర్థం-బ్రిటన్, దానితాలూకు ఐదవ రాజ్యభాగమూ ఐన వర్జీనియా-యీ రెండూ కలిసిందేనని. పోతే వర్జీనియాప్లాంటర్స్ బ్రిటిష్ వ్యాపారులకు ఋణపడిపోయారంటే—మత్తుపదార్థాలూ, విలువైన వస్త్రాలూ, గృహోపకరణాలూ మొదలైనవి కొనటంవల్ల. నిజానికి లండన్ పరిసరాల్లో ఉన్న అనేకమంది ఆంగ్లేయులుకూడా యీ స్థితిలోనే ఉన్నారు.

కాని గర్వం ద్విముఖమైనది. విలియమ్ బైర్డు 1735లో ఇలా అన్నాడు: "మనప్రభుత్వం ఎంతో సుఖసౌఖ్యాలను ఉద్దేశించి ఏర్పడింది. మన గవర్నర్‌గారు మనను అణగద్రొక్కాలంటే ముందుగా మనకన్నా తెలివితేటల్ని ప్రదర్శించ వలసి ఉన్నది; మననుంచి డబ్బుగుంజాలంటే, తన యోగ్యత విషయంలో తగిన జాగ్రతవహించవలసి ఉన్నది." 30 సంవత్సరాల తరువాత బ్రిటన్ స్టాంప్ చట్టాన్ని అంగీకరిస్తే, ఆవిధంగా ఆదాయాన్ని పొందేందుకు బ్రిటన్‌కు అర్హత లేదన్నారు. స్వాతంత్ర్యాభిలాషులైన బ్రిటన్‌వాసుల

వలెనే వీరూ ఎదిరించారు. వీరి గొప్పతనమంతా వంశపారం పర్యతకూ, వారి పరిస్థితులకూ అనుగుణంగా రూపొందింది. కొంతమంది ఇతరులకన్న ధారాళంగా మాట్లాడగలరు. వర్జీనియాలో చాతుర్యంగల యువకుడు థామస్ జఫర్సన్, ప్రచండంగా మాట్లాడగల పాట్రిక్ హెన్రీ, సమయానికి అనుగుణంగా ప్రవర్తించగల జార్జ్ మాసన్ మొదలైనవారి మాటలు ప్రజలహృదయాలను దూసుకొని పోయినవి. ఐతే యీ వాదోపవాదాలు చిత్రంగా విస్తరించి, వలసలన్నిటినీ ఆక్రమించినవి.

ఆ యేడు వాషింగ్టన్ కానీ, ఇతర వలసదారుడు కానీ బ్రిటిష్ యూనియన్‌నుంచి విడిపోదామనే ఆలోచనలు చేయలేదు. కాని అమెరికన్ల వాదానికి మాతృదేశమైన బ్రిటన్‌లోకూడా బలంచేకూరింది. స్టాంప్ చట్టం రద్దుచేయబడింది. ఒక ఆంగ్లేయుడు మరొక ఆంగ్లేయునితో మాట్లాడే విధానంలోనే, వాషింగ్టన్ తన వ్యాపారులతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలలో "స్టాంప్‌చట్టం రద్దయేందుకు సహకరించిన ప్రతి బ్రిటన్‌కూ మేము కృతజ్ఞులం." అని రాశారు. ఏమైనా అదే ఉత్తరంలో యీ చట్టం రద్దు కానట్లయితే సంభవించే విషాద పరిస్థితులనుగూర్చి కూడా ఆయన ప్రస్తావించారు. ఇలాటి వాడి ధోరణే ఆతరువాత 3–4 సంవత్సరాలలో జరిగిన ఉత్తరాలలో కనిపిస్తుంది. స్టాంప్‌చట్టానికి తరువాత మాతృదేశం టౌన్సెహెండ్ చట్టాల రూపాన మరి కొన్ని పన్ను విధించింది. వాషింగ్టన్ తగినంతగా రెచ్చి

పోయి, 1769-1770 లలో వర్జీనియా వాసులమధ్య ప్రముఖపాత్ర వహించి, పన్నులు విధించబడిన సరుకుల్ని బ్రిటన్‌నుంచి దిగుమతి చేసుకోరాదని సమ్మతింపజేశారు. "రాజుగారికీ, పార్లమెంట్‌కూ చేసుకొన్న విన్నపాలు పెడ చెవిని పెట్టబడినవి." అన్నారాయన తన స్నేహితుడూ, ఇరుగుపొరుగూ జార్జ్ మాసన్‌తో. "మన హక్కులను వా రెంతవరకూ గుర్తించారో మనకు తెలియదు; వాటివిషయం లో వారిని మేల్కొనేట్లన్నా చేయాలి; లేదా వారి వ్యాపా రాన్నీ, ఉత్పత్తి దారులనూ పస్తులుండేట్లుచేయటంవల్ల ఏమైనా భయపడి పోతారేమో చూడవలసి ఉన్నది." ఆయన మాసన్‌కు బాధపడుతూ రాసిన దాంట్లో- "అత్య వసర పరిస్థితుల్లో, తుదిప్రయత్నంగా అమెరికన్లు ఆయు ధాలను ధరించి, గ్రేట్‌బ్రిటన్‌లోని ప్రభువుల కబంధ హస్తాల నుంచి తమ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను జయించుకునేందు కూడా సిద్ధపడిఉండాలి" అని అన్నారు.

ఈ పరీక్ష బహిరంగమైన దౌర్జన్యానికి దారితీస్తుందని కొద్దిమంది అనుకున్నారు. కాని మరొకసారి మాతృదేశం వొత్తిడికి లొంగిపోయింది. టౌన్స్‌హెండ్ సుంకాలన్నీ రద్దుచేయబడినవి - వలసదారులు దిగుమతిచేసుకొనే ఒక్క టీ మీదతప్ప. బహుశా యీ ఇబ్బంది తిరిగి పెద్దదవుతుం దేమో? వాషింగ్‌టన్‌లాటి ప్రాముఖ్యత ఉన్న వ్యక్తులంద రికీ వారి వారి వ్యాపారాలను చూసుకోవలసిఉన్నది. చెప్పిన వాదాలనే తిరిగి తిరిగి చెప్పబడటంవల్ల విలువలు దిగజారి పోయినవి.

ఐతే 1773 చివర రాజకీయ సంస్కరణల నాశించే కొందరు బోస్టన్‌లో, టీమీద సుంకం చెల్లించేందుకు నిరాకరించి, ఆ టీ కేసులను హార్బర్‌లోనే విసిరిపారేసి టీపార్టీ చేయటం జరిగింది. తరువాత జరిగే ప్రమాదాలను ఊహించటం జరిగిందో లేదో కాని, వీరుమాత్రం ఇండియన్‌లు – అంటే అమెరికాలోని ఆదిమనివాసులవలె వేషాలు వేసుకొన్నారు. వీరి చర్యలుకానీ, కావాలని వీరుచేసిన నాశనం కానీ వలసల్లో సర్వజనసమ్మతంగా పరిణమించలేదు. ఐతే మసాచుసెట్స్ రాష్ట్రం నాయకత్వం వహించిందనే భావం ఉండటంతో, అక్కడికిగాను చేయబడిన చట్టాల కారణంగా, ఇతర వలసలుకూడా ఆ రాష్ట్రాన్ని బలపరిచేందుకు సిద్ధపడినవి.

ఇక వర్జీనియాలో క్లిష్టపరిస్థితికి అవసరమైన సమిధలను పోగుచేయటంలో వాషింగ్టన్ ప్రముఖపాత్ర వహించారు. ఐతే ఆయన అతివాది కారు. 1774 లో ఆయన్ను గూర్చి ఇలా వర్ణించబడింది: "సిగ్గుపడే తత్వమున్న మనిషి; ప్రతి విషయాన్ని గూర్చి ప్రశాంతంగా ఆలోచించటం, ప్రార్థన సమయంలో మతగురువు మాట్లాడిన విధంగా మాట్లాడటం ఆయన తత్వం." అటు అగ్గయిపొయ్యే రాజకీయ సంస్కరణాభిలాషులు పాట్రిక్ హెన్రీ పక్షానికీ, అలజడిని భరించే కన్సర్వేటివ్‌లు ఎటార్నీ జనరల్ జాన్ రాన్‌డాల్ఫ్ పక్షానికీ మధ్యే మార్గాన్ని ఎన్నుకున్నారాయన. ఈ విధంగా ఆయన దిగుమతుల విషయంలో తన అభ్యంతరాన్ని చెప్పినా, ఎగు

మతుల విషయంలో వాటిని నిలిపివేద్దామనే ధోరణికి అభ్యంతరం చెప్పారు; ఎందుకంటే-వర్జీనియావాసులు ఎగుమతులు చేయనిదే వారి బ్రిటిష్ ఋణదాతల ఋణాలు తీర్చలేరు.

ఐతే ఒకసారి నిశ్చయించుకున్నాక, ఆయన తన దృక్పథాన్ని మరుగుపరచ దలచలేదు. ఆయన వాక్చాతుర్యం అంత గొప్పది గాకపోయినా, నాయకు లనబడే వారి వాదాలను గ్రహించి, జీర్ణించుకొని వాటిని తిరిగి చెప్ప గలిగారు. చాలాకాలంగా దిగువసభ సభ్యుడుగా ఉండటం వల్ల, ఆయన తన వర్జీనియా సహచరులతో బహిరంగమైన తిరుగుబాటువైపు ఒక్కొక్క-అడుగే ముందుకుసాగారు.

ఈ తిరుగుబాటుతాలూకు వాతావరణాన్ని చూసి కొంతమంది భయపడిపోయి జారుకున్నారు. ఇలాటివారిలో రాన్‌డాల్ఫ్ ఒక్కడే ఐశ్వర్యవంతుడైన వర్జీనియావాసి కాడు. ఐనప్పుడు తానెందుకు ముందువెనుకలు ఆలోచించ రాదనే విషయం వాషింగ్టన్‌కు ఎదురవనట్లు కనిపిస్తుంది. మరొక ఐశ్వర్యవంతుడైన వర్జీనియావాసివలె ఆయనకూడా, రాన్‌డాల్ఫ్‌వలెనే, ప్రభుత్వానికి విశ్వాసపాత్రుడుగా ఉంటూ ఆ వలసను ఎందుకు విడిచివెళ్లలేదు? వాషింగ్టన్ తండ్రీ, ఆయన ఇద్దరు సవితిసోదరులూ ఇంగ్లండులోనే విద్యాభ్యాసం చేశారు. ఆయన ఇరుగుపొరుగులూ, మిత్రులూ, బంధువులూ, ఫెయిర్‌ఫాక్స్‌లాటి శ్రేయోభిలాషుల మనోగతాభిప్రాయాలన్నీ ఆంగ్ల సంప్రదాయ సిద్ధంగానే ఉన్నవి. కల్నల్ విలియమ్ ఫెయిర్‌ఫాక్స్ (శాలీ భర్త) తమ్ముడు బ్రయన్

ఫెయిర్ ఫాక్స్ వాషింగ్టన్‌కు ఉత్తరం రాస్తూ, అందులో మాతృదేశాన్ని క్షమాభిక్ష వేడమని సూచించాడు. బ్రయన్ వాదంతో వాషింగ్టన్ ఎందుకు ఏకీభవించలేదు?

దీనికి జవాబు తెలుస్తూనేఉన్నది; కనీసం అది వాషింగ్టన్ మట్టుకయినా తెలిసిఉండొచ్చు. ఆయన తత్వమే ఆయన్ను ఎదిరించమని ప్రోత్సహించటం మాత్రమే కాదు. "మానవుల యుగళగీతాలు నాలో ఉన్నవి" అన్నాడాయన. మానవులంటే ఆయన అభిప్రాయం వర్జీనియా వాసులు అనే. ఆయన పుట్టుకతోనే వర్జీనియన్. పెరుగుదలలో, స్వభావసిద్ధతలో, ఆస్తిపాస్తుల్లోకూడా ఆయన ముమ్మూర్తులా వర్జీనియావాసే! ఆయన భూములన్నీ ఇక్కడే ఉన్నవి; ఆయన మాతృభూమి ఇది. ఆయన ముక్కుకు సూటిగా పొయ్యే తత్వంగలవాడు కనుక, తన సహచరులు కూడా తనవలెనే ఆలోచిస్తే, అంతకన్న తనకు కావలసింది లేదు; ఇదే ఆయనకు మరింత విశ్వాసాన్ని చేకూర్చే విషయం.

ఐతే యీ కథలో ఆశపుట్టించి తృప్తి కలిగించక బాధించే ఘట్టాలుకూడా ఉన్నవి. డిన్‌విడ్డీతోడి ఆయన సంబంధ బాంధవ్యాలు మధురంగా ఉంటే మాత్రమేమిటి? లేదా డ్యూక్వెస్నీకోట ముట్టడిసందర్భాన బ్రాడాక్ ఆ అడవిలో మరణించక, ఫ్రెంచ్‌వారిమీద విజయాన్ని సాధించి ఉన్నప్పటికీ, ఆ విజయోత్సాహంలో తన వర్జీనియా సహకారిని రాజమర్యాదలకు సిఫారస్‌చేసి ఉంటే మాత్రమేమి?

నిజానికి వాషింగ్‌టన్‌కు రాయల్ కమీషన్ పదవి లభ్యమై ఉంటేమాత్రమేమి? ఫ్రెంచ్‌వారితోటి యుద్ధం ఇంకా అనేక సంవత్సరాలు సాగింది. ఈ సుదీర్ఘకాలంలో ఆయన వర్జీనియాకు అవతల అనేకరంగాలలో యుద్ధం చేయవలసివచ్చేది. ఆ సందర్భంలో కొత్త సంబంధాలు ఏర్పడినా, పాతమిత్రుల మధ్యఉండే సంబంధాలు బలహీనమయ్యేవి.

ఐతే చరిత్రలోని బహు చిన్న ప్రమాదాలన్నీ కలిసి వేరువిధంగా పరిణమించినవి. 1774 ఆగష్టులో విలియమ్స్‌బర్గ్‌లో జరిగిన వర్జీనియా ప్రావిన్షియల్ కన్వెన్షన్‌లో కలోనెల్ వాషింగ్టన్ ఆఫ్ మౌంట్ వెర్నన్ మరింతగా జగడంలోకి లాగబడినారు. ఆయన 'స్వాభావసిద్ధమైన హక్కులు', 'చట్టమూ, కాన్‌స్టిట్యూషన్' మొదలైన విషయాలమీద మాట్లాడటాన్ని ఎంతో వినిఉండటంవల్ల, యీ ఎరువుతెచ్చుకున్న భాషను అత్యధికంగా ప్రయోగించారు. ఆ సంవత్సరం ఆఖరాలే కాలంలో, ఫిలడెల్ఫియాలో జరిగే 13 రాష్ట్రాలకూ సంబంధించిన మొట్టమొదటి కాంటినెంటల్ కాంగ్రెసుకు హాజరయ్యే ఏడుగురు వర్జీనియా ప్రతినిధుల్లోనూ ఒకరుగా వాషింగ్టన్ ఎన్నికయ్యారు.

థామస్ జఫర్‌సన్ ఆరోగ్యం బొత్తిగా బాగుండనందువల్ల ఆయన ఎన్నికవలేదు; పోతే జార్జ్ మాసన్ దిగువ సభ సభ్యుడుకాదు కనుక ఆయన్నూ ఎన్నుకోలేదు. ఐనప్పటికీ వాషింగ్టన్ ఎన్నిక అత్యధికమైన ఓట్లతో జరిగిఉండటంవల్ల, ఆయనిప్పుడు వర్జీనియాలో ఎంతో ప్రముఖ వ్యక్తి

య్యారు. రాజుగారితో ఏకీభవించక వలసదారులపట్ల సానుభూతిచూపే వ్యక్తిగా ఆయన పరిగణించబడ్డారు. రాజుగారిచే నియమించబడిన గవర్నర్‌తో కలిసి ఆయన భోజనం చేసినప్పటికీ, తన ఆశయాలను విడనాడరని అందరికీ తెలుసు. ఆయన ఆధిక్యత అనుకోకుండానే పెరిగినప్పటికీ, పొరబడిందని మాత్రం అనలేము. ఏడుగురు ప్రతినిధుల్లోనూ ఒకరైన పాట్రిక్ హెన్రీ గొప్ప విషయాలను చెప్పగలవారు. లోకజ్ఞానంతోనూ, మంచి మర్యాదలు తెలిసిన వ్యక్తి కావటంవల్లా వాషింగ్టన్ సరైనవిధంగా చేస్తారని తలచబడినారు.

ఇక ఫిలడెల్ఫియాలో పాట్రిక్ హెన్రీ అద్భుతంగా మాట్లాడటం జరిగింది. ఆయన హృదయాలు ద్రవించే కంఠస్వరంతో "నేను వర్జీనియన్‌ను కాదు; అమెరికన్‌ను" అన్నారు. ఇంతకుపూర్వం అలంకారార్థంగా ఉపయోగించబడే 'అమెరికన్' అనే పదాని కిప్పుడు నిజమైన అర్థం ఏర్పడింది. బ్రిటిష్ సైనికపటాలాలు బోస్టన్‌ను ఆక్రమించినవనీ, వారక్కడ తమ స్థానాన్ని బలపరుచుకుంటున్నారనే వార్త ఇక్కడికూడా చేరింది. అదొక అమానుషమైన చర్యగా అందరూ భావించారు. ఈ పరిస్థితిలోని ఇతర భాగాలమీద ఏకాభిప్రాయానికి రావటం కష్టమైంది. ఆగ్రహం రావటంవరకూ అంతా బాగానేఉన్నది. ఐతే అది ఏయే విశిష్టరూపాల్ని దాల్చాలి? జాన్ ఆడమ్స్ ఇంటిదగ్గరున్న తన భార్యకు వ్రాసిన ఉత్తరంలో "ఇక్కడొక యాభైమంది దాకా చేరారు. ఒకరి భాషతోనూ, భావాలతోనూ, దృక్ప

థాలతోనూ మరొకరికి పరిచయంలేదు. అందుకని ఒకరిని చూసి మరొకరికి ఈర్ష్య, భయం, సిగ్గు కలిగి బాధపడుతున్నారు'' అని రాశారు. ఇక్కడ చాలా గొప్ప ఉపన్యాసాలు జరిగినవి. అందరూ తమతమ ఉద్యోగాలకు అనుగుణంగా మాట్లాడారు. వాషింగ్టన్‌కు వీరితో కలవని తత్వం లేకపోయినా, ఆయన నిశ్శబ్దంగానే ఉండిపొయ్యారు. ప్రతివారూ మాట్లాడే అవకాశం కలిగిన ఇలాటి పరిస్థితుల్లో వాషింగ్టన్ మాట్లాడకుండటం ఒక సత్కార్యం.

ఇతరత్రా యీ పరిస్థితి నిష్ఫలమవనూలేదు. తమతమ అభ్యంతరాలను తెలియ పరిచేందుకుగాను శాంతియుత పద్ధతులు జరగాలనే విషయం అంగీకరించబడి, 1775 వసంతకాలంవరకూ కాంగ్రెస్ వాయిదా వేయబడింది. వాషింగ్టన్ తిరిగి వర్జీనియా ప్రతినిధిగా ఎన్నికయారు. 1775 మేనెలలో ఆయన రెండవ కాంటినెంటల్ కాంగ్రెసుకు వచ్చినపుడు యూనిఫారం ధరించారు. అక్కడి సభ్యుల్లో వారెవ్వరూ యూనిఫారం ధరించినవారు లేరు. మధ్యమార్గంలో ఆయన అనేక స్వచ్ఛంద సేవాదళాలను సమీక్షించారు. ఫిలడెల్ఫియాలో జేరిన ఇతర ప్రతినిధులుకూడా దారిలో ఇలాటి సంఘటనలనే గమనించామనీ, జనసామాన్యం ఉద్రిక్తంగా ఉన్నదనే వార్తలను చేరవేశారు. నిజానికి అన్నిచోట్లా వేడి అధికమౌతూనే ఉన్నది. లెక్సెన్‌టన్, కన్‌కార్డులలో మసాచుసెట్స్ మిలిటరీ వారికీ, బోస్టన్‌కోటనుంచి వచ్చిన బ్రిటిష్ రెగ్యులర్స్‌కూ మధ్య స్వల్పయుద్ధాలు

దీర్ఘకాలం జరగటం, ఇందులో బ్రిటిష్‌వారు గాయపడటం జరిగింది. మే నెలలో - వాషింగ్టన్ ఫిలడెల్ఫియాకు చేరిన వెంటనే కొంతమంది వలసదారులు జార్జ్ సరసుకు ఉత్తరపు కొనలో ఉన్న టికాండెరోగా కోటను పట్టుకున్నారు. ఈకోట కెనడాకుపోయ్యే రహదారిలో ఉన్నది. దాదాపు ఇదేసమయంలో వాషింగ్టన్ స్వరాష్ట్రమైన వర్జీనియాలో హానోవర్ జిల్లాలో పాట్రిక్ హెన్రీతాలూకు మనుషులు గవర్నర్‌గారి అధికారాలను బహిరంగంగా సవాల్ చేశారు.

ఈ అలజడి పరిణామాలేమిటో ఎవ్వరూ చెప్పలేకుండా ఉన్నారు. ఐతే వలసలన్నీ కలిసి ఏకమైనవి. కాంటినెంటల్ కాంగ్రెస్‌కు వచ్చిన ప్రతినిధుల్లో ధైర్యసాహసాలున్నవారు దౌర్జన్యాన్ని బలాతిశయాలతో ఎదుర్కొనేందుకు సిద్ధంగానే ఉన్నారు. వారికి కావలసింది సైన్యం; సైన్యానికి కావలసింది సేనాధిపతి. అమెరికన్ స్వాతంత్ర్యాన్ని రక్షించేనిమిత్తం ఖండమంతటా ఏర్పరచబడే సైన్యాలకు ఒక జనరల్ నియమించ బడేందుకు 1775 జూన్ 15 - వ తేదీన తీర్మానించ బడింది. ఆ ముందురోజున మసాచుసెట్స్ ప్రతినిధి జాన్ ఆడమ్స్ తన సహచరులతోనూ, నాయకుడుగా ఉన్న శామ్యుయల్ ఆడమ్స్‌తోనూ కలోనెల్ వాషింగ్టన్ పేరు సూచించారు. కాని వర్జీనియావాసి వాషింగ్టన్ ఈ హఠాత్పరిణామానికి ఆశ్చర్యచకితుడై,

గందరగోళపడి, ఆ సభనుంచి నిష్క్రమించారు. 15-వ తారీకున ఆయన సభకు హాజరవలేదు. మేరీలాండ్ ప్రతినిధిచే వాషింగ్టన్ పేరు సూచించబడిన తరువాత అందరూ ఏకగ్రీవంగా వాషింగ్టన్‌ను ఎన్నుకోవటం జరిగింది. ఈవిధంగా ఆయన గౌరవనీయుడైన వాషింగ్టన్‌గా రూపొందారు.

---

# 3. సర్వసేనాపతి వాషింగ్టన్

మనం తొందరపడినవాళ్లంకానట్లూ, నమ్మకం చాలని వాళ్లమూ కానట్లూ కనిపిద్దాం. అక్రమశౌర్యం ఒక లోపంగానే పరిణమిస్తుంది. ప్రజాప్రతినిధుల ఎదుట ఒప్పుకొన్న పిరికితనం దేశద్రోహంవలె ద్రోహం చేస్తుంది. కనుక ఆ రెంటినీ దిమ్మెరపొయ్యేట్లు చేద్దాం.

—ఎడిసన్ రచన కాటో-రెండవ అంకం మొదటిరంగంలోనిదాని భావం.

## అధికారము - క్లిష్టపరిస్థితి (1775 - 1776):

తరువాతి తరంవారు వాషింగ్టన్‌ను విధి సర్వసేనానాయకత్వానికే ఎన్నుకొన్నదని ఒప్పుకుంటారు. ఐతే ఫిలడెల్ఫియాలోని ప్రతినిధులు ఆయన్ను ఎందుకు ఎన్నిక చేశారు? సైనిక కారణాలనేవి కొంతవరకే అన్వయిస్తవి. ఐతే వలసల్లో నివసించే అనేకమంది వాషింగ్టన్ సర్వీసంత సర్వీస్ ఉండి, అంత తృప్తికరంగానూ తమ బాధ్యతల్ని నిర్వర్తించి ఉండేవారు. ఒకరిద్దరు – ముఖ్యంగా ఛార్లెస్‌లీ హొరేషియో గేట్స్ బ్రిటిష్ రెగ్యులర్స్‌గా పనిచేసినవారు, ఇప్పుడు అమెరికన్ హక్కుల విషయంలో అమెరికన్‌లను బలపరుస్తున్నవారు, సైనిక శిక్షణలో అత్యధికానుభవాన్ని కలిగి ఉన్నారు. పోతే మసాచుసెట్స్ రాష్ట్రవాసి ఆర్టిమాస్

వార్డ్ న్యూ ఇంగ్లండ్‌లోని సైన్యాలను బోస్టన్ పరిసరా లలో నడిపిస్తూనే ఉన్నాడు.

ఐనప్పటికీ వాషింగ్‌టన్ ఏకగ్రీవంగా ఎన్నుకోబడి నారు. ఆయన ప్రతినిధిగా వెళ్లి ఉండక పోతేనూ, అందరికీ తెలిసిఉండి, నమ్మకస్థుడనే పేరు సంపాయించి ఉండకపోతేనూ ఆయన వదిలివేయబడి ఉండేవారు. చర్చనీయాంశాలలో ఆయన ఎక్కువగా పాల్గొనకుండటంకూడా జరిగింది. ఐతే కమిటీలోనూ, ప్రైవేట్‌గా జరిగిన విందుల్లోనూ ఆయన అత్యంతాకర్షణీయంగా ఉండి తాను విశ్వాసపాత్రుడననీ, స్నేహపాత్రుడననే అభిప్రాయాన్ని కలిగించారు. ఫిలడెల్ఫియాలో జార్జ్ వాషింగ్‌టన్‌ను 1775 మేనెలలో కలుసుకున్న శామ్యుయల్ కుర్‌వెన్, గొప్ప రాజభక్తుడై ఉండీ, ఇంగ్లండ్‌కు మరలిపోయినప్పటికీ అక్కడ ఆయన యీ వర్జీనియా కలోనెల్ అందమైన వ్యక్తనీ, తేలిగ్గా నలుగుర్లోనూ కలుపుగోలుతనంతో ప్రవర్తించగల సమర్థులనీ అన్నాడు. కాంగ్రెస్ సభ్యులు యీ అభిప్రాయంతో ఏకీభవించారు. వీరిలో ఒకరు "వాషింగ్‌టన్ నవయువకుడల్లే కనిపిస్తూ, సైనికునివలె కులాసాగా ఉండగలవ్యక్తి" అని కూడా అన్నాడు. తన 43-వ ఏట ఆయన సరైన వయస్సులో తగినంత శక్తిసామర్థ్యాలతోనూ, విజ్ఞానంతోనూ విలసిల్లారు.

ఇదిగాక వాషింగ్‌టన్ ధనికుడు; వదంతిననుసరించి ఆయన మహాధనికుడై ఉండకపోవచ్చు. ముందుగానే న్యూయార్క్ సభ్యులు యీవిధంగా ఆదేశించ బడినారు:

"అమెరికాలోని జనరల్ మీద అదృష్టదేవతకూడా తన చిరునవ్వులను చిలకరించాలి; ఇందువల్ల ఆయన తన హోదాను తనంతతానే సంపాదించుకో గలుగుతాడు; అంతేకాని తనకులేని ఐశ్వర్యానికై చేయి జాచడు. తన దేశరక్షణ బాధ్యతతోపాటు స్వకీయమైన ఆస్తుల రక్షణకూడా ఉండటంవల్ల, దేశానికీ వ్యక్తికీ ఉన్న సంబంధం బలపడుతుంది. ఇంత ఉన్నతోద్యోగాన్ని ఆయన సక్రమంగా నిర్వర్తించటం, యీ హడావిడంతా పూర్తయాక ప్రజాభిప్రాయాన్ని అనుసరించి, అవసరమైతే ఉద్యోగ విరమణకూడా సంసిద్ధుడవటం జరగాలి."

ఇలాటి వర్ణనకు సరిపడే వ్యక్తి వాషింగ్టన్‌కన్న మరొకరు లేరు. ఆయన ఐశ్వర్యవంతుడనీ, ప్రత్యేకదృక్పథం వైపుమళ్ళే తత్వమున్నవాడనీ రుజువుచేసేఉన్నారు. ఏమైనప్పటికీ, అనేకమంది పురప్రముఖులవలెగాక, ఆయన తన వ్యక్తిత్వాన్నీ, తన ఆస్తిపాస్తులనూ పలసదారులపక్షాన ఉంచారు. ఆయన ధరించిన మిలిటరీ దుస్తులే ఈ సత్యాన్ని వెల్లడించినవి. ఆయన ప్రవర్తనా, ఆయన కీర్తి ప్రతిష్ఠలూ ఆయన దేదీప్యమానంగా వెలుగొందేందుకుగాను వేచిఉన్నవి. ఈ విధానానికి మొదటి మెట్టు తాలూకు చిహ్నాలు కనబడసాగినవి. 1775 ప్రాంతాలలో ఆక్రితంసంవత్సరం వాషింగ్టన్ ఒక వెయ్యిమంది వర్జీనియా సైనికులున్న పటాలాన్ని బోస్టన్‌కు నడిపిస్తాననీ, వారికయ్యే ఖర్చులన్నీ తానే భరిస్తాననీ అన్నట్లు ఒక వదంతి వ్యాపించింది. ఐతే యీ వదంతికి ఎలాటి ఆధారాలూ ఉన్నట్లు కనిపించదు. ఐతే జీవిత చరిత్రకారులు అనేకసందర్భాలలో దీనిని ఉపయోగించి సత్యమేనని నిరూపించే ప్రయత్నాలు చేశారు. పోతే ఫిలడెల్ఫియా

లోనివారు, గొప్పవారు తమకు సహాయసహకారాలను అందిస్తామనే విషయాలలో ఎన్నో రుజువులను సేకరించేందుకు ఆత్రుతను చూపసాగారు. కాంగ్రెస్‌లో శామ్ ఏడమ్స్ తదితరసభ్యులూ దేశభక్తులుగా ఉంటూ గొడవలు లేవదీయ గలిగిఉన్నారు; ఐతే యీ గొడవల్ని ఒక క్రమపద్ధతిలో జరిపించేందుకూ, విప్లవదారులకు నాయకత్వాన్ని వహించేందుకూ ఒక వ్యక్తి అవసరం ఉన్నది. ఈ విప్లవాన్ని నడపటమనేది యూరపియన్ పద్ధతుల్లో ఉండాలి. ఐతే ఆ నాయకుడు నిజమైన అమెరికన్ కూడా ఐ ఉండాలి.

ఇందులో మరొక ముఖ్యవిషయం ఉన్నది. ఇంత వరకూ యీ పోరాటం ఒక్క న్యూ ఇంగ్లండ్‌లోనే జరుగుతూన్నది. మిగతా వలసరాజ్యాలుకూడా పరిపూర్ణంగా యీ పోరాటంలో కలిసిపోవాలంటే, అప్పుడది ఖండానికంతకూ సంబంధించిన పోరాటంగా మారుతుంది. అందుకని ఇంత గొప్పసైన్యాన్ని న్యూ ఇంగ్లండునుంచిగాక వేరొక వలసనుంచి ఎన్నుకున్న సేనాపతిపరం చేయవలసిఉంటుందని జాన్ ఆడమ్స్, శామ్యుయల్ ఆడమ్స్ గ్రహించారు. మసాచుసెట్స్‌తో కలిసిన వర్జీనియా వలసరాజ్యాధికారంలో మిన్నగా ఉన్నది. కనుక వర్జీనియా వాసిగా జార్జ్ వాషింగ్టన్ ఇందుకు ఎంతో తగిఉన్నారు. ఇటీవలి అమెరికన్ చరిత్రను తిరగవేసినట్లయితే, అందుకు తగినయోగ్యతలున్నవాడు వాషింగ్టనే. పోతే ఆయన కింద పనిచేయవలసిన ఆఫీసర్లూ, మేజర్ జనరల్స్ రాజకీయకారణాలూ, తదితర కారణాలకు ప్రాధాన్యతనిస్తూ

నియోగించబడినారు. మసాచుసెట్స్‌ను శాంతపరిచేందుకు ఆర్టిమస్ వార్డ్; ఎంతో దేశాటనం చేసిన ఛార్లెస్ లీ తన మిలిటరీ అనుభవానికీ; ఫిలిప్ షుయ్ వెర్ (ధనికుడైన మరొక కాంగ్రెస్ సభ్యుడు; పరిస్థితులకు తగిన మిలిటరీ ఆఫీసర్) న్యూయార్క్‌ను తృప్తిపరిచేందుకూ; కనెక్టికట్ రాష్ట్రానికి జానపదనాయకుడుగా ఉంటూన్న ఇజ్రాయిల్ పుట్‌మన్; హోరేషియో గేట్స్ - బ్రిటిష్ పుటకయినా, వర్జీనియాలో పెరిగినవాడై ఉండటంవల్ల ఎడ్జుటెంట్ జనరల్‌గా నియమించ బడినాడు. వీరికింది ఉద్యోగాలకు పైన చెప్పుకున్న కారణా ల్లాటివాటితోనే ఎన్నిక చేయబడినారు.

వాషింగ్టన్ విషయంలో 'దరఖాస్తుదారుడు' అనే పదాన్ని ఉపయోగించటం అపార్థాన్నిస్తుంది. నిజానికి ఆయన తనంతటతాను ముందుకు రాలేదు. 'ఈ సైన్యానికి అధ్యక్షత వహించే సామర్థ్యం నాకున్నదని నేను అనుకోను' అనే విషయాన్ని ఆయన కాంగ్రెస్ ముందు నిస్సందేహంగా వెల్లడిచేశారు; అంతేగాక ఆయన పాట్రిక్ హెన్రీతో ఏకాంతంగా కళ్ళనీళ్లుపెట్టుకొని 'ఈ అమెరికన్ సైన్యాలకు అధ్యక్షత వహించిన నాటినుంచీ నా పతనం ఆరంభమై, నా కీర్తిప్రతిష్ఠలు దెబ్బతింటవి' అన్నట్లుకూడా ఒక కథ ఉన్నది. ఈ కథకు తగినన్ని ఆధారాలు దొరక్కపోవచ్చు; కాని వాషింగ్‌టన్ తన పేరుప్రతిష్ఠలు ఎక్కడ దెబ్బతింటవో ననేభయంతో ఉన్నారనేది నిస్సందేహం. అనేకఉత్తరాలలో తాను విమర్శనుగూర్చి పట్టించుకోనని ఆయన తన అభ్యం

తరాన్ని తెలియపరిచినా, నిజానికి ఆయన ఇలాటి కఠిన విమర్శలకు ఎన్నోసార్లు ఎదురునిలవగలిగినా ఆయన జీవితాంతంవరకూ, ప్రజాసంబంధమైన ఉన్నతోద్యోగంలో ఇలాటివి తప్పనిసరి అనేసత్యాన్ని ఎన్నడూ నేర్చుకోలేదు. ఆయన తన కోపాన్ని స్వాధీనంలో ఉంచుకున్నారు. తన సమకాలీనుల్లో చాలామందివలెగాక, ఆయన తన కీర్తిప్రతిష్ఠలను నిలబెట్టుకొనే ఉద్దేశ్యంతో ద్వంద్వయుద్ధానికి సిద్ధపడలేదు. తాను గర్విష్ఠని కాదుకాని, తన హుందాతనాన్ని నిలబెట్టుకొనేందుకు ఆయన ఎన్నో జాగ్రతలు వహించారు. పూర్వం బ్రాడాక్ ఆధ్వర్యంలో తాను ఒక స్వచ్ఛంద సేవకునివలె పనిచేసినవిధంగానే, ఈనాడుకూడా ఆయన జీతం బత్తెం లేకుండానూ, ఒక విశిష్టస్థానంకూడా లేకుండానూ పనిచేసేందుకు తన సంసిద్ధతను కనబరిచారు. దీన్ని తెలియజెప్పేందుకు ఆయన కాంగ్రెస్ ఎదుట తనకు జీతమేమీ అవసరంలేదని చాటించి, తన విశాలత్వాన్ని ప్రకటించారు. సర్వసైన్యాధ్యక్షుడికి ఖర్చులకుగాను నెలకు 500 డాలర్లు ఇచ్చేందుకు కాంగ్రెస్ నిర్ణయించింది. ఈ ఖర్చులనుమాత్రమే తాను అంగీకరిస్తానని వాషింగ్టన్ అన్నారు.

తనపై బడిన యీ గురుతరబాధ్యతలతో ఆయన విభ్రాంతుడైనట్లయితే, దాన్ని నిర్వహించటంద్వారా లభ్యమయే కీర్తిప్రతిష్ఠలతో సంతృప్తివిషయాన్ని గూర్చి ఆలోచించకున్నట్లయితే అది అమానుషత్వమే ఐఉండేది. పూర్వపు సైనికజీవితంలో ఆయన ఎదుర్కొన్న నిరాశలు

ప్రజ్వరిల్లేందుకు ఆయన అవకాశమివ్వలేదు. ఐతే ఆయన పూర్వపు విచారం ఎలాటిదైనప్పటికీ అదంతా ఒక్క దెబ్బతో తుడిచివేయబడింది. చాలాకాలంక్రితం ఆయన శాలీఫెయిర్‌ఫాక్స్‌కు ఉత్తరం రాస్తూ, అందులో – ఎడిసన్ విరచితమైన 'కాటో'లో ఆమె 'మార్షియా'గా ఉంటే, తాను 'జూబా'గా ఉండాలని వాంఛిస్తూన్నట్లు తెలియబరిచాడు. మార్షియా కాటో కుమార్తె; జూబా ఒక యువరాజు; కాటోను బలపరిచేవారిలో ఒకడు. ఐతే యీ రంగస్థలనాటకం పూడ్చిపెట్టబడిన గతంలో ఉండిపోయింది. శాలీ ఫెయిర్‌ఫాక్స్ 1773 లోనే తన భర్తతో కలిసి ఇంగ్లండ్ వెళ్లిపోయింది. ఆమె తిరిగి ఎన్నటికీ అమెరికా రాదు. ఇదే నాటకం 1778 మేనెలలో వాషింగ్టన్ ముఖ్యస్థావరమైన వాలీఫోర్జ్‌లో ప్రదర్శించబడినప్పుడు, ఆయన ఊహలు తాను పూర్వం లేఖలో వెలిబుచ్చిన అభిప్రాయాలకు అనుగుణంగా రూపొందకపొయ్యేందుకు అవకాశమున్నప్పటికీ, ఆయన దృష్టిలో యువకుడైన 'జూబా' పరిపూర్ణమైన రోమన్‌గా ఉండి, అందరిచేతా ఆమోదించబడిన నాయకుడుగా తోచిఉండాలి. 1775 జూలై 3–వ తేదీన ఆయన దేశభక్తులైన సైనికులకు సర్వసేనానిగా ఉండటం ఆయన జీవితంలో [illegible]యాణించిన దూరానికి ఒక జ్ఞాపకం ఐంది. నెసెసిటీ [illegible] తాను ఫ్రెంచ్‌వారికి లొంగిపోయి ఇప్పటికి స[illegible] లైంది. ఆ ఘనకుడైన సైనికోద్[illegible] సైన్యంవల్ల ఉచ్చులో చిక్కుకున[illegible]

పరిపూర్ణతను పొందిన వ్యక్తిగా మారి, ముట్టడివేయటం తన వంతుగా ఉండగా, దాదాపు 15,000 మంది సైనికులకు నాయకుడయ్యారు. ఇక బోస్టన్‌లో ఇందులో సగానికి తక్కువమంది బ్రిటిష్ సైనికులు మాత్రమే ఉన్నారు. వీరు కూడా ఒకపక్షంక్రితం బ్రీడ్స్‌హిల్‌లో సాధించిన విజయంలో 1,000 మంది సైనికుల్ని కోల్పోయ్యారు. వీరి సేనాపతి జనరల్ గాజ్ 20 సంవత్సరాలక్రితం బ్రాడాక్ సైన్యానికి ముందుగా వెళ్ళే రక్షణదళాన్ని నడిపించాడు. ఇందులో అప్పుడు వాషింగ్‌టన్ జూనియర్ ఎయిడ్-డీ-కాంప్‌గా పనిచేశారు.

ఐతే యీ సమయంలో ఇలాటి విషయాలు చాలా అల్పమైనవి. అందునా అనేకమంది జనులకు సంబంధించిన సమస్యలముందు ఇవొక లెక్కలోకే రావు. తాను ఎంతో ప్రేమించే మార్తానుంచీ, వర్జీనియా ఎస్టేట్స్‌నుంచీ ఆయన బలవంతంగా లాగివేయబడినారు. ఇక సైన్యాలను నడపటంలో ఉండవలసిన బాధలు ఉండనే ఉన్నవి. చాలామంది న్యూ ఇంగ్లండ్ వాసులకు వాషింగ్‌టన్‌మీద అనుమానమున్నది. అదేవిధంగా వీరిలో చాలామందిమీద వాషింగ్‌టన్‌కుకూడా అనుమానమున్నదనే విషయం ఆయన లేఖల్లో [illegible] పుతూన్నవి. ఒక క్రమమూ, సకాలంలో వే[illegible] సుశిక్షణా లోపించినవని ఆయన [illegible] త్తంమీద దీని ఫలితం ఆయన [illegible] ాయితీగా లేకుండటం అనేవాటిని—

గుడారాలూ, దుప్పట్లూ, యూనిఫారాలూ, మందులూ, ఆహారం, మందుగుండుసామానూ, తుపాకిమందూ మొదలైన వాటి సరఫరాల్లో చూసినట్లయింది. కొంత సిబ్బంది అంటూ కానీ, ఫిరంగులూ మొదలైనవి కానీ లేవు. కాంగ్రెస్ వారు తగిన ఏర్పాట్లు చేస్తేనే కాని, సైనికులకు జీతాలిచ్చే మార్గమూ లేదు. కాంగ్రెస్ వారు ఖండానికి సంబంధించిన సైన్యాన్ని సమకూర్చాలని దృఢనిశ్చయులయ్యారు. వారు కోరినవిధంగా కోరినంత సైన్యాన్ని ప్రతిరాష్ట్రమూ సరఫరా చేస్తుందా? ఈ ప్రశ్నకు ప్రత్యేకించి జవాబు చెప్పాలంటే అది 'ఔను' అనటంకన్న 'కాదు' అనేందుకే ఎక్కువ అవకాశమున్నది. యుద్ధకాలమంతటా యీ ప్రశ్నకు జవాబు అదేవిధంగా ఉండిపోయింది.

ఐతే సమకూర్చబడిన సైన్యాలతో చేయవలసిందేమిటి? అటు కాంగ్రెస్ కానీ, ఇటు వాషింగ్టన్ కానీ దూరాలోచన ఉన్న పథకాలను అభివృద్ధి చేయలేకపోయారు. నెససిటీ కోటదగ్గిర ఎదుటిపక్షసైన్యాలు యుద్ధంలో పాల్గొనలేదు. బోస్టన్‌లో జనరల్ గాజ్ ఆధ్వర్యంలో ఉన్న బ్రిటిష్ సైన్యాలు 'మినిస్టీరియల్ ట్రూప్స్' గా కొంతమంది అమెరికన్‌లచే మాట్లాడబడుతూ, ఇప్పటికీ పలసలు జార్జి రాజుకు విశ్వాసపాత్రంగానే ఉంటూ, వారు కేవలం రాజుగారికింద ఉండే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అనుభవించే పౌరులుగా ఉండేందుకే నిలబడివున్నారని భావించబడుతోంది. 1775 తుదిమాసాలలో బహు కొద్దిమందిమాత్రమే సంపూర్ణ

స్వేచ్ఛను పొందాలనే విషయానికి సుముఖులుగా ఉన్నారు. బహుజనులు మాతృదేశ రక్షణకింద, తమకు కొంత స్వేచ్ఛ ఉండాలన్నారు. ఇలాటిదాని విశిష్టరూపమేమిటో ఊహించటం కష్టం. ఈలోగా ధైర్యసాహసాలను ప్రదర్శించే రంగం అవసరం. ఐతే అందుకు చేయగలిగిందేమిటి? కాంగ్రెస్ కెనడియన్ రాష్ట్రాలనుంచి గట్టి ప్రయత్నాలను ఆశించింది. వాషింగ్టన్ మరొక అడుగు ముందుకువేసి, కలొనెల్ బెనెడిక్ట్ ఆర్నాల్డ్ ఆధ్వర్యాన క్విబెక్‌ను పట్టుకొని యీ విషయాన్ని తేల్చేందుకు కొంతమందిని పంపారు. ఇంత ధైర్యంతోనూ ఆయన బోస్టన్ మీద ముట్టడికి ఒకసారికన్న ఎక్కువగా ప్రయత్నాలుకూడా చేశారు. కాని ఆర్నాల్డ్ వెళ్లినపని ఒక గొప్ప అపజయంగా పరిణమించటంవల్ల, వాషింగ్‌టన్ ముఖ్యస్థావరం దగ్గరి సమరసలహా సంఘం వారు వాషింగ్‌టన్ చెప్పే ముట్టడివిషయంలో తమ అంగీకారాన్ని ఇవ్వలేకపోయ్యారు.

వాషింగ్టన్ తనకింది ఉద్యోగుల మాటలను ఎంతో లక్ష్యపెడుతూండేవారని చెప్పబడింది. ఐతే ఆయన ముందు వెనుకలు ఆలోచించటానికి కారణం – 'మనకున్న కొద్దిపాటి విజ్ఞానం, ముఖ్యంగా యీ సైనికుల విషయంలో, చాలదేమో?' అనేదే. చివరకు ఛార్లెస్ లీ అనర్గళంగా మాట్లాడగలిగి ఉండికూడా, పెద్ద సైనికపటాలాలను ఏర్పరచటంలో అనుభవపు ప్రత్యేకమైన అనుభవాన్ని కలిగిఉండలేదు. పోతే వాషింగ్టన్ తాలూకు రణానుభవం సరిహద్దుప్రాంతాలను

మించిపోనిది; అందునా అది చాలా చిన్నఎత్తున జరిగింది. ఆశ్వికదళాలను నడిపేపద్ధతిలో ఆయనకు అత్యుత్తమానుభవం కానీ, ఫిరంగులన్నిటినీ ఒకచోట చేర్చి యుద్ధభూమిని ఆక్రమించేందుకు ప్రయత్నించటం కానీ, చివరకు పెద్ద సైన్యాన్ని ఒకే యూనిట్‌గా నడిపించటంలో చాకచక్యం కానీ లేవు. ఒకో సందర్భంలో తన నిశ్చయాలనే తాను నమ్మలేకుండా ఉండేవారు. చాలాభాగం ఎన్నడూ తెరవని గ్రంథంగానే ఆయనకు తోచేది. ఇదిగాక సమర సలహాదారుల కూటమిలో, అన్ని సైన్యాలకూ సంబంధించిన విషయాలనే, మిగతా సైనికాధికారులవలెనే నడిపించేవారు. ఇవిగాక వయస్సులోనూ, అనుభవంలోనూ తనకన్న పెద్దవారుగా చలామణీ అయేవారితో చాకచక్యంతో ప్రవర్తించవలసి ఉన్నది. మొదట్లో వారందరూ వాషింగ్టన్‌ను తమపై అధికారిగా నియమించటాన్ని గూర్చి ఎంతో కష్టపడి ఉండటమే ఇందుకు కారణం. ముఖ్యంగా ఆర్టిమస్ వార్డ్‌తో యీ పేచీ ఉండనే ఉన్నది. ఆయన వాషింగ్టన్‌కన్న ఐదేళ్లు పెద్ద. ఫ్రెంచ్‌వారితో జరిగిన యుద్ధాలలో ఆయన కూడా కలోనెల్‌గా పనిచేసి బోస్టన్‌లోని గాజ్ సేనానికి తాను సమానుడనే నని ఇంతవరకూ తలుస్తూవచ్చాడు. ఇక ఇజ్రాయిల్ పుట్‌నమ్ విషయం – ఆయన వాషింగ్టన్‌కన్న 14 ఏళ్లు పెద్ద. బంకర్‌హిల్ యుద్ధంలో శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠల్ని ఆర్జించటమే గాక, అత్యద్భుతమైన సాహసిక జీవితాన్ని గడిపిఉన్నాడు. ఇలాటి హేమాహేమీలతో కొత్తగా, మరొక వలసనుంచి వచ్చిన వాషింగ్టన్ ఎంతో

జాగ్రత్తగా మసలుకోవలసి ఉన్నది. ఆయన బానిసలకు యజమాని కావటంతో న్యూ ఇంగ్లండ్ హృదయాన్ని రెట్టింపు సందేహంతో చూడవలసి వచ్చింది. కనెక్టికట్, లేదా న్యూ హాంప్‌షైర్, లేదా మసాచుసెట్స్ రాష్ట్రాల నుంచి వచ్చినవారు దక్షిణాది నవాబుల ఆజ్ఞలకు లోబడాలనే వాంఛ లేనివారు. ఇతర వ్యవహారాలలోకూడా వాషింగ్టన్ తన జనరల్స్‌తో చేసే ఆలోచనలు ఇలాటి స్థితిలోనే ఉన్నవి. ఒకో సందర్భంలో ఆయన అత్యధికమైన జాగ్రతలు తీసుకున్నందుకు విమర్శించబడినప్పటికీ, నిజానికి ఆయన తన యవ్వనదశలో చూపిన ఉద్విగ్నతవైపు ఎక్కువగా మొగ్గటం జరిగింది. స్తబ్ధుగా ఉండటమనేదాన్ని వాషింగ్టన్ ఏవగించుకునేవారు. తన ఇష్టానికి విరుద్ధంగానే ఆయన 1775-1776 సం॥ చలికాలంవరకూ వేచిఉండవలసి వచ్చింది.

1776 వసంతకాలంనాటికి యీ చిక్కుప్రశ్న లన్నిటిలోకీ ఒక్కటి సుస్పష్టమైన రూపాన్ని ధరించింది. అదే అమెరికన్ స్వాతంత్ర్యం. ఈ స్వాతంత్ర్య వాంఛ అంచెలంచెలుగా వర్ధిల్లింది. ముఖ్యంగా మూడవ జార్జ్ రాజు (ఆయన మంత్రులైన లార్డ్ నార్త్, లార్డ్ జార్జ్ జర్మెయిన్, ది ఎరల్ ఆఫ్ సాండ్‌విచ్, తదితరులు కూడా) యీ తిరుగుబాటును అణచివేయాలనే దృఢనిశ్చయాన్ని ప్రదర్శించటంతో స్వాతంత్ర్య పిపాస ప్రజల్లో అత్యధికమైంది. "అంత్య స్థితిలో ఆయుధాలే నిర్ణయిస్తవి. ఈ విన్నపం రాజుగారిది. కనుకనే యీ ఖండం యీ సవాలును ఎదుర్కొనేందుకు తన

సంసిద్ధతను చూపుతున్నది" అని తన కరపత్రం ('కామన్ సెన్స్') లో టామ్ పైనీ వెల్లడిచేశారు. దీన్ని అనేక వలస దారులు - వాషింగ్టన్‌తోసహా - అంగీకరించారు. కొద్ది సంవత్సరాల క్రితమైతే పైనీ చెప్పిన మాటలు రాజద్రోహం, దేశద్రోహాలను వెల్లడిచేసి ఉండేవి. 1776 వ సం। తొలిమాసాలలో మూడవజార్జ్ ప్రభువు చేసిన ప్రకటనల్లో ఆయన ఉత్తముడైన ప్రభువుకాదనీ, 'గ్రేట్ బ్రిటన్‌లోని అమానుషుడైన రాజ వంశీకు' డనీ వెల్లడి ఐంది. అంతకు క్రితం ప్రజల్లోఉండే దురభిప్రాయాలూ, ముఖ్యంగా రాజభక్తి గలవారి తాలూకు అభిప్రాయాలను పైనీ తనమాటలతో తుడిచిపారేశాడు. ఉదాహరణకు ఆయ నిలా అన్నాడు :

"న్యాయబద్ధంగా, హక్కులకు సంబంధించిన ప్రతిదీ విడిపోవటాన్ని ఆశిస్తుంది. చనిపోయినవారి రక్తమూ, ప్రకృతిఘోషాకూడ 'విడిపోయ్యే సమయమైంది' అని చాటుతవి. చివరకు భగవానుడూ అమెరికా, ఇంగ్లండుల మధ్య ఏర్పరిచిన దూరమే ఒక గొప్ప తార్కాణంగా ఉంటూ, ఒకరి అధికారానికి మరొకరు లోబడి ఉండటం భగవదిచ్ఛ కాదని రుజువు చేస్తున్నది—"

ఆ తరువాతి సంఘటనలు పైనీ ప్రాభవాన్ని మరింత పెంపొందింప జేసినవి. అమెరికన్‌లు క్విబెక్‌లో ఓడిపోవటం, కెనడానుంచి తమసేనలను నిష్క్రమింప జేయటాన్ని జనరల్ క్లిన్టన్ ఛార్లెస్టన్ మీాద చేసిన నౌకా యుద్ధంలోని ఓటమి పూరించింది. అన్నిటికన్నా ఆనందదాయకమైన వార్త - 1776 మార్చినెలలో బోస్టన్ బ్రిటిష్‌వారినుంచి

స్వాధీనపరుచుకోబడటం. ఫిరంగుల సరఫరా జరిగేవరకూ వాషింగ్టన్ చేయవలసిందీ, చేయగలిగిందీ అక్కడ ఏమీ లేదు. సమర్థుడూ, శక్తిసంపన్నుడూ ఐన ఒకానొక బోస్టన్ పుస్తకవిక్రేత జనరల్ హెన్రీ నాక్స్ అనే ఆయన చలి కాలంలో నానాఅవస్థలూ పడి, ఎంతో శ్రమతో కూడుకున్న ప్రయాణాన్ని పూర్తిచేసి 43 ఫిరంగులూ, 16 తుపాకిమందు నూరే కల్వాలతో వచ్చాడు. వీటిని- టికాన్ డెరోగా కోట నుంచి కొద్దిమాసాల క్రితం స్వాధీనమైనవాటిని-ఆయన భూమి మీద లాగించుకొని వచ్చాడు. ఎంతో వేగంగా పనిచేస్తూ, రాత్రిపూట వాషింగ్టన్ మనుషులు, డోర్ఛస్టర్ ఎత్తుల మీద వీటిని స్థాపించారు. ఇక్కణ్ణుంచి బోస్టన్ వారి గురికి ఎదురుగా ఉండటమూ, వారికేమో గొప్ప రక్షణ ఉండ టమూ జరిగింది. ఈ సమయంలో బ్రిటిష్ సర్వసేనాని గాజ్ స్థానంలో జనరల్ విలియమ్ హోవే ఉన్నాడు. ఆయన ఎత్తు ప్రదేశంమీదున్న వాషింగ్టన్ సైన్యాలను ఎదుర్కోవా లని పథకంవేశాడు. కాని, వర్షం కురుస్తూండటంవల్ల తమ చేతుల్లోవున్న మస్కెట్లు పేలవనే ఊహా, బంకర్ హిల్ దగ్గిర యుద్ధాన్ని దాపునుంచి చూసిఉండిన అనుభవమూ ఆయన్ను నిరుత్సాహపరిచినవి. అమెరికన్ల విజయంవల్ల బోస్టన్, మరి సురక్షితస్థానం కానేరదు. తనకన్న తెలివిగా శత్రుపక్షంవారు ప్రవర్తించటాన్ని గమనించి, కేవలం అప జయాన్ని ఎదుర్కొన్నవాడు కాకపోయినప్పటికీ, హోవే 1,000 మంది రాజభక్తులతోనూ, తన సైన్యంతోనూ ఓడ ఎక్కుతూ, తాను నాశనంచేయగల స్టోర్స్ నన్నిటినీ నాశనం

చేసి, కొద్దిరోజులపాటు హార్బర్‌లోనే తారట్లాడి, తూర్పు దిశకు పలాయనం చిత్తగించాడు. వాషింగ్‌టన్‌ను ఆశ్చర్య పరిచింది హోవే హాలిఫాక్స్, నోవాస్కోషియాల వైపు ప్రయాణం చేయటం. ఈ సందర్భంలో వాషింగ్‌టన్ కాంగ్రెస్ అధ్యక్షుడైన జాన్ హాంకాక్‌కు ఇలా రాశారు:

"అయ్యా! గత ఆదివారం - అంటే 17-వ తారీకు ఉదయం 9 గంటలకు రాజుగారి సైన్యాలు బోస్టన్ నగరాన్ని విడిచి వెళ్లటం, యునైటెడ్ వలసల సైన్యాలు ఆ పట్టణాన్ని ఆక్రమించుకోవటం జరిగిందని తమకు తెలియ పరిచేందుకు ఎంతో ఆనందిస్తున్నాను. తమనూ, గౌరవనీయమైన కాంగ్రెస్‌నూ యీ శుభసమయంలో అభినంది స్తున్నాను. విశేషించి బోస్టన్‌లో మిగిలిపోయిన అభాగ్యులకు ప్రాణ నష్టం, ఆస్తినష్టం కలగకుండానే విజయ లక్ష్మి మనను వరించింది. మరి నాకు సెలవు—"

దీనికి కాంగ్రెస్‌వారు కృతజ్ఞతను తెలుపుతూ ఒక పతకాన్ని బహూకరించారు. వాషింగ్‌టన్ గూర్చి ఖండ మంతటా శ్లాఘించబడింది.

ఎండాకాలం మధ్యభాగానికల్లా పదమూడు వలస ల్లోనూ దాదాపు బ్రిటిష్ రెగ్యులర్ సైన్యాలు లేవు; ఒకే ఒక సైనికదళం సర్ గై కారెల్‌టన్ ఆధ్వర్యాన కెనడానుంచి ఉత్తరన్యూయార్క్‌కు తోసుకొనివస్తోంది. కాంగ్రెస్ వారి హృదయం సంతోషంతో నిండిఉన్నది. ఫ్రెంచ్‌వారు తాటస్థ్యంగా ఉంటూన్నప్పటికీ, తమ పాత విరోధులైన బ్రిటిష్‌వారిని దెబ్బ తీసే పథకాలు వేస్తున్నారనీ, అందుకు

గాను వలసదారులకు ఆయుధాలనూ, మందుగుండు సామ్రగ్రీనీ రహస్యంగా సరఫరా చేస్తున్నారనే విషయం కాంగ్రెస్ వారికి తెలిసిఉంటే, వారింకా సంతోషపడి ఉండేవారు. ఏమైనా రాజభక్తిని ప్రదర్శించేవారు కొన్నిప్రాంతాలలో-ముఖ్యంగా దక్షిణభాగాన-తమ ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నారు. చాలామంది అమెరికన్‌లు టోరీలుగా లేకపోయినా ఆధోరణిని కనబరుస్తూ ఆ పాతపాట - 'బ్రిటిష్ వారితో సఖ్యత' అనేదాన్ని మననం చేస్తూనే ఉన్నారు. కనుక నిజమైన దేశభక్తుణ్ణి ప్రోత్సహించటం, అనుమానాస్పదంగా ప్రవర్తించేవారిమీద వొత్తిడిచేయటం అవసరమైంది. 1776 మే నెలకల్లా వాషింగ్టన్ తాను ఎక్కడనిలబడాలో నిశ్చయించుకున్నాడు. కాంగ్రెస్ సభ్యుల్లో అత్యధికులుకూడా వాషింగ్టన్ ధోరణినే బలపరిచారు. ఇకముందు మంచిమర్యాదల ప్రస్తావనే ఉండరాదు. రాజుగారి సైన్యం దేశవినాశకరం ; మూడవజార్జిరాజు ముఖ్యమైన దుష్టుడు - విరోధి. జార్జిరాజు కొన్ని జర్మన్ సైన్యాలను బాడుగకు తీసుకొని,వాటన్నిటికీ హెస్సియన్స్ అనేపేరుపెట్టి, ప్రతి రెండవ సంగ్రామంలోనూ వారిని ఉపయోగించినట్లుగా, ఆనాడు కాస్త ఆలోచించగలిగిన ప్రతి అమెరికన్‌కూ తెలుసు. పోతే మహామేధావులైన థామస్ జఫర్సన్‌లాటివారు ఇలాటి అనేక దుష్టచర్యలను ఎత్తిచూపగలిగారు. ఆయా సంఘటనలనుగూర్చి చదివినవారికీ - అందాకా దేనికి, జఫర్సన్ కొంత సహాయంతో రూపొందించిన స్వాతంత్ర్య పత్రంలోని

వివిధాంశాలను గమనించినవారికీ ఆయన మేధస్సు తేలిగ్గా అర్థమవగలదు.

1776 జూలై 4-వ తేదీన ఆయన పనుల్ని కాంగ్రెస్ వారు ఆమోదించారు (ఒక్క న్యూయార్క్ సభ్యులు మాత్రం తటస్థంగా ఉండిపోయారు). ఆనాటినుంచీ, అమెరికన్ నాయకులు వెనుదిరగటమనేది ఎరుగరు. వారి గమ్యస్థానం సంపూర్ణ స్వాతంత్ర్యసాధన. ఇందులో వారు అపజయం పొందారో, సర్వనాశనమవటమేగాక - బహుశా ఉరిశిక్షకు పాత్రులయ్యేవారు కూడాను. ఇంతకుపూర్వం పైనీమాటలతో మూర్ఛపోతూంటే, ఇప్పుడు జఫర్సన్ ప్రతిభతో ప్రజలు ఉప్పొంగి పోతూన్నారు. చివరకు గద్యభాగాన్ని మాత్రమే మాట్లాడగల వాషింగ్టన్ లాటివారుకూడా, తమ స్వాతంత్ర్య పోరాటాన్ని గూర్చి అద్భుతంగా మాట్లాడగలిగారు. అనేకసార్లు వాషింగ్టన్ వ్రాతల్లో 'గొప్ప ఆశయం', 'న్యాయమైన హక్కు', 'మనస్ఫూర్తిగా నేను గాఢంగావిశ్వసించింది', 'విధి తప్పక అనుకూలించవలసింది.' మొదలైన పదాలను ప్రయోగించారు.

ఐనప్పటికీ 5 మాసాల అనంతరం ఆయన భాషాపరిజ్ఞత మార్పుజెందింది. ఆయన ఉద్యోగాన్నయితే కోల్పోలేదు కాని, మిగతా అమెరికన్లవలెనే ఆశలను దాదాపు వొదులుకొన్నారు. ఆయన సైన్యాలు విడిపొయ్యేందుకు సిద్ధంగా ఉన్నవి. ఆయన బాధనూ, ప్రమాదాలనూ ఎదుర్కోవలసి వచ్చింది. ఆయన డిసెంబర్ 10-వ తేదీన తన జ్ఞాతిఐన లుండ్

వాషింగ్టన్‌కు రాసినఉత్తరంలో "మేమిప్పుడు ఆధారపడి ఉండవలసింది కొత్తసైన్యాన్ని సమకూర్చుకోవటంలో మాత్రమే. ఇందులోఅపజయం ప్రాప్తించిందో, ఆటకట్టిందన్న మాటే!" ఈ 'ఆటకట్టింది' అనేపదాన్ని ఆయన ఇతర ఉత్తర ప్రత్యుత్తరాలలోకూడా ఉపయోగించారు. ఇదేవిధంగా 'కష్టాలను ఎన్నుకోవటం' అనేమాటలున్నా. తన సోదరుడైన జాన్‌ఆగస్టీన్‌తో డిసెంబర్ 18-వ తేదీన వాషింగ్టన్ ఇలా అన్నారు: "నేనెంత కలవరమైన పరిస్థితుల్లో ఉన్నానో నీవు నిజంగా ఊహించలేవు. ఏమానవుడూ ఇన్నికష్టాలను కావాలని ఎన్నుకోవటంకానీ, వీటినుంచి బైటపడేందుకు బహుకొద్ది మార్గాలే అందుబాటులో ఉండటంకానీ జరగలేదు."

జూలై, డిసెంబర్ నెలల మధ్య ఏంజరిగిందో సరళంగా చెప్పబడింది. బోస్టన్‌లో హోవే తెలివిగా తొలగించబడినాడు. ఐతే అప్పటికే హోవే బోస్టన్‌ను వొదిలేసి, కేంద్రంగా ఉండదగ్గ మరో ప్రధాన స్థావరాన్ని-రణక్రమణికకు అనుకూలంగా ఉన్నదాన్ని ఎన్నుకోవాలనే తీవ్రాలోచనల్లో ఉన్నాడు. ఆయనకు తగినంత బలమున్నట్లయితే, ఆయన బోస్టన్‌నుంచి సరాసరి న్యూయార్కు, లేదా ఫిలడెల్ఫియాలమీద దండయాత్ర సాగించి ఉండేవాడు. కాని జరిగిందేమంటే, ఆయన చల్లగా హాలీఫాక్స్‌కు వెళ్లి అక్కడ మరికొన్ని సైన్యాల రాకకొరకై వేచిఉన్నాడు. త్వరలోనే యీా సైన్యాలు పంపబడుతవనే వాగ్దానం చేయబడింది.

వీటిల్లో మొదటి నౌకాపటాలం జూలై 12 వ తేదీన, ఆయన పెద్దన్నగారైన ఎడ్మిరల్ లార్డ్ హోవే అధ్వర్యాన న్యూయార్క్ చేరింది. జనరల్ హోవే స్టాటన్ ఐలెండ్ తీరాలకు అదేరోజున - అంటే జూలై 2-వ తేదీన - కాంగ్రెస్ స్వాతంత్ర్యాన్ని సాధించేందుకు సభ్యుల అంగీకారాన్ని పొందినరోజునే చేరాడు. ఆతరువాత కొద్దివారాలలోనూ బ్రిటీష్, జర్మన్ రాజభక్తుల సైన్యాలు (ఛార్లెస్టన్ నుంచి తిరిగి వచ్చిన క్లింటన్ సైన్యాలుకూడా ఇందులో ఉన్నవి) ఓడ తరువాత ఓడగా స్టాటన్ ఐలెండ్ కు చేరినవి. ఈవిధంగా ఆగష్టు నెల మధ్యకాలంనాటికి హోవేకు 30,000 మంది సైనికులు మంచిదుస్తులతోనూ ఆయుధాలతోనూ లభ్యమైనారు.

ఇలాటి పథకం ఉండివుంటుందని వాషింగ్టన్ ముందుగానే ఆలోచించి, ఏప్రిల్ నుంచీ న్యూయార్క్ లోనే ఉన్నారు. మే 31 న ఆయన జాన్ ఆగస్టీన్ తో " ఈ ఎండాకాలం న్యూయార్క్ లో రక్తపాతంతో మిళితమై ఉంటుందని నా అంచనా" అని అన్నారు. ఐతే సైనికులున్న ఓడలు ఒకదాని తరువాత మరొకటి హోవేకు సరఫరా చేయబడుతూంటే, వాషింగ్టన్ వాటిని అడ్డగించలేకపోయ్యారు. ఇలాటిది జరిగే తీరుతుందనే నమ్మకం బలవత్తరమైనట్లు తోస్తుంది. నౌకాయుద్ధంలో అమెరికన్ లు ఆరితేరినవారైనప్పటికీ, వీరి బలం బ్రిటిష్ వారి బలంతో పోలుస్తే ఒక లెక్కలోకి రాదు. బ్రిటిష్ వారు తమ ఆధిక్యతను సముద్రం

మీదనే గాక, భూమిమీదకూడా నిశ్చయంగా చూపగలిగే ట్లున్నారు. వాషింగ్టన్ ఆధ్వర్యంలో ఉన్న సైన్యాల కన్న బ్రిటిష్‌వారి సైన్యాలు కొన్ని వేలు అధికసంఖ్యలో ఉన్నవి. వాషింగ్టన్ సైన్యాలలో కొంతభాగం తాత్కాలిక సైనికులుగా చేరిన పటాలాలు కావటంతో, ఆయన వీరిమీద ఎక్కువ ఆధారపడలేదు. మిగతావారు ఖండం లోని వివిధ ప్రాంతాలనుంచి వచ్చి, డిసెంబర్ ఆఖరువరకూ ఉండమని ఆదేశించబడినవారు. ఇలాటి పరిస్థితుల్లో న్యూయార్క్‌ను విడిచివెళ్లటమే మంచిది. శత్రువులకు న్యూయార్క్ వశమయే పక్షంలో, ఆపట్టణాన్ని కాల్చివేయటం, అక్కడి వార్ఫ్‌లను నాశనంచేయటం, చివరకు శత్రువుకు ఆయా అవశేషాలనూ, కాలి బొగ్గయిన వాటినీ వొదిలెయ్యటం జరగవలసిఉన్నది. ఐతే ఇలాటిపని అంత తేలిగ్గా చేసేందుకు వీల్లేదు. ఎందుకంటే, కాంగ్రెస్ ఎట్టి పరిస్థితుల్లోనైనాసరే దాడి ఎదుర్కొని, పట్టణాన్ని కాపాడమని వాషింగ్టన్‌ను ఆదేశించింది. కనుక తనకు తగినన్ని అవకాశాలు లేకపోయినా, నౌకాబలం అత్యధికంగాఉన్న వైపునే విజయలక్ష్మివరిస్తుందని తెలిసినప్పటికీ, ఆయన దాడిని ఎదుర్కొనేందుకు సిద్ధపడవలసి వచ్చింది.

ఏది ఏమైనప్పటికీ, ఆనాడు వాషింగ్టన్ ఇచ్చిన ఆజ్ఞల్ని అనుసరించి తీర్పు చెప్పవలసివస్తే, విజయాన్ని సాధిస్తాననే విశ్వాసం ఆయనకు ఉన్నదని అర్థమాతుంది. గత సంవత్సరంనుంచీ ఆయన దాదాపు యుద్ధమే చేయ

లేదు. డోర్ ఛస్టర్ కొండమీదినుంచి ఆయన సంపాయించిన రణవిజయం కేవలం అలంకరణకు ఉపయోగపడేదిమాత్రమే. కనుక ఇప్పు డాయన నిజమైన యుద్ధంలో పాల్గొనాలని ఉవ్విళ్లూరుతూన్నారు. బహుశా విజయం తనకే లభిస్తుందనే గాఢవిశ్వాసంకూడా ఆయనకు ఉండిఉండాలి. కారణం ఏదై నప్పటికీ మెప్పుకోళ్లు అందుకునేటంతగా ఆయన పనిచేయ లేదు. ఆగస్టు నెలాఖరులో హోవే తన సైనికుల్లో హేమా హేమీలైన 20,000 మందిని తీసుకొని, లాంగ్ ఐలెండ్ మీద దిగటం మొదటిదెబ్బ. హోవే ఉత్తరానికి కదిలి ఈస్ట్ నదిదాటి మన్ హట్టన్‌ను దాటేందుకు పథకం వేశా రనేది సుస్పష్టం. ఐతే యీ దారిని బ్రూక్ లిన్ కొండలమీద ఉన్న బలవత్తరమైన అమెరికన్ సేనలు అడ్డుతూన్నవి; కాని 8,000 మంది అమెరికన్ సైనికుల్లోనూ అధికభాగం లాంగ్ ఐలెండ్ లో జనరల్ పుట్‌నమ్ ఆధ్వర్యాన ఎత్తుప్రదే శాన ఉంచబడినవి. పొరపాటున అమెరికన్‌లసేనల ఎడమ పార్శ్వం తగినంత రక్షణలేకుండా ఉంచబడటాన్ని హోవే కనిపెట్టాడు. కనుక రెండుబాడుల్లో అమెరికన్ సేనలను కుడి మధ్యపార్శ్వాలను ఎదుర్కొనేందుకు పంపి, హోవే స్వయంగా బ్రిటిష్‌ప్రధాన దళాలతో అమెరికన్ సేనల ఎడమ పార్శ్వాన్ని చుట్టుముట్టాడు. ఆయన తాలూకు రెండు దళాలూ కొంత ఘోరమైన యుద్ధానంతరం కొంత విజ యాన్ని పొందినవి. ఇక హోవే అమెరికన్ పార్శ్వాలను చుట్టబెట్టి. 2,000 మందిని గాయపరిచి (వీరిలో సగంమందిని– న్యూ హాంప్‌షైర్ వాసి మేజర్ జనరల్ జాన్ సుల్లివాన్‌తో

సహా – ఖైదీలుగా తీసుకున్నాడు), ఈస్ట్ నదీతీరానికి తరిమి, శత్రువులు తన దయాదాక్షిణ్యాలమీద ఆశలు పెట్టుకోవలసిన పరిస్థితిని కల్పించాడు. అమెరికన్ సేనల్లో ఏర్పడిన యీ లోపంతాలూకు అపకీర్తిని వాషింగ్టన్ కొంతవరకూ భరించవలసివచ్చింది. మొట్టమొదటి అవకాశం చిక్కినప్పుడే బ్రూక్‌లిన్ దగ్గిర మిగతా సేనలను నిష్క్రమింపజేయటానికి మారుగా వారికి తోడుగా మరికొన్ని సేనలను పంపటంతో వాషింగ్టన్ మరొక పొరపాటు చేశారు.

అదృష్టవశాత్తూ జనరల్ హోవే యీ దాడిని మరి ముందుకు నడిపించలేదు. ఇదే మంచిసమయమని వాషింగ్టన్ చీకట్లో తన సేనల్ని బ్రూక్‌లిన్ కొండలమీదినుంచి తరలించారు. తుపానుగా ఉండటంవల్ల ఎడ్మిరల్ హోవే నౌకలు సముద్రంలో కదిలేందుకు వీల్లేకపోయింది. ఇప్పుడు వాషింగ్‌టన్ సేనలు మన్‌హట్టన్ మీద ఉన్నవి. ఐతే ఇదికూడా ప్రస్తుతం ప్రమాదకరమైన తావే! కొంతసేపు తటపటాయించి, వాషింగ్టన్ చివరకు న్యూయార్క్ పట్టణంనుంచి నిష్క్రమిద్దామనే నిశ్చయించారు. సెప్టెంబర్ మధ్యలో ఆయన సేనలు – చెల్లాచెదరైనవి – మన్‌హట్టన్ నది పైభాగాన హార్‌లెమ్ పర్వతాలమీద బారులుగా పయనించసాగినవి. ఇదే సమయంలో హోవే న్యూయార్క్‌ను ఆక్రమించటంకూడా జరిగింది. అదంతా ఒక పిల్లి ఎలుకా చెలగాటంగా ఉన్నది. హోవే పిల్లి పాత్ర వహించాడు. ప్రతిసారీ యీ పిల్లి కదిలినప్పుడల్లా, ఎలుక మూలుగుతూ

దూరదూరానికి పారిపోసాగింది. మన్‌హట్టన్ నుంచి ఉత్తర దిశలోని వైట్‌ప్లెయిన్స్‌కూ, ఆ తరువాత నార్త్ కాజిల్‌కూ పారిపోయింది. ఆతరువాత జరిగిన సంఘటనల్లో వాషింగ్టన్ తన సైనికబలంలో కొంతభాగాన్ని ఛార్లెస్ లీతో వొదిలిపెట్టి, న్యూ జర్సీకి కదిలివెళ్లారు. మన్‌హట్టన్ ఉత్తరదిశలోని వాషింగ్టన్ కోటను కాపాడే నిమిత్తం ఉంచిన 2,000 మంది దేశభక్తుల్ని బ్రిటిష్‌వారు బందీలుగా తీసుకోవటాన్ని వాషింగ్టన్ చూస్తూ నిస్సహాయస్థితిలో ఉండిపోవలసివచ్చింది. నవంబర్ మధ్యకాలానికి వాషింగ్టన్‌కు మార్గాంతరం లేకపోవటంతో – హోవే తాలూకు ఫీల్డ్ కమాండర్ అయిన లార్డ్ కారన్‌వాలిస్ వెంటతరుమగా, ఆయన న్యూ జర్సీగుండా దక్షిణానికి పారిపోసాగారు. ఇప్పటికీ ఛార్లెస్ లీతో వొదలిన సైన్యంనుంచి ఆయన విడివడే ఉన్నారు. ఈ పరిస్థితుల్లో కాస్త ఆశాజనకంగా ఉన్న సంఘటన ఇది: షుయ్‌లిర్, హోరేషియో గేట్స్, బెనెడిక్ట్ ఆర్నాల్డ్‌ల ఆధ్వర్యంలో ఉన్న అమెరికన్ సేనలు కలిసికట్టుగా ఉంటూ, ఛాంప్లెయిన్ హడ్సన్ దారులగుండా కారెల్‌టన్ న్యూయార్క్‌లో ప్రవేశించకుండా అటకాయించ గలగటం. ఇక మిగతాచోట్ల కుంగిపోవలసిన పరిస్థితులే ఏర్పడి ఉన్నవి. ఛార్లెస్ లీ నానాఅవస్థాపడి ఎలాగో తన సైన్యాన్ని న్యూజర్సీకి తరలించుకొని రావటం, ఉత్తర దిశలో అప్పటిదగ్గిరున్న 1,200 మంది సైనికులకొరకై వాషింగ్టన్ పిలుపుచేయటం జరిగినవి. అలాకానిపక్షంలో, డిసెంబర్‌తొలి దినాల్లో యీ 'ఆటకట్టటం' జరిగిఉండేది.

వాషింగ్టన్ డిలావేర్ నదిని దాటి తిరిగి వచ్చారు. వాషింగ్టన్ ముందుగానే ఆలోచించి నదీతీరాల్లో ఎక్కడా పడవలు లేకుండా చేసినకారణంగా, బ్రిటిష్ వారు మూకఉమ్మడిగా ఫిలడెల్ఫియామీద విరుచుకొని పడటం తప్పించబడింది. మధ్యభాగంలో ఉన్న ప్రజావిశ్వాసం అధమస్థితిలో ఉన్నది. చివరకు ఇజ్రాయిల్ పుట్నమ్, థామస్ మిఫ్లిన్ జనరల్స సలహాలను అనుసరించి, కాంగ్రెస్ వారు ఫిలడెల్ఫియానుంచి బాల్టిమోర్ కు తరలినా ప్రజావిశ్వాసం పెంపొందలేదు. ఛార్లెస్ లీ అజాగ్రత్త కారణంగా బ్రిటిష్ కాపలా దారులకు బందీగా చిక్కాడు. సైనికులు అధికసంఖ్యాకులుగా సైన్యం నుంచి నిష్క్రమించటం, ఖండమంతటినుంచీ సరఫరా చేయబడిన సైనికులు ఉండవలసినకాలం దగ్గిర పడటంకూడా జరిగినవి.

ఏమైనప్పటికీ యీ క్లిష్టతమ పరిస్థితి ఎలాగో తప్పించబడింది. చలికాలంలో హోవే యీ పెద్దఎత్తున జరిగే దాడులను నిలిపివేసి, క్లిన్టన్ ఆధ్వర్యాన 6,000 మంది సైనికుల్ని న్యూపోర్ట్, రోడ్ ఐలెండ్ లను ఆక్రమించేందుకు పంపాడు. మరికొన్ని బహూకరణలను ఆశపెట్టటంద్వారా తిరిగి సైనికులను సేకరించటం జరిగింది. ఫిలడెల్ఫియానుంచి 2,000 మంది సైనికులు పంపబడినారు.

వీటన్నిటినీమించి వాషింగ్టన్ సమయస్ఫూర్తితో క్రిస్మస్ నాటిరాత్రి ట్రెన్టాన్ లో ఒక తిరుగుబాటు జరిపారు. ఆయన తన పథకంప్రకారం మూడు ముఠాలుగా

తన సైనికుల్ని సగం గడ్డకట్టిన డిలావేర్ నదిని దాటించి, ఆవలివొడ్డునఉన్న బ్రిటిష్ స్థావరాలను ఆశ్చర్యచకితుల్ని చేయటం. 1754 లో ఆయన జూమన్ విల్లీ కాంప్‌మీాద చేసిన పోరాటానికి ఇప్పటిది ఒక జ్ఞాపకార్థంగాకూడా ఉంటుంది. ఈ పథకమంతా ఎంతో జాగ్రత్తగా వేయబడింది. ఈ మూడు ముఠాల్లోనూ రెండు నదిని దాటలేకపోయినా, మూడోముఠా-ముఖ్యమైనది-వాషింగ్టన్ ఆధ్వర్యాన నదిని దాటింది. ట్రెన్‌టన్ స్థావరంలో ఉన్న 1,500 మంది హెస్సియన్స్ కొద్దిపోరాటానంతరం ఓడించబడినారు. 500 మంది శత్రుసైనికులు ఎలాగో తప్పించుకొని పారి పోయ్యారు. క్రిస్‌మస్ పండగ సందర్భంలో అనేకమంది తెగతాగిఉన్న సమయంలో యీ దాడి జరగటంవల్ల, వీరు చేసినపని నీచమైనదని అనటంలో సందేహమేమీా లేదు. ఐనప్పటికీ ఈ సంఘటన వాషింగ్టన్ ధైర్యసాహసాలకు ఒక తార్కాణం కాదు. అంతేగాక మరోవారం తరువాత ఆయన తీసిన దెబ్బకూడా ఆయన ధైర్యాన్ని నిరూపించేందుకు పనికిరాదు. ఆయన తిరిగి డిలావేర్ నదిని దాటి, కారన్ వాలీస్‌ను ఎదుర్కోవలసి రావటంతో, మెదలకుండా తిరోగమించి, ప్రిన్స్‌టన్ దగ్గిర జరిగిన చిన్న పోరాటంలో గెలుపొంది బైటపడినారు.

దేశభక్తుల విశ్వాసాన్ని పెంపొందించేందుకు కానీ, లేదా వాషింగ్‌టన్ కీర్తిప్రతిష్ఠల్ని ఉన్నతస్థాయికి తీసుకొని వెళ్లేందుకుకానీ యీ సంఘటనల తాలూకు ప్రాముఖ్యతను

ఉత్ప్రేక్షించటం కష్టతరమే అవుతుంది. 1777 జనవరి 17-వ తేదీన నిఖొలాస్ క్రెస్‌వెల్ వర్జీనియాలోని లీజ్‌బర్గ్‌దగ్గర ఉన్నాడు. అక్కడి పరిచయస్థునితో మాట్లాడిన పిదప క్రెస్‌వెల్ తన పత్రికలో ఇలా రాశారు :

"ఆరు వారాల క్రితం యీ పెద్ద మనిషి అమెరికన్‌ల కష్టదశను గూర్చి విచారిస్తూ, తమకందరికీ ప్రేమాస్పదుడుగా ఉన్నతను జనరల్ విషయంలో సానుభూతి చూపుతూన్నాడు; ఆ జనరల్‌కు సైనిక పద్ధతుల్లో తగినంత చాకచక్యమూ, అనుభవమూ లేని కారణాన, యీ సంఘటనలు అమెరికన్‌ల సర్వనాశనానికి దారితీస్తున్నవని ఆయన అభిప్రాయపడినారు. అంతాపోవటం, అంతా పోగొట్టుకోవటం జరిగింది. ఐతే హఠాత్తుగా ఇప్పుడు తక్కడ తలకిందులై, వాషింగ్టన్ పేరు మేఘాలమీద పరుగెత్తుతున్నది......ఈవెధవ హెస్సియన్‌లే దీనికంతకూ కారణం...వీరిని ఇక్కడికి పంపాలని మొదట ఆలోచించిన మూర్ఖుల్ని శపించాలి—"

ప్రిన్స్‌టన్‌దాడి తరువాత వాషింగ్టన్ తన మోరిస్ టౌన్ ప్రధాన కార్యాలయంలో చలికాలమంతా మిన్నకున్నారు. హోవే డిలావేర్ నదీతీరాల్లో ఉన్న స్థావరాలను రద్దుచేసి, తన సైనికులందర్నీ న్యూ బ్రన్స్‌విక్ పరిసరాల్లో సమీకరించుకున్నాడు. ఉభయపక్షాలవారికీ తమతమ నిలవలను సరిజూచుకునే కాలమిది. మనంకూడా ఇదే పనిచేద్దాం; ముందు అమెరికన్‌ల స్థానాన్ని గూర్చి తెలుసుకుందాం.

సమస్యలూ - అవకాశాలూ:

వాషింగ్‌టన్ జీవితచరిత్రల్ని వ్రాసిన తొలి చరిత్ర కారులందరూ ఆయన యుద్ధనైపుణ్యాన్నీ, జనరల్‌గా ఆయన గొప్పతనాన్నీ గూర్చి, ఆయన యోగ్యతల ప్రస్తావనే లేకుండా, ఎంతగానో శ్లాఘించారు. నిజానికి ఆయన న్యూయార్క్ చుట్టుపట్ల చేసిన దాడుల్లో చాలా పొరపాట్లు చేశారు. ఆ తరువాతికాలంలో యుద్ధాన్నిగూర్చిన ప్రస్తావనలో ఒకానొక బ్రిటిష్‌వాద మిది: "జనరల్ హోవే గాక ప్రపంచంలోని ఏ ఇతర జనరల్ ఐనా సరే, వాషింగ్టన్‌ను తుక్కు-తుక్కుగా కొట్టిఉండేవాడు. అదేవిధంగా వాషింగ్టన్ గాక ప్రపంచంలోని మరి ఏ ఇతర జనరల్ ఐనా సరే, జనరల్ హోవేను తుక్కు-తుక్కుగా కొట్టిఉండే వాడు!" ఈ పోలికలు సరసమైనవి కావు; చాలా చౌకబారు హాస్యంతో కూడినవి. వాషింగ్టన్ వహించిన బాధ్యత గురుతమమైనది. ఆయన తటపటాయించటమూ, చేసిన బహు. చిన్న పొరపాట్లుకూడా ఆయన కింది ఉద్యోగుల అనుభవ శూన్యత కారణంగా గోరంతలు కొండంతలైనవి. సుస్పష్టంగా లేని ఆజ్ఞల్నికూడా హోవే కింది అధికారులు అర్థం చేసుకోగలగటం, అనుమానాస్పదంగా ఉన్న క్షణాల్లో వారే స్వతంత్రించి నిర్ణయాలను అమలుజరపటం చేస్తే - అనుభవశూన్యులైన వాషింగ్టన్ కింద పనిచేసే అధికారులు యీ రెండురేఖల మధ్య ఉన్నదాన్ని అవగాహన చేసుకో లేకపొయ్యారు.

1776 లో తనకు అందుబాటులో ఉండే సైన్యంతో బ్రిటిష్ వారిమీద విజయాన్ని సాధించే అవకాశాలు వాషింగ్టన్ కు ఎంతమాత్రమూ లేవు. ఐనప్పటికీ ఆయన చేయరాని పొరపాటు చేయనే చేశారు. బ్రూక్లిన్ కొండలమీద పొందిన అపజయానికి తోడుగా ఆయన మరికొంత సైన్యాన్ని పంపారు. ఇలాటి విషయాలలో వాషింగ్టన్ రెండవ ఆలోచన చేయగల విలాసాన్ని చురుకుదనమున్న ప్రతిపక్షీయుడెవరూ అమలు జరపనీడు. ఆ తరువాత ఆయన వేసిన ఎత్తులూ, కదలికలూ భయాందోళనల్ని కలిగించేవి కాకపోయినా, నిర్ణయాలు లేనివీ, గజిబిజిగా ఉన్నవీను. వాషింగ్టన్ కోట విరోధులకు స్వాధీనం కావటం, అందులోని సైనికపటాలాలూ, విలువైన శతఘ్నులూ, ఆహార పదార్థాలూ శత్రువశమవటం – కనీసం ఇవన్నా వాషింగ్టన్ లోపాలనే చెప్పవలసి ఉంటుంది.

ఇదంతా ఇలా ఉంచి, ఆయన తన పొరపాట్లను ఒప్పుకొని తలబిరుసుతనాన్నికూడా ప్రదర్శించారు. ఒప్పుకూ, స్వాభిమానానికీ మధ్య ఉండే శాఖ బహు ఇరుకైనది. వాషింగ్టన్ వర్జీనియా కలోనెల్ గా ఉన్ననాటికీ, యీనాటికీ ఎంతో పరిపూర్ణతను చూపగలిగినప్పటికీ, ఆ రెంటి విషయంలోనూ గాబరా పడసాగారు. విమర్శకు గురైనప్పుడల్లా ఆయ నెంతో బాధపడేవారు. లేదా బాధపడవలసి ఉంటుందని విశ్వసించారు. ఐతే 1776 లోనూ, ఆ తరువాత 1777 లోనూ ఆయన వ్రాసిన ఉత్తరాలలో నిష్పాక్షిక

విమర్శలకు తానెప్పుడూ అభ్యంతరం చెప్పనని అనేకసార్లు ఉదాహరించారు. ఐనప్పటికీ 'కోరుకున్న కష్టాలు' విషయం ఆయనకూ, ఆయన ఆప్తులకూ తెలిసినట్లుగా, ఆయా విమర్శలకు ఎలా తెలుస్తుంది? కేవలం తన కీర్తిప్రతిష్ఠల్ని దృష్టిలో ఉంచుకొని, తన బాధ్యతలను ఇతరులమీదికి నెట్టేందుకు ఆయన సర్వసంసిద్ధుడుగా ఉన్నారు. వాషింగ్టన్ కోట శత్రువుల స్వాధీనమైన సందర్భంగా తనకెంతో విశ్వాస పాత్రుడుగా ఉన్న జనరల్ నథేనియల్ గ్రీనీ విషయమై ఆయన న్యాయమైన రిపోర్ట్ ఇవ్వలేదు. ఐతే ఆ తరువాతి సంఘటనల్లో గ్రీనీ, నాక్స్, తదితర విశ్వసనీయులైన ఆఫీసర్ల విషయంలో ఆయన విశాలత్వాన్ని చూపారు. ఆయన తన కోపతాపాలనూ, దుఃఖాన్నీ గూర్చి కాంగ్రెస్ ఎదుట విపరీతంగా నొక్కిచెప్పే ధోరణిని కనబరిచారు.

మిలిటరీ విషయాల్లో వాషింగ్‌టన్ నేర్చుకోవలసింది ఇంకా చాలా ఉన్నది. తత్వరూపంగా ఆయన పరిపూర్ణతకు ఏదో తక్కువస్థితిలోనే ఉన్నారు. ఐతే ఆయన నేర్చుకొనే సామర్థ్యతను కలిగివున్నారు. దీన్ని సరితూచుతూ ఆయన తత్వం యీ కర్మకాండకు తగినవిధంగా తూగింది. మొదట్లో ఆయనవేసిన గంతుల్నిబట్టి ఆయన విజయాలకు మూల కారణాలైన వాటిని మనం తెలుసుకోవచ్చు. ఎందుకంటే ఆయన యోధుడు. ఆయన చేసిన పొరపాట్లు పిరికితనంవల్ల కావు,- అలా ఐతే అది పెద్దదిబ్బ తీసివుండేది - కేవలం కలహేచ్ఛవల్లనే! అమెరికన్‌ల లోపాలన్నీ తనమీదనే

తెలివిగా పడే అవసరాన్ని కలిగించటంవల్ల, ఆతలపే ఆయన కెంతో ఏవగింపు కలుగజేసింది. ఇందువల్లనే ఆయన పెద్ద ఎత్తున దాడి జరపలేకపోయ్యారు. ఐతే ఆయన క్రమంగా తనకు తానుగా సత్యాన్ని తెలుసుకున్నారు. కనుకనే 1776 సెప్టెంబర్‌లో ఆయన కాంగ్రెస్‌కు పంపిన నివేదికలో - "ఈ యుద్ధంలో మనం స్వరక్షణ చేసుకోవటమే పనిగా పెట్టుకోవాలి" అని రాశారు. కనుక, ఇకముందు ఆయన పనులు సుముఖంగా లేవు. అంతేకాదు, అపకీర్తికి దారితీసేవిగా కూడా రూపొందినవి. ఐతే ఏదో విధంగా తానూ, తనతో పాటు సైన్యమూ బతికిఉండాలి. చివరకు శత్రువులకు యీ పోరాటం విసుగెత్తాలి. అదృష్టవశాత్తూ ఆయన కలహేచ్ఛ గలవాడే గాక, పట్టుదలగలవాడు కూడాను. వర్జీనియా భూములమీాది తన హక్కులను పదిహేను సంవత్సరాలుగా వదులుకోలేనివాడు ఇప్పుడింత పెద్ద ఆస్తి పణంగా ఉండగా దీన్ని వదులుకోగలడా? ఆయన హఠాత్తుగా ట్రెన్‌టన్ మీాద చేసిన తిరుగుబాటు అర్థమిదే! ఇంతకన్న పెద్దదెబ్బ తీయాలని ఆయన ఆశించారు. కాని, ప్రిన్‌స్టన్‌లో ఆయన చేసిన ప్రయత్నం దాదాపు ప్రమాదానికి కారణభూతమైంది. ఐతే ఆయన కారన్‌వాలీస్ సైన్యాలనుంచి తప్పించుకొని తెలివిగా పారిపోయి రావటం వాషింగ్టన్ గొరిల్లాయుద్ధంలో జనరల్ స్థానాన్ని గ్రహించటానికి ఆరంభించారనే విషయాన్ని స్పష్టీకరిస్తుంది. కాంప్ వేసిన సూచనలు చేసేందుకు ఆయన కొలుములు పెట్టి, చలిమంటలు వేయించి - కారన్‌వాలీస్ ఆనందంతో మర్నాడు ఉదయమే యీ వృద్ధ జంబు

కొన్ని వలలో వేసుకుంటానని చంక లెగరేస్తూ ఉండగా – రాత్రికిరాత్రే ఆ నెగళ్లను అక్కడే వొదిలి వాషింగ్టన్ సైన్యంతో సహా బైటపడ్డారు.

కొన్ని సందర్భాలలో ఆయన కాంగ్రెస్‌లో ఫిర్యాదులు చేశారని లోగడ తెలుసుకున్నాం. ఇవి అకారణమైనవి. కావు కాంగ్రెస్ అవలంబించిన పద్ధతులు అసందర్భంగానూ, చాలీచాలకుండానూ, మూర్ఖంగాకూడా ఉన్నవి. కొంతమంది కాంగ్రెస్ సభ్యులు సామాన్యులు. యుద్ధం సాగుతూంటే వీరి యోగ్యతలుకూడా దిగజారసాగినవి. దేశభక్తులైన సైనికులూ, ఖండం నలుమూలలనుంచీ వచ్చిన సైనికులూగాక, కాంగ్రెస్‌వారు శాశ్వతంగా ఉండే సైన్యాన్ని సరఫరాచేయవలసిఉన్నది. ఐతే వాషింగ్టన్ తలచినదానికన్న అధికంగానే కాంగ్రెస్‌కు కష్టాలున్నవి. ఈ యుద్ధం అధికధనవ్యయంతో కూడిఉన్నది; ఖండంలోఉన్న కరెన్సీనోట్ల విలువ ఎంత దిగజారి పోయిందంటే, ఒకానొక ఆంగ్లేయుడు న్యూయార్క్ పత్రికలో తన ఇంటిగోడలకు అంటించుకునేందుకు కరెన్సీనోట్లు కావాలని హాస్యాస్పదమైన ప్రకటనచేశాడు. వాషింగ్టన్ తన బాధ్యతలకు కొత్తవాడైతే, కాంగ్రెస్‌కూడా సరిగ్గా అలాటిస్థితిలోనే ఉన్నది. ఇదిగాక కాంగ్రెస్‌కు ముఖ్యమైన ఇతరపనులున్నవి. ఉదాహరణకు పరదేశాలతోడి సంబంధబాంధవ్యాల చర్చల్లాటివి. వాషింగ్టన్‌కు వీటితో పనిలేదు.

వాషింగ్‌టన్ జీవిత చరిత్రల్ని రాసిన వారు ఒప్పుకునేందుకు లెక్కచేయకపోయినా-కాంగ్రెస్ వాషింగ్టన్‌ను ఎంతో గౌరవంతో చూసింది. కార్యాలయ కార్యకలాపాలవిషయంలో కాంగ్రెస్ నిజాయితీగానూ, సానుభూతిగానూ ప్రవర్తించింది; అందులోని సభ్యుల్లో అత్యధికులు వాషింగ్టన్‌తో సద్భాంధవ్యాలను కలిగిఉన్నారు. ఐతే ఆయన అధికారమూ, కాంగ్రెస్ అధికారమూ స్పష్టంగా తెలియరాని సందర్భాలలో కొంత ఘర్షణ, రాపిడి ఎటూ తప్పనిసరి. వాషింగ్టన్ దురహంకారియైన సర్వసేనాని ఐనట్లయితే వారిమధ్య సఖ్యత బాగాచెడిపోయిఉండేది. పోతే విశాల భావంతోచూస్తే ఆయన కాంగ్రెస్‌ను నమ్మటం, దాన్ని బలపరచటం జరిగింది. అదేవిధంగా కాంగ్రెస్‌కూడా యీసద్భావాన్ని వాషింగ్‌టన్ ఎట్లు ప్రదర్శించిందనే మనం నొక్కి చెప్పవలసిఉన్నది. ఆ పరిస్థితుల్లో మనస్సు ఆందోళనా పూరితమై ఉన్నప్పటికీ, 1776 డిసెంబర్‌లో కాంగ్రెస్ వింత ప్రవర్తనకు మరేం కారణమున్నది? అప్పటికి సరిగ్గా నిర్ధారణ చేయలేనికాలం - ఆరునెలలపాటు - వాషింగ్‌టన్ సైన్యాన్ని సమకూర్చుకోవటంలోనూ, దాన్ని సుశిక్షణలో ఉంచటంలోనూ కాంగ్రెస్ నిరంకుశంగా ప్రవర్తించింది. సాధారణమైన అర్థంలో, ప్రజావిరోధి అనే భావం స్ఫురించకుండానే నిజానికి కాంగ్రెస్ ఆయన్ను 'నియంత' అనేపదంతో పిలిచింది. కొంతమందిప్రజలు క్రామ్వెల్‌ను మనసులో ఉంచుకొనో, లేదా అలాటి భావమేలేకనోకాని వాషింగ్టన్‌ను 'లార్డ్‌ప్రొటెక్టర్' అనికూడా మాట్లాడారు.

అటు కాంగ్రెస్‌కూ, ఇటు వాషింగ్టన్‌కూ వారి వారి సమస్యలు ఉన్నవి. అదేవిధంగా బ్రిటిష్‌వారికికూడా వారి సమస్యలు వారికి ఉన్నవి. మాతృదేశంలో బ్రిటిష్‌వారు వారి వారి రాజభక్తి పరాయణత్వంలో అభిప్రాయభేదాలను కలిగి ఉండటంతో, వారు అనుసరించే మార్గాలలోకూడా భేదం ఏర్పడింది. మూడవజార్జ్ ప్రభువుకూ, ఆయనటోరీ సలహాదారులకూ పార్లమెంట్‌లోనూ, ఇతర తావుల్లో కూడా నిశ్చయమైన ప్రతిపక్షం ఏర్పడింది. రాజుగారు వలస రాజ్యాలు తన పాలనలోనికి రావాలని పట్టుబట్టారు; సకారణ వాదంతో ఇదిసాధ్యపడనట్లయితే, ఇనుపహస్తాలతో, దండోపాయంతోనైనాసరే దీన్ని సాధిద్దామని నిశ్చయించుకున్నారు. కాని యుద్ధం ఇంకా ముందుకు డేకుతూ ఉండగా యీ చిత్రం మారవలసిన అవసరం ఏర్పడింది. బ్రిటిష్‌వారికి కాల్బలమూ, నౌకాబలమూ ఉత్తమమైనవి ఉన్నప్పటికీ వాటిని ఉపయోగించేందుకు వారికి ఇచ్ఛలేక పోవటమో, లేదా నిర్ణయించుకో లేకుండటమో జరిగినవి. జనరల్ గాజ్, ఆయన అనంతరం సైనికాధ్యక్షత వహించినవారి హృదయాలు ఎంతో సున్నితమైనవనీ, ఒకవిధంగా వారు అమెరికన్‌ల క్షేమాన్ని కోరారనీ చెప్పటం తప్పు. అదే విధంగా దేశభక్తులు - ఇంగ్లీషు జనరల్స్ కఠినహృదయులనీ, రాక్షసులనీ చేసిన ప్రచారంకూడా సత్యదూరమైనది. అమెరికన్ వలసదారులను రహస్యంగా మెచ్చుకోవటంలో గాక, వారిని ఏవగించుకోవటంలోనే వారి అసలు పొరపాటు జరిగింది. "వీరికి సుశిక్షణలేదు; సైన్యంలోకి కొత్తగా

చేరారు ; పైపెచ్చు పిరికివారుకూడాను'' అని ఎంతో ప్రచారంపొందిన లార్డ్ శాండ్విచ్ అభిప్రాయం యీ విషయాన్ని తెలియజెపుతోంది. పోతే బంకర్ హిల్ మీద జరిగిన దాడిలో, యుద్ధసమాప్తి కాకుండానే గాజ్ చెప్పిన అభిప్రాయంకూడా పైదానితో సరిపోలుతున్నది. సర్ విలియమ్ హోవే (లాంగ్ ఐలెండ్ లోని రణవిజయానికిగాను ఆయన నైట్ బిరుదు సంపాయించారు) ఇంత దారుణంగా కాకున్నా, 1776 లో ఇలాటి అభిప్రాయంవల్లనే కొంతవరకూ అజాగ్రత్తగా ప్రవర్తించటంకూడా జరిగింది.

కొంతవరకూ ఆయన అభిప్రాయాలు న్యాయాన్యాయ శంకలతో కూడిఉన్నవని వివరించవచ్చుతవి. గాజ్ కి అమెరికన్ భార్య ఉన్నదనీ, క్లిన్టన్ తండ్రి న్యూయార్క్ వలసకు గవర్నర్ గా పనిచేశారనీ, హోవే పెద్దన్నగారు (1758 లో ఆయన ఫ్రెంచ్ వారితో పోరాడుతూ టికాన్ డెరోగాలో మరణించారు) వలసల్లో గొప్పనాయకుడుగా పరిగణించబడే వారనే సత్యాలవల్ల మనం కొంత ఉద్ధృతాన్ని తగ్గించవచ్చు.

ఐతే వారిబాధ్యతలు ద్విముఖంగా ఉండటంవల్ల కొంత తికమకపడటంకూడా జరిగింది. తిరుగుబాటుదారుల మీద యుద్ధంచేసేందుకుగాను హోవేసోదరులు న్యూయార్కుకు పంపబడినప్పుడు - వారు సర్వనాశనాన్ని ఒకవైపు ఉద్దేశించినా, మరొకవైపు శాంతిదూతలుగాకూడా ఉండవలసి వచ్చింది. ఎందుకంటే, మూడవజార్జ్ ప్రభువు వారికి శాంతి స్థాపనకై, రాజీకై ప్రయత్నాలు చేసేందుకు అధి

కారాన్ని ఇచ్చిఉన్నారు. ఇలాటి సందర్భాన్ని మనం తేలిగ్గా అర్థంచేసుకోవచ్చు. అందుకనే జనరల్ హోవే లాంగ్ ఐలండ్ విజయానంతరం శత్రువులు రాజీకివస్తారేమోననే ఆశతోనే దాడులను కొంతకాలంపాటు వాయిదావేశాడు. ఆయనా, ఆయనసోదరుడు ఎడ్మిరల్ హోవేలు తిరిగి 1778 లో ఒక ప్రక్క యుద్ధరంగ బాధ్యతల్ని వహిస్తూ, మరొకవైపు రాజీ కుదురుతుందేమో చూసేందుకు కమీషనర్లుగాకూడా నియమించబడినారు. ఐతే వారు సాధించిన విజయాలు ఘనమైనవేకావు; రాజీకి వారు చెప్పిన షరతులు చాలా దారుణంగాకూడా ఉన్నవి.

ఐతే యీ గొడవలకు కొంతవరకూ లోపించిన వారి మిలిటరీ సామర్థ్యంకూడా కారణమే. బ్రిటన్‌కు ఒక బ్లేక్ ఉన్నారు. కాని ఒక నెల్సన్‌నుకూడా సృష్టించవలసిఉన్నది. దానికి మార్లబరో ఉన్నారు; వెల్లింగ్టన్‌ను అది సృష్టించవలసిఉన్నది. కాని లార్డుహోవే, గ్రేవ్స్, చివరకు రాడ్నీ కూడా నెల్సన్లుకారు. అదేవిధంగా గాజ్ కానీ, 'బిల్లీ' హోవే కానీ, క్లింటన్ కానీ, 'జంటిల్‌మన్ జానీ' కానీ, బర్గయ్‌నీ కానీ వెల్లింగ్టన్ కారు. వీరందరూ అసమర్థులని చెప్పటంకాదు. వలసల విషయంలో సెక్రటరీగా పని చేస్తూన్న లార్డు జార్జి జర్మయిన్ లండన్‌నుంచే ఈయుద్ధానికి దర్శకత్వాన్ని వహించి, కొంతమంది విమర్శకులన్నట్లు రోష పూరితంగానూ, బొమ్మలాటగానూకూడా దీన్ని నడిపారు. రణరంగంలో పనిచేస్తున్న బ్రిటిష్ సేనానాయకులందరూ

మంచి యోధులు; ధైర్యసాహసాలు కలిగిఉండి యుద్ధాన్ని లెక్కప్రకారం నడుపుతూ, యూరపియన్ యుద్ధకౌశలంలో చాకచక్యమున్నవారు. వీరిలోకల్లా ఉత్తముడుగా పరిగణించబడే కార్న్‌వాలీస్ ఆతరువాత ప్రపంచంలోని ఇతర తావుల్లో విజయవంతమైన జీవితాన్ని గడిపారు. వీరు గొప్ప యోధులు కాకుండటమే వారి దురదృష్టం. నిజానికి వారి సమస్యలేవో అవి వారికి స్పష్టంగా తెలుసు. వీరికి మూడు అవకాశాలున్నవి. 1775 జూన్‌లో ఇందులో మొదటి అవకాశం ఛార్లెస్‌టౌన్ ద్వీపకల్పంమీది దాడిలో గాజ్‌కి ఇవ్వబడింది. ఆయన తెలివిగా ఆలోచించి ముందుగా బ్రీడ్స్‌మిట్టను ముట్టడించి, ఆ తరువాత తన అవకాశాన్ని ధైర్యంగా అనుసరించినట్లయితే, ఆయన ఆర్టిమాస్ వార్డ్ ఆధ్వర్యంలోని సైన్యాన్ని చెల్లాచెదరు చేసి, వాషింగ్టన్ ఆ రంగంమీద కాలిడక పూర్వమే తాను విజయాన్ని స్వీకరించి ఉండేవారు. రెండో అవకాశం లాంగ్ ఐలెండ్‌మీద హోవేకు ఇవ్వబడి, ఆ తరువాతి కాలంలోకూడా ఆ సదవకాశం అంతరించకుండా ఉన్నది. బ్రూక్లిన్ మిట్టలమీది వాషింగ్‌టన్ దేశరక్షణ దళాలను చెల్లాచెదరు చేసివేసి, లేదా ఆ తరువాతకూడా వారిని వెన్నాడినప్పుడు పరిపూర్ణతను ప్రదర్శించి ఉన్నట్లయితే, అమెరికన్ సైన్యాలను పోదిలోకికూడా రాకుండా చేయగలిగి ఉండేవారు. పోతే ఇక మిగిలిన మూడో అవకాశం ఆయనకు 1777 లో ఇవ్వబడ నున్నది.

ప్రతిసారీ ఈ వ్యత్యాసం దీర్ఘమవసాగింది. ప్రతి సంఘటనా బ్రిటిష్‌వారికే అత్యంతనానుకూలంగా ఉన్నట్లు కనిపిస్తుంది. ఐతే నిశితదృష్టితో చూడగా, వారి అవకాశాలు చాలా స్వల్పమైనవిగా కన్పట్టుతవి. ఈ యుద్ధమేమో అధిక ధనవ్యయానికి దారితీస్తూన్నది. స్వదేశంలో ఇది జనామోదంగా లేదు. ఇక వారి నౌకాబలంలో తగినంతమంది సైనికులూ, సైనికాధికారులూ లేరు. ఉన్నవారేమో ప్రపంచంలోని వివిధతావుల్లో నిర్వర్తించవలసిన పనిభారంలో ఉండటంవల్ల, ఇదంతా వారి తలలకు మించిన పనిగా పరిణమించింది. అదేవిధంగా తగినంత సైనికబలాలు బ్రిటిష్‌వారికి లేవు; ఉన్నవేవో ప్రపంచంలోని నలుమూలలా చెల్లాచెదరుగా పడిఉన్నవి. కనుకనే బ్రిటిష్‌వారు ఇతర యూరపియన్ రాజ్యాలనుంచి సైనికబలాలను బాడుగకు తీసుకోనవలసివచ్చింది. ఇక అమెరికన్ గడ్డమీద సృష్టించబడిన యుద్ధరంగం స్వదేశానికి 3,000 మైళ్ల దూరంలో ఉన్నది. అక్కడ బ్రిటన్‌లో కూర్చొని దీనికి దర్శకత్వాన్ని వహిస్తే, అది ఎలా ఉండాలో వేరుగా చెప్పనవసరంలేదు. వార్తలూ, ఆజ్ఞలూ మొదలైనవి శీఘ్రగతిని వెళ్లే అవకాశాలు ఏమీ లేవు. సైనికులూ, నావికులూ ఒకరికి తోడుగా మరొకరు పని చేసేందుకు తగిన సుశిక్షణను పొంది ఉండలేదు. హోవేనూ, ఆయన సహకారులైన ఆఫీసర్లనూ బాధపెట్టిన విషయాలు:- ఇంత పెద్ద ఖండంమీద జరిగే యుద్ధం గొరిల్లాయుద్ధంవలె ఉండటమూ, ఇక్కడి శీతోష్ణపరిస్థితులలో ఇక్కడ స్థిరనివాసాలున్న అమెరికన్‌లే త్వరలో అలసటజెందుతూ విసు

గెత్తుతూండగా, బ్రిటన్‌నుంచీ, ఇతర యూరపియన్ దేశాల నుంచీ దిగుమతయిన తమ సైనికబలాలు ఎంతో శ్రమపడి పోవటమూను. ఈ భూమిమీద ఉన్న రోడ్లు బహుకొద్ది; స్థిరనివాసాలకు ఆవలంతా కీకారణ్యాలు; 1754 లో వాషింగ్టన్ అల్లెఘనీ అడవులగుండా 15 రోజుల్లో 20 మైళ్లు ప్రయాణం చేయగలిగారనే విషయాన్ని మనం ఇక్కడ జ్ఞాపకం చేసుకోవచ్చు. ఇదొక తీర్థపగపట్టిన దేశం—యూరపియన్ యాత్రికులు యీనాటికీ యీ అభిప్రాయాన్నే కలిగి ఉన్నారు.

ఇక వాషింగ్టన్‌కు 'కష్టాలను ఎన్నుకోవటం' అనేది ఉండనే ఉన్నది. ఐనప్పటికీ 1776 ఆకురాలే కాలంనాటికి ఆయన విధులు విషమరూపాన ఉన్నప్పటికీ, ఏవో సరళమైన అత్యావసరాలకే సంకోచింపబడినవి. ఆయన భరించటం, తప్పించుకోవటం, ప్రేరేపించటం చేయవలసి ఉన్నది. దీన్ని హోవే విధులతో పోల్చినట్లయితే, హోవేకు అనేక ఇతర మార్గాలుకూడా అందుబాటులో ఉన్నవి. నౌకాబలసహాయంతో హోవే అమెరికాలోని ఏ తీరాన్నయినా తేలిగ్గా చేరగలడు. ఆరోజుల్లో వేసిన యుద్ధపథకాలవిషయంలో రహస్యం అత్యావసరమైనదనే అభిప్రాయం లేకపోయినా, అదొక ముఖ్యవిషయం కూడా కాదు. అన్ని అమెరికన్ ముఖ్యపట్టణాలూ హోవే దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి మనుగడను సాగించవలసి ఉన్నవి. న్యూపోర్ట్ హోవే స్వాధీనంలో ఉండటంవల్ల, అక్కణ్ణుంచి ఆయన న్యూ

ఇంగ్లండ్‌ను భయపెట్టగలడు. న్యూయార్క్‌ను స్వాధీన పరుచుకొని, అక్కడున్న అధికసంఖ్యాకులైన రాజభక్తులకు తగిన రక్షణనివ్వటమేగాక, ఆ ప్రదేశంనుంచి హోవే తేలిగ్గా కెనడాకూ, గ్రేట్ లేక్స్‌కూ వెళ్లే మార్గాలను అదుపు ఆజ్ఞల్లో ఉంచుకోగలడు. అమెరికాలోకల్లా పెద్దపట్టణమూ, కాంగ్రెస్ స్థావరమూ ఐన ఫిలడెల్ఫియాను స్వాధీన పరుచుకున్నట్లయితే - అమెరికా మధ్యభాగంలోని వలస లన్నిటా హోవే ప్రాముఖ్యత ప్రబలమౌతుంది. ఛార్లెస్టన్‌ను పట్టుకున్నట్లయితే దక్షిణదేశద్వారంకూడా ఆయనకు తెరవ బడుతుంది.

ఐతేమాత్రమేం? ఒకసారి ఆయన అమెరికన్ తీరాల్లో ఉన్న పట్టణాలన్నిటినీ ఆక్రమించలేడు; ఒకవేళ ఇది సాధ్య మైనా అంతమాత్రాన యీ తిరుగుబాటు పూర్తిగా అణచి వేయబడటమూ జరగదు. ఊహించలేనంత సువిశాలమైన కారడవులున్నవి; ఎంతో దూరప్రయాణాలకు సైనికుల్ని సిద్ధపరచాలి; శత్రువును గుండెలవిసేట్లు తరిమినా తగిన ప్రతిఫలమూ, కృతజ్ఞతా చూపబడదు. యుద్ధనీతిని అనుస రించని శత్రువులు - అసలు అలాటి నియమాలనేవి ఉన్నవనే తెలియని విరోధులు - హఠాత్తుగా ఏ కీకారణ్యంలోనో దాగొనిఉండి, మీదపడి తన సైన్యాలను సర్వనాశనం చేసే అవకాశాలూ ఉన్నవి. ఇక పోతే ఎన్నో స్థిరనివాసాలు ఏర్పడిన తావులు, దేశపటాలకు ఇంకా ఎక్కనివి, ఎలాటి రికార్డ్ ఆధారాలూ లేనివి లెక్కలేనన్ని ఉన్నవి. వాషిం

ట్రా ఆదేశీయుడు; ఒక్క పట్టణమన్నా లేని రాష్ట్రవాసి; బహుశా యీ కారణంగానే వాషింగ్టన్ ధరించిన పాత్ర ఆయనకు సులభసాధ్యమై ఉండొచ్చు. హోవే సైనిక స్థావరాలున్న పట్టణాలను పట్టుకోవటం ఖండంలోని శత్రు సైన్యాలను వెన్నాడటంకన్న మంచిదని ఊహించాడు. అందుకు ఆయన కారణాలు ఆయన కున్నవి. ముఖ్యంగా అందమైన ప్రియురాలనేది ఒకేఒక కారణమైనప్పటికీ, అదే మంత ముఖ్యమైనది కాదు. విశేషనష్టాన్ని ఆయన భరించ లేదు. తన సైన్యాన్ని వృథాగా పోగొట్టుకోనూ లేదు. అమెరికన్ సైనికబలాలు చెల్లాచెదరుచేయబడినా, తిరిగి అవి కలుసుకుంటవి. శత్రువులపక్షాన చేరేందుకు ఎక్కువ మంది సైనికులు వస్తుంటారు. హోవే సైన్యాలు అత్యధిక వ్యయంతో తప్ప నిలబడలేవు. కనుకనే ఆయన వాదాలు తప్పుదారిపట్టినవి. హోవే క్రింది అధికారి సర్ హెన్రీ క్లిన్టన్ (ఆ తరువాత ఈయనకూడా నైట్‌హుడ్ పొందారు, హోవేకన్న విజ్ఞాని. ఆయన కనీసం సిద్ధాంత రీత్యానన్నా సక్రమంగా ఆలోచించి, వాషింగ్టన్‌మీద పెద్ద దెబ్బ తీయమని హోవేను ప్రోత్సహించి కోరారు. ఐతే క్లింటన్ అనుభవపూర్వకమైన సంఘటనల్లో రెచ్చిపొయ్యే యోధుడు కాదు. అదీగాక ఒకవిధంగా ఉద్యోగ రీత్యా క్లింటన్, హోవేలకు చుక్కెదురు. అందుకని ఒకరు చెప్పింది మరొకరికి నచ్చదు. 1777 జులైలో క్లింటన్ "ఏదో శాపం మమ్మల్ని వెంటాడటంవల్ల, నేనూ జనరల్

హోవే ఏకాభిప్రాయానికి రాలేకపోయ్యాం" అని ఒప్పుకున్నాడు.

వీరిద్దరిమధ్యా ఇలాటి భేదాభిప్రాయాలు ఉండగా, తామొక అంతర్యుద్ధాన్ని నడుపుతున్నామనీ, అందువల్ల విషాదాంతమైన సంఘటనలను చేతులారా సృష్టించవలసి ఉన్నదనే ఊహలు ఉభయులకూ ఉన్నవి. దయాదాక్షిణ్యారహితంగా తాము ప్రవర్తిస్తే, తామింకా ప్రజలచేత ఏవగించుకోబడతారు. లేదా వారు దయగా ప్రవర్తిస్తే, విశాలభావాలను కనబరుస్తే, యీ పడిన శ్రమంతా హాస్యాస్పదంగా పరిణమిస్తుంది. ఈ సందిగ్ధావస్థలో తాము ఎన్నటికీ పరిపూర్ణ విజయాన్ని పొందలేమని వారు గ్రహించారు. నిజానికి వారి గురి ఏమిటి? వాషింగ్టన్‌ను తుడిచిపారెయ్యటం మినహా మరేమీ ఉన్నట్లు తోచలేదు. అందుకనే అనేకసార్లు వాషింగ్టన్ శత్రువులకు బందీ అయ్యారనే వదంతి వేయబడింది. తమ కోరిక యీ విధంగానన్నా తీరాలని బహుశా యీ నాయకులు ఉద్దేశించి ఉండాలి. 1776 లో వాషింగ్టన్‌ను చంపేందుకు ఒక పథకం వేయబడింది. బ్రిటిష్‌వారి దృష్ట్యా అది అత్యద్భుతమైన పథకం. అమెరికన్ సైన్యాలలో ఒక గొప్ప సేనానిగా పరిగణించబడే ఛార్లెస్ లీ 1776 డిసెంబర్‌లో బ్రిటిష్‌వారికి బందీగా చిక్కాడు. ఐతే అందువల్ల సత్ఫలితాలేమీ కలగలేదు. తమపక్షాన వాషింగ్టన్ మినహా ఏ ఇతర జనరల్ పోయినా అమెరికన్‌లు ఒక పెద్ద నష్టంగా భావించటంలేదు. ఆ తరువాత

క్లింటన్‌ను అపహరించేందుకు ఒకదాడి జరిపే పథకాన్ని చాలామంది అమెరికన్‌లు విమర్శించారు. ఎందుకంటే క్లింటన్ తమకు చేజిక్కితే, ఇంగ్లండ్‌నుంచి అంతకన్న మంచి జనరల్‌ను బ్రిటిష్‌వారు పంపవలసిన అవసరాన్ని చేజేతులా తాము కలిగించవలసి వస్తుందని!

ఎప్పుడైనా వాషింగ్టన్‌కు పీడకల ఏదైనా వచ్చి వుంటే - అలాంటి రికార్డు ఏమీలేదు - అది ఇది: ఆయన సముద్రంమీద ఒక చిన్న నావలో ప్రయాణం చేస్తున్నారు. దాని తెరచాప కాగితంతో తయారై ఉన్నది. (అదే బహుశా ఆయన సైన్యం కావచ్చు; లేదా అమెరికన్ వలసల యూనియన్ ఐఉండొచ్చు. ఐతే ఈ వలసలన్నిటికీ సంబంధించిన ప్రభుత్వమనేది, 1781 లో ఫెడరేషన్ ఆర్టికిల్స్ ఏర్పడే దాకా లేదు) తరువాత వర్షం కురవటంతో, ఆ తెరచాప కూలిపోయి మాయమైంది. పోతే హోవేకు వచ్చిన పీడకల (ఆయనకు ఇలాంటివి తప్పకుండా వచ్చిఉంటవని ఊహించవలసే ఉన్నది) ఇది: అది వాషింగ్టన్ పీడకలకు నకలుగానే ఉంటుంది. కాకపోతే ఆయన ప్రయాణంచేసే నౌక పెద్దదీ, దాని తెరచాప మందమైన కాన్వాస్‌తో చేయబడినదీ ఐఉంటుంది. పెద్ద తుపాను వీచిఉండాలి. తెరచాప వొదులైంది. దాన్ని గట్టిగా యథాస్థానంలో కదలకుండా కట్టివేసేందుకు హోవేకు తగినంత సిబ్బంది లేదు...కొద్దిమాటల్లో దీన్ని వివరించాలంటే - తగినన్ని అవకాశాలు లేకుండానే వాషింగ్టన్ ఒక ఖండాన్ని సంరక్షించవలసిన బాధ్యతను

కలిగిఉన్నారు. హోవే దీన్ని ఆటంకపరచవలసిన ఖర్మకు గురయ్యాడు. ఈ తిరుగుబాటు తగినంత శక్తిని పొందిందా- దాన్ని అణగద్రొక్కేందుకు తగినంత శక్తి తనదగ్గిర లేదని కూడా హోవేకు తెలుసు. దేశీయులకు ఆత్మగౌరవ ప్రాముఖ్యత తెలిసిరాగా, బహుజనాదరణను పొందిన తిరుగుబాటు ఒక పెద్దదేశంలో జరిగితే, దాన్ని అణగద్రొక్కటం ఎంత కష్టసాధ్యమో – ఇదివరకు ఇతరులు రుజువుచేసినదాన్నే ఇప్పుడూ బ్రిటిష్‌వారు ప్రదర్శించవలసి వచ్చింది. నెపోలియన్ స్పానిష్ ద్వీపకల్పాన్ని ఎదుర్కొన్నప్పుడూ, అంతకన్న దారుణంగా రష్యాను ఎదుర్కొన్నప్పుడూ యీ విషయాలను రుజువుచేశాడు. బోయర్ రిపబ్లిక్స్ బ్రిటిష్‌వారితో మూడేళ్ల పాటు యుద్ధాన్ని సాగించినవి. ఆక్రమించబడిన యూరప్‌లో జర్మన్‌లు పాఠాలను నేర్చుకోవలసి ఉన్నది.

## క్లిష్టపరిస్థితి : కృత్రిమ విచారణసంఘం (1777-1778) :

ఈలోగా హోవే భవిష్యత్ 1777 లో చాలా ఆశాజనకంగా ఉన్నది. వసంతకాలారంభంలో వాషింగ్‌టన్ తనసేనలను చలికాలపు స్థావరాలనుంచి ముందుకు కదిలించే యోచనలు చేస్తున్నసమయంలో హోవే అనేక పథకాలను గూర్చి ఆలోచిస్తున్నాడు. ఆయన మొదటి ఆలోచన- వాషింగ్టన్ తాలూకు అల్పమైన సవాల్‌ను ఎదుర్కోకుండానే, తన సైన్యాలను ఆల్బనీలో సమీకరించి, కెనడానుంచి దక్షిణానికి దాడి జరపాలని. ఈ పథకంలోనే రోడ్ ఐలెండ్‌నుంచి బోస్టన్‌మీద దాడికూడా జరుగు





తుంది. ఆయన వలసరాజ్యాలకు సెక్రటరీగా ఉన్న జర్మే యిన్‌కు తెలియపరిచారు. కాని హోవే యీ పథకాన్ని విడనాడి, ఫిలడెల్ఫియామీద దాడి జరగాలనీ, న్యూయార్క్ నగరానికి ఉత్తరదిశనుంచి మరికొన్ని దళాలుకూడా యీ దాడిలో పాల్గొనాలనీ సలహాచేశాడు. ఆర్థికదృష్ట్యా జర్మే యిన్ యీ రెండో పథకాన్ని ఆమోదించాడు. ఐతే కొత్తగా సైన్యాలంటూ రాలేదు. హోవే ఆ పథకాన్ని అమలు జరిపేందుకు తనకింకా 15,000 మంది సైనికులు కావాలని కోరాడు. చలికాలంలో సెలవుతీసుకొని బర్గాయినీ ఇంగ్లండ్‌కు తిరిగివెళ్ళటంవల్ల ఆయన మాటలతాలూకు పలుకుబడి జర్మయిన్‌మీద పనిచేసింది. తాను స్వతంత్రంగా సైన్యాలను నడపాలనే ఉద్దేశంతో బర్గాయినీ తాను బ్రహ్మాండమైన దెబ్బతీయగలనని జర్మయిన్‌కు నచ్చజెప్పాడు. ఆల్బనీని దృష్టిలోఉంచుకొని మూడు కోణాలనుంచి ఒక్కసారిగా దాడి జరిపించాలి. బర్గాయినీ నాయకత్వాన్ని వహించి, మాంట్రియల్‌నుంచి ఉత్తరదిశకు వదులుతాడు... యీపథకాన్ని జర్మయిన్ ఆమోదించాడు.

సైన్యాలను నడపటంలో బ్రిటిష్‌వారు ఆచరించిన చాలీచాలని యీ పద్ధతి ఇక్కడే క్లిష్టపరిస్థితిలో పడింది. కొత్తగా నాటకాలువ్రాసే రచయితవలె — బరాయినీవేసిన పథకంలో రంగస్థలంతాలూకు రక్తికట్టటంలాటిదేదో ఉన్నది. ఐతే కవిగారి సాహిత్యదృష్ట్యా ఆయన ఆలోచనలు అద్భుతంగా కన్పట్టినప్పటికీ, వివరాలలో ఎంతో బలహీనత

ఉన్నది. ఈ మూడుదళాలూ ఎదుర్కోవటంలో ఒకరికీ, మరొకరికీ పొత్తు కుదురుతుందో లేదో సరిగ్గా ఆలోచించ లేదు. మాంట్రియల్, అల్బనీల మధ్య ఆహారపదార్థాలూ, యుద్ధసామగ్రి సరఫరాలూ సకాలంలో సక్రమంగా అందు తవో లేదోకూడా సరిగ్గా ఆలోచించనూ లేదు. ఆల్బనీకి రాగలగటమే ఒక ఘనవిజయాన్ని సాధించటంగా యీ పథకం భావించింది. న్యూ ఇంగ్లండ్ దిగ్బంధించబడుతుంది. వలసలు ఛిన్నాభిన్నమై పోయి తిరిగి కలవాలని తహతహ లాడుతవి. ఐతే యీ సేనల గతేమిటి? బ్రిటిష్‌వారు వార్త లను చేరవేసుకోవటాన్ని సాధించగలుగుతారా? తమ ఆక్రమితప్రదేశాలకు బైట అమెరికన్ సైన్యాలు తిరుగులాడ టాన్ని ఆపుజేయగలమనే ఆశ బ్రిటిష్‌వారికి ఉన్నదా?

హోవే మార్పులుచేసిన పథకం వాషింగ్టన్ సైన్యా లను ఎదుర్కొనేందుకే ఉద్దేశించబడితే అది ఇంతకన్నా శ్రేష్ఠమైనది. ఈ తిరుగుబాటుకు అక్కడే హృదయంలాటిది ఉన్నది. వసంతకాలంలోనూ, ఎండాకాలపు తొలిరోజు ల్లోనూ కారన్‌వాలీస్ ఎలాగైనా వాషింగ్టన్ సైన్యంతో బాహాబాహీ పోరాడాలని ప్రయత్నాలుచేశారు. ఐతే వాషింగ్టన్ ఎంతో తెలివిగా కారన్‌వాలీస్ పాలబడకుండా, ఆయన సవాళ్ళను తప్పించుకొని తిరగటంలో ఎంతో చాక చక్యాన్ని చూపారు.

మధ్యలో హోవే తన అభిప్రాయాల్ని తిరిగి మార్చు కున్నాడు. ఈ కొత్త ఊహప్రకారం, ఆయన నౌకాబలంతో

ఫిలడెల్ఫియాను స్వాధీనం చేసుకొనేందుకు ఉద్దేశించి, అందుకుగాను తన సైన్యంలోని ఉత్తములైన సైనికులు 15,000 మందిని వేరేఉంచాడు. దీన్ని అనుసరించి న్యూయార్క్ పట్టణానికి ఉత్తరదిశనుంచి రెగ్యులర్ సైనికపటాలాలు ముందుకు తోసుకొనిరావు. కొంతమంది రాజభక్తి పరాయణులు కొంత హడావుడి చేయటంమాత్రం జరగవచ్చు. కనుక మొదట అనుకున్న ప్రకారం మూడుదళాలకు మారుగా రెండుదళాలు మాత్రమే ఆల్బనీమీద దండెత్తుతవి. బర్గాయినీ అమెరికన్ సైన్యాలను ఉత్తరదిశలో కదలకుండా చేయటానికి మారుగా, తానే పట్టుబడిపొయ్యే పరిస్థితిలో ఇరుక్కునేందుకు సిద్ధపడ్డాడు. ఐతే హోవే దృష్టంతా ఫిలడెల్ఫియామీదనే కేంద్రీకరించబడింది. క్లిన్‌టన్ ఎంత చెప్పినా వినక ఆయన్ను న్యూయార్క్‌లోనే విడిచి, తానుమాత్రం ఫిలడెల్ఫియా ముట్టడికి బయలుదేరాడు. హోవే పథకంలోని యీ మార్పుల్నిగూర్చి అటు బర్గాయినీకి కానీ, జర్మయిన్‌కు కానీ చాలా ఆలస్యంగా తెలిసింది. అప్పటికూడా జర్మయిన్ గాభరాపడలేదు. ఫిలడెల్ఫియాను ఆక్రమించుకున్న తరువాత, హోవేను బర్గాయినీని బలపరచమని ఆదేశించా రాయన.

ఈ బ్రిటిష్‌వారి పథకాలలోని రహస్యం వాషింగ్‌టన్‌ను ఆశ్చర్యపరచలేదు. వారి సకారణవాదన అనుసరించగలిగేదిగాలేదు. ఐతే శత్రువుకు రెండు ముఖ్యమైన గురులు ఉన్నవనేది క్రమంగా స్పష్టమైంది. అవి : కెనడామీద దాడి

జరపటం; మధ్య, లేదా దక్షిణ వలసలను సముద్రంమీద నుంచి ముట్టడి వేయటమూను. ఇందులో పాల్గొనే సేనా వాహినినిగూర్చి వాషింగ్టన్ దాదాపు సరిగ్గా లెక్కకట్టి, ఊహించ గలిగారు. బర్గాయినీ ఆధ్వర్యంలోని 8,000 మంది సైన్యాన్ని ఉత్తరదిశలోని అమెరికన్ సైన్యాలు ఎదుర్కో గలవు. ఇక క్లిన్టన్ ఆధ్వర్యంలో ఉన్న 7,000 మంది సైన్యం (వీరిలో సగంమంది మాత్రమే రెగ్యులర్స్) వారి న్యూయార్క్ స్థావరంనుంచి చిన్న పోరాటాన్ని మాత్రం చేయగలరు. కనుక వాషింగ్టన్ హోవేను ఎదుర్కొనే స్వేచ్ఛను కలిగి ఉన్నారు. హోవేదగ్గరున్న సైన్యం తన సైన్యంకన్నా అధికసంఖ్యాకులు. అంతమాత్రంచేత మరీ నిరాశ పడ నవసరంలేదు. ఎందుకంటే, ఎండాకాలపు మధ్యభాగాని కల్లా, వాషింగ్టన్ దగ్గర 9,000 మంది ఖండంలోని వలసల నుంచి సరఫరా చేయబడిన సైనికులూ, వీరుగాక సరిగ్గా లెక్క తెలియనంతమంది స్థానిక సైనికులూ ఉన్నారు. 1777 ఫిబ్రవరి లో వాషింగ్టన్ బెనెడిక్ట్ ఆర్నాల్డ్కు ఇలా రాశారు: "మన శత్రుపక్షంవారు మనసైన్యాలను కూడ గట్టుకొనే వ్యవధి మనకుఇస్తే, లోగడ జరిగిన పొరపాట్లన్నిటినీ మనం సరిదిద్దుకో గలుగుతామని నా ఆశ." నిజానికి తాను కోరిన దానిలో కొంతభాగమే ఆయనకు లభ్యమైంది. ఒకపక్క కాంగ్రెస్ ఖండానికి సంబంధించిన సైన్యంలో చేరేవారికి ఎంతో ధనబహూకరణేగాక, కొంతభూమికూడా ఇస్తామనీ, సైనికులుగా మూడేళ్లు, లేదా యుద్ధసమాప్తి వరకూ ఉండాలనీ ప్రకటించినా వారికి తగినంతమంది సైని

కులు లభ్యమవలేదు. ఎందుకంటే—ఇంతకన్న ఆకర్షవంత మైన బహూకరణలకు వలసల్లోని కొంతమంది వ్యక్తులు ఆశ జూపి, కొద్దికాలంపాటు తమతమ రాష్ట్రసరిహద్దుల్లో రక్షణ దళాలుగా పనిచేస్తే చాలని అనటంవల్ల, ప్రతివారూ అటే ఎక్కువగా మొగ్గారు. ఈ విధంగా ఖండానికి సంబంధించిన సైన్యం బహుకొద్ది మాత్రమే సమకూరింది. ఐనప్పటికీ ఇలా లభ్యమైన సైనికులు ఎదిరి నిలవగలవారు. ఫ్రాన్స్, స్పెయిన్ చాటుగా సహాయపడి, బ్రిటిష్‌వారి సరఫరాలను కొల్లగొట్టీ, తమతమ ఉత్పత్తిదారులనుంచి సరుకులను సేకరించీ అమెరికన్ బలాలకు సరఫరాచేయటంతో, అమెరికన్ సేనలకు మంచి ఆయుధాలూ, దుస్తులూ లభ్యమైనవి.

శత్రువులు వాషింగ్టన్‌కు తగినంత వ్యవధినికూడా ఇచ్చారు. హోవేతాలూకు నౌకాబలం న్యూయార్క్ హార్బర్‌ను జులై మాసాంతంలోకాని విడిచిపెట్టలేదు. ఆ తరువాత ఒక నెలకుకాని అది ఓడదిగనూలేదు. ఛెసపీకే సముద్రశాఖలోని ఎల్క్‌నదీ ముఖద్వారానికి హోవే చేరాడు. ఇప్పటికే ఆయన ఫిలడెల్ఫియాకు చాలాదూరాన ఉన్నాడు. ఇక్కణ్ణుంచి ముందుకు సాగడమనేది భూమిమీదనే జరిగింది. చిన్నచిన్న పోరాటాలతో, క్రమక్రమంగా ఆయన పట్టణాన్ని చేరుతూ, ఇప్పటికీ ఎంతో విశ్వాసంతో ఉన్నాడు. న్యూబ్రన్‌స్విక్‌లో హోవే దిగి ఉన్నట్లయితే, ఆయన ఫిలడెల్ఫియాకు 60 మైళ్ల దూరంలోనే ఉండి ఉండేవాడు. అలా కాకుండా ఆయన 400 మైళ్ల సముద్రయానంచేసి, ఫిలడెల్ఫి

యూకు 70 మైళ్ల దూరాన దిగింది ఎందుకో వాషింగ్టన్‌కు అర్థంగాక, ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. బహుశా హోవేగురి ఛార్లెస్టన్ మీద ఉంటే ఉండొచ్చని వాషింగ్టన్ నమ్మారు. ఐతే అదేమీ కాదనీ, హోవే గురంతా ఫిలడెల్ఫియా యే ననేది వాషింగ్టన్‌కు అర్థమైంది. హోవే ప్రయాణం దీర్ఘ కాలం జరగటంతో హోవే గురిచూసిన నగరానికీ ఆయన సైన్యానికీ మధ్య అమెరికన్ సైన్యాలను వాషింగ్టన్ అడ్డు పెట్ట గలిగారు.

ఇంతవరకూ వాషింగ్టన్ మీద అదృష్టదేవత చిరు నవ్వులు చిలకరించింది. ఆ తరువాతి కొద్ది వారాల్లోనూ తారుమారయింది. ఇదివరకటి దండయాత్రల్లో వలెనే యీసారికూడా కొంతవరకూ వాషింగ్టన్ తనను తాను నిందించుకున్నారు. ఆయన ఎదురు నిలబడి పోరాడన ట్లయితే ఆయన ఫిలడెల్ఫియాను పోగొట్టుకోవటం తథ్యం. ఇదే పూర్తి అపజయం కాకపోయినా...అమెరికన్ లక్ష్యాన్ని దెబ్బతీసిన దవుతుంది. కనుక హోవేను ఎదుర్కోవటం ఆయనవిధి. ఇలాటిది జరుగుతే, హోవే వేసిన పథకం పూర్తిగా విఫలమవదు. వాషింగ్టన్ కింద ఉన్న సైన్యంకన్నా శత్రుపక్షాన ఉన్నసైన్యం 11,000 నుంచీ 15,000 వరకూ అధికం. ఐనప్పటికీ ఈ రణరంగాన్ని ఆయన ఎన్నుకోవలసి ఉన్నది. ఆయన ఎన్నుకొన్న ప్రదేశం బ్రాండివైన్ సెల యేరు తనముందునుంచి దాటిన స్థలం. ఇది సెప్టెంబర్ 10-న జరిగింది. వాషింగ్టన్ కుడిపార్శ్వాన్ని సల్లివాన్ ఆధ్వ

ర్యానికి వదిలారు (ఈయన లాంగ్ ఐలెండ్‌లో శత్రువులకు బందీగాచిక్కాక, ఉత్తరోత్తరా వేరొక ఖైదీకి బదులుగా వదలివేయబడినాడు); మధ్యపార్శ్వాన్ని నాథేనియల్ గ్రీనీకీ, ఎడమ పార్శ్వాన్ని పెన్సిల్వేనియా సైన్యానికీ వదిలారు. బ్రాండీవైన్ సెలయేరు అనేక చోట్ల దాటేందుకు వీలుగా ఉన్నప్పటికీ, స్వభావసిద్ధమైన అడ్డంకిగాఉండి, ముఖ్యంగా, అమెరికన్ సైన్యాల ఎడమ పార్శ్వానికి ప్రకృతి సిద్ధమైన రక్షణను ఇస్తూ్తన్నది.

హోవే దండయాత్ర పథకం బ్రూక్లిన్ దండయాత్రను పోలే ఉన్నది. అమెరికన్ సైన్యాల మధ్యభాగంమీద కపటంతోకూడిన దండయాత్రనుసాగించి, పార్శ్వంమీద ముఖ్యమైన,ఘనమైనదండయాత్ర(ఈసందర్భాన కుడిపార్శ్వంమీద) సాగించటమే యీ పథకం. హోవే పథకాలన్నీ యీ పద్ధతిలోనే ఉంటవి. ఐతే వాషింగ్టన్ యీవిషయాన్ని కాస్త మెల్లిగా గ్రహించటం, స్కౌట్‌దళాలను అడ్డుగా అమర్చటంలో ఆలస్యం చేయటం జరిగింది. దీనిఫలితంగా సెప్టెంబర్ 11 వ తారీకున యుద్ధారంభం జరిగి, సైనికదళాల్లోని మధ్యభాగంలో నిశ్చయవిజయం జరగలేదు. పోతే ఇరుపార్శ్వాలా ఒకే ఒక పెద్దఊచ్చు కారన్‌వాలీస్‌చే నిర్వహించబడేందుకు అనుకూల వాతావరణం ఏర్పడింది. కారన్‌వాలీస్ ఆధ్వర్యంలోని 10,000 మంది సైనికులూ సల్లివాన్ సంసిద్ధంగా లేని సమయాన, హఠాత్తుగా ఎదిరించి, కుడిపార్శ్వాన్ని [illegible]రగొట్టారు. సల్లివాన్‌దళాలు వెనుకంజ

వేసే సమయాన, వాషింగ్టన్ ఆ ఉన్న పరిస్థితుల్లో తాను చేయగలఉత్తమ కార్యాన్ని నిర్వహిస్తూ తన నౌకిలో మిగిలిన హేమాహేమీల్లాటివారిని గ్రీనీ ఆధ్వర్యాన రెండవ రంగాన్ని సృష్టించేందుకై పంపారు. గ్రీనీ ఆధ్వర్యానఉన్న సైనికులు ఎంతో పట్టుదలతో పోరాడి, చీకటిపడేవరకూ ఎదురునిలవగలిగారు. ఈలోగా ఇరు పార్శ్వాలనూ తోణక కుండా నిలబెట్టగలిగే మధ్యభాగం హావే సైనికశక్తికి కుంగిపోయింది. ఈ యుద్ధం దాని ఆకారాన్నే కోల్పోయింది. చీకటిపడే సమయానికి కాల్పులు నిలిపివేయబడి, ఎంతో అలసిపోయిన సైనికులు – ప్రాణాలు కోల్పోయిన, గాయపడిన వేయి సైనికుల్ని రణరంగంలోనే వదిలేసి, విశ్రాంతి తీసుకునేందుకు మరలిపొయ్యారు.

ఇదొక అపజయం. అందుకే ఆ అవసరాన్ని బట్టి చూస్తే చాలా విలువైనదిగాకూడా పరిణమించింది. ఐతే ఏవిధంగాచూసినా ఇది పూర్తి, లేదా నిశ్చయమైన అపజయం మాత్రంకాదు. చిరు బుర్రులాడే పరిశీలకుడు కొద్దిమంది అమెరికన్‌లు ఖైదీలుగా తీసుకోబడ్డారని అనవచ్చు. వారు ఎంతో వేగంగా పరుగులెత్తారు అనికూడా అనవచ్చు. దీనికి జవాబుగా వారు సరిగ్గా సరిపడేటంతదూరం పరుగెత్తారని చెప్పాలి. ఎందుకంటే, మర్నాటి ఉదయానికల్లా వారు తిరిగి తమ తమ దళాలుగా ఏర్పడసాగారు. పోతే గ్రీనీ ఆధ్వర్యంలో ఎదురునిలిచి పోరాడినవారు తమ సామర్థ్యాన్ని చూపి, బ్రిటిష్ సైనికుల్ని 500 కు పైగా చంపటమో,

గాయపరచటమో చేయగలిగారు. దీన్నే మరొకవిధంగా చెప్పాలంటే - ఇప్పటికీ అమెరికన్‌లు బ్రిటిష్ సైన్యాలను ఓడించలేక పోయినప్పటికీ - కనీసం అమెరికన్ సైనికులు గొరిల్లాయుద్ధ సైనికులు చూపే చాకచక్యాన్ని (నిజానికి - తిరోగమించటంలోనే!) చూపి, తాముకూడా రెగ్యులర్ సైనికులవలెనే ప్రవర్తించగలమనీ, ఐతే కలిసికట్టుగా ఉండట మనేది ఆదర్శపూర్వకంగా జరపలేకపోయినా, ఒకగొప్ప ప్రమాదానికి గురికాకుండామాత్రం చేసుకోగలమనీ నిరూపించారు.

ఆ తరువాతి సంఘటనలుకూడా ఈకోవలోనే ఉన్నవి. ఐతే క్లిష్ట పరిస్థితులన్నిటిల్లోనూ ఎంతో చాకచక్యాన్నీ యుద్ధసంసిద్ధతనూ ప్రదర్శిస్తూ, అమెరికా భావీ, తనకీర్తి ప్రతిష్ఠలూ పణంగా వొడ్డబడిన సమయాలన్నిటా ఎంతో సామర్థ్యతను వాషింగ్టన్ ప్రదర్శించారు. హొవే ఎంతో కష్టంతో, నానాఅవస్థాపడుతూ ఫిలడెల్ఫియావైపు ప్రయాణం చేశాడు. కాంగ్రెస్ త్వరత్వరగా తమ కార్యాలయాన్ని లంకాస్టర్‌కూ, ఆతరువాత పెన్సిల్వేనియాలోని యార్క్‌కూ మార్చుకున్నది. వాషింగ్‌టన్ మరొకయుద్ధానికి పథకాన్ని తయారుచేశారు కాని, విపరీతమైన వర్ష కారణంగా దాన్ని రద్దుపరుచుకోవలసివచ్చింది. హొవేపట్టణంలో ప్రకాశిం చాడు; వాషింగ్టన్ ఆయన్ను ఫిలడెల్ఫియాకు 10 మైళ్ల దూరాన ఉన్న జర్మన్‌టౌన్‌లో సవాల్ చేశారు.

ఈసారి యుద్ధమైతే గందరగోళంగా జరిగింది కాని వాషింగ్‌టన్ చాకచక్యానికి తగిన బహూకరణ లభించక,

తిరిగి వారొక వేయిమందిసైనికుల్ని కోల్పోవటమూ, శత్రు పక్షంవారికి అందులో సగంమంది సైనికులు నష్టమవటమూ జరిగినవి. వాషింగ్టన్ మరొక యుద్ధంచేయాలని సంకల్పించారు కాని, హోవే ఆ అవకాశాన్ని కలగనీయలేదు. డిసెంబర్‌తోపాటు చలికాలంకూడా వచ్చింది. బ్రిటిష్ వారికి కొంచెం ఇబ్బందిగానూ, దేశభక్తులకు అసంతృప్తికరంగానూ ఉన్న కాలమిది. హోవే తన సైనికులతో ఫిలడెల్ఫియాలో వెచ్చగా, హాయిగా ఉంటే - ఇరవైమైళ్ల దూరాన వాషింగ్‌టన్ సైనికులు షూయిల్‌కిల్‌తీరాన, వేలీఫోర్జ్ దగ్గిరిమైదానంలో కాపలాలుకాస్తూ ఎంతో కష్టపడవలసివచ్చింది. ఫిలడెల్ఫియా పరిసరాల్లోని స్థిరనివాసాలలో కాందిశీకులు ప్రవాహంగా వచ్చిఉండటంవల్ల, వాషింగ్టన్ తన సైనికులకు నివాసాలను సమకూర్చటంలో ఎంతో కష్టపడవలసివచ్చింది. అందుకని సైనికులు కొయ్యలతో తమ తమ నివాసాలను నిర్మించుకునేంతవరకూ కాన్వాస్ డేరాలలోనే ఉండిపోవలసివచ్చింది. చలిబాధతో, ఆకలిబాధతో చాలావారాలు గడిచాక, యీలోగా థామస్ మిఫ్లిన్ అసమర్థతకూడా సహాయపడగా, వాషింగ్‌టన్‌కూ ఆయన సైనికులకూ నివాసాలు ఏర్పడినవి. అప్పటికీ అన్నవస్త్రాల లోపం అధికంగానే ఉన్నది. వేలీఫోర్జ్ దగ్గిర అమెరికన్లు పడిన బాధలు, అమెరికన్ జాతీయాభిప్రాయంలో ఒక భాగంగా పరిణమించేందుకు తగిన కారణాలు ఉన్నవి. నిజానికి ఎంతో బాధనుంచి ఏదోవిధంగా తప్పించుకో ా జరిగింది. వాషింగ్టన్ తన ఉత్తర ప్రత్యుత్తరాలలో ిరిచిన విధంగానే

యీసత్యం ఆయనకు తెలుసు. వేలీఫోర్జ్ దగ్గర అమెరికన్ సైనికదళాలు పడినబాధలకు బ్రిటిష్‌శత్రు పటాలాలకన్న అమెరికన్ల నిర్లక్ష్యతే ఎక్కువగా దోహదం చేసింది.

ఏది ఏమైనప్పటికీ 1777 – 1778 సంవత్సరాల చలి కాలంలో దేశభక్తుల తాలూకు బాలెన్స్‌షీట్ అంత అధ్వాన్నంగా మాత్రం లేదు. ఖర్చుల జాబితాలో – హోవే ఫిలడెల్ఫియాను ఆక్రమించటం, బ్రాండీవైన్, జర్మన్‌టౌన్‌లు శత్రువుల స్వాధీనం కావటం ఉన్నవి. జమజాబితాలో – వాషింగ్టన్ సైనికులు ఇప్పటికీ బతికిఉండి, ఏదోవిధంగా రోజులు గడుపుతున్నారు. వారికి చలిబాధా, అన్నవస్త్రాల లోపమూ, వేతనాల బకాయిలూ ఉన్నప్పటికీ మనుగడ జరుగుతూనే ఉన్నది. ప్రతిచలికాలంలోనూ వాషింగ్టన్ సైన్యం కరిగిపోయి ఏమీ మిగలలేదనిపించే స్థితిలోకి వస్తూన్నప్పటికీ అది బ్రిటిష్ సైన్యాలు చలికాలంలో జీవచ్ఛవాలవలె కదలకుండా పడిఉండేస్థితికి అనుగుణంగానే పరిణమిస్తూన్నది. అదేవిధంగా న్యూయార్క్‌లో కలిగిన కష్టాలకు అనుగుణంగా కాంగ్రెస్ కరిగిపోయి, దానిసభ్యులు ఒకోసమావేశంలో ఇరవైమందిపైచిలుకుమాత్రమే హాజరవటం వరకూ జరిగింది. ఐనప్పటికీ కాంగ్రెస్ ఇంకా సజీవంగానే ఉంటూన్నది. ఇక హోవేవిషయం తీసుకుంటే ఆయనదండయాత్ర ఒక అపజయమే. ఎందుకంటే అది విజయంకానేరదు. రాజభక్తులు తన తాకకిందికి బారులు తీరివచ్చి గుమికూడుతారని ఆశించాడు. ఖండంలో అదివరకు

అమల్లోఉన్న కరెన్సీని అంగీకరించక బంగారానికిమాత్రమే పెన్సిల్వేనియావాసులు హోవేకు తమ తమ సరుకులనూ, ఆహారపదార్థాలనూ అమ్మేందుకు సిద్ధపడినప్పటికీ, బహుకొద్ది మందిమాత్రమే ఆయనతో చేతులుకలిపారు. ఇదంతా హోవేలో ఎంతోనిరాశను రేపటంవల్ల, ఆయన ప్రభుత్వానికి తన రాజీనామా పంపాడు.

ఉత్తరాన ఉన్న దళాలు బర్గాయినీమీద సాధించిన విజయం మారుమ్రోగింది. జూలై తొలిరోజుల్లో టికోన్‌డెరోగా కోటను స్వాధీనపరుచుకోవటం, బర్గాయినీని ఆక్రమించటం అమెరికన్లకు శుభసూచకంగా తోచింది. ఆ తరువాత ఆయన ముందుకు సాగటం బాధాకరంగానూ, మందగతిలోనూ సాగింది. మోహాక్ తీరాన జరిపిన రెండవదాడి మొదట్లో విజయవంతంగా ఉన్నా, క్రమంగా కుంచుకొనిపోయింది. ఆగస్టుమధ్యకాలానికి అత్యవసరమైన సరఫరాలను వెదకటంలో నిమగ్నమైన బర్గాయినీతాలూకు కొంతసేన - దేశభక్తుల సైనికదళాలచేత దక్షిణవెర్మాంట్‌లోని బెన్నింగ్టన్‌లో నాశనంచేయబడింది. న్యూయార్కునుంచి వచ్చి తనకు కలవబొయ్యే సేనంటూ లేదనే విషయం తెలిసికూడా, ఆయన ఆల్బనీ దక్షిణదిశకు తోసుకొనిపోవలసివచ్చింది. శారటోగాకు కొద్దిమైళ్లు దక్షిణాన ఉత్తరదిశలోని అమెరికన్ పటాలాలు అడ్డగించటంతో (ఇవి పూర్వం షుయ్‌లర్ ఆధ్వర్యానా, ఇప్పుడు హోరేషియో గేట్స్ ఆధ్వర్యానా పనిచేస్తున్నవి) నిలిచిపోవలసివచ్చింది.

సెప్టెంబర్‌లోనూ, తిరిగి అక్టోబర్ తొలిరోజుల్లోనూ ఆయన ముందుకు తోసుకొని వెళ్లాలని ఎంతో ప్రయత్నించాడు. కాని, ప్రయోజనం లేకపోయింది. ఈ దారుణమైన ఫలితాలను గ్రహించి, చివరకు క్లింటన్ సాధ్యమైనంత ఎక్కువ సైనికుల్ని వెంటబెట్టుకొని, హడ్సన్‌నది ఎగువకు పయనమయ్యాడు. అక్టోబర్ మధ్యకాలానికి ఆయన అడ్డగించిన వారిని ఒక పక్కకు నెట్టుకుంటూ, బర్గాయినీకి 80 మైళ్ల దూరానికి, ఎసోపస్ (కింగ్‌స్టన్) చేరగలిగాడు. బర్గాయినీ ఎంత తొందర పడ్డాడో, క్లింటన్ అంత జాగ్రత్త వహించాడు. ఆయన రాక చాలా ఆలస్యమైంది. హోవే ఫిలడెల్ఫియాలోనే కాలంగడుపుతున్నాడు. పోతే క్లింటన్ కింద ఉన్న సైన్యం బహుకొద్ది. క్లింటన్ ఎసోపస్‌కు చేరిన రోజునే—సారటోగాలో బర్గాయినీ, తన సైన్యంలో మిగిలిన వారితో పాటుగా లొంగిపొయ్యాడు. ఈ సైన్యం 5,700 మంది! బ్రిటిష్ సైన్యాలకు ఇదొక గొప్ప పరాజయం. క్లింటన్ తిరోగమించి, మెల్లిగా న్యూయార్క్‌కు తిరిగి వచ్చి చలికాలమంతా కిమ్మనకుండా ఉండేందుకు నిశ్చయించుకున్నాడు. ఇక హోవే ఎలాటి కుతూహలమూ చూపక, తన రాజీనామా అంగీకరించబడిందనేవార్తకోసం ఫిలడెల్ఫియాలో వేచిఉన్నాడు. ఆ తరువాత మేలో అమెరికాలోని తన సర్వసేనాపతిత్వాన్ని క్లింటన్‌కు అప్పగించి, స్వదేశానికి తిరిగి వెళ్లాడు. గాజ్, బర్గాయినీ, హోవేలు వెళ్లిపోయినా, వాషింగ్టన్ మాత్రం యథాస్థానంలోనే నిశ్చలంగా నిలబడిఉన్నారు.

బ్రిటన్ అమెరికన్ వలసల స్వాతంత్ర్యాన్నింకా గుర్తించేందుకు సిద్ధపడకపోయినా - లండన్‌లో లార్డ్ నార్త్ మరొక సంధి సమితిని ఏర్పాటుచేయటంలో నిమగ్నుడై ఉన్నాడు. పారిస్‌లో గొప్ప సంచలనం రేగింది. సిలాస్ డీన్, బెంజమిన్ ఫ్రాంక్లిన్‌లు పారిస్‌లో అమెరికన్ ఏజెంట్లుగా ఉంటూ, కొంతకాలంగా ఫ్రెంచ్ ప్రభుత్వంనుంచి వలసలకు సహాయసానుభూతుల్ని అందుకుంటున్నారు. ఫ్రెంచ్ ప్రభుత్వం చేసిన సహాయంలో కొంతభాగం - వాషింగ్టన్ కింద పని చేసేందుకు విదేశీయులైన ఆఫీసర్లను పంపటం. మరికొంత మంది ఆఫీసర్లు తమంతటతామే రావటంకూడా జరిగింది. వీరిలో అత్యధికులు ఎటూ నిర్ణయించుకోలేని విధంగానూ, గొప్ప సైనికోద్యోగులవాలనే అభిలాషలతోనూ ఉండటం వల్ల వీరంతా కలిసి వాషింగ్టన్ కష్టాలను ద్విగుణీకృతం చేశారు. వీరిలో కొందరు - ముఖ్యంగా థడ్డియస్ కోస్కియస్‌జికో, ఆత్రుతపడే యువకుడు మార్క్వస్ డీ లాఫయెట్టే, బారన్ డీ కాల్బ్, 'బారన్'వాన్ స్ట్యూబెన్ - అత్యుత్తమ వంశజులూ, యోధానుయోధులూ ఐనవారు - అమెరికన్ లక్ష్యాలకు ఎంతగానో దోహదంచేశారు. సారటోగాలోని వార్త విన్నతరువాత ఫ్రెంచ్‌వారు మరింత సహాయం చేయాలని నిశ్చయించుకున్నారు. వారు కేవలం సెంటిమెంట్ మీద ఆధారపడే యీ నిర్ణయాన్ని తీసుకోలేదు. వారు ఒకపక్క వలసదారుల ధైర్యసాహసాలనూ, వారి సర్వ సేనానిఐన వాషింగ్టన్ నిశ్చలతనూ మెచ్చుకుంటూనే ఉన్నారు. అమెరికన్‌లు కష్టపడి సాధించిన అవకాశాలు

పాడుగాకుండానూ, అన్నిటినీ మించి బ్రిటన్‌ను బలహీన పరిచే ఉద్దేశ్యంతోనూ ఫ్రెంచ్ వారు ఉన్నారు. స్వాతంత్ర్య తృష్ణతో సతమతమౌతూన్న యీ రిపబ్లిక్‌కు సహాయ పడేందుకు అనేకమంది యూరపియన్ పాలకులు సంసిద్ధులయ్యారు. 1778 ఫిబ్రవరి మాసాంతంలో ఫ్రాంక్లిన్ యీ విధంగా ప్రకటనను చేయగలిగాడు: "యునైటెడ్ స్టేట్స్ పోరాటాన్ని చాలామంది క్రిస్టియన్ రాజులు ప్రజాపోరాటంగా పరిగణిస్తున్నారు...వారు యునైటెడ్ స్టేట్స్ స్వాతంత్ర్యాన్నీ, అధికారాన్నీ ఒప్పుకుంటూ, దానికొక హద్దు లేదని బల్లగుద్దుతూన్నారు." ఎండాకాలం మధ్యకాలానికి ఫ్రాన్స్‌కూ, బ్రిటన్‌కూ అధికారపూర్వకమైన యుద్ధం ఆరంభమైంది. యునైటెడ్ స్టేట్స్‌ను ప్రత్యేకమైన జాతిగా గుర్తించకపోయినా, స్పెయిన్‌కూడా ఫ్రాన్స్ పంథానే అనుసరించి చాలాదూరం వెళ్లింది.

ఏప్రిల్ మాసంలో రాజీనిగూర్చి వాషింగ్టన్ విన్నారు. "ఏ ఇతర సంఘటనా ఇంతకన్న సంతోషపూర్వకంగా ఆహ్వానించబడి ఉండదని నా నమ్మకం" అని ఆయన కాంగ్రెస్‌కు తెలియపరిచారు. ఏ ఇతరవ్యక్తీ ఆయనకన్న భారం తగ్గినట్లు భావించి ఉండలేదు. ఐతే ఇందుకు భిన్నంగా, యీ సంధి జరుగుతున్న వారాలు వాషింగ్టన్ జీవితంలోనే చాలా చెడురోజులు. వేలీ ఫోర్జ్‌లోని కొయ్యఇళ్లల్లో ఉండటం శారీరకంగా బాధాకరంగా పరిణమించింది. దీనికితోడు వాషింగ్టన్‌ను సర్వసేనాపతిగా తొలిగించి, ఆ స్థానంలో

హొరేషియో గేట్స్‌ను ఉంచేందుకు ప్రయత్నాలు జరిగిన కాలమిది. ఈ విధంగా ఆయనకు మనశ్శాంతి లేకపోయింది.

ఐతే ఇందులోని నిజానిజాలనుగూర్చి మనకు అంతగా తెలియదు. వాషింగ్టన్ దృష్ట్యా చెప్పాలంటే - సైన్యంలోని చాలామంది అసంతృప్తి జెంది, కాంగ్రెస్‌లోని మిగతా వారితో కలిసి ఆయనకు కళంకాన్ని అంటగట్టాలని ప్రయత్నించారు. సైనికుల్లో నాయకులైనవారు గేట్స్, మిఫ్లిన్, థామస్ కాన్‌వే (ఈయనొక ఐరిష్ స్వచ్ఛందసేవకుడు; ఇంతకుపూర్వం ఫ్రెంచ్ సైన్యంలో పనిచేశాడు). అందరికీ పరిచయమున్న కథ ననుసరించి - వాషింగ్‌టన్‌కు విశ్వసనీయులుగా ఉన్నవారిద్వారా (వీరిలో లాఫయెట్టేకూడా ఉన్నాడు. ఈయన తరువాత వాషింగ్టన్‌ను కొలిచేవారిలో ఒకరుగా, ఆయన ప్రాణమిత్రుల్లో ముఖ్యుడుగా ఉన్నారు) యీ కుట్ర బైటపడింది. ఆ తరువాత వాషింగ్‌టన్ యీ కుట్రతాలూకు వివరాలను రుజువులతోసహా గేట్స్‌కు చూపి, గేట్స్ సిగ్గుపడేట్లు చేశారు. ఆ దెబ్బతో మిగతా కుట్రదారులందరూ చీకటికోణాల్లోంచి బైటపడి తమ కుట్ర పథకాలను విడనాడారు. ఐనప్పటికీ ఇటీవలి పండితులు, బరన్‌హార్డు నోలెన్‌బర్గ్ ప్రభృతులు ఆ పాతకథనుగూర్చి ప్రశ్నించారు. వారి వాద మిది: ఆనాడు గేట్స్ బర్గాయినీని ఓడించినందువల్ల ఆయన శ్లాఘించబడటం సబబే. ఐతే ఎంతైనాకూడా వాషింగ్టన్‌కన్న అత్యధికంగామాత్రం కాదు. అదేవిధంగా హోవేచేత దెబ్బతిన్న వాషింగ్టన్‌కూడా అంతగా నిందించ

బడేందుకూ అవకాశంలేదు. ఐతే జనవాక్యం - అందునా యుద్ధసమయాన ఇలాగే ఉంటుంది. అదృష్టవంతులైన సేనానులు పై స్థాయిలకు ఎగబాకటమూ, దురదృష్టవంతులు కిందికి దిగజారటమూ జరుగుతూనే ఉంటుంది. వాషింగ్టన్‌ను గూర్చి గొణుక్కోవటమంటే అది ఆయనపట్ల కృతఘ్నతను చూపటమే కాగలదు. ఆయన లోపాలనుగూర్చి ఆయన సహచరులు కొద్దిమంది వ్యక్తిగతమైన తమతమ ఉత్తర ప్రత్యుత్తరాలలో పేర్కొనటం భావ్యమా? కాన్వే స్వలాభాపేక్షతో (అందులోకూడా ఆయన హృదయపూర్వకంగా కృషిచేసినట్లు తోచదు.) గేట్స్‌కు వ్రాసిన ఉత్తరంలో - తాను వాషింగ్టన్‌కన్న గేట్స్‌నే ఎన్నుకుంటున్నానని ఉదాహరించాడంటే - ఆయన దానవుడా? వాషింగ్టన్ ఇలాగే భావించినట్లు కనిపిస్తారు. తదనుగుణంగానే ఆయన జీవిత చరిత్రకారులుకూడా అలాగే భావించటమే గాక, వాషింగ్టన్‌ను గుడ్డిగా కొలవటందాకా వెళ్లారు. తత్ఫలితంగా, ఉన్న పరిస్థితుల ననుసరించి, గేట్స్ ప్రభృతులు ద్రోహచింతతో ప్రవర్తించారనీ, గేట్స్ స్వామిభక్తిపరాయణుడు కాకుండటమే గాక, అసమర్థుడుకూడా ననీ కాంగ్రెస్‌లో మూర్ఖులూ, కపట మనస్తత్వం గలవారూ, దొంగలూ ఉన్నారనీ ఆయన జీవిత చరిత్రకారులు తమతమ అభిప్రాయాలను వెల్లడించారు.

ఇక వాషింగ్టన్ విషయంలో - ఆయన స్నేహితులందరూ నిజంగానే గొప్ప కుట్ర ఆయనమీద జరిగిందనే

ఒప్పుకున్నారు. "విశాల దృక్పథంతో చూస్తే యీ కుట్ర తాలూకు సత్యాన్ని ఏ విధంగానూ నేను అనుమానించను" అని కలోనెల్ అలెగ్జాండర్ హామిల్టన్ రాశారు. కాంగ్రెస్‌లో కొంతమంది సభ్యులు ఈర్ష్యతోనూ, బాధ్యతా రహితంగానూ ప్రవర్తించటం నిజమే! "వాటికన్‌లో ఎంత కృత్రిమమూ, కుట్రా ఉన్నదో, కాంగ్రెస్‌లోనూ అంతా ఉన్నది" అని జాన్ జే ఫిర్యాదుచేశాడు. వాషింగ్టన్ కింద పనిచేసే ఆఫీసర్లలో ఎక్కువమంది, ఆయన వెనుకనే గోతులు తీసే రకం ఉన్నారు. ఐతే ఒకవ్యక్తి కీర్తిప్రతిష్ఠలను ఆర్జిస్తూన్న సమయంలో ఇలాటివి వాతావరణంలో ఉండటం సహజమే. ఉదాహరణగా క్లింటన్, హోవే, బర్గాయినీలు ఒకరికొకరికి పడకపోవటం మనకు తెలిసిన విషయమే! ఎంతోమంది మేజర్ జనరల్స్ మధ్య వాషింగ్టన్ ఒకరుగా ఉంటూ, సర్వ సేనాని పదవిలో ఉండనట్లయితే, ఇలాటి ఈర్ష్యతాలూకు వేడి ఆయనకు సోకిఉండేది కాదు. ఈ కుట్రలో ఆయన ఎంతో మనస్థయిర్యాన్ని చూపి, హుందాతనాన్ని ప్రదర్శించి నప్పటికీ, విశేషంగా కోపోద్రిక్తుడయ్యారు. కొన్ని నెలల వరకూ గేట్స్‌మీద ఆయన అగ్గిబుగ్గయిపొయ్యారు. కాంగ్రెస్ వీరిద్దరినీ దూరదూరాన ఉంచటంలో తన విజ్ఞత చూపింది.

## మన్‌మౌత్‌నుంచి యార్క్‌టౌన్‌కు (1778-1781):

కుట్ర జరిగిందో లేదో అది వేరే విషయం - ఎంతో తొందరపనులు వొత్తిడి చేయటంవల్ల, కుట్రనుగూర్చిన ఆలో

చనలు మాయమైనవి. జూన్ 1778లో క్లింటన్ తన సైన్యాన్ని ఫిలడెల్ఫియానుంచి పూర్వోత్తరదిక్కుగా న్యూ జర్సీకి అడ్డంగా నడిపించటంతో, ఆయన యుద్ధసన్నద్ధుడు కాలేదని తెలియవచ్చి, వాషింగ్టన్ ఆశ్చర్యచకితు లయ్యారు. క్లింటన్ పిచ్చివాడేంకాదు. నిజానికి ఆయనకు హోవే పథకాలు ఎన్నడూ నచ్చలేదు. కొద్ది సైనికపటాలాలు ఇంగ్లండ్‌నుంచి పంపబడుతవని వాగ్దానం చేయబడింది. ఒక ఫ్రెంచ్ నౌకాదళం వస్తున్నదనే వార్తలు అందినవి. కనుకనే క్లింటన్ తన సైనికబలాలన్నిటినీ న్యూయార్కులో కూడగట్టటం మంచిదని తలిచాడు. రెండేళ్ల క్రితం బోస్టన్ వలెనే, ఇప్పుడు ఫిలడెల్ఫియాకూడా అమెరికన్‌లకు వశమైంది. ఈ విధంగా శత్రుసైన్యాలు ఆక్రమిత పట్టణాన్ని తమంతట తామే ఖాళీచేయటం యునైటెడ్ స్టేట్స్‌కు నైతిక విజయం. వాషింగ్టన్ వేలీ ఫోర్జ్‌లోని కాంప్‌ను ఎత్తివేసి, క్లింటన్ దారినే అనుసరించి, ఎలాగైనా ఇంటికి పోయ్యేనే పాఠాన్ని బోధిద్దామని కృతనిశ్చయుడయ్యారు.

క్లింటన్ సైన్యానికి వెనుకభాగాన ఉండే రక్షణ దళాలు మన్‌మాత్ కోర్ట్‌హౌస్‌లోనుంచి కదిలిపోతూండగా, వాషింగ్టన్‌కు జూన్ 28–న అవకాశం చిక్కింది. ఆరోజు ఆదివారం; ఎండ చండప్రచండంగా ఉన్నది. వాషింగ్టన్ ఉత్తర్వుల ప్రకారం బ్రిటిష్ సైన్యాలను అమెరికన్ సైన్యాలు కాస్త పలకరించి, యుద్ధరంగానికి దారితీయాలి. 1776 డిసెంబర్‌లో యుద్ధఖైదీగా తీసుకోబడి, ఇటీవలనే

మరొక ఖైదీకి మార్పు చేయబడటంలో విడుదలైన ఛార్లెస్ లీకి యీపని అప్పగించబడింది. ఉభయపక్షాల సైన్యాలూ దాదాపు సరిసమానమైన బలంతోనే ఉన్నవి. వాషింగ్టన్ తెలివిగా, బ్రిటిష్ పటాలాలు ముందుకు సాగకుండా చూడాలని యీ పథకం వేశారు. కాని ఉద్రిక్త స్వభావంగల లీకి యీ పథకం నిరాశాపూరితంగా కనిపించినట్లున్నది. లీ గుడ్డినమ్మకంతో ముందుకుసాగాడు. క్లింటన్ త్వరితగతిని తన సైన్యాలను వెనక్కు మరలించటంతో, ఎక్కువ చాకచక్యాన్ని చూపకుండానే ఆయన తిరోగమించాడు. వాషింగ్టన్ భయపడిపోయి, కలతజెంది, లీ తిరోగమనాన్ని ఆపి తన శ్రేణిని కట్టుదిట్టం చేశారు. ఐతే యుద్ధం పరిపూర్ణంగా జరగలేదు. ఉభయపక్షాలలోనూ 350 మంది గాయపడటమో, మరణించటమో జరిగింది. క్లింటన్ సైనికులు తమ ప్రత్యేకపద్ధతిలో న్యూయార్క్‌వైపు సాగిపోసాగారు. శాండీహుక్ దగ్గర ఓడఎక్కి, సముద్రయానం ద్వారా వారు తమ ప్రయాణాన్ని పూర్తిచేశారు. వాషింగ్టన్‌కు దొరికిన ఈ అవకాశం పాడైపోయింది. ఆతరువాత లీ అధికారుల ఆజ్ఞలను పెడచెవిన పెట్టినందుకు కోర్ట్‌మార్షల్ చేయబడి, మిగతా యుద్ధకాలంలో రణరంగంనుంచి విరమించాలనే ఉత్తర్వులకు గురైనప్పటికీ, ఈ యథార్థం తాలూకు విషాదం అలాగే ఉండిపోయింది. మన్‌మాత్ సంఘటనలోని ఇతర విషయాలు ఎలా ఉన్నప్పటికీ, వాషింగ్టన్‌లోని ముందు చెయ్యిచేసుకొనే తత్వానికి ఇదొక తార్కాణగా ఉన్నది. యుద్ధసలహాసంఘ సలహాలనుకూడా అతిక్రమించి,

వాషింగ్టన్ ఒక పెద్దయుద్ధాన్ని జరిపేందుకు సిద్ధపడ్డారు. ఆయన వేసింది అనుభవపూర్వమైన పథకమే మరి. ఎందుకంటే, న్యూజర్సీలోని సైనికులు తమను విడనాడుతారేమోనని ఆయన అనుమానించారు (నిజానికి వారు యీ సంఘటన తరువాత ఆపని చేయనేచేశారు). లేదా అమెరికన్ నైతికస్థాయిని ఎలాగైనాసరే అమెరికా మునిగిపోకుండా తేలుతూండేట్లు చేయాలని ఆయన ఆశించి ఉండొచ్చు. కారణాలు ఏవైనప్పటికీ, తనసైనికులు గోళ్లు గిల్లుకుంటూ కూర్చోకుండా రణరంగంమీదికి దూకించటమే వాషింగ్టన్ తత్వమనేది అర్థమైంది.

ఫ్రెంచ్‌వారు చేతులు కలపటంతో రణరూపమే మారిపోయింది. బ్రిటిష్‌వారు తమ పురాతన శత్రువులైన ఫ్రెంచ్ వారితోనూ, స్పెయిన్‌తోనూ యుద్ధానికి తలపడినప్పుడు బ్రిటిష్‌వారి నౌకాబల ఆధిక్యత సవాలు చేయబడింది. కనుకనే బ్రిటిష్‌వారు 1778 లో కామ్టిడీ ఎస్టెయింగ్ ఆధ్వర్యాన బయలుదేరిన ఫ్రెంచ్ నౌకా బలాన్ని అడ్డగించలేకపోయ్యారు. మిగతా తావుల్లోకూడా బ్రిటిషువారిమీది వొత్తిడి అధికంగానే ఉన్నది. మెడిటరేనియన్‌లోనూ, జిబ్రాల్టర్ ముట్టడిలోనూ, వెస్ట్ ఇండీస్‌లోనూ-ఇండియన్ మహాసముద్రం వరకూ వారు ఎన్నో వ్యవహారాలను చక్కబరుచుకోవలసి ఉన్నది. ఇదిగాక ఫ్రెంచ్‌వారూ, స్పెయిన్‌వారూ కలిసి బ్రిటన్‌మీద దండెత్తే అవకాశాలు (ఇది ఎన్నడూ జరుగలేదు) ఉండటంకూడా మరో పెద్ద వొత్తిడి. 1780

డిసెంబర్ నెలలో హాలెండ్ కూడా బ్రిటన్ శత్రుపక్షాలతో చేతులుకలిపింది. అదేసంవత్సరంలో అనేక యూరపియన్ దేశాలకు రష్యా నాయకత్వాన్ని వహించి, 'లీగ్ ఆఫ్ ఆరమ్డ్ న్యూట్రాలిటీ'ని స్థాపించి, బ్రిటన్‌పట్ల శత్రుత్వాన్ని ప్రదర్శించింది.

అమెరికన్‌ల తీవ్రప్రయత్నాలకు వేలీఫోర్జ్ కేంద్రంగా ఉండటం మనం ఎరుగుదుము. ఆతరువాత ఎప్పుడూ వాషింగ్టన్ నాయకత్వానికి ఎదురు లేకపోయింది. వాషింగ్టన్‌ను తుడిచి పారవేసేందుకు ఏర్పడిన మూడవ-లేదా తుది అవకాశం హోవేకు జర్మన్ టౌన్, బ్రాండీవైన్‌లలో ఎదురైంది; లేదా చలికాలం మధ్యలో వేలీఫోర్జ్‌మీద హఠాత్తుగా దండయాత్ర చేయటంలో ఎదురైంది. ఐతే హోవే చిన్నచిన్న విజయాలతోనే సంతృప్తి చెందుతూండగా, వాషింగ్టన్ మీదకానీ, ఆయన నిలబడిన ఆదర్శంమీద కానీ చావుదెబ్బ తీయలేక పోయ్యాడు. ఇప్పుడు ఫ్రెంచ్ వారు తమవాగ్దానాన్ని నిలబెట్టుకొనే పక్షంలో యునైటెడ్ స్టేట్స్‌కు విజయాలూ, స్వాతంత్ర్యమూ అందుబాటులోనే ఉండగలవు.

వేలీఫోర్జ్ అనంతరం వాషింగ్టన్ విషయంలో అంతా సక్రమంగా సాగినట్లయితే యీ కథాగమనం సాఫీగా సాగిపోయి ఉండేది. కాని మన వెనుక చూపే సర్వమూ మేలుకొరకే జరుగుతూన్నదనే అభిప్రాయాన్ని కలిగించటంతో మనచేత యీవిధంగా మాట్లాడిస్తూన్నదేమో? వాషింగ్టన్

తన సైన్యంతో సహా మన్‌హాత్‌నుంచి బయలుదేరి, న్యూయార్క్‌నుచుట్టి వైట్‌ప్లెయిన్స్‌మీద స్థావరాలను ఏర్పరుచుకోవటం–రెండేళ్ల క్రితం ఆయన భౌగోళికంగా ఎక్కడ ఉన్నారో, ఇప్పుడూ అక్కడే ఉన్నారు. వారాలు, నెలలు, సంవత్సరాలు బరువుగా కదిలిపోయినవి. ఇక భూమ్యాకాశాలు కలిసిన ప్రదేశాన్నిగూర్చిన మాటలూ అంత ఓదార్పును ఇవ్వటంలేదు. ఎందుకంటే ముందున్న దారి అగమ్యంగా ఉంటూాన్నది. చలికాలంలో కొంతకాలం పాటు మార్తా తన భర్తతోనూ, ఇతర ఆఫీసర్ల భార్యలతోనూ ముఖ్యస్థావరం దగ్గర కాలం గడపగలుగుతూాన్నది. ఉదాహరణకు ఆమె వేలీఫోర్జ్‌లోని తన భర్తదగ్గిరికి ఫిబ్రవరి తొలిదినాల్లో చేరింది. ఇక మౌంట్‌వెర్నన్ వాషింగ్‌టన్ జ్ఞాతి అయిన లుండ్ వాషింగ్టన్ ఆధ్వర్యంలో ఉంటూ, ఎక్కడో మారుమూల ప్రదేశంవలె కన్పట్టుతోంది. అనేక సందర్భాలలో మౌంట్‌వెర్నన్ వాషింగ్టన్ ఊహల్లో విహరించింది. ఒక్కో-క్షణంలో హఠాత్తుగా ఆయన ఉద్యోగానికి సంబంధించిన ఊహల్ని నిలిపివేసి, వ్యవసాయాభివృద్ధిలో కొత్తగా ప్రవేశపెట్టబడిన పద్ధతులనుగూర్చి, లేదా స్వగృహంలో చేయవలసిన మార్పుల్ని గురించీ ఆలోచించేవారు. ("ఈవసంతంలో ఎన్నిగొర్రెపిల్లలు పుట్టినవి? ... ఈ రోజుల కల్లా ఇల్లంతా పెయింట్ చేయట మనేది ఎంతవరకూ కొనసాగింది? పిజ్జాపేవ్‌మెంట్‌ను మరమ్మత్తు చేసే ఉద్దేశ్యమేమన్నా నీకు ఉన్నదా?...మరికొంత భూమిమీద హక్కును సాధించే ప్రయత్నాలు ఏమైనా చేస్తున్నావా?")

ఈవిధంగా ఆయన ఉత్తరాలు ఫిగ్ చెట్టుకింద హాయిగా పడుకుని కనే కలలకు ప్రతిబింబాలుగా ఉన్నవి.

ఐనప్పటికీ, ఆవెంటనే వచ్చే దృశ్యంలో శాంతి కనిపించలేదు. ఫ్రెంచివారి కలయిక హృదయానందాన్ని పెంపొందింప జేసింది. కాని అందువల్ల కలిగిన మొట్ట మొదటి ప్రతిఫలం నిరాశాపూరితంగా ఉన్నది. 1778 జూలైలో, అనుకున్న విధంగానే డీఎస్టెయింగ్ ఆధ్వర్యాన ఫ్రెంచ్ సేన వచ్చింది. న్యూయార్క్ పట్టణం కొరకరాని కొయ్యగా ఉండటంవల్ల, ఫ్రెంచ్ సేనను అమెరికన్ సేనతో కలిపి, సల్లివాన్ ఆధ్వర్యాన రోడ్ ఐలెండ్ లోని బ్రిటిష్ సైనికులమీది దండయాత్రకు వాషింగ్టన్ ఏర్పాట్లు చేశారు. ఫ్రెంచ్ నౌకాదళాన్ని బ్రిటిష్ నౌకాదళం అడ్డగించటంతో, ఫ్రెంచ్ వారు చల్లగా వెస్ట్ ఇండీస్ కు జారుకున్నారు. నౌకాదళ సహాయం లభ్యంకాకపోవటంతో సల్లివాన్ రోడ్ ఐలెండ్ లోని బ్రిటిష్ పటాలాలను గెలవలేక పోయ్యాడు. ఈ స్నేహానికి ఇది అశుభమైన ఆరంభంగా పరిణమించింది. ఈ విధంగా రెండు జాతుల సైనికదళాలను కలేసి చేసేయుద్ధం అనేక కొత్త కొత్త సమస్యలను తెచ్చిపెట్టడంవల్ల వాషింగ్టన్ చాకచక్యం, శక్తి సామర్థ్యాలను విశేషంగా ఉపయోగించవలసి వచ్చింది. ఈ ఫ్రెంచ్ నౌకాదళం ఎరువుతీసుకున్నది. దీన్ని సక్రమంగా ఉపయోగించుకునేందుకు ఎంతో ముందుగా పథకాలను వేయుటం చాలా కష్టసాధ్యమైనపని. అత్యవసరమైన పథకాలను ఆమోదింప జేసేందుకు ఇటు

కాంగ్రెస్, అటు ఫ్రెంచ్ కోర్ట్, అమెరికాలో ఉన్న ఫ్రెంచ్ సేనానుల అభిప్రాయాలనుకూడా తీసుకోవటం అవసరమైంది.

ఫ్రెంచ్ వారి సహాయకారణంగా, స్వదేశీయులు విశ్రాంతి తీసుకొని, ప్రమాదకరమైన పరిస్థితులకు దారి తీస్తారేమోనని వాషింగ్టన్ నిజంగానే ఎంతో భయపడ్డారు. అమెరికనుల ఉదాసీనతా, అసమర్థతా క్లింటన్ సైనికదళాల వలెనే ప్రమాదకరంగా ఉంటున్నవి. కనీసం వాషింగ్టనుకు ఇలాగే కనపట్టిఉండాలి. కనుకనే ఆయన తనకాలంలో అధిక భాగాన్ని పోరాటాల కొరకై వినియోగించటానికి మారుగా సైనిక కార్యాలయ కార్యకలాపాలలో ఎదురయ్యే అనేక క్లిష్ట సమస్యలను పరిష్కరించటంలో నిమగ్నులయ్యారు. ఆయన ఉత్తర ప్రత్యుత్తరాలు చాలా అధికంగా ఉంటూండటంవల్ల ఒకోసారి అనేకమంది సెక్రటరీలను తీసుకోవలసి వచ్చేది. ఆయన వ్రాసినదానిలో అత్యధికభాగం _ అన్న వస్త్రాలూ, ఆయుధాలూ, తుపాకిమందూ, దుప్పట్లూ, గుర్రాలూ, జీతాలూ (ఎప్పుడూ జీతాలు బాకీయే!), కొత్త కొత్త కోర్కెలూ, సైనికులను చేర్చుకోవటం, ఉద్యోగపు అంతస్తులు పెంచటం (ఆ పెంపకాలకు అసమ్మతి తెలియ పరచడం), శిక్షలూ, బహూకరణలూ, మిలిటరీ కోటాలూ మొదలైనవాటిని గూర్చే. కాంగ్రెస్, రాష్ట్రాలూ, అమెరికన్ వ్యక్తులూ యీ బరువు భారాలను లాగుతే యీ బాధ లెన్నో తప్పి ఉండేవని వాషింగ్టన్ అభిప్రాయ

పడ్డారు. ఆయన యీ కష్టాలని ఉత్ప్రేక్షించటం, తన లోపాలను గోరంతలు కొండంతలుగా చెప్పటం మొదలైనవి ఆయన అనుసరించేందుకు అవకాశాలు లేకపోలేదు. ఐనప్పటికీ ఆయన చేసిన ఫిర్యాదులు మరేమంత విపరీతమైన ధోరణిలో లేవు. ఎందుకంటే 1781 ఏప్రిల్‌లోనే "మనదాస్యశృంఖలాలు విడివడనున్నవి" అని ఆయన ప్రకటించారు. ఆయన దృక్పథాన్ననుసరించి, 1778–1779, 1779–1780 సంవత్సరాలనాటి చలికాలాలకన్న (ఆ రెండేళ్లూ ఖండానికి సంబంధించిన సైనికుల్లో కొట్లాటలు జరిగినవి) వేలీ ఫోర్జ్‌లోని చలికాలం అంతదారుణంగా లేదు. 1781 జనవరిలో నథేనియల్ గ్రీనీకూడా ఇలాటి అభిప్రాయాన్నే దక్షిణదేశంనుంచి వెలిబుచ్చారు. "ఈ సైన్యానికి మరింతబలం చేకూరనట్లయితే, ఈదేశం (బహుశా దక్షిణదేశం కావచ్చు) బాగుపడేందుకు వీల్లేనంతగా చెడిపోతుంది" అన్నారాయన.

మార్తా 1780 జూలైలో మోరిస్‌టౌన్ కాంప్‌నుంచి తిరిగిరాగానే ఆమె బావగారితో ఇలా అన్నది: "అక్కడ ఆనందమేమీ లేదు. సైనికులు యమబాధలూ, కష్టాలూ పడుతున్నారు. కారణమైతే నాకు తెలియదు. పాపం, ఆయన సర్వసేనాపతిత్వంతో చాలాకష్టం పడటం నా కలవరానికి కారణమైంది."

ఒక్క బ్రిటన్‌తోగాక, బ్రిటన్‌ను బలపరిచే అమెరికన్ వాస్తవ్యులైన టోరీలతోకూడా వాషింగ్టన్ కోపో

దీపితులైనారు. ఎవరు విశ్వసనీయులు? ఒకే దృక్కోణం నుంచి చూస్తే, వాషింగ్టన్‌కళ్ళకే వారి ఉభయుల జవాబులూ విరుద్ధంగా ఉన్నవి. ఒక కంటికి టోరీ బలమైన దేశభక్తుడుగానూ, మరో కంటికి దేశద్రోహిగానూ కన్పట్టాడు. మానసికంగా తనలోని పెరుగుదలనూ, యోధుడుగా తాను పొందిన శిక్షణనూ వాషింగ్‌టన్ చట్టబద్ధమైనదిగా భావించారు. క్లిన్‌టన్ ప్రవర్తన ఇదేవిధంగాఉన్నా, అవి దుష్టమైనవిగానూ, పెడదారుల బట్టినవిగానూ ఆయన తలపోశారు. టోరీలు తన వేడికోళ్లను తగినవిధంగా ఆదరించక పోవటంతో క్లిన్‌టన్ నిరాశజెందారు. ఐతే సిమ్కోవ్ రేంజర్లూ, రాజభక్తుల సమాజాలూ ఆయనకెంతో సహాయ పడినవి. చాటుగా టోరీలమీద చూపబడే యీ సానుభూతికి వాషింగ్టన్ చిరాకుపడ్డారు. ద్రోహచింత మూలమూలలా నక్కి ఉన్నది. ఛార్లెస్‌లీ బ్రిటిష్‌వారికి ఖైదీగా చిక్కిన సమయాన, ఆయన పెడదార్లు పట్టారేమో ఎవరికీ తెలియదు. జూన్ 1778 లో పాట్రిక్ హెన్రీ వర్జీనియా తత్వంచూసి కలవరపడి కాంగ్రెస్‌కు ఇలా రాశాడు: "అయ్యా! కరుణించి మీ దేశానికి సంబంధించిన యీ కౌన్సిల్‌నుంచి విడివడకండి; మనం ముందుగా గ్రేట్ బ్రిటన్ కబంధహస్తాలనుంచి బైటపడ్డాక, ఒకరితో మరొకరు విడిపోవచ్చు." ఈమాటల విలువ రెండేళ్ల తరువాత ప్రతిధ్వనించింది; అమెరికన్ సైన్యంలోకల్లా ఎంతో ఉత్సాహంతో రణరంగంమీదికి ఉరికే తత్వమున్న బెనెడిక్ట్ ఆర్నాల్డ్—క్విబెక్, సారటోగాలలో నాయకుడై కీర్తి నార్జించిన వ్యక్తి - హడ్సన్ రక్షణార్థం ఏర్పరిచిన

పథకాన్ని క్లిన్‌టన్‌కు ధారాగతం చేసేందుకు పన్నినకుట్రలో పట్టుబడినాడు. ఆర్నాల్డ్ తప్పించుకొన్నాడు. అంతకన్న దారుణమేమంటే - ఆయన విశేషంగా బహూకరించబడి, బ్రిటిష్ బ్రిగేడియర్ జనరల్‌గా నియమించ బడటమూ, కనెక్టికట్, వర్జీనియాలమీద నాశనానికి దారితీసే దాడులు జరపటమూ చేశాడు. ఆకర్షణీయంగా ఉండే బ్రిటిష్ ఆఫీసర్ మేజర్ ఏండ్రీ ఆర్నాల్డ్‌కూ, బ్రిటిష్‌వారికీ మధ్యగా రాయబారం జరుపుతూ, క్లిన్‌టన్ ఆజ్ఞల్ని శిరసావహిస్తూ, అమెరికన్‌లకు చిక్కగా, యీ కుట్రంతా బైటపడ్డాక, వాషింగ్టన్ తనలో లేని శాంత భావాన్ని కనబరిచి, ఏండ్రీని ఉరిదీయించారు.

ఎండాకాలం మధ్యకాలంలో జరిగే మిడ్ సమ్మర్ పండుగ తరువాత వాషింగ్టన్‌కు దుర్దినాలు ఆరంభమైనవి. ఆయన చేసిన దాడులలోనూ, కాంప్‌దగ్గరి ఆయన జీవితం లోనూ కూడా యీ సత్యం నిరూపించబడింది. అమెరికన్‌లు భూమిమీద జరిగిన యుద్ధాలలో కొన్ని చిన్నచిన్న విజయాలను సాధించారు; బాల్యదశలో ఉన్న అమెరికన్ నౌకాబలం జాన్ పాల్ జోన్స్, తదితర కాప్టెన్‌ల ఆధ్వర్యాన అనేక చిన్నచిన్న పోరాటాల్లో విజయాలను సాధించింది. ఐతే యీ విజయాలేవీకూడా రణధోరణిలో ఎలాటి మార్పులూ తీసుకొనిరాలేదు. బ్రిటిష్‌వారు దక్షిణదేశం లోనే తమ బలాతిశయాల్ని అధికం చేసుకున్నారు. 1780 వ సంవత్సరపు అంత్యదశలో న్యూపోర్ట్ ఖాళీచేసి అక్కడి

సైనికపటాలాలను వేరుతావుల్లో లాభసాటిగా ఉంచేందుకు కదిలించారు. ఒక సంవత్సరానికి ముందే వారు జార్జియాలోని సవన్నాను పట్టుకొన్నారు. 1780 ఆకురాలేకాలంలో క్లిన్‌టన్ సముద్రంమీద ఒకసైన్యాన్ని తరలించుకొని ఛార్లెస్టన్‌కు చేర్చి, ఆ పట్టణాన్ని ముట్టడించాడు. ఆయన పనులు చాలా చిరాకు కలిగించేవిగా ఉన్నప్పటికీ, గురి చూసిన ఫలితాలను అందుకున్నవి. ఛార్లెస్టన్ శత్రువులకు వశమైంది. దాంతోపాటుగా ఈ యుద్ధంలో ఎంతో విలువైనదికూడా అమెరికా కోల్పోయింది – 5,000 మంది అమెరికన్ రక్షకదళాలు! కారన్‌వాలీస్‌ను 8,000 మంది సైనికులతో జార్జియా, దక్షిణ కరోలినాలను రాజభక్తుల ఆశ్రయాలుగా ఉంచేందుకు నియమించి, క్లిన్‌టన్ న్యూయార్క్‌కు తిరిగివచ్చాడు. వాషింగ్‌టన్ హడ్సన్‌దగ్గరే ఉండిపోక తప్పలేదు. ఆయన క్లిన్‌టన్ చర్యలను కనిపెడుతూ, తాను పంపగలిగినంత సైన్యాన్ని దక్షిణానికి పంపారు. కాంగ్రెస్ దక్షిణాన నాయకత్వాన్ని వహించేందుకు హోరేషియో గేట్స్‌ను పంపింది.

చిట్టచివరికి ఇప్పుడు యీ పోరాటం నాటకంలో రక్తికట్టే ఘట్టానికి చకచకా సాగిపోయింది. వేలమైళ్ల దూరంలో ఉన్న ప్రధాన పాత్రధారులు ఈ తుది ఘట్టానికి కలుసుకోవటం అవసరమని తహతహలాడారు. కొంతమంది–యోగ్యతాయోగ్యతలు ఎలా ఉన్నప్పటికీ, పక్కకు తోసివేయబడినారు; మరికొంతమంది ఇంతవరకూ ప్రఖ్యాతిని పొందే

ఉన్నారు - ఉదాహరణకు గేట్సు. 1780 ఆగష్టులో దక్షిణ కరొలినాలోని కామ్డెన్ దగ్గర కారన్‌వాలీస్‌చే ఘోరంగా ఓడింపబడి, మూడు నెలలలోగా తొలగించబడినాడు. కామ్డెన్ దగ్గర చావుదెబ్బతిన్న బారన్ డీ కాల్బకూడా విరమింప జేయబడినాడు. ఛార్లెస్ లీ అప్పటికే, రణరంగాన సైనిక పక్షాల ఆధ్వర్యానికి నియోగించబడినాడు. క్లిన్‌టన్ న్యూయార్కునుంచి కదిలే సావకాశం లేక తన స్థితి 'సిగ్గుపడే కుక్క' వలె ఉన్నదని ఆయనే అన్నారు. చరిత్రలో అదృష్ట వంతులైన సేనానుల జాబితాలోకి ఆయన రాడు.

ఇక మిగతా వేషధారులందరూ ఐదుగురు ముఖ్య పాత్రల (గ్రీనీ, స్ట్యూబెన్ ఇత్యాదులు) ఆధ్వర్యాన చిల్లర వేషధారులుగా ఉన్నారు. ఈ ఐదుగురూ-కారన్‌వాలీసు, లాఫయెట్టే, వాషింగ్టన్, మరో ఇద్దరు ఆలస్యంగా వచ్చిన వారు - కామ్టే డీ రోచంబియూ, ఎడ్మిరల్ డీ గ్రాసేలు.

1780-1781 సం. చలికాలంలో చేసిన దాడిలో కారన్‌వాలీస్ నిష్ఠను సాధించాడు. ఐతే యీదాడి చాలా సమర్థతతో కూడినది. ఆయన వేగాన్ని చూపారు; తగిన సరఫరాలున్నవి ; తన తెలివితేటలను అమెరికన్ వాతావర ణానికి అనుగుణంగా ప్రయోగించాడు. ఆయనా, ఆయన సహచరుడు పదాతి దళాధిపతి బెనస్ట్రె టార్లెటన్ కామ్డెన్‌లో గేట్సును తుక్కు తుక్కుగా కొట్టారు. ఆ తరు వాత 1781 మార్చిలో గుయిల్‌ఫర్డ్ కోర్ట్ హౌస్ దగ్గర గ్రీనీమీద చావుదెబ్బతీశారు. ఐతే కారన్‌వాలీస్ విజయా

లన్నీ నీళ్ల మీద రాసుకున్న రీతి ఐనవి. ఆయన ఉత్తరానికి హడావిడిగా వెళ్లటం, తిరిగి దక్షిణానికి రావటం, మరోసారి ఉత్తరానికి వెళ్లటం జరుగుతే, ఆయన వెనుకనే అమెరికన్ దళాల అడ్డంకులు కొత్త కొత్తగా లేచినవి. మేనెలకల్లా ఆయన వర్జీనియాలో ఉన్నారు. ఇక్కడ టార్లెటన్ గవర్నరైన థామస్ జఫర్సన్‌ను దాదాపు పట్టుకోవటమూ, ఆశ్చర్యచకితులైన లెజిస్లేచర్‌ను బంధించటంకూడా జరిగినవి. కారన్‌వాలీస్ మేధావిమాత్రమేకాదు – ధైర్యసాహసాలుగల వ్యక్తికూడాను. ఐతే ఉత్సాహవంతంగా నడుపబడే అమెరికన్ సైన్యాలను లాఫయెట్టే, స్ట్యూబెన్‌ల ఆధ్వర్యాన సాగినవాటిని సాధించటంలో కృతకృత్యుడవలేక, సముద్రతీరానికి వెళ్లి, క్లిన్‌టన్‌తో యోచనచేద్దామని నిశ్చయించుకున్నాడు. ఇందుకు ఆయన యార్క్‌టౌన్‌ను ఎన్నుకున్నాడు. పూర్వపు దాడులలో అత్యధిక వివేకంవలన హోవే అపజయాన్ని పొందటమూ, అది లోపించటంవల్ల బర్గాయినీ పరాజయాన్ని పొందటమూ జరిగినవి. ఈ సందర్భంలో క్లిన్‌టన్ హోవేను పోలి ఉంటే, కారన్‌వాలీస్ బర్గాయినీ అడుగుజాడల్ని అనుసరించే ప్రమాదానికి గురయ్యాడు. యార్క్‌టౌన్‌ను రక్షించుకోవటం అంత తెలివేంకాదు; కారన్‌వాలీస్ దగ్గిర ఉన్న సైన్యం దాదాపు 8,000 మాత్రం.

మానవుని ఆత్మకు విషమపరీక్షగా ఉండే మూడేళ్ల కాలాన్ని వాషింగ్టన్ భరించారు; మరో మూడేళ్లు మానవుని ఓర్పుకు అగ్నిపరీక్షవలె ఉండే కాలాన్నికూడా ఓర్చు

కున్నారు. ఇప్పుడు విధి కరుణించిన సదవకాశం లభించింది. ఇంతకుపూర్వం ఆయన ఇతర రణరంగాలమీద చూపిన చాకచక్యంలో సగంమాత్రమే చూపినా ఆయన సామర్థ్యం నిరూపించ బడగలదు. ఈ అవకాశం రోచంబియూ, డీ గ్రాసేలద్వారా కలిగింది. రోచంబియూ సమర్థుడైన యోధుడు; 5,000 మంది ఫ్రెంచ్ సైన్యంతో ఆయన న్యూపోర్ట్‌లో ఉన్నాడు. డీ గ్రాసే ఫ్రెంచ్ వెస్ట్ ఇండీస్ నౌకాదళాధిపతిగా ఉండి, మరో 3,000 మంది ఫ్రెంచ్ సైనికులతో నిర్ణీతకాలం వరకూ సహాయపడేందుకు సిద్ధంగా ఉన్నాననీ, ఛసపీకే బేకి పయనమౌతున్నాననీ కబురు పెట్టాడు.

రోచంబియూ సహాయంతో న్యూయార్క్‌మీది దండయాత్రకు వాషింగ్టన్ ఆలోచనలు చేస్తున్నారు. డీ గ్రాసే కబురు అందగానే, ఆయన తన మనస్సు మార్చుకొని, వర్జీనియావైపుగా సైన్యాలను నడిపించారు. డార్ [illegible] మిట్టలవరకూ, మొట్టమొదటిసారి అంతా హాయిగా [illegible]గా జరిగింది. పాల్గొన్నవారందరూ ఇదివరకే తగినన్ని [illegible] సల్స్ వేసుకున్నారా అనిపించింది. డీ గ్రాసే బ్రిటిష్ పటాలాలకన్న ముందుగానే ఛసపీకే బేకి చేరి, కారన్‌వాలీస్ సముద్రయానంలో నిష్క్రమించేందుకు వీల్లేకుండా ఆ దారిని బంధించివేశాడు. కొద్దిరోజుల్లోనే వాషింగ్టన్, రోచంబియూ, లాఫయెట్టే, డీ గ్రాసేలు కలుసుకొన్నారు. ఈ కలయిక తాలూకు 17,000 మంది సైన్యం (ఇందులో

(ఫ్రెంచ్ వారిది 8,000 సైన్యం) యార్క్‌టౌను ముట్టడి వేసింది. ఆక్షణంలో నౌకాబలంలో ఫ్రెంచ్ వారిదే పైచేయిగా ఉన్నది. అదొక అత్యద్భుతమైన గారడీ. ఐతే సత్యంగా పరిణమించింది. చివరకు అది వాషింగ్టన్ ఊహించిన దృశ్యీకరణతోనే ప్రదర్శించ బడింది; కొద్దిమైళ్ల దూరంలోనే విలియమ్స్‌బర్గ్ ఉన్నది. సగజీవిత ప్రమాణం నాడు వాషింగ్టన్ ఓహియో దేశంనుంచి వెనక్కు గుర్రం మీద సవారీచేసి, డిన్‌విడ్డీని ఫ్లాయర్ - డీలిస్ ఆక్రమణలనుగూర్చి హెచ్చరించినారు.

ఖండం నలుమూలలనుంచీ వచ్చిన సైనికులు - ఫ్రెంచ్ సైనికులు వృత్తిధర్మంగాచూపే కౌశలాన్ని అలవరుచుకొనేందుకు గట్టిప్రయత్నాలు చేశారు. ఈ మిత్ర సైన్యాల తుపాకులూ, శతఘ్నుల తాకిడితో ఆపట్టణం మారు మ్రోగింది. తనసేనకన్న శత్రుపక్షాల సేనలు రెండింతలుండటం, తుపానుగాలి వీచుతూ యార్క్‌నది గుండా గ్లొసెస్టర్ పాయింట్‌కు తప్పించుకొనిపో[illegible]కాశం లేకుండటంతో కారన్‌వాలీస్ ఆశలన్నీ అడుగంటిన[illegible] అక్టోబర్ 17-వ తేదీన, సారటోగా మూడవ వార్షికోత్సవం నాడు కారన్‌వాలీస్ ఎంతో కలవరపాటుతో వాషింగ్టన్‌కు పంపిన యీ చిన్నపత్రం జ్ఞాపకం ఉంచుకోదగింది.

" అయ్యా! ఈ విరోధభావమూ, తదనుగుణమైన కర్మకాండలూ ఇరవైనాలుగు గంటలసేపు నిలుపుజేయబడాలని నేను ఆపాదిస్తున్నాను; ఇందుకుగాను ఉభయపక్షాలవారూ ఒక్కోరు ఇద్దరిద్దరు ఆఫీసర్లను నియోగిం

చాలని కోరుతూన్నాను...యార్క్, గ్లౌసెస్టర్ల స్వాధీనానికీ, ఆయాషర తులను నిర్ణయించేందుకూ యీ ఆఫీసర్లు కృషిచేస్తారని ఆశిస్తున్నాను. గౌరవాభినందనలతో- —కారన్ వాలీస్."

జనరల్ వాషింగ్టన్‌కు యీ నాటకం అంత్యదశలో పడి ఇప్పుడు అద్భుతమైన పరాకాష్ఠ నందుకున్నది. బ్రిటిష్, హెస్సియన్స్ పటాలాలు ఒకదాని వెనుకగా మరొకటి పలాయనం చిత్తగిస్తూ, శత్రువును ఎదిరించలేక తమతమ ఆయుధాలను కిందపెడుతూన్నవి. ప్రపంచమంతా (చివరకు బ్రిటిష్ వారుకూడా) వాషింగ్టన్‌ను మెచ్చుకుంటూన్న యీ సమయంలో మనం యీ కథాంతానికి కృషిచేయవలసి ఉన్నది.

ఐతే ఇన్ని ఎదురుదెబ్బలు తింటూవచ్చిన కథ - అంత త్వరగా అంతమవదు మరి. మరో రెండేళ్ళపాటు - విసుగుపుట్టించే గ్రంథాంతమందలి భూమికలాంటిది - సందేహమూ, ఉద్వేగమూ కలిసిన వాతావరణం చుట్టూ కమ్ముకున్నది. వాషింగ్టన్ సవితికుమారుడు జాక్ కుస్టిస్‌కు కాంప్ జ్వరం సోకి మరణించటంతో, యార్క్‌టౌన్ స్వాధీనమైన ఆనందం అంతరించింది. ఖండం నలుమూలలనుంచీ వచ్చిన సైనికులు యీ చివరిముట్టడిలో చూపిన ప్రతిభావిశేషాలతో ఎంతో తృప్తిజెందిన వాషింగ్టన్‌కు ఆ తరువాతిమాసాల్లో ఆ సైనికులు గొణుక్కుంటూ, నిందారోపణలు చేయనాగటంతో మనశ్శాంతి లేకుండాపోయింది. తాము పస్తులు పడుకుంటూంటే, మిగతావారు సౌభాగ్యాన్ని దోచుకొని కూడగట్టుకుంటున్నారని యీ సైనికులు అన్నారు. ప్రాణా

లొడ్డి యునైటెడ్ స్టేట్స్‌కు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను సంపాయించి పెట్టినప్పటికీ, తమకు బకాయిపడిన జీతాలివ్వని తాము కాంగ్రెస్‌ను ఎందుకు ప్రాధేయపడాలి? అటు కాంగ్రెస్‌కూ, ఇటు సైనికులకూ బాధ్యత వహించిన వాషింగ్టన్, సైనికులపట్ల సానుభూతి చూపుతూ, వారు క్రోధోద్రిక్తులు కాకుండా తన కౌశలాన్నంతా ఉపయోగించవలసి వచ్చింది. బ్రిటిష్‌వారితో పోరాడి వారిని పారద్రోలింది. తమలో తాము పోరాడుకునేందుకా?

ఏమైనప్పటికీ యుద్ధంలో విజయం లభించింది. యార్క్‌టౌన్ సంఘటనానంతరం భారీఎత్తున పోరాటమనేది జరగలేదు. కారన్‌వాలీస్‌కు సహాయార్థం సైనికదళాలను తీసుకొని క్లింటన్ చాలా ఆలస్యంగా రావటంవల్ల, ఇక ప్రయోజనం లేదని తెలుసుకొని, ఆయన న్యూయార్క్‌కు తిరిగి వెళ్లాడు. ఆ తరువాత కొద్దికాలానికే హోవే అడుగుజాడల్ని అనుసరించి, ఆయన రాజీనామా ఇచ్చి, ఇంగ్లండ్‌కు తిరిగి వెళ్లాడు. బ్రిటిష్‌సైనికుల తాలూకు మిగిలిన కథ క్షౌరకల్యాణం. వారు తమతమ ఓడరేవులనూ, కోటలనూ వదిలి ముతాలుముతాలుగా తమతమ పెట్టాబేడలు సర్దుకొని ఇంగ్లండ్‌కు పయనమవసాగారు. ఇప్పటి కుతూహలమంతా పారిస్‌మీద కేంద్రీకరించబడింది. అక్కడ అమెరికన్ కమీషనర్లయిన జాన్ ఆడమ్స్, ఫ్రాంక్లిన్, జే, లారెన్స్‌లు తాము బేరమాడిన దానికన్న అధికంగానే రాబట్టుకుంటున్నారు. యునైటెడ్ స్టేట్స్ స్వాతంత్ర్యం గుర్తించబడి,

దాని సరిహద్దులు సముద్రతీరంనుంచీ మిసిసిపీ నదివరకూ, గ్రేట్ లేక్స్‌నుంచీ స్పానిష్ ఫ్లారిడావరకూ అంగీకరించబడినవి. ఇంత మంచి సంధి షరతులు ఇదివరకే కాంగ్రెస్ చేత 1783 లో ఆమోదించబడినవి.

యుద్ధ విజయంతో పాటు శాంతి విజయంకూడా లభ్యమైంది. 1775 జూన్‌లో వాషింగ్టన్ అమెరికన్ సేనల సర్వసేనాపతిత్వాన్ని అంగీకరించినప్పుడు, మార్తాను ఓదార్చుతూ "ఆకురాలే కాలానికల్లా నేను సురక్షితంగా వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను—" అని రాశారు. అంతరంగికంగా యీ సేవ దీర్ఘకాలం ఉండగలదని ఆయన అనుమానించారు. కాని ఎనిమిదిన్నర సంవత్సరాలపాటు ఇదిలా సాగుతుందని బహుశా ఆయనెప్పుడూ అనుకొని ఉండరు. తిరిగి గృహోన్ముఖుడవటంలో ఆయన హృదయం ఆనందంతో నిండిపోయింది. ఐతే ప్రజాసేవకు సంబంధించిన కార్యకలాపాలన్నిటినుంచీ విరమించటమంటే ఆయన హృదయం, ఉద్వేగం గాయపడకపోవు. మధ్యలో చాలా జరిగింది. 1783 డిసెంబర్‌లో న్యూయార్క్‌లోని ఫ్రాన్సెస్ టావరన్‌లో ఆయన తన ఆఫీసర్లకు వీడ్కోళ్లు చెప్పినప్పుడు, ఆయనా, వారుకూడా కళ్లనీళ్లు పెట్టారు. ఆ తరువాత కొద్దిరోజులకు అన్నాపోలిస్‌లో ఆయన తన సర్వసేనాపతిత్వభారాన్ని కాంగ్రెస్‌కు తిరిగి అప్పగించేప్పుడు ఆ సంఘటన ప్రేక్షకుల హృదయాలను కలచివేసింది. ఎంతో చెప్పవలసింది ఉన్నది. వాషింగ్టన్ క్రిస్‌మస్‌నాటికి మౌంట్ వెర్నన్ చేరాలని త్వరత్వరగా

గుర్రమెక్కిపోతూంటే యీ దృశ్యమంతా ఆయన హృదయం లోనూ, అమెరికన్ల మనస్సుల్లోనూ సినిమా బొమ్మలవలె తిరగసాగింది.

## సర్వసేనాని సాధించింది:

సేనానాయకుడుగా వాషింగ్టన్ స్థానమేమిటి? ఈర్ష్యనూ, కక్తినీ వేరుజేసి, ఆయన సాధించినవాటితో సద్భావంతో కూడిన వ్యక్తిత్వాన్ని మనం ఏ విధంగా ఏర్పరుచుకోగలం? చరిత్రలో ప్రసిద్ధికెక్కిన యుద్ధాలతో, వాషింగ్టన్ పాల్గొన్న యుద్ధాలను ఉపయోగకరంగా పోల్చే అవకాశాలు మనకు లేవు. ఆ తుదియుద్ధరంగంలో తప్ప మిగతాయుద్ధా లన్నిటా అమెరికన్లు ఓడిపొయ్యారు. ఏ యుద్ధమూ బ్రహ్మాండమైన పరిమాణంలో జరగనూలేదు. ఇక రణరంగంలో ఆయన అవకాశాలు నిర్ణీతంగా ఉన్న ప్పటికీ, ఆయన తన ఆధిక్యతను గొప్పగా ప్రదర్శించనూలేదు.

అలెగ్జాండర్, ఫ్రెడరిక్, నెపోలియన్లతోగాక, ఆ తరువాత సంభవించిన అంతర్యుద్ధంలో పాల్గొన్న స్వదేశీయు లతో వాషింగ్టన్‌ను పోల్చటం న్యాయం. స్టోన్‌వెల్ జాక్ సన్‌లాటి మూఢవిశ్వాసమున్న సైనికనాయకచాతుర్యం కానీ, రాబర్ట్ ఇ. లీలోని పరిపూర్ణతకానీ వాషింగ్టన్‌లో కనిపించకపోవచ్చు. లీవలె, లేదా మెక్‌క్లెల్లాన్‌వలె ఆయన సైనికుల్లో ఉద్వేగంతో కూడిన అనురాగాన్ని ప్రజ్వరిల్ల జేయలేదు. ధనికవర్గాలను ఏవగించుకొన్న టామ్‌పైనీ

రచనలు చదివి కదలిక ఏర్పడినప్పటికీ, 'పెద్దమనుషులు' మాత్రమే ఆఫీసర్లుగా ఉండేందుకు యోగ్యులని ఆయన గాఢంగా విశ్వసించారు. నిజానికి ఆ ఆఫీసర్లకే ఆయనమీద ఎంతో అభిమానం. సామాన్యులను చేరే చాతుర్యం ఆయనలో లోపించింది. ఆయనకు మాసుపేరు పెట్టేందుకు చివరకు శత్రువులుగా ఉన్న బ్రిటిష్‌వారిలో సైతం ఎవ్వరూ ప్రయత్నించలేదు. తన సమానులలో చేసిన విందు సమయాల్లో ఆయన అందరికీ ప్రేమాస్పదుడుగా ఉండేవారు; సామాన్యసైనికులకు ఆయన ఎంతో కఠినుడుగానూ, భయంకరుడుగానూ కనిపించేవారు. సైనికుల కోర్కెలనుగూర్చి ఆలోచించటం, వారి ఇబ్బందులనూ, ప్రమాదాలనూ పంచుకోవటం చేసేవారేకాని, వారిలో ఒకరుగా ఉండేవారు కాదు. వారిని దూరాన ఉంచి, ఆనాడే సామాన్యులైన సైనికులెవ్వరూ తన దగ్గిరికి రాకుండా ఉండేందుకు అనేక కఠినమైన ఆజ్ఞల్ని జారీ చేశారు.

ఐతే ప్రజాసంబంధ కార్యకలాపాల్లో 18-వ శతాబ్దపు వర్జీనియా ప్లాంటర్ ఇరవయ్యోశతాబ్దపు హేమాహేమీలవలె ప్రవర్తించలేదనటం చిలిపితనంగా ఉంటుంది. ఐనప్పటికీ సమకాలికుల్లోకూడా, తాను ప్రత్యేకవ్యక్తిననే ధోరణిని ఆయన కనబరిచారు. ఈ యుద్ధమే తన సర్వస్వమూ అనే సంగతి ఆయనకు తెలుసు. ఐనప్పటికీ అత్యవసరపరిస్థితుల్లో ఆయన తగినంతగా భుజం వేయలేకపోయ్యారు. సారటోగాను గూర్చిన వార్త ఆయనకు చేరిన సమయంలో, ఆయన

ఛార్లెస్ విల్సన్ పియలేచేత తన చిత్రపటాన్ని వ్రాయించు కుంటున్నారు. ఆ వార్తను చదివి "ఆహా! బర్గాయినీ ఓడి పొయ్యాడా?" అని, తిరిగి చిత్రకారుని ఎదుట కూర్చు న్నారు. అంతకు మించి ఏమీ చేయలేదు. ఇక కారన్ వాలీస్ కాళ్లు తేలవేసి లొంగిపోయినప్పుడు, ఈ వార్తను స్వయంగా వ్రాయకుండా, తన సహచరుల్లో ఒకరికి ఆపని అప్పగించారు. ఇలాటి సంగ్రహితమైన ఘట్టాలు నిరాశను పెంపొందింపజేసేవరకూ ఉన్నవి.

మనం అమెరికన్ జనరల్స్‌లో మరొకరైన జార్జ్‌ని మరొకసారి చూస్తే, ఇవన్నీ గొప్పలోపాలని అనలేము. జార్జ్ బి. మెక్‌క్లెల్లాన్ అంతర్యుద్ధసమయంలో కొంతకాలం పాటు యూనియన్‌ను కాపాడాడనే కీర్తికూడా పొందాడు. వీరు ఉభయుల్లోనూ అణకువా, విశ్వాసమూ మిళితమై ఉండటం చిత్రమే! ఐతే సైన్యాలకు శిక్షణనివ్వటంలో మెక్‌క్లెల్లాన్ వాషింగ్‌టన్ కన్నా మిన్న. ఐనప్పటికీ ఆయన సుప్రసిద్ధుడవలేదు. తన శత్రువుల ఎదుట నమ్రతను ప్రదర్శించటం, విశ్వాసాన్ని తన పై అధికారులూ, తోటి ఉద్యోగులదగ్గర తలబిరుసుతనమూ అనేటంతవరకూ కన బరచటం చేశారాయన. ఇక వాషింగ్‌టన్ యోధుడు. ఎదురైన సమస్యా స్వరూపాన్ని తన మనస్సులో స్పష్టంగా ఉంచుకోగల సమర్థుడు. సైనికుడుగా ఆయన పొరబడితే, అది ఎప్పుడూ తొందరపాటు కారణంగానే జరిగేది.

దీన్నిబట్టి ఆయన పరిపూర్ణుడైన సైనికుడు కాదని తెలుస్తుంది. ఐనప్పటికీ ఎవ్వరూ తీర్చలేనన్ని కోర్కెలను — అసంభవమైన వాటిని వాషింగ్‌టన్‌లో చూడనవుతుంది. తమ ఆశయాలమీద బ్రహ్మాండమైన కాంతిని ప్రసరింప జేయగల సర్వసేనానిని కాంగ్రెస్ మొదట కోరింది. ఇంత వరకూ వాషింగ్టన్ ఎంతో సంస్కృతితో కార్యాన్ని నెర వేర్చి, శత్రుపక్షాన ఉన్న హోవేను సైతం మెప్పించ గలిగారు. పోతే తమ పట్ల సానుభూతి చూపగల ఆంగ్లే యుడు ఛథమ్‌లాటివ్యక్తి 1777 ఫిబ్రవరిలో హౌస్ ఆఫ్ లార్డ్సులో — "...అమెరికా ఒక పెద్ద అరణ్యమనీ, అక్కడి వారు చట్టబద్ధులు కాని దోపిడీముఠాలనీ, కనుకనే వారికి పోయ్యేదేమీ లేదనీ, ప్రజాధనాన్ని కొల్లగొట్టుకోవటమే వారి ఉద్దేశమనీ అనుకోవటం శుద్ధపొరపాటు. వీరి నాయ కుల్లో చాలామంది పెద్ద పెద్ద పణాలను ఒడ్డి మరీ యుద్ధంలోకి దిగారు...వీరి సైన్యాలను నడిపించే యీ పెద్దమనిషికి ఏటా నాలుగైదువేల ఆదాయమున్న ఎస్టేట్లు ఉన్నవని నాకు తెలిసింది" అన్నాడు. వాషింగ్టన్ విషయంలో ఫ్రెంచ్‌వారికి మరింత సదభిప్రాయం కలిగింది. వారిని సంతోషపెట్టేందుకే బహుశా ఆయన ఆదేశించబడిఉండొచ్చు. అలా ఐనప్పటికీ ఆయన అందులో బ్రహ్మాండమైన విజయాన్ని సాధించారు. ఇక్కడ వీరందరికీ ఒక పెద్ద మనిషి — గొప్ప సుగుణాలతో, అత్యంత విశ్వసనీయుడు కనిపించారు.

ఆ తరువాత కాంగ్రెస్ కోరింది — యూరపియన్ పద్ధతులమీద సైన్యాలను నడుపుతూ, ఖండంలోని నలు

మూాలలనుంచీ వచ్చిన సైనికులను, వృత్తిధర్మంగా సైనికులుగా ఉన్నవారితో పోరాడేందుకు సిద్ధపరచగల సేనానాయకుణ్ణి. 'ఆర్డర్, సక్రమవిధానం, సుశిక్షణ' అనేవి వాషింగ్టన్ నినాదాలు. నిజానికి ఆయన ఆశ్వికదళాన్ని, ఇతర ఆయుధధారుల్నీ కొంతవరకూ నిర్లక్ష్యంచేసినా ముఖ్యంగా పదాతిదళాలనుగూర్చే తీవ్రంగా ఆలోచించారు. ఐతే ఆయన దీర్ఘానుభవంగల సైనికులుండాలని కలలుగన్నారు. అదొక ముఖ్యమైన సత్యం. అందుకనే యుద్ధకాలమంతటా ఆయన కలతజెందే ఉన్నారు.

ఇక మూడోది – కాంగ్రెస్ – చాలామంది కొద్ది సైనికానుభవం ఉన్నవారూ, రెగ్యులర్‌గా సైనికులు కాని వారితో యుద్ధాన్ని సాగించే సేనానిని కోరింది. ఇలాటి రకరకాల మనుషుల్ని అదుపాజ్ఞల్లో ఉంచుతూ, వీరిలోని గుణ గుణాలను సక్రమంగా ఉపయోగించుకోగల వ్యక్తి కాంగ్రెస్‌కు అవసరమయ్యాడు. ఈ పరిస్థితుల్లో కాంగ్రెస్ వాషింగ్టన్‌నుంచి అధికంగానే వాంఛించిందని చెప్పాలి. తత్వరీత్యా, తన అమెరికన్ పరిస్థితుల్లో, యూరపియన్ తత్వానికి ఆయన పెద్దనీడగా రూపొందారు. వర్జినియా సరిహద్దు ప్రాంతాలలోని సంఘటనల తరువాత ఆయన స్వానుభవం అంత ఆనందదాయకమైనదేం కాదు. బంకర్, లేదా బ్రీడ్స్, హిల్‌నుంచి కౌపెన్స్ దాడులు వేటిల్లోనూ ఆయన పాల్గొవటం జరగలేదు. యీ దాడుల్లో పనిచేసినవారికి అధిక గౌరవం అందింది. దీన్నిబట్టి మిలిటరీలో

పనిచేయటం ఒక గొప్ప సుగుణమని ఆయన భావించక*
విముఖత్వాన్నికూడా చూపారు. ఆయనకు తగినంత
గాఢ రాఉన్నది. బ్రిటిష్ సైనికులు అప్పుడప్పుడు సమయం
చిక్కినప్పుడు మాత్రమే ఆయన్ను బాధపెట్టారేకాని
ఎప్పుడూ తాను అలాగే ఉండాలని ఆయన అనుకోలేదు.
యుద్ధరంగాన్ని మార్చకుండానే వారిని తుక్కుతుక్కుగా
కొట్టాలని ఆయన ఆశయం. ఇక్కడకూడా కాంగ్రెస్
మనుష్యమాత్రుడైన వానినుంచి ఆశించినదంతా ఆయన
నెరవేర్చారు. అమెరికామీద సైనిక శిక్షణలాటిదాన్ని
రుద్దేందుకు ఆయనెన్నడూ ప్రయత్నించలేదు. అమెరికన్
పరిస్థితులు ప్రత్యేకమైన పూర్వాచారపరాయణత్వాన్ని
అనుసరించి మిలిటరీకి సంబంధించిన సమస్యల్ని పరిష్క-
రించుకోవాలనే సత్యాన్ని ఆయన విస్మరించలేదు. నాయ
కత్వంలో ఆయన కార్న్‌వాలీస్‌ను పోలి ఉన్నారు. ఐతే
కార్న్‌వాలీస్ రెగ్యులర్‌గా యోధుడేగాక ఆయనచేతి

---

* కనీసం సుశిక్షణను పొందిన యుద్ధ సైనికుడుగా జాబితాల్లోకి ఎక్కేవరకన్నా ఇదేభావం ఆయనకు ఉన్నది. ఆ తరువాత కొద్ది సంవత్స రాలకు, యునైటెడ్‌స్టేట్స్‌కుగాను, తృప్తికరమైన సైనికదళాలను సమకూర్చేందుకు ఆయన ప్రయత్నించినప్పుడు, రెగ్యులర్ సైనిక దళాలను ఉంచుకోవటం అనవసరమని భావించారు. కనుకనే ఆయన, దేశరక్షణకు గాను సుశిక్షణను పొందిన సైనికదళాలుండాలన్నారు. ఈ సిద్ధాంతం కార్యరూపాన్ని ధరించేవరకూ ఆయన సజీవుడై ఉండలేదు. ఆయన తరువాతి తరాలవారుకూడా యీ ఆశయాన్ని పవిత్రంగా భావించినా, సాధించలేక పొయ్యారు.

కింద సుశిక్షణను పొందిన సైనికులున్నారు. వాషింగ్టన్ గురికూడా ఇదే!

ధనవంతుడైన పెద్దమనిషి, నిష్కళంకుడైన సేనాని, గొరిల్లాయోధుడు - కాంగ్రెస్ వాంఛించిన యీ లక్షణాలన్నీ జార్జ్ వాషింగ్టన్‌లో ప్రతిఫలించిఉన్నవి. ఇవిగాక ఇలాటివ్యక్తి తాను సివిలియన్ అనేభావాన్ని కూడా కలిగిఉండాలని కాంగ్రెస్ కోరింది. శక్తిసామర్థ్యాలున్న యీ సేనానాయకుడు హుందాతనంతో తనఅధికారాన్ని రెగ్యులర్ సైనికులమీదా, అసంపూర్ణంగా ఉన్న స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూన్న 13 వివిధరాష్ట్రాలనుంచి వచ్చిన సైనికులమీదా ప్రయోగిస్తూ, వారిని అదుపాజ్ఞల్లో ఉంచుకుంటూ కూడా కాంగ్రెస్ అధికారానికి నవ్వుతూ తలవొంచవలసి వచ్చింది!

ఇందులోని అత్యద్భుత విషయమేమంటే-అసంభవమైన దాన్ని కాంగ్రెస్ కోరి, దాదాపు దాన్నంతటినీ జార్జ్ వాషింగ్టన్‌నుంచి రాబట్టుకున్నది. ఈ గుణగణాలేగాక పైపెచ్చు ఎంతో అద్భుతమైన పట్టుదలగూడా ఆయనలో మూర్తీభవించిఉన్నది. ఫిట్జ్ పాట్రిక్ తయారుచేసిన వాషింగ్టన్ రచనలతాలూకు పెద్దగ్రంథం చాలామందిచేత సంపూర్ణంగా చదువబడుతుందని ఆశించలేము. యుద్ధం జరిగిన సంవత్సరాల తాలూకు ఉత్తర ప్రత్యుత్తరాలే 10,000 పేజీలుండటంవల్ల సంపూర్ణ పఠనం తలనెప్పి తెప్పిస్తుంది. అందునా చెప్పిన విషయమే తిరిగి తిరిగి చెప్పబడటంవల్ల పాఠకుని కుతూహలం ఇనుమడించదు. ఐతే ఆయన వ్యక్తిత్వ

తత్వాన్ని అర్థం చేసుకునేందుకు యీ పునశ్చరణ అవసరమే మరి! ఆయన కార్మికునివలె సుత్తిదెబ్బలుకొడుతూ, సరళంగా ఉండే వచనంలో, అద్భుతంగానూ లేదా హాస్యపూరితం గానూ ధ్వనించకుండానే, క్షమార్పణచెప్పుకొనే ధోరణి, లేదా ఉబ్బవేసే ధోరణి లేకుండానే – ముందుకు సాగుతూ, తాను తగినంత వ్రాశాననే అభిప్రాయంతో ఆగటంలాటిది కనిపిస్తుంది, ఆశలు ఎంత అడుగంటిపోయినప్పటికీ. ఈ యుద్ధ సమాప్తికొరకై ఉన్న అవకాశాల విషయమై చర్చించటంలో ముఖ్యంగా యీ ధోరణి కనిపిస్తుంది. ఆయన గురంతా విజయంమీదనే ఉన్నది. బ్రిటిష్ సేనానులవలె ముఖ్యమైన దాడి ఎలాఉన్నా, ఆపక్కన ఏర్పడే అనుకూలతలకొరకై ఆయన ఎన్నడూ గురిచూడలేదు, భారీ ఎత్తున ముఖ్యమైన స్థానాలలో యుద్ధాన్ని సాగించటంలో ఆయనకు ప్రావీణ్యత లేదు (బహుశా యీ విషయాన్ని ఆయన నమ్మారు. అది కాంగ్రెస్ చూసుకొనే బాధ్యత కాని, తనది కాదు). 1775–1776 లో కెనడాదాడిలో అపజయం ఎదురయ్యాక, ఇలాటి ఆశాపూరితమైన ప్రయోగాలను ఆయన ప్రోత్సాహ పరచ లేదు. ఇందుకుమారుగా ఏది ఐఉండాలో దానిమీదనే తనశక్తిని కేంద్రీకరించారు – ఒక పెద్ద సైన్యం, ఇంతకన్న ఉత్తమ స్థాయిలో దాన్ని పోషించటం, రాష్ట్రాల నుంచిమరింత వేగంగానూ, విశాల భావంతోనూ అంద వలసిన విరాళాలు, కొద్ది పరిమితిలో కన్నా బ్రిటిష్‌వారి నౌకాబలాధిక్యతను పడగొట్ట గల నౌకాబలం

మొదలైనవి. ఎంతోకాలంగా ఆయన కలలుగన్న బహూకరణ యార్క్‌టౌన్ దగ్గర ఎదురయింది.

'1789 లో అమెరికన్ల తిరుగుబాటు చరిత్ర' ను వ్రాసిన దక్షిణ కరొలినా నివాసి డేవిడ్ రామ్సే ఇలా అన్నాడు: "ఈ యుద్ధం నైపుణ్యాన్ని కోరటమే గాక, నిపుణుల్నికూడా రూపొందించింది." ఈ పరిశీలనావాక్యాలు వాషింగ్టన్‌కు సరిగ్గా సరిపోతవి. 'ఒక చిన్న మిలిటరీ కలొనెల్' అని లార్డ్ హోవే సెక్రెటరీ 1776 లో చీదరించుకున్నాడు. కాని వాషింగ్టన్ ఎన్నడూ ఆ స్థితిలో లేరు. అమెరికాలోని ఆయన విమర్శకులు ఆయన ప్రజాగౌరవాన్ని పొందేటంత గొప్పవాడుగా రూపొందలేదని అన్నారు. వీరే - యుద్ధానంతరం, ఆయన పొందిన గౌరవాలకొరకై ఆయనెన్నడూ ఆశించి ఉండలేదనీ అన్నారు. యుద్ధసమయాన ఆయన వ్రాసిన 10,000 పేజీలనుంచీ ఇదంతా ఎలా సాధ్యపడిందో మనం గ్రహించవచ్చు. వీటిల్లో - ఆయన విశ్వాసాన్ని, విజ్ఞానాన్ని, విశాలత్వాన్ని అంచెలంచెలుగా ఏ విధంగా పెంపొందించుకున్నారో మనం కనుక్కోగలం. యుద్ధ సమాప్తిదశలో ఆయన్ను కలుసుకున్న ఫ్రెంచ్ ఆఫీసర్లుకూడా ఇదే కథానుక్రమణికను చెపుతూన్నారు. వారు మాట్లాడే వ్యక్తి అందరిచేతా గౌరవించబడేవాడూ, కొందరిచేత పూజింపబడేవాడూను.

ఈ అత్యవసర పరిస్థితుల్లో రూపొందించబడిన అమెరికన్ కౌశలానికి ఆయనొక్కరే తార్కాణం కారు. ఆయన

కీర్తిప్రతిష్ఠలు బహుశా హొరేషియో గేట్స్ మొదలైన వారు దిగజారటంద్వారా పెంపొంది ఉండవచ్చు. ఆయన స్థితిలో ఉన్నవారెవరైనా ఆ మాత్రమన్నా చేసి ఉండేవారని కూడా వాదించబడవచ్చు. ఫిలిప్ షూయిలర్ తనకు న్యూయార్క్ మీద ఉన్న ద్వేషాన్ని విడనాడి ఉండొచ్చు. అదేవిధంగా వాషింగ్టన్ కూడా వర్జీనియా వాసిగా, న్యూఇంగ్లండ్, తదితర ప్రాంతాలమీద ఉండే ద్వేషాన్ని వొదిలించుకొని ఉండొచ్చు. నాథేనియల్ గ్రీనీ, రోడ్ ఐలెండ్ క్వాకర్ జనరల్, ఎంతో విశ్వాసనీయంగా పోరాడి, తానొక గొప్పసేనాని అని తన దేశీయులను తృప్తిపరిచి ఉండొచ్చు. తెలివిగల, మన్నుతిన్న పాముల్లే పడిఉంటూ, మానవద్వేషాన్ని బైటపెట్టే ఛార్లెస్ లీ యీ దారిలో యథాస్థానంలో ఉండి ఉండొచ్చు. ఐతే లీ 'చర్చి వార్డెన్' అని ద్వేషభావంతో స్వస్థానంనుంచి, 1775 లో తొలిగించబడిన ఆర్టిమెస్ వార్డు అంతకన్న గొప్పసేనాని అనే విషయాన్ని రుజువుచేసే అవకాశాలు లేకుండా పోయినవి. తాను ఆశించిన కీర్తిప్రతిష్ఠలకొరకు తహతహలాడిన బెనెడిక్ట్ ఆర్నాల్డ్ తనకు ఎదురునిలిచిన దుష్టశక్తుల్ని అగ్నికాహుతిజేసి ఉండేవాడు. కాని అందుకు విరుద్ధంగా ఆయన దేశద్రోహిగా మారాడు. ఇవన్నీకూడా జరగని విషయాలు. సత్యమేమంటే – కాంగ్రెస్ (అమెరికా) తాను ఆశించినదానికన్న అత్యధికంగా సాధించిందంటే – అది

కలోనెల్ వాషింగ్టన్‌ను ఎన్నుకోవటంవల్లనే. ఆయనలో చిన్న చిన్న లోపాలు ఉన్నప్పటికీ, అప్పటికి 'అందు బాటులో' ఉన్న యీవ్యక్తి తన ఉనికి తప్పనిసరి అని రుజువు చేసుకున్నారు.

---

# 4. ప్రెసిడెంట్ వాషింగ్టన్

రైతుగా ఉండే వాషింగ్టన్—రెండవ సినిసిన్నటస్ ఐనప్పటికీ — నాగలి వొదిలి యీ గొప్ప జాతిని పరిపాలించేందుకుగాను ఆహ్వానించబడుగాక.

(డిలావేర్‌లోని వెల్లింగ్టన్‌లో 1788 జూలై 4 శుభ సమయాన చెప్పబడిన మాటలు.)

## "నాలో నేనే విరమిస్తున్నాను"

జనరల్ వాషింగ్టన్ తిరిగి రైతువాషింగ్టన్ అయేందుకు వాంఛించారు. ఆయన మానసికంగాను, శారీరంగానూ కూడా ఎంతో అలసి ఉన్నారు. ఆయన ఆరోగ్యమంత బాగాలేదు. ఆయన దంతాలు చాలా బాధపెట్టినవి. మోయలేని బాధ్యతను తొమ్మిది దీర్ఘ సంవత్సరాలపాటు భుజస్కంధాలమీద భరించారు. 1783–వ సంవత్సరానంతరం, తానూ ఒక పౌరుడేననీ, ఐతే తనకు ఎలాంటి రహస్య జీవనమూ ఉండబోదనే సత్యాన్ని ఆయన గ్రహించారు. ఐతే తనకూ కూడా శాంతియుతమైన స్వప్నాలుండాలనీ, ఏదో పద్యకావ్యానికి సంబంధించిన జీవితంలాటిది అవసరమనీ భావించటం సహజమే మరి.

కాని ఇలాటి వాంఛలు పరిస్థితులను అనుసరించి విడనాడబడినవి. ఐనప్పటికీ ఆయన 1784 మొదటి మాసాల్లో వ్రాసిన ఉత్తరాలలో ఇలాటి స్వప్నాలను గూర్చిన ఛాయలు మనకు కనిపిస్తవి. మౌంట్ వెర్నన్‌తో గర్వపడవలసిన యీ ప్లాంటర్, తన ఉత్తరాల్లో ఎంతో వినయం ఉట్టిపడేవిధంగా తన 'కుటీరం' అనీ, 'నివాసం' అనే పదాలను తన గృహాన్నిగూర్చి ఇంతకు ముందెన్నడూ ప్రయోగించని పదజాలాన్ని వాడారు. ఆయన తననుతాను ఇలా చూసుకున్నారు: "...తానొక అమెరికన్ పౌరుడు; పొటోమాక్ నదీ తీరాన స్వజీవితాన్ని వెళ్లబుచ్చుతూ... తన స్వంతమైన ఫిగ్ వృక్షంకిందా, ద్రాక్షతీగెకిందా—కాంప్‌లోని రొదా, కోర్టులోని గొడవలూ లేకుండా ప్రశాంత జీవితాన్ని గడిపే వ్యక్తి." ఐతే జీవిత ప్రవాహంలో మెల్లిగా కదిలిపోతూ, తుదకు శాశ్వత శాంతిని పొందవలసి వచ్చింది. "నేను ప్రజాసేవకు సంబంధించిన కార్య కలాపాల నుంచే కాదు, నాలో నేనుకూడా విరమిస్తున్నాను" అన్నారాయన.

తాను సగం తెలిసిఉండే సిన్సిన్నట్టస్ పాత్రను ప్రదర్శిస్తున్నానని వాషింగ్టన్ బహుశా భావించి ఉండొచ్చు. చాలామంది వ్యక్తులు ఆయన్ను ఆదేశభక్తునితో పోలుస్తూ, ఆయన్ను నిరాడంబర జీవిగా చూస్తున్నారేకాని, ప్రముఖుడైన భూస్వామిగా భావించటంలేదు. ఏమైనప్పటికీ కొద్ది కాలంపాటు ఆయన తన స్వాప్నిక ప్రపంచంలో ఆనందించ

గలిగారు. ముందుముందు తనకెంతో తీరిక ఉంటుందనే తలపుతో ఆయన ఎన్నో పుస్తకాలకు ఆర్డర్ చేశారు. (వీటిల్లో కొన్ని దేశాటనానికి సంబంధించిన పుస్తకాలు. ఇవి ఆయన రెండవ స్వప్నం—లాఫయిట్టే మొదలైనవారు ఫ్రాన్స్‌లో ఉండి తనకు ఘనస్వాగత మిస్తామని వాగ్దానం చేసి ఉండటం తాలూకు క్రియారూపమిది.) ఆయన ట్రూరో పారిష్ అధ్వర్య సభ్యత్వానికి కారణాలు తెలియపరచకుండానే రాజీనామా ఇచ్చారు. బహుశా ఇదికూడా ఒక చిన్న ప్రజాసంబంధ కార్యకలాపమనీ, ఇలాటివాటిని వొదిలించుకునేందుకు ప్రయత్నించాలనీ ఆయన భావించి ఉండొచ్చు. అడిగినంత మాత్రాన వర్జీనియా రాష్ట్రశాసన సభకు సభ్యత్వాన్ని సంపాయించటం, లేదా గవర్నర్ పదవే లభించటం జరుగుతుందని ఆయనకు తెలిసినా, వర్జీనియా రాజకీయ జీవితంలో ప్రవేశించేందుకుగాను ఆయన ఎలాటి ప్రయత్నమూ చేయలేదు. ఆయన కేవలం గౌరవ ప్రధానమైన ఒకే ఒక ఉన్నతమైన స్థానాన్ని ఉంచుకున్నారు. సొసైటీ ఆఫ్ సిన్సిన్నటి అనేది పూర్వం యుద్ధంలో పనిచేసినవారు ఏర్పరిచిన సంఘం. దీనికి వాషింగ్టన్ ప్రెసిడెంట్ జనరల్. ఐతే యీ సమాజ వ్యవస్థాపకుల్లో ఆయన లేరు. ఇందులో ఉన్నతస్థానాన్ని పొందాలని ఆయన ప్రయత్నించీ ఉండలేదు. ఉత్తరోత్తరా తన వ్యవహారాలను మాత్రమే తాను చూసుకో గలుగుతానని ఆయన ఆశించారు.

ఐతే యీాస్వవిషయాలనేవి బహుళంగా ఉండటంవల్ల ప్రశాంత జీవితం, లేదా తగినంత విశ్రాంతి ప్రస్తావనలే మనసులోకి రాకుండా చేయగలిగిన విధంగా ఉన్నవి. మూడు పురాతన కుతూహలాలు ఆయన్ను చుట్టుముట్టినవి. మొదటిది: మాంట్ వెర్నన్‌లోని స్వగృహం ఆయన ప్రత్యేకంగా గర్వపడుతూండేది. రెండోది వ్యవసాయాన్ని చేయటం. మూడోది పశ్చిమాన ఉన్న భూములను అభివృద్ధి చేసుకోవటం. ఈమూడూకలిసి ఆయన కాలాన్నంతా హరించివేయటంతో యుద్ధానంతర ప్రశాంతత అనేదాని ఛాయలుకూడా ఆయనకు దరిదాపుల్లో కనిపించలేదు.

మాంట్ వెర్నన్-1757 లో 'కుటీరం' అన దగిందే. కాని ఆతరువాత ఆ ఎస్టేట్‌ను ఆయన ఎంతో అభివృద్ధి చేశారు. కాని 1783 కల్లా, అమెరికన్ స్థాయిల ననుసరించి అదొక భవనం, ఒక గొప్ప ఎస్టేట్ అనదగి ఉన్నది. ఈనాడు యాత్రీకులు దీన్ని పరిపూర్ణ రూపంలో చూస్తున్నారు. కొన్నిసంవత్సరాల అనంతరం అది వాషింగ్టన్ కళ్లకు సగం మాత్రమే పూర్తయిన చిత్రంవలె కన్పట్టింది. ఆయన ఉత్ప్రేక్షాలంకారాలతో ఫిగ్‌వృక్షమూ, ద్రాక్షతీగెల విషయమై ప్రస్తావించినప్పటికీ, నిజానికి ఆయన వాటిని నాటి పెంచేవరకూ, వాటికింద కూర్చునే అవకాశాలు ఏవిధంగానూ లేవు. కనుక వాషింగ్టన్ తిరిగి వచ్చిన నెలలోనే ఆయన పొగగొట్టాలు, పిజ్జాను సాపు చేయటం, తన కొత్త గదికి అలంకరణలు, లేదా బాంక్వెట్ హాల్‌కు అలంకరణాల

విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపసాగారు. ఆనాటి నుంచీ ఆయన ఉత్తరాలు, డైరీ (యుద్ధసమయంలో దీన్ని ఆయన దాదాపు మూలపారేశారు), మౌంట్ వెర్నన్ మీది శ్రద్ధా, దాని అలంకరణాలూ మొదలైన వాటిని గూర్చి ఆయన తీసుకున్న శ్రమకు తార్కాణాలుగా ఉంటూన్నవి. కొత్తగా జర్మనీనుంచి వచ్చిన సేవకులను ఆయన ఒడంబడిక మీద 'కొని' ఇటుకలను పేర్చేందుకుగాను నియోగించారు. గృహాంతర్భాగంలో గోడలకు కాగితాలు అంటించటం, పుస్తకాల అల్మారులు నిర్మించటం, తీవ్రమైన సూర్యకాంతి లోనికి ప్రవేశించకుండా బ్లైండ్స్ దించటం మొదలైన పనులమీద ఆయన శ్రద్ధచూపారు. గృహోపరిభాగంలో ఆయన ఒక పెద్ద గ్రీన్‌హౌస్‌ను నిర్మించారు. రోడ్లు వేయించి, నడిచేందుకు అనువుగా దారులు నిర్మించి, పచ్చిక బయళ్లను వృద్ధిచేసి, అనేక చెట్లను నాటించారు. ఐస్ హౌస్‌ను వేరొక రూపాన నిర్మించారు. లేళ్లు పెరిగేందుకు వీలుగా ఒక పార్కు నిర్మించి, చుట్టూ తీగెలు వేయించారు. ఒక పళ్లతోటను రూపొందించారు.

ఆ భవనానికీ, దానికి సంబంధించిన ఖాళీస్థలానికీ ఆవల మౌంట్ వెర్నన్ తాలూకు ఐదు క్షేత్రాలు, లేదా ప్లాంటేషన్స్ ఉన్నవి (వీటిల్లో ఏపదమైనా సరిపోతుంది. వాషింగ్టన్ యీ రెండు పదాలనూ ఉపయోగించేవారు. ఎందుకంటే ఆయన పత్తి పండించేవారుకారు: గోధుమ క్షేత్రంమీది పంటనే పండించేవారు). మరోవైపు ఆయన పనివాళ్లు —

ముసలివారూ, పిల్లలతోసహా - 200 మంది ఉండేవారు. వీరిని ప్లాంటేషన్ బానిసలు అనేవారు. వాషింగ్టన్ దాదాపు రిక్తహస్తాలతో ఇంటికివచ్చాడు. ఆయన దగ్గర దాదాపు రొఖ్ఖం ఏమీలేదు. కనుక స్వవిషయాలను వెనువెంటనే సక్రమంగా అమర్చుకోవలసి ఉన్నది. అమెరికన్ పౌరులలో ప్రథముడుగా భావించబడి, కాంగ్రెస్ ప్రత్యేకమైన ఎల వెన్సు ఇస్తామనే ప్రస్తావనను అంగీకరించేందుకు ఆయన స్వాభిమానం అడ్డపడింది తాను హృదయపూర్వకంగా వ్యవసాయానికి అంకితమై పోవాలని ఆయన వివేకం బలాత్కరించింది. అదేవిధంగా ఆయన తత్వంకూడాను. ఈ విషయంలోమాత్రం వాషింగ్టన్, థామస్ జఫర్సన్‌లు ఒకే విధమైన భాష మాట్లాడారు. ఐతే వ్యవసాయం ఎంతో శ్రమపడి చేయాలి. అడుగడుగునా నిరాశలు ఎదురౌతూనే ఉంటవి. ఐనప్పటికీ వ్యవసాయమంటే వాషింగ్టన్ చెవికోసుకునే వారనేందుకు ఎలాటి సందేహమూ లేదు. ఇంగ్లీషు వ్యవసాయ దారుడైన ఆర్థర్ యంగ్ సలహాలను తీసుకొని, తదనుగుణంగా ఒక ధాన్యపుకొట్టును కట్టించి, వ్యవసాయ కర్మకాండలను తనిఖీచేసేందుకు ఆయన ఒక ఇంగ్లీషు వ్యవసాయదారుణ్ణికూడా పిలిపించటం జరిగింది. పెంపుడు జంతువుల్ని అభివృద్ధిచేయటం, కొత్త జాతుల్ని సృష్టించటం, కొత్త కొత్త పంటలమీాద పరిశోధనలు చేయటం, భూసారం తగ్గి పోకుండా పంటల్లో మార్పులు చేయటం మొదలైన పనులు చేశారు.

వాషింగ్టన్ శ్రద్ధాసక్తులన్నీ ఒక్క మౌంట్ వెర్నన్ మీదనే కేంద్రీకరించబడలేదు. పశ్చిమానఉన్న ఆయన భూముల మీద ఆదాయం దాదాపు ఏమీ రావటంలేదనే చెప్పాలి. వీటిల్లో కొన్నిభూములు వాషింగ్టన్ యాజమాన్యాన్ని అంగీకరించని రైతులచేతా, దారేపొయ్యే దానయ్యలచేతా ఆక్రమించబడినవి. కనుక 1784 ఆకురాలే కాలంలో ఆయన మరొకసారి అల్లెఘనీస్ కొండల్ని- ఎన్నో పాతజ్ఞాపకాలను కదిలించే ఆపాతదారినేపడి, అసలు అక్కడేం జరుగుతున్నదో తెలుసుకునేందుకు పయనమయ్యారు. ఐతే, వర్జీనియాలోని తనభూములను ఆక్రమించిన వారినుండి ఆయనకు తృప్తి కలగలేదు. ఆపైన ఓహియో, గ్రేట్ కనవాహాలకు పయనమై, అక్కడి తనహక్కులను తణిఖీ చేసుకోలేక పోయా రాయన. ఈ ప్రయాణం ముందు ముందు గొప్పఫలితాలకు దారితీసినా, ఆక్షణంలో ఆయన జీవితంలో, ముఖ్యంగా మౌంట్ వెర్నన్‌లోని ఆయన విధులకు అంతరాయాల్ని కలిగించింది. 1785 ఎండాకాలంవరకూ వాషింగ్టన్‌కు సెక్రటరీ లభ్యమవలేదు. ఈ సందర్భంలో ఆయన ఒక స్నేహితునితో యీ విధంగా గొణిగారు:

"ఈ రోజుల్లో నేను వ్రాస్తున్నదాంట్లో సగంకూడ యుద్ధ సమయంలో వ్రాయలేదని నమ్మకంగా చెప్పగలను...విదేశీయులనుంచి అర్థంపర్థం లేని అనేక ఉత్తరాలు వస్తున్నవి. పోతే డిక్, టామ్, హారీ మొదలైన అనామకుల విషయమై-వారెప్పుడో ఖండం నలుమూలలనుంచీ వచ్చి కొన్నాళ్ళపాటు బహుశా సిపాయిలుగా ఉండి ఉండొచ్చు-వారిని గూర్చిన అనేక ప్రశ్నలు, స్వరాష్ట్రాన్ని విడిచి వేరువేరు సర్వీసులకు

వెళ్ళదల్చుకున్నవారు సర్టిఫికెట్ల కొరకై వ్రాసే ఉత్తరాలు, అనేక కాగితాలకు నకళ్లను కోరే అర్జీలు...ఇలాటి అనేక విషయాలతో నన్ను వీరందరూ బాధపెట్టి ఉండకూడదు. ఐతే ఇలాటి వాటన్నిటికీ ఏదో జవాబు ఇవ్వవలసే ఉన్నది. ఫలితంగా నా దినచర్య అంతా తలక్రిందు లౌతున్నది. నాకు విశ్రాంతి లేకుండా పోయింది. ఈ బరువు భారాలు నన్నెంతో కుంగదీస్తున్నవి—"

ప్రజలు ఆయన్ను అప్పులడిగేవారు. స్నేహితులూ ఇరుగు పొరుగులవారూ ఆయన సలహాలూ, అభిప్రాయాలను అర్థించేవారు. ఆయన బంధువర్గాలవారుచేసే అనేకపనులు విజ్ఞతలేనివి, అనేకసందర్భాలలో పరాజయాన్ని పొందే వాటిని ఆయన పరిశీలించాలని ఆత్మ ఘోషిస్తూ ఉండేది.

ఇదిగాక తనను సిన్సిన్నట్టితోపోల్చి ఉండటంవల్ల దాని బరువు భారాలుకూడా ఆయనమీద పడినవి. ఈ సంఘం ఏర్పడిందో లేదో, అనేక గాష్ట్రాలలో పెద్దగొడవలు తల లెత్తి దాని ప్రెసిడెంట్ జనరల్‌ను చికాకు పరచినవి. ఐతే యీ సంఘంలోని సభ్యులు తిమవల్ల ఎలాటిహానీ కలగదనీ, దీన్ని సిన్సిన్నట్టస్ పేరిట ఉద్భవింపజేసిన కారణంగా, దీని ఆదర్శాలన్నీ శాంతిభద్రతల వైపే మొగ్గి ఉన్నవనీ నమ్మారు. ఈ సంఘానికి శత్రువులైనవారు ఇదొక హాస్యాస్పదమైన సంఘమనీ (ఎందుకంటే దీనిలోని సభ్యత్వం వంశపారం పర్యత కలిగి, ఆఫీసర్లకుమాత్రమే కేటాయించబడిఉన్నది), ఎంత హీనస్థితికి దిగజారినా, దానిలోని అంతరాంతరాల్లో ముందు ముందు మహా ధనికవర్గాలు ఉండబోతున్నారనీ అన్నారు. ఈ అభ్యంతరాలను సమాధాన పరిచేందుకు వాషింగ్టన్

శక్తి వంచన లేకుండా ప్రయత్నించారు కాని, ఈ సంఘం మాత్రం ఆయన్ను కలవరపాటుకు గురిచేసింది.

ఆయన నలుగురిమధ్యా ఉండటానికి ఉవ్విళ్లూరే తత్వమున్నవాడైనప్పటికీ, ఆయన ఆకలి మౌంట్ వెర్నన్‌లో మొహంమొత్తేటంతవరకూ తీరుతూన్నది. ఆయనా, ఆయన భవనమూ అనేకమంది యాత్రీకులకు దర్శనయోగ్యమైన స్థలమైంది. పాతస్నేహితులు మొదలు పరదేశీయులవరకూ ఆయన అతిథిగృహాలనూ, గదులనూ ఆక్రమిస్తూ, వారం తరువాత వారంగా, చలికాలం ఎండాకాలం అనే భేదం లేకుండా ప్రవాహంగా వచ్చిపడుతూ, ఆయన ఆహారపదార్థాలను టన్నులలోనూ, ద్రాక్షాసవాన్ని గాలన్లలోనూ పీల్చిపారేయసాగారు. 1785 లో వాషింగ్టన్, ఆయన కుటుంబీకులూ, అనేకమంది అతిథులూ నిద్రిస్తూన్న సమయాన, అర్ధరాత్రి ఒకానొక ఫ్రెంచ్ శిల్పి హూడన్ అనే ఆయన వాషింగ్టన్ శిల్పాన్ని చెక్కే ఉద్దేశంతో వచ్చి, అందరికీ నిద్రాభంగంచేశాడు. ఏదోవిధంగా హూండన్‌కూ, ఆయన ముగ్గురు సహాయకులకూ ఒక గది ఇవ్వబడింది. ఆయనక్కడ ఉండగానే ఇంటికప్పు కొంతభాగం మరామత్తు కావలసిరావటం, జార్జ్ ఆగస్టీన్‌కూ (లుండ్ వాషింగ్టన్ ఎస్టేట్ మేనేజర్ స్థానాన్ని ఆక్రమించిన జ్ఞాతి), మార్తా వాషింగ్టన్ మేనకోడలైన ఫ్రాన్సెస్ బస్సెట్‌కూ వివాహం ఆ భవనంలోనే జరగటమూ సంభవించినవి. జూన్ 1785 లో కాని మౌంట్ వెర్నన్ యజమాని తన డైరీలో

యీవిధంగా వ్రాయలేకపోయ్యారు: "నేను యుద్ధానంతరం తిరిగివచ్చాక వాషింగ్టన్ సతితో సహభోజనం చేసిన మొట్ట మొదటి సంఘటన ఇది!" ఇలాటి ఒంటరిపాటు బహుఅరుదు.

ఏమైనప్పటికీ ఈ సంవత్సరాలలో జార్జ్ వాషింగ్టన్ పూర్వ మెన్నడూ అనుభవించనంత సుఖసౌఖ్యాలను అనుభవించారు. ఉత్తరప్రత్యుత్తరాలు ఒకవైపు తల నొప్పిగా ఉన్నా, ప్రపంచం నలుమూలలనుంచీ వచ్చిపడే ప్రశంసలు ఆయన కెంతో తృప్తి నిచ్చినవి. స్పెయిన్ప్రభువు ఆయన కొక కంచరగాడిదను బహూకరించగా, ఆయన దానికి సున్నితమైన హాస్యంతో కూడిన 'రాయల్ గిఫ్ట్' అనే పేరు పెట్టారు. ఒకానొక ఆంగ్లేయుడు ఆయనకు చలువరాళ్లతో కట్టబడిన అగ్నిగుండాన్ని బహూకరించాడు. ఒకానొక ఫ్రెంచ్ పౌరుడు ఒక వేటకుక్కల గుంపును పంపాడు. మరొక యూరపియన్ జమీందారు తన మిలిటరీనాయకులబొమ్మలున్న గాలరీకి వాషింగ్టన్ చిత్రపటాన్నికూడా చేర్చాలనే కుతూహలంతో ఒక చిత్రపటాన్ని అర్థించాడు. వర్జీనియా కలొనెల్ మిలిటరీ యూనిఫారమ్‌లో ఉండగా వ్రాయబడిన చిత్రపటానికి తగినస్థానం ఇప్పుడు లభించింది కదాఅని వాషింగ్టన్ భావించారు.

ఇతర పరిహారాలుకూడా లభ్యమైనవి. మెల్లి మెల్లిగా ఆయన దినచర్య చెడకుండానూ, అతిథులకు ఇబ్బంది కలుగకుండానూ సమర్థించుకోగలిగారు. పోతే పరిశ్రమకుగాను ఆయన ప్రతిరోజూ తన క్షేత్రాలను గుర్రంమీద స్వారీ

చేస్తూ చుట్టివచ్చేవారు. చలికాలంలో నక్కలవేటలో ఆనందించేవారు. తాను ఆశించిన హుందాతనం మౌంట్ వెర్నన్‌కు వస్తూండటాన్ని గమనిస్తూ ఆయన ఆనందించేవారు. యాత్రీకులు వాషింగ్టన్ కాస్త బిగుసుకునే రకమనీ, మార్తా చాలా దయార్ద్రహృదయ అనీ అనుకునేవారు. జాకీకుస్టిస్‌తాలూకు ఇద్దరుపిల్లల్నీ, వారి తల్లి మరణానంతరం, వాషింగ్టన్ పెంచుకున్నారు. ఈ పిల్లల పెళ్లి పేరంటాలలో ఆయన నిమగ్నులయ్యారు.

వీటన్నిటినీ మించి ఆస్తిపెంపకాన్నిగూర్చిన కుతూహలం ఆయనకు అత్యధికంగా ఉన్నది. 1782 లో ఆయన న్యూయార్క్‌కు ఉత్తరాన పయనించి, అక్కడ కొంత భూమి కొన్నారు. వర్జీనియా, ఉత్తరకరొలినాలమధ్యఉన్న డెస్మల్‌శ్వాంప్‌పట్ల ఆయన కుతూహల మింకా క్షీణించలేదు. ఇంటికి సమీపంలోనే ఉద్విగ్నమైన అభివృద్ధిసూచనలున్నవి. నిజానికి ఆయన 1784 లో పశ్చిమానికి చేసిన ప్రయాణం వీటి పరిశీలనార్థమే!వర్జీనియా, పశ్చిమప్రాంతమూ జలమార్గాన కలుపబడాలనే విషయంలో ఆయన సమాధానపడినారు. పొటోమాక్‌నది ఎగువకు చాలావరకు నౌకాయానానికి అనుకూలంగా ఉన్నది. ఓహియోనది కలిసే చోట కొద్దిదూరంమాత్రమే ఇది అనువుగా లేదు. అవసరమైన అభివృద్ధులు చేయబడినప్పుడు (వీటిల్లో ముఖ్యమైనది పొటోమాక్‌నది తాలూకు జలపాతం చుట్టూ తవ్వబడే కాలువలు) ఈ రహదారిమీద ఏర్పడే ప్రయాణరద్దీలను

గూర్చి, అవన్నీకూడా తన ఇంటిగుమ్మంముందునుంచే వెళ్ల టాన్నిగూర్చి ఆయన చిత్రీకరించుకున్నారు. వీటి ఫలితాలు-ముఖ్యంగా వ్యాపారాభివృద్ధీ, వెనుకబడిన దేశంలో త్వర త్వరగా స్థిరనివాసాలు ఏర్పడటమూ, అల్లెఘునీపర్వతశ్రేణుల దగ్గరి భూస్వాములకు పెద్ద పెద్ద లాభాలు రావటమూ, చివరకు దేశంలోని ప్రజలను యూనియన్‌లో కట్టిపడవేయ గల పరిస్థితులు ఏర్పడటమూను. అలా కానట్లయితే, ఓహియోలోయలకు బహిర్ద్వారాలుగా ఉన్న మిసిసిపీ, గ్రేట్ లేక్స్‌మీది అజమాయిషీ తమ చేతుల్లో ఉంచుకున్న స్పెయిన్, బ్రిటన్‌లు చెప్పే మోసపు మాటలకు యీ ప్రజలు లోబడిపోవటం జరగవచ్చు.

ఈ పథకాన్నిగూర్చి వాషింగ్టన్ ఆలోచించినకొద్దీ అది మరింత ఆకర్షణీయంగా కన్పట్టింది. ఉత్తరోత్తరా తన యీ సాహసం తనను ఎక్కడికి నడిపిస్తుందో తెలుసుకోకుండానే, ఆయా విషయాలను కదిలించటానికి ఆయన పూనుకున్నారు. ఇలాటి పథకాలతాలూకు విశదమైన చర్చలు మధ్యరాష్ట్రాలలో జరుగుతూన్నవి. జేమ్స్‌నదిగుండా నదీమార్గాన్ని ఏర్పరచటంకూడా ఒక ఫాషన్‌గా ఉన్నది. వర్జీనియాకూ, మేరీలాండ్‌కూ కూడా పొటోమాక్‌నది మీద హక్కులుండటంవల్ల, రాజభక్తులైనవారి ద్వేష కారణంగా, ప్రస్తావనలు ఫలించకపోవచ్చు. ఐతే వాషింగ్టన్ తనకున్న పేరుప్రఖ్యాతులను అమితవేగంతో అమలు జరిపి 1784-1785-వ సంవత్సరాల్లో రెండు రాష్ట్రాల శాసన

సభలనుంచీ అంగీకారాలను పొందగలిగారు. వర్జీనియాకు కమీషనర్ హోదాలో ఆయన మేరీలాండ్ ప్రతినిధులను కలుసుకున్నారు. పొటోమాక్ రివర్ కంపెనీ స్థాపితమై, దానికి వాషింగ్టన్ ప్రెసిడెంటయ్యారు. దీన్ని యీ రెండు రాష్ట్రాలవారూ బలపరుస్తూ, తమ సహకారానికి హామీల నిచ్చారు. జేమ్స్‌రివర్ కంపెనీకూడా స్థాపించబడింది.

1785 వసంతకాలంలో పొటోమాక్ కమీషనర్లు, కలిసికట్టుగా చేసుకునే ఒప్పందపు పత్రాలు మౌంట్ వెర్నన్‌లో సంతకాలు చేయబడినవి. ప్రతిసంవత్సరమూ మేరీలాండ్, వర్జీనియాలు కలుసుకుంటూ ఉండాలనే సూచన సర్వజనసమ్మతంగా రూపొందింది. క్రమంగా యీ అభిప్రాయానికి తగినంత సావకాశంకూడా లభించింది. 1786 జనవరిలో వర్జీనియా శాసనసభవారు యూనియన్‌లోని అన్నిరాష్ట్రాలవారికీ, తమ తమ కమీషనర్లను పంపమనీ, అందరికీ అనువుగా ఉండే వ్యాపారవిషయాలను చర్చించవలసిఉంటుందనీ కబుర్లుపెట్టారు. ఈ సంప్రదింపులకు అన్నాపొలీస్‌కన్వెన్షన్‌కు 1786 సెప్టెంబర్‌లో ఐదురాష్ట్రాలవారు (వర్జీనియాతో కలిపి) తమ తమ ప్రతినిధులను పంపారు. వర్జీనియా ప్రతినిధుల్లో ఒకరైన జేమ్స్‌మాడ్‌సన్ ఫిలడెల్ఫియాలో 1787 మేలో మరో కన్వెన్షన్ జరగాలని సూచించాడు. దీనిద్వారానే కాన్‌స్టిట్యూషన్ ఏర్పడిందనే సంగతి అందరికీ తెలిసిందే! ఈ కొత్త కాన్‌స్టిట్యూషన్ ఒక ప్రెసిడెంట్‌ను ఏర్పరచవలసిఉన్నది. ఈ కొత్త ప్రెసిడెంట్ జార్జ్ వాషింగ్‌టన్.

## కొత్త కాన్‌స్టిట్యూషన్ వైపుగా :

జార్జీవాషింగ్టన్ జీవిత చరిత్రను వ్రాసిన వారిలో ఆయన్ను అతిగా శ్లాఘించిన రచయితలు ఆయన పనులన్నీ సమానార్థకంగా అమెరికన్ చరిత్ర యందంతటా కనిపిస్తున్నవనీ, ప్రతి సంఘటనకూ సూత్రధారుడనే ధోరణిని కనబరిచారు. ఆయన జీవితకథలోని వెనుకటి ఘట్టాల దగ్గిరికి వెళ్లి-ఆయన లీబాయిఫ్ కోటకు తరలివెళ్లటం దగ్గర్నుంచీ 1753 లో పొటోమాక్ కంపెనీని స్థాపించటంవరకూ, ఆతరువాత అడుగడుగ్గా ముందుకువేస్తూ 1789 లో అమెరికన్ ప్రెసిడెంట్ కావటం వరకూ, ఆయాపరిస్థితులను అల్లి, ఆయన కీర్తి ప్రతిష్ఠల్ని పెంపొందింప జేశారు. వాషింగ్టన్ తమ దేశానికి పితృసమానుడని వారు అన్నారు. యూనియన్ ఒకటి ఏర్పడుతుందనే నమ్మకంతో, దాని అసలు అర్థాన్ని ముందుగానే గ్రహించి, ఆయన యవ్వనదశ నుంచి వృద్ధాప్యంవరకూ ఆ ఆదర్శానికే తన శక్తి సామర్థ్యాలన్నిటినీ ధారపోశాడని నిరూపించేందుకు వారు ప్రయత్నాలు చేశారు.

ఐతే ఇలాటి ప్రతిపాదనలు పూర్తిగా తప్పుదారులు పట్టినవని అనలేము. కాని దీన్ని నిరూపించేందుకుగాను వారు అనేక కథల్నిఅల్లి, తమను తాము సమర్థించుకునేందుకు చేసిన ప్రయత్నాలను మనం ఏవగించుకుంటున్నాము. ఏ ప్రదేశాన, ఏక్షణాన చరిత్ర నిర్మించబడుతుందో, సకాలంలో తాను అక్కడ సిద్ధంగాఉండే చాకచక్యం వాషింగ్టన్‌కు

ఉన్నది. ఐతే యీ అంతర్యుద్ధానికి పూర్వం ప్రమాద వశాత్తూ, లేదా యాదృచ్ఛికంగా ఇది జరిగింది. ఆరోజుల్లో ఆయనకు కొంత ప్రత్యేకత ఏర్పడింది. ఐతే, ఆయన సమకాలీనుల్లో ఆయన చాలాగొప్పదనాన్ని సంపాయించుకున్న వాడుగా పరిగణించబడలేదు. పోతే యీ గొప్పతనాన్ని ఆయన యుద్ధసమయంలో సాధించారు. ఆయన ప్రజాసంబంధమైన కార్యకలాపాలనుంచి విరమించినా, జాతీయ రంగంలో ఆయన ప్రత్యక్షమౌతూనే ఉన్నారు. ఆయనచేసిన ప్రతిపనీ ఏదోవిధంగా జాతీయతకు దోహదం చేసింది. చిత్రమేమంటే ఆయన చేయనిపనులుకూడా జాతీయప్రాముఖ్యత ఉన్నవిగా పరిణమించినవి. వాషింగ్టన్‌కు వీటినిగూర్చి తెలుసు. ఒక వేళ ఆయనకు తెలియకపోయినా సిన్సినట్టీకి ప్రెసిడెంట్ జనరల్‌గా ఉండటంవల్ల యీ పాఠాన్ని నేర్చుకునే అవకాశాలెన్నో ఉన్నవనేది సుస్పష్టం.

1783 – 1789 సం. మధ్య వాషింగ్టన్‌లోని అభివృద్ధి పరంగా ఏర్పడిన సమస్య ఇది. మరింతగొప్పవాడుగా పరిణమించటమనేది తనహక్కుగా ఆయన అమలుజరుపుకొని అందుకొన్నారా? లేక ఆయన మరి తప్పించుకోలేని స్థితిలో యీ మరింత గొప్పతనమనేది ఆయన మీాదికి తోసివేయబడిందా? యూనియన్ పునర్నిర్మాణంలో ఆయన నాయకత్వాన్ని వహించారా? లేక కేవలం గౌరవార్థంగా ఆయన్ని అందులో చేర్చారా? లేక యీ రెండు కొనలకూ మధ్యగా అసలు సత్యం ఉన్నదా? ఈ సమస్యకు వెనుక

మరొక సమస్య - చరిత్రకారులను తీవ్రమైన వాదోపవాదాలకు లాగేది - ఉన్నదా? కాన్ఫెడరేషన్ సంవత్సరాలలో యూనియన్ నిజంగా ఏస్థితిలో ఉన్నది? ఇదొక క్లిష్టపరిస్థితా? లేక అమెరికా వర్ధిల్లుతున్నదా? యునైటెడ్ స్టేట్స్‌కు నిజంగానే క్రొత్త ప్రభుత్వాయుధం అవసరమైనదా? పోతే నిజంగానే యూనియన్ ప్రమాదంలో చిక్కుకున్నదని వాషింగ్టన్ హృదయపూర్వకంగా విశ్వసించారా? ఇదే నిజమైతే ఆయన తన నిర్ణయాన్ని తానే చేసుకున్నారా? లేక ఇతరులు ఆ అభిప్రాయాన్ని ఆయనలో లోతుగా నాటారా?

బహుశా ఇలాటి ప్రశ్నలకు ఖచ్చితమైన జవాబులు సాధ్యపడక పోవచ్చు. ఐతే ఇలాటి ప్రశ్నల్ని తలెత్తనివ్వటంవల్ల మన బుర్రల్లోనుంచి వాషింగ్టన్ గొప్పవాడనే నిర్హేతుకమైన అభిప్రాయం మాయమై, ఆయన్ను సరళమైన ధోరణిలో చూడగలిగే అవకాశాలు ఏర్పడుతవి. వీటి వివరణలు సాధారణంగా చెప్పబడే వాటితో పెద్దగా భేదించవనే తుది నిర్ణయాలకు మనం చేరినా ఫర్వాలేదు.

యుద్ధసమయంలో ఏర్పడిన కాంగ్రెస్‌కు సేవచేసిన వాషింగ్టన్, అలాటి ప్రభుత్వంగాక సుస్థిరమైన జాతీయ ప్రభుత్వం ఉండాలని గాఢంగా వాంఛించారంటే - అది ఆయన తత్వానికీ, ఆయన సర్వసేనానిగా సంపాయించిన అనుభవానికీ అనుగుణంగానే ఉన్నది. ఈ కొత్త ప్రభుత్వం కనీసం అత్యవసర పరిస్థితుల్లో సత్ఫలితాలకై పాటుబడేదిగా

నన్నా ఉండాలని ఆయన అభిలాష. ఆయన జూన్ 1783 లో రాష్ట్రాలకు తయారుచేసిన సర్క్యులర్‌లో ఇది విశదమౌతుంది. ఆయన దాన్ని ఫిలడెల్ఫియాలో తన సర్వసేనాపతిత్వాన్ని కాంగ్రెస్‌కు అప్పగించే ముందురోజు విందులో ఒక్క వాక్యంలో కుదించారు: ''సాధారణ సమస్యలను పరిష్కరించే నిమిత్తం కాంగ్రెస్‌కు సమర్థనీయమైన అధికారాలు - ''అన్నారు. ఇందులో ఆయన అలాటి పనిని అంతకుముందే ఆరంభించారనీ (ఆయన మంచి మర్యాదలను పాటించేవ్యక్తి గనుక, ఇలాటిభావం అడపాదడపా ఆయన ఉత్తర ప్రత్యుత్తరాలలో ద్యోతకమవుతుంది), తాను ఆచరణలో జాతికంతకూ ఒక ఆదర్శాన్ని అనుసరించారనీ ఆయన సూచించారు. ఆయన జాన్‌జే (కాన్ఫెడరేషన్‌లో ఆయన విదేశీయ వ్యవహారాల శాఖలో సెక్రెటరీ)కు వ్రాసిన ఉత్తరంలో తన దేశీయులు తన అభిప్రాయాలనూ, మానసికస్థితినీ, తాను స్థిరాస్తులుగా వొదిలిన వాటిని నిర్లక్ష్యపరిచారనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఇంతవరకూ ఆయన తనను అమెరికానుంచి ఎత్తి చూపుకున్నారు. తన కీర్తి ప్రతిష్ఠలు అమెరికాకీర్తి ప్రతిష్ఠలతో పెన వేసుకున్నవనీ, అమెరికాలో ఐక్యత లేదనీ మిగతా ప్రపంచం భావించినట్లయితే అది తనకెంతో బాధాకరంగా ఉంటుందనే ధోరణిని ఆయన కనబరిచారు. ముఖ్యంగా ఆయన బ్రిటిష్‌వారి చేతలకు సహజంగానే గాయపడ్డారు. వారు శత్రువులు. తానా, శత్రువుల్ని తరిమితరిమికొట్టి ఓడించాడు. పశ్చిమానఉన్న కొన్ని బ్రిటిష్ స్థావరాలను సంధిషరతులప్రకారం ఖాళీ

చేయటానికి బ్రిటిష్‌వారు నిరాకరించటం వాషింగ్టన్‌కు ఎంతో బాధాకరంగా ఉన్నది. బ్రిటిష్‌వారు ఏదో కుంటి గుడ్డిసాకులు చెపుతూ కాలయాపన చేయటం సహజమే. కాని, అనేక అమెరికన్ రాష్ట్రాలవారు సంధి షరతుల్లో చేసిన వాగ్దానాలను చెల్లించకుండటం కడుశోచనీయం.

కాని జేకు ఆయన వ్రాసిన ఉత్తరం 1786 ఎండా కాలంలో పంపబడటంవల్ల, అంతకు క్రితం రెండేళ్లల్లోనూ వాషింగ్టన్ దృక్పథాన్ని అది సరిగా వివరించలేదు. ఆ సమయంలో ఆయన ఎందులోనూ తలదూర్చకూండా దూర దూరాన ఉండేందుకు ప్రయత్నించారు. ఆయన ధరించిన పాత్ర కాటో అవనీ, సిన్సిన్నటస్ అవనీ దాన్ని ఆయన ప్రదర్శించి, తాను చెప్పవలసిన సంభాషణలను చెప్పివేశారు. ఇప్పుడాయన రహదారినుంచి తొలిగి, పక్కనేనిలబడిన ప్రేక్షకుడుగాను, తన జీవితంలో మిగిలిన కాలాన్ని తన ఆస్తిపాస్తుల్ని వర్ధిల్లజేసుకునేందుకు నిశ్చయించుకొన్న వ్యక్తిగానూ ఉండిపొయ్యారు. ఆయనకు ప్రత్యక్ష వారసులు లేకున్నప్పటికీ, ఆస్తిని వర్ధిల్లజేయటంలో, ఏ ఇతర వర్జీనియా వంశీకులకన్నా తక్కువ కుతూహలాన్నీ ఉత్సాహాన్నీ ఆయన కనబరచలేదు. నిజానికి ఆయనలో అమెరికన్ జాతీయత ఎంతో పదునుగానూ, శక్తిమంతంగానూ పాతుకొని ఉన్నది, ఐతే పొటోమాక్ పథకం ఆయన వర్జీనియన్ గర్వాన్ని రేపిందనే విషయం గమనించదగింది. ఈ పథకాన్ని మరొక వర్జీనియన్ జఫర్సన్ ఆయనకు సిఫారసు

చేశాడు. ఆతరువాత ఇది వాషింగ్టన్ అదుపాజ్ఞల్లోకి వచ్చాక ఆయన దాన్నిగూర్చి ప్రాంతీయంగానే ఆలోచించారు కాని, జాతీయంగా ఆలోచించలేదు. ఉత్తరానఉన్న పరిచయస్థులకు వ్రాసిన ఉత్తరాలలో ఆయన బ్రిటన్‌ను ఎంత త్వరగా పారద్రోలాలో, అదెంత ముఖ్యవిషయమో వివరించారు. పోతే తన ప్రాంతీయులకు - న్యూయార్క్ ప్రజలు హడ్సన్ నదిగుండా దేశాంతర్భాగాలకు జొరబడటంలో తమకు పోటీగా ఉండటాన్ని తానూ పట్టించుకుంటున్నానని వెల్లడిచేశారు.

ఇంతమాత్రాన వాషింగ్టన్ నిజాయితీతో ప్రవర్తించలేదని అనటంకాదు. కాని 1784 - 1785 లలో ఆయన ఖండానికంతకూ సంబంధించిన దృక్పథంలో ఆలోచించటం లేదని మాత్రమే అనగలం. ఐతే అమెరికా ఖండానికి దెబ్బతగిలే విధంగా, ఆయన స్వరాష్ట్రీయ గర్వం ఏనాడూ అమలు జరుపబడలేదు. కాంగ్రెస్‌లోఉన్న మిత్రులు ఆయనతో ప్రత్యక్ష సంబంధాలను పెట్టుకొన్నారు. ఆయనకు రోజూ వచ్చి పడే పెద్దటపాలో ఖండంలోని వివిధరాష్ట్రాలలోని పరిస్థితులు - మసాచుసెట్స్‌నుంచీ జార్జియావరకూ ఉన్నవి వివరించబడేవి. ఐతే కాంగ్రెస్ చాలా దూరాన ఉన్నది. దాని స్వభావమూ అన్నవిధంగా అది తన కార్య స్థానాన్ని అన్నాపొలీస్ నుంచి ట్రెన్‌టన్‌కూ, ఆతరువాత మరింత దూరానఉన్న న్యూయార్క్‌కూ మార్చింది. గృహ విషయాల్లో మునిగిపోయి తాను త్వరగా విరమించాలనే

ఆ త్రుత 'వేధించినా' తనవిలేఖరులు చెప్పేవిషయాల తాలూకు నిజమైన ప్రాముఖ్యతలను అనుమానిస్తూ, వాషింగ్టన్ తన అభిప్రాయాలను ఇదమిత్థంగా చెప్పలేకపొయ్యారు. జాన్ జే, హెన్రీలీ, జేమ్స్ మాడిసన్ మొదలైనవారు అలసి ఉన్నప్పటికీ స్పష్టంగా తమ అభిప్రాయాలను వెల్లడిస్తూ, కొత్త ప్రభుత్వం ఏర్పడేందుకుగాను నాయకత్వాన్ని వహించారు. పోతే వాషింగ్టన్ సహాయాన్ని వారు అర్థించిన కారణం ఆయన లోని రచనా పాటవముకాదు, ఆయన విజ్ఞానమూకాదు– కేవలంఆయనకున్న పేరు ప్రతిష్ఠలే! అమెరికన్‌లకు వాషింగ్టన్ అంటే విజయానికి సూచన. ఐతే క్షణకాలంపాటు ఆయన ఒక పెద్ద సున్నా. 1786 మార్చిలో జే వాషింగ్టన్‌తో మాట్లాడుతూ – "అమెరికా ఇలా విచ్ఛిన్నమై పోతూఉంటే గుడ్లప్పగించి, ఏమీ పట్టనట్లుగా కూర్చోవటం భావ్యంకాదు... నేనీ ఫెడరేషన్‌లోని విషయాలను పునః పరిశీలించవలసిన అవసరం వెనువెంటనే ఉన్నదనే ప్రజాభిప్రాయం రూపురేఖలు దిద్దుకోబోతున్నది." దీనికి జవాబుగా ఒకనెలతరువాత – విశాలభావంలో జే చెప్పిన విషయాలను అంగీకరిస్తూ, అమెరికా వస్త్రంలోని దారాలు బలహీనమై తెగిపోతూన్నవనేది ఒప్పుకుంటూ, తానుమాత్రం సామాన్య విషయాలలో తగిన జాగ్రత వహించారు.

ఇక్కడ వాషింగ్టన్ మూర్ఖత్వాన్నికానీ, ఆయన బాధ్యతారహిత ప్రవర్తనను కానీ నొక్కి చెప్పటంకాదు ; కాని దీనికి విరుగుడుగా పరిష్కార మార్గమేదీ ఆయనదగ్గర

సిద్ధంగా ఉండకుండటమే కారణమని దృఢంగా చెప్పగలం. కార్మికులూ, వ్యాపారస్థుల పరంగా చూసినట్లయితే అమెరికా వర్ధిల్లుతూన్నదనే చెప్పవలసి ఉంటుంది. కాంగ్రెస్‌కు బొత్తిగా స్థానం లేకుండాపోలేదు. నిజానికి దేశానికి అదే అధికార పూర్వకమైన ప్రభుత్వం. కాంగ్రెస్ దానంతటదే సంస్కరించుకోకపోతే, చట్టసమ్మతంగా ఆ సంస్కరణను ఎవరో కొంతమంది కలిసి దానిమీద ప్రయోగించగలరా? ఇలాటి దానికి ప్రజలేమంటారు? రాష్ట్రాలు ఏమంటవి? వేరొకపక్క కాన్ఫెడరేషన్‌లోని ఆర్టికిల్స్ మరొక సుస్థిర జాతీయ ప్రభుత్వాన్ని అనుభవంలో అంగీకరించటంలేదు. ఇక రాష్ట్రాలు కాంగ్రెస్‌ను లెక్కచేయక ఒక ప్రమాదావస్థను తెచ్చిపెట్టి, ఒకదాన్ని మరొకటి నిర్లక్ష్య భావంతోను, శత్రుభావంతోను చూస్తున్నవి. కనుక ఏదో వొకటి చేయవలసే ఉన్నది.

తీవ్రమైన వాద ప్రతివాదాలనుంచి ఆయన కాస్త వెనక్కువెళ్లి, 1775 లో వలెనే, క్రమంగా తన స్వంత అభిప్రాయాలను పేర్చి, కూర్చుకోసాగారు. ఈవిధంగా ఆయన 1786 ఆగష్టు 1-వ తారీకున మూడు లేఖలు వ్రాశారు. వీటిల్లో రెండు ఫ్రాన్సుకు వెళ్లి, ఒకటి ఛవెలియర్ డీలాలుజ్ రెనీకీ, రెండోది అమెరికన్ మంత్రి ఐన థామస్ జఫర్‌సన్‌కూ చేరినవి. మూడోది న్యూయార్క్‌లోని జేకు వ్రాయబడింది. వీటిల్లో మొదటిరెండూ ఆనందోత్సాహాలతోనూ, మూడోది రానున్న విపత్తులను సూచించేదిగానూ ఉన్నది. ఈ విభేదం

ఎందువల్ల వచ్చింది? ఖండాంతరంలో అమెరికన్ ప్రతిష్ఠకు ఏ మాత్రమూ భంగం కలుగరాదని వాషింగ్టన్ వాంఛించారు. చివరకు తనకు ప్రాణమిత్రుడైన లాఫయెట్టీతో మాట్లాడేప్పుడుకూడా అమెరికా విషయంలో గొప్ప ఆశాభావాన్ని ఆయన ధ్వనింపజేశారు. పోతే ఆయన మానసికంగా రెండు విరుద్ధాభిప్రాయాలమధ్య – కొట్టు మిట్టాడుతుండటంవల్ల తన లేఖల్లో యీ విభేదాన్ని స్పష్టీకరించి ఉండొచ్చు. కనుకనే ఆయన జేకుక్రాసిన ఉత్తరంలో – "నాకేమీ సంబంధం లేదనే ధోరణిలో మిన్నకుండి ఇదంతా చూస్తూ ఊరుకోలేను...మన దేశీయ సమస్యలు త్వరితగతిన క్లిష్టపరిస్థితులవైపు పయనమాతున్నవనే మీ భావంతో ఏకీభవిస్తున్నాను..." అన్నారు.

1786 ఆకురాలే కాలంలో మసాచుసెట్స్‌లోని షాయే విప్లవరూపంలోనే వాషింగ్టన్‌కు యీ క్లిష్టపరిస్థితి సాక్షాత్కరించింది. వెనుకబడి ఉన్నప్రదేశంలో అసంతృప్తి జెందిన కొంతమంది ప్రజలు చెదురు చెదురుగా యీ తిరుగుబాటు జరిపారు. ఐతే యీ తిరుగుబాటును అణచివేసిన పద్ధతి ఎంతో అక్రమంగా ఉన్నదనే విషయాన్ని సూచించింది. ఆయన ఉత్తరాల్లో వివరణాలంటూ ఉండవు. కాని యీ సందర్భంలోమాత్రం ఆయన తననుతాను సంబాళించుకో లేని విధంగా బైటపడ్డారు.

"ప్రజలారా! మీకేంపిచ్చెక్కిందా? దీనికంతకూ కారణం ఏమిటి?...ఇది ఎప్పుడు, ఏవిధంగా అంతమౌతుంది?...ఈ అల్లరులు!... భగవాన్! టోరీకానీ, లేదా బ్రిటన్ కానీ వీటిని ముందుగా ఊహించగల

డేమో కాని, వేరెవ్వరికి ఇదిసాధ్యం ?...మానవుడంటే ఏమిటి? మానవుని ప్రవర్తనలో యీ అసందర్భాలేమిటి?...మనం అరాజకానికీ, అల్లరులకూ ఎంత త్వరగా దారితీస్తున్నాము!"

ఆయనిప్పుడు ఏంచేయాలి? నెలలపర్యంతం ఆయన తల బద్దలు కొట్టుకుంటూ, ఎటూ తేల్చుకోలేక పోయ్యారు; ఇతర అమెరికన్‌లు 1787 మేలో, ఫిలడెల్ఫియాలో జరుగనున్న కన్వెన్షన్‌కు తగినఏర్పాట్లన్నీ చేస్తున్నారు. దీనికి తాను వర్జీనియా ప్రతినిధిగా హాజరవాలా? తనను తానావిధంగా ప్రకటించుకోవాలని ఆయన తహతహ లాడేట్లు చేశారు. 1787 ఆరంభంలో యీకన్వెన్షన్‌కు కాంగ్రెస్ తన దీవనల నందివ్వటంతో కొంతభారం తగ్గింది. ఐతే వాషింగ్టన్‌ను పట్టి పీడించే శంకలు అనేకం ఉన్నవి. ఆయన వయస్సు 55 సంవత్సరాలు. తాను ముసలివాడ నవుతున్నాననే భావం కలిగిందాయనకు. ఇదిగాక రుమాటిజమ్‌తో ఆయన బాధ పడుతున్నారు. ఆయన చేతిలో తగినంత రొక్కంకూడా లేదు. ఇంతకు పూర్వమే సిన్సిన్నట్టీ సభలకు హాజరయ్యేందుకు ఆయన అంగీకరించలేదు. ఇప్పు డీ కన్వెన్షన్‌తో పాటే యీ సభలుకూడా ఫిలడెల్ఫియాలో జరుగనున్నవి. ఇప్పుడు తాను ఫిలడెల్ఫియా వెళ్లి సిన్సిన్నట్టీ సభలకు రాలేనని చెప్పటం ఎలా కుదురుతుంది? అన్నిటినీమించి ఇప్పుడు వాషింగ్టన్ కలిసిన సంఘం—1786 సెప్టెంబర్‌లో అన్నాపొలీస్‌లోని అసమర్థమైన సంఘాన్ని రుజువు చేసేదిగా రూపొందే అవకాశాలున్నవి. నైరుతి దిశలోని రాష్ట్రాల వారు కలవకుండా, దూరదూరాన ఉండేట్లయితే, ఫిలడెల్ఫి

యాలో గుమికూడిన యీ ప్రతినిధులు చేయగలిగేదేమీ ఉండబోదు. మేలు లేకుంటేమానె, కీడు — తమ దేశానికీ, తమ తమ కీర్తి ప్రతిష్ఠలకూ హానిచేసుకున్నా ఆశ్చర్యపడ నవసరం లేదు. ఇలాటి వేళాకోళంలో కానీ, లేదా కుట్రలో కానీ తనకు భాగముండాలని ఆయన వాంఛించలేదు.

వాషింగ్‌టన్ జీవితచరిత్రకారుల్లో ప్రప్రథముడైన డగ్లస్ సౌథాల్ ఫ్రీమన్—ఈకాలంలోని ఆయన ప్రవర్తన అహంభావంతో కూడిందిగా ఉన్నదని అన్నాడు. అమెరికా ప్రమాదకర పరిస్థితుల్లో ఉంటే, దాన్ని రక్షించేందుకు ఆయ నెందుకు ముందుకు ఉరకలేదు? ఐతే యీ తీర్పు చాలా కఠిన మైనదిగా కన్పిస్తుంది. వాషింగ్‌టన్‌ను గూర్చి మనం చెప్ప గలిగిందంతా – ఆయన ఒక మానవుడనీ, కేవలం ఆదర్శాల కొరకై, దేశభక్తిని మాత్రమే ప్రదర్శిస్తూ స్వజీవన విధాన మనేది లేనివాడు కాదని మాత్రమే! ఆయన ఉద్దే శ్యాలు కథానాయకత్వానికి సంబంధించినవి కాకున్నా, వాటిని మనం అర్థంచేసుకో గలిగేవి. ఐనప్పటికీ ఆశ్చర్య పడేవిది: ఎంత లజ్జ ఉన్నా అది దానికి విరుద్ధమైన అర్థంలేని గర్వంవలెనే ఉంటుందా? ఆయన విషయంలో అలాగే రూపొందిందా?

కావచ్చు. ఐతే అతిముఖ్యమైన నిజం ఏమిటంటే – వాషింగ్టన్ ఫిలడెల్ఫియాకు వెళ్లేందుకు నిశ్చయించుకున్నారు. అక్కడకు మేమాసారంభంలో చేరారు. ఆ కన్వెన్షన్‌కు హాజ రైన ప్రతినిధులందరూ ఏకగ్రీవంగా ఆయన్ను ప్రెసిడెంట్‌గా

ఎన్నుకున్నారు. వారాల తరబడి వాదప్రతివాదాలను వింటూ ఆయన ఆకుర్చీలో అలసిపోయి కూర్చొని, చివరకు సెప్టెంబర్ మధ్యకాలం వరకు పని నిర్వర్తించారు. ఆ తరువాత ఆగష్టులో అది దీర్ఘకాలం వాయిదా వేయబడింది. ఈ కాలాన్ని సద్వినియోగ పరిచేందుకు వాషింగ్టన్ వేలీ ఫోర్జ్‌నీ, తాను హెస్సియన్స్‌ను హఠాత్తుగా పట్టుకొన్న ప్రదేశం ట్రెంటన్ పట్టణాన్నీ దర్శించారు. ఈ కాల యాపన ఆయనకు నూతనోత్సాహాలను ఇచ్చిందనేందుకు సందేహంలేదు. ఆ పురాతన చరిత్రంతా ఆయన కళ్ల ముందు కదిలి, హృదయాన్ని కదిలించింది. ఐనప్పటికీ ఇతర విషయాలను గూర్చికూడా ఆయన తనడైరీలో వ్రాసిఉన్నారు.

ఎండాకాలపు వేడితో తెకతెకలాడి పోతూండగా ఫిలడెల్ఫియాలో సాగిన యీ కన్వెన్షన్‌లోని తనపాత్ర వాషింగ్టన్‌కు అనువుగానే ఉన్నది. ఏదైనా విషయం వోటింగ్‌కు వచ్చిన సమయాల్లో, ఆయన తన స్థానంనుంచి కదిలి, ఇతరప్రతినిధులతోపాటు తన వోటుకూడా రికార్డు చేస్తూండేవారు. ఇలా జరగని పక్షంలో ఆయన వహించిన ప్రాతినిధ్యంనుంచి కొంతవరకూ విడివడి ఉండేవారు. వాదప్రతివాదాలను వింటూ అభిప్రాయాలను తూచి, విశ్రాంతిగా తన నిశ్చితాభిప్రాయాన్ని ఏర్పరుచుకునేవారు. ఈఅభిప్రాయం మధ్యవర్తి చెప్పే అభిప్రాయం లాటిదేకాని, సలహాదారుడు చెప్పేలాటిది మాత్రంకాదు. ప్రెసిడెంట్ పదవికి యోగ్యులైన మరొకవ్యక్తి – బెంజిమన్ ఫ్రాంక్లిన్ (ఆయనా హాజ

రయ్యారు) మాత్రమే! కాని ఫ్రాంక్లిన్ వయస్సు అప్పటికే 80 దాటింది. పైగా ఆయన రోగిష్ఠికూడాను.

ఒకోసమయంలో వాషింగ్టన్ వోటమి ఎదురయ్యే పక్షానే తన వోటు వేసేవారు. సాధారణంగా ఆయన 'ఫెడరలిస్టిక్' అనబడే పక్షాన తన వోటువేస్తుండేవారు. అంటే సుస్థిరమైన, బలవంతమైన ప్రభుత్వము – దాన్ని నడిపే సామర్థ్యమున్న వ్యక్తీను. కొద్దికొద్దిగా ముందుకు సాగుతూ ఫెడరలిస్టులు యీ భారాన్ని లాక్కువొచ్చారు. క్రమంగా పొందిన వ్రాతపూర్వక పత్రాన్ని గూర్చి వాషింగ్టన్, తదితర ప్రతినిధులూ తృప్తి జెందలేదు. చాలా మంది చిరాకుపడి, ఫిలడెల్ఫియానుంచి అంతర్ధానమయ్యారు. లేదా ఆ పత్రంమీద సంతకాలు చేసేందుకు నిరాకరించారు. కొంతమంది తమ రాష్ట్రీయ అధికారాలను ఫెడరల్ ప్రభుత్వానికి అప్పగించేందుకు విచారపడ్డారు. పెద్ద పెద్ద రాష్ట్రాలైన వర్జీనియా, మసాచుసెట్స్‌లనుంచి వచ్చిన వారు, తాము అనుభవిస్తున్న సౌకర్యాలు కేవలం ఫెడరల్ ప్రభుత్వానికి ధారాదత్తం కావటమేగాక, డిలావేర్, న్యూజెర్సీలాటి రాష్ట్రాల కూడా సంక్రమిస్తవేమోనని భయపడ్డారు. పోతే చిన్నచిన్న రాష్ట్రాలనుంచి వచ్చిన ప్రతినిధులు, కాన్‌ఫెడరేషన్‌లోని ఆర్టికిల్స్‌కు అనుగుణంగా తమకూడా సరిసమాన ప్రాతినిధ్యం ఉండాలని పట్టుబట్టారు. అనేకసార్లు యీ కన్వెన్షన్ అంతటితో స్తంభించిపోయే పరిస్థితులు ఏర్పడినవి. కాని అది మందగమనంతో

ముందుకుసాగింది. వాషింగ్టన్, అందులోని ఎక్కువ మందితో చేతులు కలిపి, తాము రాజీగా అంగీకరించిన వన్నీ అనుభవ పూర్వకంగా అమలు జరపగలవేనని సమ్మతించారు. రాజకీయాలు సుసాధ్యం చేయటాన్ని కళారూపకంగా ఆరాధించటం. ఇక ఆ పరిస్థితుల్లో రూపొందిన యీ కొత్త కాన్స్టిట్యూషనే అప్పటికి అత్యుత్తమ మైనది.

ఏమైనప్పటికీ – వాషింగ్టన్ అనుకున్నది అదే! దానిలోని వివిధ భాగాలను ఆయన ఆమోదించారు. వాటిని అమలు జరిపే వ్యక్తి (ప్రెసిడెంట్ రూపాన); కాంగ్రెసుకు రెండు సభలు (ఒక సెనేట్, ఒక ప్రతినిధుల సభ); ఒక న్యాయస్థానాల పద్ధతి – ఇది సుప్రీంకోర్టు ఆధ్వర్యాన నడుపబడుతుంది. వీటిల్లో ప్రతిశాఖా ఒకో ప్రత్యేక శాఖగా ఉండి, మిగతా వాటినుంచి విడివడు తూన్నది. తన అనుభవాన్నిబట్టి చూస్తే ఇలాటి ఏర్పాట్లు యోగ్యమైనవిగా ఆయనకు తోచినవి. ప్రెసిడెంట్ అంటే ఏవర్జీనియా గవర్నర్ వలెనో ఉంటాడు (ఐతే ఏలండన్ నుంచో సూచనలూ, ఆజ్ఞలూ రావటం, వాటిని అమలు జరపవలసిన బాధ్యతల్లాటివి ఉండవు). సెనేట్ గవర్నర్ తాలూకు కౌన్సిల్ లాటిది (ప్రతి రాష్ట్రంనుంచీ ఇద్దరు ప్రతినిధులు ఎన్నుకోబడుతూ, ఇందులో 26 మంది కౌన్సిలర్లు ఉంటారు). ప్రతినిధుల సభ వర్జీనియా జనరల్ ఎసెంబ్లీలాటిది. నిజానికి వర్జీనియా ఎంతో పలుకుబడిగల రాష్ట్రం; ఎందుకంటే అది జనరంజకంగా ఉంటూ, మిగతా ఏరాష్ట్రం కన్నా

ఎక్కువ మంది ప్రతినిధుల్ని కలిగి ఉన్నది. ఉదాహరణకు రోడ్ ఐలెండ్‌కు ఒకే ప్రతినిధి ఐతే, వర్జీనియాకు 10 మంది ప్రతినిధులు.

ఆయా రాష్ట్రాలకు సంబంధించిన హక్కులనేవి ఉంటూన్నప్పటికీ – ఫెడరల్ ప్రభుత్వపు కోరల్లో ఆ అధికారాలను ఇరికించటమనేది వాషింగ్టన్‌కు ఎంతో సంతృప్తిని కలిగించింది. ఇంతవరకూ కాంగ్రెస్ కేవలం సిద్ధాంత రూపాన ఉంచిన అధికారాలను ఫెడరల్ ప్రభుత్వం ఇప్పుడు ప్రయోగంలో చూపుతుంది. పైగా దీనికి కొత్త కొత్త అధికారాలు కూడా సంక్రమించినవి. పరదేశీయులందర్నీ ఒకే పతాకం కిందికి చేర్చి, ప్రభుత్వానికి అవసరమైన ధనాన్ని వారినుంచి వసూళ్లుచేసి, రాబడినిబట్టి వ్యయాన్ని ఒక పద్ధతిలో ఉంచుతూ, ప్రతి అమెరికన్‌కూ – అతను వ్యవసాయ దారుడవనీ, ప్లాంటర్ కానీ, ఉత్పత్తి దారుడవనీ, వ్యాపారి కానీ – జీవిత సౌలభ్య మేర్పడేట్లుగా పరిస్థితులను రూపొందిస్తుంది.

ఆ సెప్టెంబర్‌లో వాషింగ్టన్ తన బండిలో మౌంట్ వెర్నన్‌కు బయలుదేరారు. తన విధులను నిర్వర్తించిన తృప్తి ఆయనకు కలిగింది. ఆయన గృహమంతా దాదాపు పూర్తయింది. శాంతిని సూచించే మందిరానికి కొంత ఇనుప కమ్మీల పనిమాత్రమే మిగిలి ఉన్నది. ఐతే యీ కొత్త కాన్‌స్టిట్యూషన్, ఆయా రాష్ట్రాలవారు తమ తమ కన్వెన్షన్‌లను ప్రయోగిస్తేనే తప్ప, పూర్తవదు. వాషిం

గ్టన్ జీవితం మరో కొత్త స్థితిలోకి పడింది. ఆయన ఫిల డెల్ఫియా ప్రయాణానికి ముందు కొన్ని నెలలుగా అనుభవించిన వేదనలాటిది తిరిగి ఇప్పుడు దాపరించింది, ఆయన కాన్‌స్టిట్యూషన్‌ను బలపరుస్తానని మాట ఇచ్చారు; అందుకు తాను చేయగలిగిందంతా చేశారు. స్వరాష్ట్రమైన వర్జీనియాలోని ఆయన పలుకుబడి తక్కడను సరిజేసిందనటం వాస్తవం. ఐతే ఒకోరాష్ట్రమే తమ తమ అభ్యంతరాలను చెప్పసాగాక ఆయన ఎంతో చికాకు పడ్డారు. ఫిల డెల్ఫియాలో హాజరైన ప్రతినిధులు, వారికి ఇవ్వబడిన సూచనలను అతిక్రమించి (ఇది కొంతవరకూ సమర్థనీయం) ప్రవర్తించారనే నిందలు మోపబడినవి. వీరు రహస్యంగా కలుసుకొని, సంప్రదింపులు జరిపి, తమతమ నిర్ణయాలను చివరిదాకా ప్రకటించే అవకాశాలు లేకుండా చేశారు. వీరు క్షత్రులు పన్నేవారూ, మహదైశ్వర్యవంతులూను. వీరు ఎంతో తొందర పడ్డారు. మొదటి కన్వెన్షన్‌ను సమాలోచించేందుకు రెండో కన్వెన్షన్ ఉండనీలెమ్మని అనుకున్నారు. కాన్‌స్టిట్యూషన్‌ను తయారు చేసినవారి పట్ల చూపిన వాదోపవాదాల్లో ఇవి కొన్ని. ప్రత్యేక పద్ధతిని అనుసరించిన రోడ్ ఐలెండ్‌వారు తమ ప్రతినిధులను కూడా ఫిలడెల్ఫియాకు పంపలేదు; కాన్‌స్టిట్యూషన్‌కు మిగతా రాష్ట్రాల వారు కట్టుబడి ఉంటారా అనేది కూడా సందేహాస్పదంగానే ఉన్నది. అప్పుల పాలైనవారూ, కాగితపు డబ్బుగలవారూ మాత్రమే కాన్‌స్టిట్యూషన్‌ను స్థాపించిన పితామహులను (లేక వారే వ్యవస్థాపకులైన పితామహులా?) ఎదుర్కొ

లేదు. శక్తి సామర్థ్యాలుండి, అసంతృప్తి జెందిన కొంత మందికి విరోధభావం కూడా ఉన్నది. న్యూయార్క్‌లోని గవర్నర్ క్లింటన్, మసాచుసెట్స్‌లోని గవర్నర్ జాన్ హాన్ కాక్, వాషింగ్టన్ స్వరాష్ట్రమైన వర్జీనియాలోని పాట్రిక్ హెన్రీ, రిచర్డ్ హెన్రీ లీ, ఎడ్మండ్ రాన్ డాల్ఫ్, చివరకు ఆయన పాతస్నేహితుడూ ఇరుగుపొరుగూ ఐన జార్జ్ మాసన్ ప్రభృతులు వీరిలో కొందరు.

కాన్‌స్టిట్యూషన్‌ను అమలు జరిపేందుకు పదమూడు రాష్ట్రాలలోనూ తొమ్మిది రాష్ట్రాలు సమ్మతించినవి. 1788 జనవరికల్లా ఐదు రాష్ట్రాలవారు తమ సమ్మతిని నిశ్చయంగా తెలియ పరిచారు. ఫిబ్రవరిలో మసాచుసెట్స్ కొద్ది కుడి ఎడంగా, ఫెడరలిజమ్‌ను అనుసరించే ధోరణిలో, హాన్ కాక్ వైస్ ప్రెసిడెంట్ అయ్యేట్లుగా చూస్తామని హామీ ఇచ్చి, లేదా ఒక వేళ వర్జీనియా కాన్‌స్టిట్యూషన్‌కు కట్టుబడి ఉండని పక్షంలో హాన్ కాక్‌ను ప్రెసిడెంట్ చేస్తామని ఎలాగో ఒప్పించారు. ఈ విధంగా హాన్ కాక్ లొంగి వచ్చాడు. అంతకన్న ముఖ్య విషయమేమంటే ఆయనొక సిద్ధాంతాన్ని ప్రవేశ పెట్టటం, దాన్ని ఇతర రాష్ట్రాల వారు అనుసరించటం కూడా జరిగింది. ఉత్తరోత్తరా పరిస్థితులకు అనుగుణంగా యీ కాన్‌స్టిట్యూషన్‌లో అవసరమైన మార్పులు చేస్తామనే వాగ్దానం మీద, మసాచుసెట్స్ కాన్‌స్టిట్యూషన్‌ను అంగీకరించేందుకు సమ్మతించింది. ఈ కొత్త కాన్‌స్టిట్యూషన్ ఇంతకు పూర్వమే

అనేక రాష్ట్ర సంబంధమైన కాన్‌స్టిట్యూషన్‌లలో పేర్కొ బడి అమలు జరుపబడే 'బిల్ ఆఫ్ రైట్స్'ను పోలి ఉంటవి.

ఆ తరువాత మరో రెండు రాష్ట్రాలు కూడా కలిసి మొత్తం ఎనిమిదైనవి. అన్నిటికన్నా క్లిష్టమైన రాష్ట్రం - వర్జీనియా ఎంతో పెనుగులాట తరువాత చిట్టచివరికి వచ్చి చేరింది. అంతకన్న శుభసూచన ఏమంటే - న్యూహాంప్‌షైర్ కూడా సమ్మతించిందనే విషయం వర్జీనియాలో తెలియవచ్చింది. ఇప్పుడు మొత్తం పదిరాష్ట్రాలైనవి. అంటే కావలసిన వాటికన్నా ఒకరాష్ట్రం అధికంగానే వచ్చిందన్నమాట. న్యూయార్క్‌లోని అలెగ్జాండర్ హామిల్టన్, తదితర ఫెడరలిస్టులు యీ సువార్తలను ఉపయోగించి, ఆ రాష్ట్రంలోని ప్రతి పక్షీయులను నిరాయుధుల్ని చేశారు. ఫిలడెల్ఫియాలో హాజరైన ప్రతినిధులు ఎవరిదోవను వారు వెళ్లిపోయ్యాక, ఒక సంవత్సరం తరువాత, కాన్‌స్టిట్యూషన్‌ను కొన్ని నిబంధనలతోనో, లేదా అవిలేకుండానో-పదమూడు రాష్ట్రాలలోను పదకొండు రాష్ట్రాలు అంగీకరించినవి. ఉత్తర కరోలినా, రోడ్ ఐలెండ్‌లు మాత్రమే వెలుపల ఉన్నవి. వీరి నిర్లక్ష్యత దురదృష్టమైన దైనప్పటికీ, ప్రమాదకరమైనది మాత్రం కాదు.

ఆ తరువాత జరగవలసిం దేమిటి? జాతికంతకూ సంబంధించిన సమస్య - కాంగ్రెస్ దానంతటదే విచ్ఛిన్నమై కొత్తకాంగ్రెస్‌ను ఎన్నుకునే అవకాశాన్ని కలగజేయ వలసి ఉంటుందనేది ప్రతివారికీ జ్ఞాపకం వచ్చింది. ఈ కొత్త

ప్రభుత్వం ఏపట్టణంనుంచి పరిపాలించాలనే విషయంమీద వాగ్వాదాలు జరిగినవి. చివరకు ప్రస్తుతం న్యూయార్క్ ముఖ్యపట్టణమనేదాన్ని అందరూ ఒప్పుకున్నారు. ఇక వాషింగ్టన్ విషయంలో – తానే ప్రెసిడెంట్‌గా ఎన్నికవుతా ననే గాఢవిశ్వాసం ఆయనకున్నది. కాన్‌స్టిట్యూషన్‌ను సమ్మతింప జేసేందుకుగాను ఫెడరలిస్టులు ఆయన పేరు విరివిగా ఉపయోగిస్తున్నారు. ఫెడరలిస్టులు వాషింగ్టన్ నామంతో సూచించబడతారనీ, ఏంటీ ఫెడరలిస్టులు 'షాయి సైట్స్' అని మసాచుసెట్స్ తిరుగుబాటుదారుడు డేనియల్ 'షాయిస్ పరంగా పిలువబడుతారనీ ఎవరో సూచించారు. కాన్‌స్టిట్యూషన్‌లోని నిబంధనలు ప్రకటించబడ్డాక, ప్రెసి డెంట్ పదవి వాషింగ్‌టన్‌కే సంక్రమిస్తుందనేది స్పష్టమైంది. అన్ని రాష్ట్రాలలోనూ ఆయనొక్కరే గౌరవించబడటమూ, తెలిసిన వ్యక్తికావటమూ, విశ్వాస పాత్రుడవటమూ జరి గింది. వృద్ధుడైన ఫ్రాంక్లిన్ తరువాతవాషింగ్‌టన్ ఒక్కరి లోనే ఆ ఇంద్రజాలం, కీర్తి, ప్రతిష్ఠ (దీనిగుణగణానికి సరైన పదమేలేదు) ప్రభుత్వంలోని ఆ అత్యున్నతస్థానానికి యోగ్య మైనవి ఉన్నవి. ఈ విషయాన్నే వార్తాపత్రికలు వక్కా ణించినవి. ఆయన స్నేహితులు రూఢిపరిచారు. 1788 జన వరిలో లాఫెయిట్టే ఇలా వ్రాశాడు: "అమెరికా కొరకు, యీ మానవజాతి కొరకు, మీ వ్యక్తిగత కీర్తిప్రతిష్ఠల కొరకు — మొదటి సంవత్సరాలలో ప్రెసిడెంట్ పదవిని మీరు తిరస్కరించ వద్దని ప్రార్థిస్తున్నాను. ఈ

రాజకీయ యంత్రాంగం తప్పుదారుల్లో పడకుండా దాన్ని మీరొక్కరే సక్రమంగా నడపగలరు.''

వాషింగ్టన్ అనుభూతులు వివిధంగా ఉన్నవి. ఆయన తృప్తిపడటమూ, కలతజెందటమూ, భయపడటంకూడా జరిగినవి. ఆయనపట్ల చూపబడిన గౌరవం మహోత్కృష్టమైనది. ఆతరువాత జరగబొయ్యేదికూడా సరిగ్గా ఎన్నికల్లాటి వ్యవహారంకాదు. ప్రెసిడెంట్ పదవి తనకు ఇవ్వబడుతే, దాన్ని ఆయన తప్పక అంగీకరించాలి. ఐతే తాను దానికి సమ్మతిస్తే, మరో నాలుగేళ్ల పాటు కీర్తి జ్వాలల బాధకు తాను తట్టుకోగలిగి ఉండాలి. ఐతే యీశ్రమ పడేందుకు ఆయనగాక మరెవ్వరూకూడా సంసిద్ధులై లేరు. ఐతే తానుమాత్రం సర్వసిద్ధంగా ఉన్నాడా? ''ఇంతవరకూ శోధింపబడని రంగంలోకి దూకబోతున్నానని అనుకోవాలి; ఆ రంగం అన్నివైపులా మేఘావృతమై, కటిక చీకట్లతో ఉండి ఉన్నది'' అన్నా రాయన. 1788 ఆకురాలేకాలంలో ఆయన అన్న యీ మాటలు ఎలాటివైనప్పటికీ, ఆయన పరిచయస్థులందరూ, వాషింగ్టన్ ప్రెసిడెంట్ అవుతారనే అనుకున్నారు. ఆ రాబొయ్యే అగ్నిపరీక్షనుగూర్చి ఆయన ఆత్రుతపడుతూ ఆచలికాలమంతా గడుపుతూంటే, ప్రజలు ఆయన విధులను గూర్చి మాటిమాటికీ జ్ఞాపకం చేస్తూనే ఉన్నారు. 1789 ఏప్రిల్‌లో, తనను తప్పక చేరవలసిన వార్తకోసం వాషింగ్టన్ మౌంట్ వెర్నన్‌లో వేచిఉంటూ, తన పాత స్నేహితుడైన హెన్రీ నాక్స్‌తో రహస్యంగా ఇలా అన్నారు :

"ప్రభుత్వంలో నాకు రాబోయ్యే యీ అత్యున్నత స్థానాన్ని గూర్చిన నాభావనలు - నేరస్థుడు ఉరిశిక్షను అనుభవించేందుకు వెళ్ళే వాడి భావాలను పోలి ఉన్నవి; నాజీవితం ప్రజాసేవలో దాదాపుగా గడిచిపోయి, యీతుది వత్సరాలలో ప్రశాంతంగా జీవించేందుకు వీలు పడక, నేను కష్టసముద్రంలోకి జారబడుతున్నాను. రాజకీయ దక్షతా, చాతుర్యమూ, సమర్థతా ఆ స్థానాన్ని అలంకరించేందుకు అవసరం. నాకు అవిలేవు. కేవలం నాదేశీయుల యింగళగితాన్ని నిరాదరించలేక, నా పేరుప్రతిష్ఠల్ని గూర్చిన వారి అభిప్రాయాలను గాయపరచలేక యీ సముద్రయానానికి సమకట్టాను. ఐతే ఇందువల్ల నాదేశీయులకు కలిగే ఫలితాలేమిటో ఆ పరమాత్మునికే ఎరుక !"

## ప్రథమ పరిపాలన (1789-1793):

ఈసందిగ్ధావస్థ తరువాతి పక్షం రోజుల్లోనూ తీరిపోయింది. ఎన్నికల్లో అన్నివోట్లూ వాషింగ్టన్‌కే పడినవనే విషయాన్ని కాంగ్రెస్ తెలియపరిచింది; మసాచుసెట్స్ రాష్ట్రవాసి జాన్ ఆడమ్స్‌కు వైస్‌ప్రెసిడెంట్ అయేందుకు కావలసిన ఓట్లు బొటాబోటీగా లభ్యమైనవి. వాషింగ్టన్ వెనువెంటనే న్యూయార్క్‌కు పయనమయ్యారు. దారిపొడుగునా జనం తండోప తండాలుగా తమ ఆనందాన్ని తెలియపరుస్తూ ఆయన్ను ఆహ్వానించారు.

ప్రేక్షకునికి ఆయన నిండైన విగ్రహం. కాని లోలోపల ఎంతో పిరికిపడి పోతున్నారాయన. ఇలాటి అనేకరుజువులుండగా ఆయన ప్రజారంజకుడనే విషయం ఏవిధంగానూ సందేహాస్పదమైనదికాదు. కాని ప్రతి కొత్త ప్రదర్శనా ఆయన ఆత్రుతను మరింతగా బలపరచసాగింది. తన దేశీ

యులు తనను మానవాతీతుడుగా తయారుచేస్తున్నారు - బహుశా వారు తననుంచి ఆశించేదికూడా మానవాతీతమైన ఫలితాలే కావచ్చు. తాను ఆచరణలో పెట్టబొయ్యే కార్యాన్ని గూర్చి తనకే బాగా తెలియదు. ఒకవేళ తాను అపజయాన్ని పొందినట్లయితే తన పతనం ఎంత ఘోరంగా ఉండగలదో ఆయన ఊహించుకో గలిగారు గుండెలు చీల్చిన బంట్లవంటి పదమూడు రాష్ట్రాలు (వీటిల్లో ఇంకా రెండు రాష్ట్రాలు యూనియన్‌కు వెలుపలనే ఉన్నవి.) కాన్‌స్టిట్యూషన్ ప్రమాదావస్థనుంచి ఇంకా బైటపడ లేదు. ఈ పరిపాలనకుగాను అందరూ అర్రులుచాచారు; కనుక వారి ఈర్ష్యాజ్వాలల వేడి ఉండనే ఉన్నది. పోతే పరిపాలనకింద ఉన్న భూమి కాస్తా కూస్తానా - అట్లాంటిక్ మహా సముద్రతీరంనుంచి 1,500 మైళ్ళదాకా విస్తరించి ఉన్నది. జనాభా 40 లక్షలమంది (ఈజనాభాలెక్క అప్పటికి సరిగ్గా తెలియదు). వీరిలో దాదాపు ప్రతి ఐదింటా ఒకరు నీగ్రోబానిస. ఈ జాతికి 'జాతీయత' అనేదే నూతనానుభవం. ఋణభారంతో కుంగిపోయి, బైట శత్రువర్గాల భయంతో వొణికిపోతూ, ఫెడరల్ రిపబ్లికానిజమ్‌ను కొత్తగా పరిశోధనకుబెట్టి - ఇదంతా ఏమైపోతుందో, ఎక్కడికి దారి తీస్తుందో ఊహాతీతంగానే ఉన్నది.

ఏమైనప్పటికీ ఎలాటి క్లిష్టపరిస్థితుల్లోనూ తలకిందులై పోకుండడటమనేది వాషింగ్టన్ సుగుణాలలో ఒకటి. కొంతమంది వ్యక్తుల్లో ఆత్రుత మనస్సును ఎటూ కదలనీయకుండటమో, లేదా ఉన్న శక్తిసామర్థ్యాలను గురిలేకుండానే

ప్రయోగించిన విధంగా చెల్లాచెదరు చేయటమో చేస్తుంది. వాషింగ్టన్‌లో ఇది మరింతగా హెచ్చరించటం, తదను గుణంగా తాను నిర్వహించిన కార్యభారంమీద మనసు మరింతగా లగ్నమవటాన్ని చేసింది.

ఎంతో తీవ్రంగా ఎదుర్కొన్న ఒకానొక విమర్శకుడు కూడా హుందాతనంతో నిండిన వాషింగ్‌టన్ వ్యక్తిత్వాన్ని కూడా 1789 లో ఎదుర్కోవటం జరిగింది. 'ఈ అత్యద్భుత పరిస్థితుల్లో ప్రభుత్వయంత్రాంగాన్ని సరిగా నడిపించటంలో, వాషింగ్‌టన్ అనుకున్నదంతా నెరవేర్చలేక పోయ్యారు' అని ఆయన అన్నాడు. ఆయన వ్యక్తిగత విషయాలు – ఆయన ఋణాలూ, న్యూయార్క్ లోని ఆయన గృహానికి ఫర్నిచర్ అమర్చటం, తనమీద మోపబడే అభియోగాలకు (నిజానికి అలాటివేమీ లేవు) తాను ఎరగాకుండా కాపాడుకోవటం, ఇంతకు పూర్వం ప్రజాసంబంధ కార్యకలాపాలనుంచి తాను విరమించాలనే నిశ్చయంతాలూకు అసత్యం – ఇవన్నీ కలిసి ఆయన్ను వేధించినవి. కనీసం ఇలాగని పెన్సిల్వేనియా సెనెటర్ విలియమ్ మెకాలే కళ్లకు కనిపించింది. సగం భయంతోనూ, సగం అసహ్యంతోనూ మెకాలే వాషింగ్టన్ ప్రారంభోపన్యాసాన్ని ఇలా పేర్కొన్నాడు:

"తనపైకి గురిపెట్టబడిన యీ ఫిరంగి, లేదా మస్కెట్‌ను చూసి ఆయన భయభ్రాంతుడై, ఇంతగా కలతజెందటం ఇదివర కెన్నడూ జరగలేదు. బహుశా యీ ఉపన్యాసాన్ని ఆయన ఇంతకుముందే ఎన్నోసార్లు చదివి ఉండొచ్చు; ఐనప్పటికీ దీన్ని చదివేప్పుడు ఆయన వొణికి

పోవటం, అనేకచోట్ల నట్లు కొట్టటం, కొన్నిచోట్ల చదవలేక పోవటం కూడా జరిగింది."

ఐనప్పటికీ, వాషింగ్టన్ ప్రారంభోపన్యాసం ఆ ఏప్రిల్ రోజున అక్కడ గుమికూడిన జనబాహుళ్యాన్ని కదిలించింది. ఆయన చూపరులకు కొంచెం అస్వాభావికంగా కనిపించినప్పటికీ, వా రాయన్ను మన్నించి, ఆయన్ను మరింత విశ్వసించారు. ఇంతకుపూర్వం తాను అనుమానించినదాన్నే వాషింగ్టన్ ఇప్పుడు తిరిగి కనుక్కున్నారు. యీ జాతిలో తాను నిలబడిన స్థానం అమూల్యమైనది. ఇతరశక్తులన్నీ కూడా ఆయన పక్షానే ఉన్నవి. ఆర్థిక విధానంమీద ఆయన మేటికారు; రాజకీయపు ఎత్తులు వేయటంలో మొనగాడు కాదు; కాన్‌స్టిట్యూషన్ సిద్ధాంతాలను నిర్మించగల సమర్థుడూ కాదు; చివరకు విదేశీయ వ్యవహారాలను పరిష్కరించగల విజ్ఞుడూ కాదు. ఐతే ఆయన సర్వసేనానిగానూ, కాన్‌స్టిట్యూషనల్ కన్వెన్షన్‌కు ప్రెసిడెంట్‌గానూ ఉండటంతో, యీ పై చెప్పిన విషయాలతోనేగాక, ప్రభుత్వానికి సంబంధించిన ఇతర కోణాలలోకూడా పరిచయం లభించింది. ఉన్నత కళల విషయంలో తనలో ఉన్న లోపాలనుగూర్చి ఆయ నెంతో నిజాయితీగా ఉంటూ, సక్రమమైన పరిపాలనా విధానాన్ని అమలు జరపగలిగారు. ఈ కొత్త ప్రభుత్వంలోని పదవులకోసం వచ్చే దరఖాస్తులు ముంచెత్తుతూన్నవి. ఆయన స్వభావసిద్ధమైన మోటు మాటలతోనే ఇలాటి దరఖాస్తుదారుల కెవ్వరికీ మాటిచ్చేందుకు నిరాకరించారు. ఆయన న్యూయార్క్‌కు

వచ్చేపుడు బరువైన హృదయంతో వచ్చినా, నిష్కల్మష మైన చేతులతోనే విచ్చేశారు.

అదృష్టవశాత్తూ 1789 ఎండాకాలంలోనే ఏ క్లిష్ట పరిస్థితీ ఏర్పడలేదు. కాంగ్రెస్ సమావేశంకావటమే చాలా మందగతిలో జరిగింది. ఆ తరువాత వారు చిన్న చిన్న సమస్యలూ వాటి పరిష్కార విధానాలనుగూర్చే ఆలోచిం చారు. ఐతే కాంగ్రెస్ అంతా వెలుగుతోనూ, మాధుర్యం తోనూ నిండిలేదు. ఈసుస్థిరమైన ఫెడరల్ ప్రభుత్వం ఎక్కడ ఉండాలనే విషయంమీద వాగ్వాదాలు అధికమై, ఆ యా ప్రాంతీయసంబంధమైన ద్వేషాలింకా సజీవంగానే ఉన్న వనేవిషయం వెల్లడయింది. ప్రాథమికంగా ఏకాభిప్రాయాలు లేవనేందుకు ఇవి చిహ్నాలు. ఐనప్పటికీ - కాంగ్రెస్, జాతీ కూడా కాన్‌స్టిట్యూషన్ విషయంలో గొడవచేయకుండానే అంగీకరించినవి. 'బిల్ ఆఫ్ రైట్స్'కు అవసరమైన మార్పులుచేసి, వ్రాయబడి వివిధ రాష్ట్రాలకు పంపబడి, శ్రమలేకుండానే వాటి అంగీకారాన్ని పొందటం జరిగింది. ఆ తరువాత ఉత్తర కరోలినా, రోడ్ ఐలెండులు కూడా యూనియన్‌లోకి ప్రవేశించినవి. న్యాయసంబంధమైన చట్టం- కాన్‌స్టిట్యూషన్‌లో పేర్కొనబడిన ఫెడరల్‌కోర్ట్ విధా నానికి అనువుగాఉండేది-1789 లో పాస్‌చేయబడింది. వాషిం గ్టన్ ప్రారంభోత్సవాన్ని జరిపిన కొద్దినెల్లలోనే - ఫిలడెల్ఫి యాలో ఊహించబడిన పత్రం స్వజీవితాన్ని రూపొందిం చుకో సాగింది. దీన్ని అందరూ ఒప్పుకున్నారు. నిజానికి

అమెరికన్ల ఐక్యతకు వాషింగ్టన్ సూచనగా ఉంటే, యీ కాన్‌స్టిట్యూషన్ లిఖితపూర్వకమైన పత్రంగాఉండి, ఎంతో పవిత్రమైనదిగా భావింపబడుతూ, కలిసికట్టుతనానికి రెండవది, మరింత సుస్థిరమైన సూచనగా ఉన్నది. అమెరికనులు జార్జి వాషింగ్టన్‌పట్ల వ్యక్తిగతంగా ఎంతో గౌరవాన్ని ప్రదర్శిస్తున్నారు; ఆయనను ప్రభుత్వ ప్రతినిధిగా మరింతగా గౌరవించసాగారు. వారు తమ యీ ధోరణిని అనేక విధానాల్లో కనబరిచారు. కాంగ్రెస్‌లో జరిగే వాదప్రతివాదాలు ఒకోసారి పగతోకూడినవిగాను, మరొకసారి అతిస్వల్పవిషయాలుగానూ ఉంటున్నవి. ఐతే ఇవన్నీకూడ పార్లమెంటరీ చట్రంలోపలనే ఉంటూ, అమెరికనల దీర్ఘకాల అనుభవాన్ని భంగపరచటంలేదు. ప్రవేశపెట్టబడిన కాన్‌స్టిట్యూషన్ సక్రమంగా పనిచేయాలని అత్యధిక సంఖ్యాకులైన అమెరికనుల వాంఛగా ఉండటంవల్ల, అది సాధ్యమైంది. ఎంతోకాలంగా అలవడిన కలిసికట్టుతనాన్ని సాధించే వాషింగ్టన్ చాతుర్యమే లేనట్లయితే, ఆయన శ్రమంతా వృథాఐఉండేది.

ఈ కొత్తప్రభుత్వాన్ని సులువుగా నడిపేందుకువీలుగా ఉండే లక్షణాలు 1789 లో మరికొన్ని సమకూరినది; ప్రెసిడెంట్‌గా అంతకుపూర్వమే - టోబియాస్ లియర్, డేవిడ్ హంఫ్రహాస్, తదితరవ్యక్తులు, వ్యవసాయశాఖను గూర్చి బాగా తెలిసేవారున్నారు; ఇప్పుడు, ఇంతకు పూర్వం ఖండానికి సంబంధించిన కాంగ్రెస్‌కు సెక్రటరీగా ఉన్న విలియం

జాన్‌సన్ కూడా ప్రెసిడెంట్ తాలూకు సెక్రటరీల జాబితాలో చేరటంవల్ల, ప్రెసిడెంట్‌కు ఎంతో మంచిదయింది. అంతకన్న, ఆ పురాతన శాఖల్లో పనిచేస్తున్న ఉన్నతాధికారుల్లో చాలామందితో వాషింగ్‌టన్‌కు అంతకుపూర్వమే పరిచయం ఉండటం మరీ మంచిదయింది. కాన్‌స్టిట్యూషన్ ఆయాశాఖలనుగూర్చిన క్రమమైన ప్రస్తావన లేదు. ఐతే కాంగ్రెస్ అవసరమైన చట్టాన్ని ఆమోదించి, ఆ పాతదాన్ని పునర్నిర్మించే అవకాశాలను కలుగజేయటమే గాక, కొంత వాదప్రతివాదాల అనంతరం అమలుజరిపే అధికారులను తొలిగించేందుకు, లేదా ఉన్నతస్థానాలు, బాధ్యతాయుతమైనవాటిల్లో ఉద్యోగాలనిచ్చేందుకు ప్రెసిడెంట్‌కు హక్కును కలుగజేసింది.

పూర్వం తనకింద ఫిరంగి దళాలమీాది అధికారిగా ఉన్న – మసాచుసెట్స్‌నివాసి హెన్రీనాక్సును ఆయన యుద్ధకార్యకలాపాలకు సెక్రటరీగా ఉంచేశారు. 1784 నుంచీ అంతర్జాతీయ విషయాలకు సెక్రటరీగా ఉంటున్న, న్యూయార్క్ నివాసి జాన్ జే సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా నియమింపబడ్డాడు. జాన్ జే పోకతో ఖాళీఐన స్థానాన్ని విజ్ఞాని, తనకు మిత్రుడు, వర్జీనియా నివాసి ఐన థామస్ జఫర్‌సన్ ఆక్రమించాడు. ఎడ్మండ్ రాన్‌డాల్ఫ్ అనే మరొక వర్జీనియన్‌ను ఎటర్నీ జనరల్‌గా చేశాడాయన. స్టేట్‌డిపార్టుమెంట్‌లో సరిసమానమైన ప్రాముఖ్యత ఉన్న ట్రెజరీకి – ఇంతకుపూర్వం ఒక కమిటీ ఆధ్వర్యాన ఉండే

పద్ధతిని తొలిగించి, వాషింగ్‌టన్ ఒకేవ్యక్తి అధీనంలో ఉంచారు. ఇందుకుగాను ముప్ఫయ్యోపడిలోఉన్న న్యూ యార్కు నివాసి అలెగ్జాండర్ హామిల్టన్ - వయసుకు పిన్న వాడైనా, యోధుడుగా, లాయరుగా, సిద్ధాంత నిర్మాతగా గణనకెక్కినవాడవటంవల్ల - ఆ స్థానాన నియమించబడ్డాడు. చివరకు పోస్టల్ డిపార్టుమెంట్ ఒకటి ఉండిపోయింది. దీన్నిది వరకు బెంజిమన్ ఫ్రాంక్లిన్ నిర్వహించేవాడు. ఇప్పుడది పోస్ట్‌మాస్టర్ జనరల్ ఐన శామ్యుయల్ ఆస్‌గ్రాడ్‌కు ఇవ్వ బడింది. వీరందరూ కూడా సుప్రసిద్ధులైన వ్యక్తులేగాక, తమకు కేటాయించబడిన యీ కొత్త కొత్త బాధ్యతలతో దాదాపు పరిచయమున్నవారే! నిజానికి స్వాతంత్ర్యానికీ, అమెరికన్ల ఐక్యతకూ పాటుబడిన వ్యక్తులతో న్యూయార్కు మారుమ్రోగింది. ఉదాహరణకు జేమ్స్ హడ్సన్ వర్జీనియాలోని ప్రతి పక్షీయులచే సెనెట్‌లో ప్రవేశించలేక పోయినా - ప్రతినిధుల సభలో ప్రముఖవ్యక్తిగా ఉంటున్నాడు.

అంతకు పూర్వమే కాన్‌స్టిట్యూషన్‌లో రూపుదిద్ద బడినదాన్ని కాంగ్రెస్ చట్టరూపాన పెడుతూ విస్తరిస్తూ ఉంటే, వాషింగ్‌టన్ కేవలం దాదాపు దాన్ని అమలు పరుస్తున్నారు. అనేక విషయాలింకా సందేహాస్పదంగానే ఉన్నవి. వీటిల్లో ప్రెసిడెంట్ అధికారాలు ఒకటి. కాంగ్రెస్ రెండు శాఖలకూ సంబంధించిన అధికారాలూ, విధులలో ప్రెసిడెంట్ భాగాలు పంచుకున్నప్పటికీ ఆయన

యీ రెంటికీ కూడా కొంత దూరంలో ఉండాలని వాషింగ్‌టన్, ఆయన సమకాలీనులూ విశాలదృక్పథంలో ఏకీభవించారు. ఇక ప్రెసిడెంట్ వేతనాన్ని గూర్చిన ప్రస్తావన వచ్చినప్పుడు - కాన్‌స్టిట్యూషన్ కన్‌వెన్షన్‌లో ఇలాంటి దాన్ని ఫ్రాంక్లిన్ తీవ్రంగా ఖండిస్తూ, గౌరవనీయమైన పదవి 'లాభసాటి పదవి'గా కూడా ఉంటే ఆశ, దురాశలను ప్రమాదకరమైన స్థాయికి పెంపొందిస్తుందని అన్నాడు. వాషింగ్‌టన్ సర్వసేనాపతిగాఉన్న కాలంలో ఆయన వేతనమేమీ తీసుకోలేదు. కేవలం ఖర్చులు మాత్రమే స్వీకరించారు. పోతే ఆయన చేసిన ప్రారంభోపన్యాసంలో కూడా ఇదే విధానాన్ని వెల్లడిచేశారు. ఐతే ఆయన సూచనే గనుక అమలుజరుపబడిఉంటే వాషింగ్‌టన్ సర్వనాశనమయేవారు. ఆయనకూ, ఆతరువాత ఆ స్థానాన్ని ఆక్రమించినవారికీ మేలు జరిగేటట్లుగా - ప్రెసిడెంట్ వేతనం సాలుకు 25,000 డాలర్లు అని కాంగ్రెస్ నిర్ణయించింది. 1789 లో ఇది గొప్ప ఆదాయం. సెక్రటరీ ఆఫ్ స్టేట్, లేదా ట్రెజరీ సెక్రటరీల సంవత్సర వేతనం 3,500 డాలర్లు; కాంగ్రెస్ సభ్యుల దినబత్తెం 6 డాలర్లు.

ఆదాయానికి అనుగుణంగా ప్రెసిడెంట్ తన అంతస్తునూ, హోదానూ ప్రదర్శించాలి. ఐతే యీ అంతస్తు అనేది ఎంత ఎత్తున ఉండాలనే దానికి పరిపూర్ణమైనజవాబు లేదు. మహాదైశ్వర్యంలో జీవించటమంటే మెకాలేలాటి

వ్యక్తుల ఈర్ష్యాద్వేషాలకు గురికావలసి ఉంటుంది. ఎందుకంటే మెకాలే, మరికొందరు అమెరికన్‌లూ దేశంలో 'రాజరికం' లాటిది సుస్థాపిత మౌతుందేమోననే సందేహంలో ఉన్నారు. అలాకాకుండా పొదుపరితనాన్ని ప్రదర్శిస్తే ప్రెసిడెంట్ పదవికే అవమానంగా ఉంటూ, అందువల్లకూడా అసహ్యాకరమైన భావాన్ని రేకెత్తించవలసి వస్తుంది. యీ రెంటినీ సమన్వయించిన వాషింగ్‌టన్ విధానం అనేకమంది దేశీయుల్ని తృప్తి పరిచింది. హుందాతనమూ, లోకజ్ఞానమూ ఆయన వేగుజుక్కలు. ఐతే ఆయన్ను పిలవాల్సిన గౌరవ వాచకం ఏమిటి? సెనేట్ అధ్యక్షత వహించిన జాన్ ఆడమ్స్, రాజుగారిని పిలిచే గౌరవవాచకాల్లాటి వాటిని సూచించి, హాస్యాస్పదంగా ధ్వనించాడు. "ఘనతవహించిన, యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ ఆమెరికా ప్రెసిడెంట్, అమెరికన్‌ల స్వాతంత్ర్య రక్షకుడు." ఇదీ సెనెట్‌వారు సూచించింది. కాని సభికులు సరళంగా ఉండే గౌరవవాచకం 'ప్రెసిడెంట్ ఆఫ్ ది యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా' ఉండాలని కోరాడు. 'సర్వశక్తిసంపన్నుడు ప్రెసిడెంట్ ఆఫ్ ది యునైటెడ్ స్టేట్స్' అనేలాటిది ఉండాలని వాషింగ్‌టన్ వాంఛ అని చెప్పబడింది. ఐతే యీ వాదప్రతివాదాలు వాటంతటవే సహజమృత్యువును పొందేందుకు అనుమతించి, తన విజ్ఞానాన్ని ప్రదర్శించి, వాషింగ్‌టన్ మిన్నకున్నారు. చివరకు అతిసరళంగానూ, అందరికీ నోరు తిరిగేట్టుగానూ ఉన్న "మిస్టర్ ప్రెసిడెంట్" అనేది వాడుకలోకి వచ్చింది.

కులాసా కాలక్షేపాలలోనూ, ప్రభుత్వహోదాలో ప్రయాణాలుచేసే విధానంలోనూ ఆయన లోకజ్ఞానాన్నే అమలుజరిపారు. మౌంట్ వెర్నన్‌లో ఆయన తనగృహాన్ని అతిథుల కొరకు ఇప్పటికీ తెరిచేఉంచారు. కాని అలాటిది న్యూయార్క్‌లో అసంభవం. అందుకని ముందుగానే సలహా చేసి ఆయన వారానికి ఒకసారి ఆస్థానంలో కనిపించే ఆచారం, అందులో తనను చూడదలిచిన వారికి అవకాశ మివ్వటం, ఆతరువాత విందుభోజనాలు (ఈ ఆస్థాన కాలక్షేపం అయాక, సర్వసాధారణంగా మధ్యాహ్న సమయాలలో) ఉండే పద్ధతి ప్రవేశపెట్టారు. ఆయన వ్యక్తిగతమైన ఆహ్వానాలను అంగీకరించేవారుకారు. ఆయనకు నాటకాలంటే మహాఇష్టం! థియేటర్‌లో అతిథులమధ్య నాటకం చూస్తూండేవారు. తిరిగి సలహాచేయబడి, ఆయన యూనియన్‌లోని వివిధప్రాంతాలను దర్శించేందుకు నిశ్చయించుకున్నారు. ఇందులోకూడా పక్షపాతం చూపకుండా ఉండాలని ఆయన ఆశయం. అందుకనే 1789 లో ఆయన న్యూఇంగ్లండ్‌ను దర్శిస్తే, రెండేళ్లతరువాత దక్షిణ రాష్ట్రాలను దర్శించారు.

ఈ కొరకరాని కొయ్యలో ఇదంతాకూడా బహుశా ఒక ముఖ్యభాగమే. ముఖ్యంగా కాంగ్రెస్‌తోడి సంబంధ బాంధవ్యాల విషయంలో దీన్ని ఘంటాపథంగా చెప్ప వచ్చు.. ఉభయులూ సక్రమమైన ప్రవర్తనను ప్రదర్శించారు. ఇలాటిది తేలికైన విషయమేంకాదు. ఆయన

ఉపన్యాసాలు, వ్యావహారికమైన జవాబుల్ని తీసికొచ్చేవి - వీటికి తిరిగి జవాబులూ, ప్రతిజవాబులూ జరుపబడుతూం డేవి. సంస్థాపకులు కనిపెట్టిన ఒక ఫలితమిది : ప్రెసిడెంట్, సెనేట్ ఒకరి కొకరు దూరంగా జరిగారు. బహుశా ఇలాటిది తప్పనిసరేమో ! ఎందుకంటే - కొత్తప్రభుత్వం తనకున్న సౌకర్యాల విషయం ప్రమత్తతను కలిగిఉంటూ, ప్రతిమెట్టు మీాదా నియోగించబడిన విధుల విషయమై మెలకువగానే ఉన్నది. ఐతే ఒకరకం నిశ్చలతా, సంభ్రమమూ కలిగినవి. సెనేట్ ప్రెసిడెంట్‌కు ఆంతరంగికంగా వ్యవహరించేందుకు మారుగా, అది వాషింగ్‌టన్‌కు దూరంగా జరిగింది. అమలు జరిపే అధికారీ, సెనేట్‌లు కలిసి వహించిన ఉమ్మడి బాధ్యతను నిర్వహించేందుకుగాను వాషింగ్‌టన్ ఒక్కసారే స్వయంగా సెనేట్‌కు వచ్చారు - అంతర్జాతీయ విధానం మీాద సమాలోచనలు చేసేందుకు. ఐతే యీా సందర్భం పరాజయాన్ని కావిలించుకున్నది. మెకాలేను నమ్మవలసి ఉంటే - వాషింగ్‌టన్ వేడెక్కిపోయి, ఓర్పుచూపలేక, చికాకుపడి, ఆయన కోర్కెలను తక్షణం సెనేట్ అంగీకరించని కారణాన వెళ్లి పొయ్యారని చెప్పవలసి ఉంటిది.

ఐనప్పటికీ - వాయిదా అనంతరం వాషింగ్‌టన్ తిరిగి నవ్వుముఖంతో, కులాసాధోరణిలోనే సెనేట్‌కు వచ్చారని మెకాలే ఒప్పుకుంటూనే ఉన్నాడు. ఈ పరిశోధనను ఆయన పునశ్చరణ చేయలేదంటే, లేదా తన కోర్కెల విషయంలో ఆయన అంతగా పట్టుపట్టలేదంటే,

ప్రమాదకరమైన సంబంధాలను తప్పించారనే అనాలి. ఏ సందర్భంలోను కూడా ఆయనకు సలహాలకొరవ ఎన్నడూ లేదు. మొదటి సంవత్సరాలలో ఆయన సంబంధాలు మాడిసన్‌లో చాలా దగ్గరగా ఉంటూండేవి. మాడిసన్ ఆయన్ను చూసేందుకు వచ్చి, ఆయా కాగితాలను తయారుచేసి, కాన్‌స్టిట్యూషన్ మీంది తన అభిప్రాయాలను చెపుతూండేవాడు. 1792 లో వాషింగ్‌టన్ పదవినుంచి నిష్క్రమించ దలచుకున్నప్పుడు (అంటే మొదటి టరమ్ పూర్తయిన సమయాన) మాడిసన్ ఆ యా విషయాలను ఏర్చి, కూర్చి, పత్రాన్ని తయారుచేశాడు. అదే నాలుగేళ్ల తరువాత వీడ్కోలు ఉపన్యాసంగా ప్రసిద్ధిగాంచింది. ఆయన అలెగ్జాండర్ హామిల్టన్ మీంద అధికంగా ఆధారపడ్డారు. అంతకన్న కాస్త తక్కువగా జాన్ జేమీందా, వైస్‌ప్రెసిడెంట్ ఆడమ్స్‌మీందా ఆధారపడ్డారు. క్రమంగా ఆయనఅమలు జరిపే అనేక శాఖల్లోని ఉన్నతోద్యోగులమీంద ఆధారపడసాగారు. ఇదంతాకూడా పథకంవేసుకోవటంవల్ల జరిగింది కాదు. ఎందుకంటే ఎవ్వరూకూడా ప్రెసిడెంట్‌ను ముఖ్యమంత్రిని చూసే దృష్టితో చూడలేదు. ఐనప్పటికీ ఆయన మొదటి టరమ్ పరిపాలన అంత్యదశలో ఆయనకూ్కడా కొంత 'మంత్రివర్గం' ఏర్పడింది. ఈపదమైతే అమల్లో ఉన్నది కాని, దీనికి సంబంధించిన భావం ఇంకా విశిష్టరూపాన్ని దాల్చలేదు.

ఈ సమయానికి ఒక పథకమనేది లేకుండానే – పార్టీ విధానం లాటిదాన్ని వాషింగ్‌టన్ ప్రవేశపెట్ట గలిగారు.

నిజానికి ఆయనమీద ద్వేషం కేంద్రీకరించబడి ఉంటూ, మాడిసన్‌కూ, ఆయనకూ ఏకాభిప్రాయాలు కుదరక, ఒకరి నొకరు పడిపోకుండా చూసుకోలేని పరిస్థితులు సంభవించి నవి. మాడిసన్ భవిష్యత్‌జ్ఞాన దృష్టితో పరిశీలించి, 'పార్టీసంబంధమైన' ధోరణి అనేది ప్రతి నాగరికమైన జాతి లోనూ ఉండక తప్పదనీ, ఆ యా మతాలూ, పక్షాలతో రాజీధోరణిని ప్రదర్శించటం, కాంగ్రెస్, అమలుజరిపేవారి గురుతర బాధ్యతలనే సత్యాన్ని గ్రహించారు. వాషింగ్టన్ ప్రెసిడెంట్ పదవీస్వీకారానికి ముందే దేశంలోని వివిధ రాష్ట్రాలమధ్య ఉండే వైరాలకు తోడుగా, కాన్‌స్టిట్యూషన్ మీద భేదాభిప్రాయాలు ప్రమాదకరంగా ఉన్నవనే విష యాన్నికూడా గ్రహించారు. ఎన్నికల సమయంలో ఏంటీ ఫెడరలిస్టలు తనకు ఓట్లు వేయరని ఆయన తలపోశారు.

కాన్‌స్టిట్యూషన్‌ను అమలుజరపటంలో, వాదప్రతి వాదాలు సమసిపోతవని వాషింగ్టన్. ఆయనతోటివారూ అనుకున్నారు కాని, ఈ వాదప్రతివాదాలకు కాంగ్రెస్ ముఖ్యకేంద్రంగా రూపొందుతుందనిమాత్రం అనుకోలేను. 1787–1788 సంవత్సరాలలో కాన్‌స్టిట్యూషన్‌ను బలపరి చినవారు అపార్థంచేసుకున్నవారిని తీవ్రంగా ఎదుర్కొ న్నారు. వారు తమను తాము ఫెడరలిస్టలనీ, ఏంటీఫెడర లిస్టలనీ పిలుచుకుంటూ శైశవదశలో ఉన్న తమ జాతి రూపురేఖ లెలా ఉండాలనే విషయంమీద రగడగా వాగ్వాదాలు చేయసాగారు.

ఎవరెటున్నదీ ఇదమిత్థంగా లేదు. మాడిసన్, రాన్ డాల్ఫలలాటి కొంతమంది తమ మనసులు మార్చుకున్నారు. ఒకేపక్షంలో ఉన్నవారిమధ్య అభిప్రాయభేదాలు ఏర్పడినవి. మసాచుసెట్స్ నివాసి ఫిషర్ ఏమ్స్‌కి - ప్రతినిధుల మహాసభలో ప్రముఖునికి - ఆయన సోదరుడైన నాథనియల్ కన్న గొప్ప శత్రువు మరొకడు లేడు; కొన్నిసంవత్సరాల అనంతరం నాథనియల్ ఫిషర్ ఏమ్స్ అంత్యక్రియలకూ-డా రాక, ఇదంతా ఫెడరలిస్ట్‌ల ప్రచారమని అన్నాడు. ఫెడరలిస్ట్‌లు సరుకున్న మనుషులు. వీరిలో చాలామంది వ్యాపారస్థులు, లాయర్లూ మొదలైనవారు. అత్యధికులు తూర్పు భాగాలనుంచి వచ్చినవారు. వీరి ప్రతిపక్షీయులు అనేక కారణాలుగా దీన్ని ప్రతిఘటిస్తున్నారు. వీరిలో కొంతమంది బలవత్తరమైన జాతీయప్రభుత్వమనే భావానికి అయిష్టతను చూపుతూన్నారు; లేదా, పరిపాలనావిధానంలోని అధికారాన్ని ఏవగించుకుంటున్నారు. వీరిదృష్టిలో - టామ్‌పైనీ దృష్టిలోవలెనే - ప్రభుత్వం "అమాయకత్వానికి పోగొట్టుకొన్నచిహ్నం." ఇతరులు - దక్షిణాదివారూ, పశ్చిమాదివారూ - ఫెడరలిస్ట్‌లంటే స్వార్థపరులైన వ్యాపారులనే అభిప్రాయంలో ఉన్నారు.

పోతే ఇందుకు ప్రతిఫలంగా ఏర్పడిన పోరాటం కనీసం నాలుగు కారణాలమీద ఆధారపడి, వాషింగ్‌టన్‌ను చాలా చికాకు పరిచింది. మొదటిది - ఈ ఐక్యత సుస్థిరత్వాన్ని ఎవరు కానీ ఎందుకని భయపెట్టాలనేది. రెండోది-

యీ అంతర్యుద్ధం తన ప్రభుత్వంలోని అధికారులమధ్యనే ఆరంభమైంది. మూడోది - యీ యుద్ధం అంతర్జాతీయ వ్యవహారాలవరకూ విస్తరించింది. నాలుగోది ఇది ప్రత్యక్షంగా ఆయన గౌరవమర్యాదలమీద దెబ్బతీసేదిగాఉన్నది.

1789 లో వాషింగ్టన్ యీ స్థానాన్ని ఆక్రమించినప్పుడు ఆయన తన తల బిరుసుతనం కారణంగా గాక, అనేకమంది అమెరికన్‌లు తనతో చెప్పిన మాటల కారణంగా - చుక్కానిదగ్గర తన అవసరం ఎంతో ఉన్నదని నమ్మారు. ఇంతకన్న సహజమైన ఉత్ప్రేక్షాలంకారాన్ని వాడాలంటే - వంతెనదగ్గర ఆయన అవసరం ఎంతో ఉన్నది. అమెరికాకు అత్యవసరమైన, ప్రాథమికమైన అవసరం విశ్వాసం. ఆయన వీడ్కోలు ఉపన్యాసంలో, "కాలమూ అలవాట్లూ కనీసం ప్రభుత్వం, లేదా ఇతర మానవసంస్థల గుణగణాలను నిర్ణయించేందుకు అవసరమౌతవి" అని ఆయన అన్నారు. ముందు యూనియన్‌ను సక్రమమైన పద్ధతిలో ఉంచుతే, మిగతా విషయాలు యథావిధిగా వాటంతటవే సరైనపద్ధతిలో అమరుతవి. చిన్న నౌకాదళం, సైనికులూ, మిలిటరీ ఉంటే శాంతి కాపాడబడుతుంది. ప్రభుత్వాదాయాలు వసూల్లుచేయబడి, చట్టాలకు కట్టుబడిఉండి, స్వదేశీయుల గర్వాన్ని ప్రోత్సహించాలి. ఆ తరువాత విషయాలు వాటితీరుల్లో సాగనిస్తే సరిపోతుంది. ఇదీ ఆయన వేదాంతం. అమెరికా కానీ, యూనియన్ కానీ గొప్పదిగానూ, శక్తివంతమైనదిగానూ ఉన్నది. ఇదంతా

పద్యరూపాన చెప్పబడే సిద్ధాంతం కాదు. ఐతే ఆయన ఆత్మశక్తిని పెంపొందించుకునేందుకు తనను తాను ప్రోత్సహించుకోలేదు. అదంతా చెప్పలేని గాఢవిశ్వాసం – తనలో ఎక్కడో మారుమూల దాగిఉన్న దేనని ఆయన భావించారు.

ఇదిలాఉండగా – చట్టాలకు సంబంధించినంతవరకూ వాషింగ్టన్ ముఖ్యపాలనాధికారివలెగాక, ముఖ్యన్యాయవేత్తవలె ప్రవర్తించారు. ట్రెజరీసెక్రటరీఐన అలెగ్జాండర్ హామిల్టన్ ఈ విషయంలో మరింత నిశ్చయ ప్రవర్తనను ప్రదర్శించాడు. హామిల్టన్ దృష్టిలో–"కాన్‌స్టిట్యూషన్ ఒక వస్త్రవిశేషంగా ఉంటూ, యథాస్థానంలోనే ఉండును; అది ముందుకు సాగనట్లయితే, వెనక్కి పోతుంది." కనుక యీ కదలికను సృష్టించాలంటే విశ్వాసం అత్యవసరం. ఇక 'రాజకార్యధురంధరుడు' అంటే ఆయన దృష్టిలో తానేనని!

అమెరికన్ చరిత్రలో హామిల్టన్ ఒక విచిత్రవ్యక్తిత్వం. వాషింగ్టన్ ఎంతో మంచివారు కావటంతో, నిజంగా అలాటి వ్యక్తేనానని మనం భయపడతాం; కాని హామిల్టన్ ఇందుకు విరుద్ధంగా, సమన్వయించలేని వ్యక్తిత్వం కావటంవల్ల మనను భయపెడుతాడు. ఒక సమయంలో విశ్వాసపాత్రత చూపుతూ, మరొకవేళ తనను తాను పెంపొందింప జేసుకుంటూ, ఒక తావున మెలకువగా ఉంటే, మరొకవైపున నిర్లక్ష్యతను ప్రదర్శిస్తూ, ఒకసారి అనుభవయోగ్యమైనదాన్నే అనుసరిస్తూ, మరొకసారి

ఊహాల మీదనే ఆధారపడుతూ – ఏ సమయంలోని ప్రెసిడెంట్ నైనా సరే ఆయన చేతికి సరిపడే విషయాలను అందించగలిగిన సమర్థుడే! ప్రభుత్వాన్ని గూర్చిన వివరణ ఇంకా ఇదమిత్థంగా తేలని సమయాన – ఈ అతిసమర్థుడైన యువకుడు, ఎంతో ఆత్మవిశ్వాసంతో, అధికారాన్ని చలాయించటంలో తాను ఒక రకమైన ముఖ్యమంత్రి స్థానాన్ని అలంకరించేందుకూ, వాషింగ్టన్‌ను పరిమితమైన అధికారాలున్న రాజుగా పరిగణించే ధోరణి ప్రదర్శించి, భయపెట్టాడు.

లోపల ఆశాపిశాచి ఏడిపిస్తూంటే, హామిల్టన్ తన స్థానాన్ని నిర్వచించేందుకు కొన్ని ఆధారాలను సేకరించి ఇలాభావించాడు: బ్రిటన్ సమకాలీన చరిత్రలో తన కన్న చిన్నవాడైన విలియమ్ పిట్ – ప్రధాన మంత్రే కాకుండా, ఛాన్సలర్ ఆఫ్‌ది ఎక్స్చెకర్. అమెరికన్ ఆర్థిక విధానంలో కొన్ని మార్పుల అవసరం ఎటూ ఉన్నది. కనుక హామిల్టన్ పథకాలు వాషింగ్టన్ పాలనలోని ప్రథమదశలో ప్రాముఖ్యత వహించే విధంగా ఉండక తప్పవు. హామిల్టన్ పదవీ స్వీకరణలో ఉపయోగించబడిన పదజాలంలో, అధికారులకు ఆయన ప్రత్యేక కార్యకలాపాలను గూర్చిన సూచన చేస్తూ, ప్రెసిడెంట్‌కూ, కాంగ్రెస్‌కూ మధ్యవర్తిగా ఉంటాడనే భావం వ్యక్తమైంది. ఈ విధంగా ఆరు నెలలు గడిచింది; ఈ ఆరు నెల్లలోనూ అన్ని సందర్భాలలోనూ – ప్రముఖ సమస్యలు – అంతర్జాతీయ సమస్యల్లోకూడా, హామిల్టన్ సలహాలు కోరబడటం, తప్పనిసరిగా ఆయన చేయి ఉండటం

జరిగింది. ఆ తరువాత రెండవ అధికారి ఐన థామస్ జఫర్‌సన్ స్థానాన్ని ఆయన అలంకరించాడు.

ఐతే ఫలితాలు దారుణంగా తయారైనవి. ఎందుకంటే త్వరలోనే హామిల్టన్, జఫర్‌సన్‌ల మధ్య తీవ్రమైన అభిప్రాయ భేదాలు వర్ధిల్లినవి. అమెరికన్ కథలో జఫర్‌సన్, హామిల్‌టన్‌లు ఉత్తర దక్షిణ ధ్రువాలనీ, తదనుగుణంగా ప్రాథమికమైన విభాగాలు ఏర్పడినవనీ సామాన్యంగా చెప్పబడుతోంది. ఐనప్పటికీ యీ అభిప్రాయభేదాల తీవ్రతను ఒప్పుకొనవుండటంకానీ, వీరు పట్టిన ఆయా ప్రత్యేక మార్గాలను కాదనటంకానీ లేదు. హామిల్‌టన్ గొప్పవాడైతే థామస్ జఫర్‌సన్ అంతకన్నా గొప్పవాడు; ఐతే హామిల్‌టన్ అంత కలహప్రియుడుకాదు. హామిల్‌టన్ వలెనే – జఫర్‌సన్ కూడా చర్చనీయాంశాలలో తాను వ్యక్తిగతంగా ఇరుక్కునేందుకు ఇష్టపడలేదు; పోతే హామిల్‌టన్‌వలె తాను అత్యున్నతస్థానాన ఉండాలని ఆయన కోరలేదు. ఆ అత్యున్నతస్థానాలు ప్రమాద కరమైనవి కావటం వల్ల ఆయన్ను ఆకర్షించలేదు. ఇక – హామిల్‌టన్ యుద్ధంలో సైన్యాలను నడిపాడు; ఇప్పుడు యుద్ధ విషయాలలో సెక్రటరీగానూ, సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గానూ కూడా వ్యవహరిస్తూ – ఒక చెయ్యిచూడొచ్చని అభిప్రాయపడ్డాడు. జఫర్‌సన్ ఎన్నడూ కదనరంగంలో ప్రవేశించిన వాడుకానీ, సిపాయిగా ఉన్నవాడు కానీ కాదు; తనకు మిలిటరీ అనుభవం ఉన్నదని ఆయన ఏవిధమైన నటనైనా ప్రదర్శించలేదు.

ఏది ఏమైనప్పటికీ — యీ ఉభయులూ అనేకసార్లు క్రోధోద్రిక్తులై తలపడ్డారు. 'హక్కుల పత్రం' (బిల్ ఆఫ్ రైట్స్) కాన్‌స్టిట్యూషన్‌లో సుస్థాపితం చేయబడినాక, అది జఫర్‌సన్‌కు ఎంతో తృప్తినిచ్చింది. ఐతే జఫర్‌సన్ మాడిసన్ తదితరుల దృష్టిలో హామిల్‌టన్ అవలంబించిన విధానాలు అధునాతన ఫెడరలిజమ్ వలెనూ, ప్రమాద భరితంగానూ, విషతుల్యంగానూ ఉన్నవి. కాని యీ విధానాలకు వాషింగ్‌టన్ తన సమ్మతిని ఇచ్చి ఉన్నారు; వీటిల్లో చాలాభాగం అమలు జరుప బడినవి; ఇప్పుడవి అమెరికన్ వంశపారంపర్యతలో సాధారణంగానే కనిపిస్తవి.

ముఖ్యకారణం ఇది: హామిల్టన్ పథకాలు యూనియన్‌లోని కన్సర్వేటివ్‌లూ, వాణిజ్యశాఖల వారికి ఎంతో ప్రీతికరమైనవిగా ఉంటూ — వ్యవసాయశాఖల్లో ఉన్నవారికీ, విశిష్టతను ప్రదర్శించేవారికీ కఠినంగా ఉన్నవి. ఆపరిస్థితుల్లో ఒక రాజీకి రావటమనేది చాలా కష్టంగా పరిణమించింది. ఏదో ఒకవిభాగంలోని ప్రజలు అసంతృప్తి జెందక తప్పేట్లులేదు. 1790 లో హామిల్టన్ ఎత్తుకున్న ముఖ్యసమస్య అమెరికాకు ఉన్న ఋణాలు. ఈ ఋణాలు విప్లవ సమర సమయంలో అయినవి. ఇవి 80 మిలియన్ డాలర్లదాకా ఉన్నవి వీటిల్లో 25 మిలియన్ డాలర్లు ఆయా రాష్ట్రాలు తీర్చవలసి ఉన్నది. ఈఋణాలకు హామీగా ఉంచిన పత్రాలమీద ప్రజా విశ్వాసం సన్నగిల్లినప్పటికీ, హామిల్టన్ యీ ఋణాలను తీర్చేందుకే నిశ్చయించాడు. ఐతే యీ ఋణాలను తీర్చే

సావకాశాలు వివిధంగా ఉన్నవి. వీటిల్లో స్పెక్యులేషన్ వ్యాపారం చేసేవారిని మహదైశ్వర్య వంతుల్ని చేసే హామిల్టన్ పథకం చాలా వేడెక్కించింది. నిజానికి యీ పత్రాలు మొదట వీటిని దేశభక్తి ప్రదర్శించేందుకుగాను కొన్న ఆసాములచేతుల్లో లేవు. ఆర్థిక బాధలుపడి, వారు వాటిని తగ్గింపు ధరలకు అమ్మారు; ఆ పత్రాలను కొన్న వారికిప్పుడు ప్రభుత్వం దాదాపు ఆ పత్రపు విలువను చెల్లించాలని హామిల్టన్ ప్రతిపాదించాడు. ఈ జరిగిన తంతంతా హామిల్టన్‌కు బాగా తెలుసు; కాని ఆయన ప్రసరించిన దృక్పథం వేరుగా ఉన్నది. తన యీ పథకాన్ని ప్రవేశపెట్టినందువల్ల యూనియన్‌లోని ప్రతి విభాగమూ ఐక్యతను పొంది, యూనియన్ తాలూకు ఆర్థికవిధానం మీద ప్రజలకు అచంచల విశ్వాసముండగలదని ఆయన ఊహించాడు.

1791 ఆరంభంలో ట్రెజరీ సెక్రటరీ, సెక్రటరీ ఆఫ్ స్టేట్‌లు ప్రెసిడెంట్ సమక్షంలో ఘోరంగా వాగ్వాదాలు చేశారు. హామిల్టన్ ప్రభుత్వాధ్వర్యంలో ఒక జాతీయమైన బ్యాంక్‌ను స్థాపించదలచి, ఆ విషయాన్ని ప్రతినిధుల మహాసభకు తెలియపరిచాడు. ఈ ప్రతిపాదన ఎంతో అలజడి రేపటంవల్ల, వాషింగ్టన్ వివిధశాఖలను నిర్వహిస్తూన్న ప్రముఖుల వ్రాతపూర్వకమైన అభిప్రాయాలను కోరుతూ ఇలాటిదాన్ని కాన్‌స్టిట్యూషన్ సమ్మతిస్తుందో లేదో తెలియపరచమన్నారు. సహజంగానే హామిల్టన్ తనపరిపూర్ణ సామర్థ్యం ఉట్టిపడే విధానంలో – కాన్‌స్టిట్యూషన్

దీన్ని అంగీకరిస్తుందనే తెలియపరిచాడు. జఫర్సన్ తన ప్రతిభ నంతా ప్రదర్శిస్తూ, కాన్‌స్టిట్యూషన్‌ను అంతవరకూ విస్తరించేందుకు వీలుండదన్నాడు. ఈ పరిస్థితుల్లో వాషింగ్టన్ చేయవలసిందేమిటి? ఈ రెండు అభిప్రాయాలు ఒక దాన్నొకటి రసవత్తరంగా, తీవ్రంగా ఖండిస్తున్నవి. ఏ ఒక్కటీ కూడా అంగీకారయోగ్యంగా ఆయనకు తోచలేదు. ఐతే యీ ఊహలన్నీ హామిల్టన్ బుర్రలోంచి ఉద్భవించి రూప ధారణచేసిన కారణంగా వాషింగ్టన్ ఆ బిల్లుమీద సంతకం చేసేందుకే నిశ్చయించుకున్నారు. ఆ తరువాత కొద్దికాలం లోనే హామిల్టన్ సిఫారస్‌చేసిన ఎక్స్‌సైజ్ బిల్లునుకూడా వాషింగ్టన్ ఆమోదించాడు; ఇందువల్ల దిగుమతి సుంకా లను విభాగాలుగాచేసి, ప్రభుత్వాదాయాన్ని పెంపొందింప జేయటమే దీని లక్ష్యం. డిస్టిల్డ్ లిక్కర్ మీద ఎక్స్‌సైజ్ డ్యూటీ వేయబడింది. పశ్చిమాదివారికి ముఖ్యజీవనాధార మిది. ఇందువల్ల మరొక తీవ్రమైన అభిప్రాయభేదం ఏర్పడింది.

మూలధనాన్ని సమకూర్చేందుకూ, దాన్ని నిర్వహించేందుకూగాను జాతీయమైన బ్యాంకూ, ఎక్స్‌సైజుసుంకమూ వచ్చినవి. మాడిసన్, జఫర్సన్లకు హామిల్‌టన్ గొప్ప అధి కారంలో ఉన్నట్లూ, ఆయన అలాగే ఉంటే అమెరికా పెడద్రోవలపడుతుందనే అభిప్రాయం తీవ్రతరమైంది. కాస్తో కూస్తో విజ్ఞానాన్ని సంపాయించిన వ్యవసాయదారులు వర్ధిల్లే అవకాశాలన్నీ అడుగంటినవి. ఇందుకుమారుగా అధి కారంలో ఉన్నవారు అమెరికాను యూరప్‌కు నకలుగా

రూపొందించేట్లున్నారు. కాంగ్రెస్‌లోని సభ్యులందరూ విశిష్టస్థానాలున్నవారే. ఈ విషయమింకా విస్తరించి నట్లయితే, అమెరికాలోని పరిపాలన వంశపారం పర్యా సంక్రమించేదిగానూ, కొద్దిరంగాల్లోని వారికి ప్రత్యేకంగా కేటాయించబడిందిగానూ రూపొందవొచ్చు. దీనికి విరుగుడల్లా హామిల్టన్‌తో పోరాడటమే! ఐతే పోరాటానికి నాయకత్వాన్ని వహించేందుకు జఫర్సన్ సమ్మతించలేదు. పరిస్థితులు తమంతతామే భారమై, వేగాన్ని అందుకున్నవి. క్రమక్రమంగా జఫర్సన్, మాడిసన్, తదితరులూ సంఘంగా రూపొంది, తాముఏంటీఫెడరలిస్టులమని భావించే అమెరికన్ల పక్షాన మాట్లాడే వ్యక్తులుగా తయారైనారు. తమ పక్షానికి ప్రత్యేకనామాన్ని అన్వేషించారు. ఇందులోని సభ్యులు 'డిమోక్రెటిక్ - రిపబ్లికన్స్', కాదా రిపబ్లికన్స్ అని పిలువబడసాగారు.

ఈ చీలిక వర్ధిల్లుతున్నదనే దానికి ఒకచిహ్నంగా 1791 అక్టోబర్‌లో రిపబ్లికన్ పత్రిక 'నేషనల్ గెజెట్' స్థాపించబడింది. ఇది ఫెడరలిస్టులను ఎదుర్కొనేందుకు స్థాపించబడిన మొదటి పత్రిక కాకున్నప్పటికీ, 1789 లో ఏర్పడిన యీకొత్త ప్రభుత్వంపాటే తలలెత్తిన 'గెజట్ ఆఫ్ ది యునైటెడ్ స్టేట్స్' అనే ఫెడరలిస్ట్ పత్రికకు సవాలుగానూ, ప్రమాదకరంగానూ ఉన్నది. ఫెడరలిస్ట్ పత్రిక జాన్ ఫానో సంపాదకత్వాన వెలువడుతూ, హామిల్టన్ పథకాలను బలపరచటంలో ఎన్నడూ ఏమరిఉండలేదు. ఫానోను ఎదుర్కొ

నేందుకు ఫిలిప్ ఫ్రీనే సంపాదకత్వాన్ని వహించాడు; ఈయన మాడిసన్‌కు కాలేజిలో సహాధ్యాయి; ఉగ్రమైన రిపబ్లికన్. జర్నలిస్టుగా ఫానోకన్న ఉత్సాహవంతుడు; స్టేట్ డిపార్ట్‌మెంట్‌లో పార్ట్‌టైమ్ అనువాదకుడుగా పనిచేశాడు. 1792 నాటికి ఫ్రీనే వాదాలు ప్రతిభావంతంగా ఉండటంవల్ల, ఫానోకు మారుగా అనేక మారు పేర్లతో వ్రాస్తూండే హామిల్టన్ ఫ్రీనేను జఫర్‌సన్ తొత్తుగా పేర్కొన్నాడు. ఫ్రీనే అంత బలవత్తరంగానూ దీన్ని ఎదుర్కొన్నాడు.

ఆ తరువాతి తరాలవారికి యీ పరిస్థితులు విచిత్రంగా కనిపించవచ్చు. వాషింగ్‌టన్ సలహాదారుల్లో అతిముఖ్యులైన ఇద్దరూ ఒకరినొకరు శత్రుత్వంలో ఎదుర్కొని దారుణమైన, ప్రాథమికమైన వాగ్వాదాల్లో పాల్గొన్నప్పటికీ, వారెవరికీ వేరొకరెవర్ని కానీ, తమకుతాము కానీ మోసగిద్దామనే భావమే లేదు. అధికారాన్ని అమలు జరిపే ఇతర శాఖల్లోని అగ్రశ్రేణివారు పక్షాలు తీసుకోనారంభించారు. నాక్స హామిల్టన్ పక్షంవహిస్తే, రాన్‌డాల్ఫ జఫర్సన్ పక్షం వహించాడు, హామిల్టన్ ఇప్పటికీ పరదేశవ్యవహారాలలో జోక్యం కలిగించుకుంటూనే ఉన్నాడు. డిపార్ట్‌మెంట్ ఆఫ్ స్టేట్‌నకు సానుకూలతతో కేటాయించ బడవలసిన పోస్ట్ మాస్టర్ ఆర్గనైజేషన్‌ను హామిల్టన్ తన చేతుల్లోకి తీసుకున్నాడు; అదేవిధంగా తర్కరీత్యా కొత్త ఫెడరల్ టంకశాల ట్రెజరీడిపార్ట్‌మెంట్ కింద ఉండవలసింది, జఫర్సన్

కిందపనిచేస్తున్నది. ఇదంతా కలగాపులగమైన గందర గోళమైందా?

ఆ సమయంలో – వాషింగ్‌టన్ వయస్సులో చూసి నట్లులేదిదంతా. సలహాదారులు పొందికగాలేరు. ఆయా పక్షాలు సక్రమమైన శ్రేణిలోనూ లేవు. అమలు జరిపే అధికారులు ప్రవేశపెట్టే పథకాలు ముతకగానూ, నిర్వ చించలేని ధోరణిలో ఉంటూ, అవే ప్రెసిడెంట్ ఆజ్ఞ లుగా భావించబడినప్పటికీ ఏకగ్రీవమైన నిర్ణయంగా ఉండటం లేదు. హామిల్టన్ జఫర్సన్‌లు ఉభయులూ ప్రెసిడెంట్‌ను గౌరవిస్తూనే ఉన్నారు; తమ తమ యూనియన్‌లకు విశ్వాస పాత్రులుగా ఉన్నారు. ఆయన సమక్షంలో వారు వాగ్వా దాలకు దిగటంలేదు. వారి వారి సంకటాలు ఒకరి పట్ల మరొకరికేగాని, వాషింగ్టన్ పట్లమాత్రంకాదు. చట్టాలకు పథకాలు తయారుచేసి, వాటిని ప్రోత్సహించటంలో ఉత్సా హంచూపక, ఎక్కడో దూరాన ఉండినప్పటికీ – ఆయన మూర్ఖుడు కానీ, బలహీనుడు కానీ కాదు. ఆయన మొదటి టరమ్ పరిపాలనలో, ఆయన కేవలం హామిల్టన్ చేతిలోని కీలుబొమ్మ అని ఎవ్వరూ నేరంమోపలేదు. హామిల్టన్ ఎయిడ్ – డీ కాంప్‌గా ఉంటున్న సమయంలో, ఆయన్ని వాషింగ్టన్ విప్లవ సమరంలో నాలుగేళ్లుగా ఎరుగును. 1787 లో ఫిలడెల్ఫియాలో హామిల్టన్ ప్రభుత్వాన్నిగూర్చిన తన అభిప్రాయాలను వెల్లడిచేయటాన్ని వాషింగ్టన్ వినిఉన్నారు. హామిల్‌టన్ విధానాన్నిగూర్చి శ్రీనే తదితరుల అభిప్రాయా

లను చదివేందుకు వాషింగ్టన్‌కు తగినంత అవకాశమున్నది. ఆయువకుని తెలివితేటలనూ, విజ్ఞతనూ వాషింగ్టన్ ఎంతో మెచ్చుకున్నారు. 1781 లో ఏదో ఊహించి పంతంకోసమై హామిల్టన్ వాషింగ్టన్ ప్రధాన స్థావరంనుంచి నిష్క్రమించటం జరిగింది. ఈ సంఘటనలో హామిల్టన్ తత్వమేమిటో వాషింగ్టన్‌కు ఆనాడే తెలిసిఉండాలి.

ఏది ఏమైనప్పటికీ 1792 ప్రెసిడెంట్‌కు సాఫీగా సాగిపోయిన సంవత్సరం కాదు. రెండురకాల వ్యాధులు ఆయన్ను పీడించినవి. 1789 లో తొడమీద ఒక కణితి లేచింది; 1790 లో న్యూమోనియావల్ల బాధ దాపరించింది. ఆయన జ్ఞాపకశక్తి క్షీణిస్తున్నది. ఆయన వయస్సు పెరిగిపోతూన్నది; జఫర్సన్ ఆపేక్ష మాంటిసెల్లోమీద పెంపొందుతున్న విధంగానే వాషింగ్టన్ ఆపేక్ష మౌంట్ వెర్నన్‌మీద వర్ధిల్లసాగింది. కాంగ్రెస్ సమావేశాలు జరగనప్పుడు ఆయన అక్కడ ఉండేవారు; దూరప్రదేశంలో ఉన్నప్పుడు ఆయన తన ఓవర్‌సీర్లకు దీర్ఘమై, సరిగా నిర్ధారణ చేయలేని విధంలో సూచనలు చేస్తుండేవారు.

ఉద్యోగ విరమణ సాధ్యమేనా? సరిహద్దు ప్రాంతాల్లో ఇండియన్‌లతో శాశ్వతమైన కష్టాలు ఎదురౌతూన్నప్పటికీ – యూనియన్ వర్ధిల్లుతూనే ఉండేది. ఐతే ఫెడరలిస్టులకూ, రిపబ్లికన్‌లకూ మధ్య ఉండే వాగ్వాదాలు తగ్గుముఖం పట్టటానికి మారుగా దిన దిన ప్రవర్ధమాన మౌతూన్నవి. మాడిసన్ వాషింగ్టన్‌ను ప్రెసిడెంట్ పదవినుండి విరమించ

వద్దని కోరాడు. వీరెవ్వరూ చివరకు మాడిసన్‌కు ప్రాణ మిత్రుడైన జఫర్‌సన్ కూడా ఐక్యతను కాపాడలేదు. వైస్ ప్రెసిడెంట్ ఐన జానీ ఆడమ్స్ ఫెడరలిస్ట్ అనే సందేహం ఉన్నది. ఆయన మెతక తత్వమున్నవాడు. ఇక జాన్ జేకు బహుకొద్దిమంది శత్రువులేఉన్నప్పటికీ ఫెడరలిస్టులలో ఆయన అతివాది. ఫెడరలిజంమీద ఒక్క కాలేమోపిన హామిల్టన్ ప్రస్తావనే అనవసరం. మాడిసన్ నోరువిప్పి చెప్పనప్పటికీ ఆయన ప్రముఖుడైన రిపబ్లికన్ కావటంలో, ఆస్థానానికి అర్హుడుకాడు. పోతే వాషింగ్‌టన్ ఒక్కరే ఆ స్థానానికి యోగ్యతను కలిగి ఉన్నారు.

వాషింగ్టన్ తన విధికి లొంగి ఎందుకని రాజీనామా ఇచ్చారో మనం చెప్పలేము. హామిల్టన్‌కూ, జఫర్సన్‌కూ మధ్య ఉండే అభిప్రాయ భేదాలను తుడిచివేయ గలుగుతే మరొక అభ్యర్థి లభ్యమవ వొచ్చని బహుశా ఆయన అభిప్రాయపడి ఉండొచ్చు. ఏమైనప్పటికీ ఉన్నపరిస్థితిని విశదీకరించే శ్రమను ఆయన తీసుకున్నారు. జఫర్సన్ హామిల్టన్ మీద కనీసం 21 నేరాలను మోపిన జాబితాను, వాషింగ్టన్ ఇస్తూ, ప్రభుత్వ పత్రాలమీద వ్యాపారంచేసే వారి విషయంలో పట్టిన పెడత్రోవలు, ఫెడరలిస్ట్ విధానాలను అనుసరించడం మొదలైనవన్నీ యీ జాబితాలో వివరించబడినవి. ఈ జాబితాకు వాషింగ్టన్ ఒక నకలు తయారుచేసి, జఫర్సన్ పేరు ఉదహరించకుండానే, అనేక తావులనుంచి తనకు చేరినవని చెపుతూ, వీటిని హామిల్‌టన్‌కు పంపారు.

క్రమేణా హామిల్టన్ కోపోద్రిక్తతతో, సందర్భోచితంగా, వివరణలతో సహా యీ నేరాలన్నిటినీ త్రోసిపుచ్చుతూ జవాబులు అందించాడు.

ప్రజాసంక్షేమం కొరకు హామిల్టన్, జఫర్సన్‌లు తమ అభిప్రాయభేదాలను విడనాడుమని వాషింగ్టన్ ఎంతో దూరం చెప్పి చూశారు. కాని వారి జవాబులు నిరాశాపూరితంగా ఉన్నవి. ఇక వాషింగ్టన్ చేయగలిగింది కూడా లేదు; కాకపోతే యీ ఉభయులూ కలిసి మెలిసి ఉండాలని కోరటం, జఫర్‌సన్‌ను సెక్రెటరీ ఆఫ్ స్టేట్ పదవికి రాజీనామా ఇవ్వవొద్దని కోరటం మాత్రం చేయగలిగారు. వీరిలో ఏ ఒకరినీ తాను విడనాడలేరు; ఎందుకంటే ఉభయులూ హేమాహేమీలు. ప్రతివిషయంలోనూ వీరి సలహాలు అమూల్యాలూను. వీరికి ఉద్యోగాల బెడద లేనట్లయితే, ఉభయులూ మరింత ఉత్సాహకరంగా, నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తారనే నమ్మకం ఆయనకు కుదిరింది.

1783 లో కొంతమంది ఉన్నతోద్యోగులు తమ సహాయంతో వాషింగ్టన్ యునైటెడ్ స్టేట్స్‌కు రాజు కావొచ్చని ఆయనకు తెలియపరిచినప్పుడు ఆయన అదిరిపోవటం, సంభ్రమాశ్చర్యాలకు గురికావటం జరిగింది. ఇలాటి పథకం తనపట్ల కానీ, ఏ అమెరికన్ పట్ల కానీ విజయవంతంగా కొనసాగ గలదనే నమ్మకం ఆయనకు ఈషణ్మాత్రంకూడా లేదు. కాన్‌స్టిట్యూషన్ ప్రకారం ప్రెసిడెంట్ సిద్ధాంత రీత్యా ఒకనారెకన్న ఎక్కువగా తిరిగి తిరిగి ఎన్నిక కావ

చ్చనే విషయంలో అలాటిదానిలో ఎలాటి హానీ లేదని వాషింగ్టన్ అభిప్రాయ పడ్డారు. ఐనప్పటికీ రాజరికం స్థాపించ బడుతుందేమోననే భీతి ఉన్నట్లయితే, ఈఅభిప్రాయాన్ని ఉపమింప జేసేందుకు ఆయన సిద్ధంగానే ఉన్నారు.

కాగాపోగా - వాషింగ్టన్ ప్రభుత్వాన్ని నడిపించే ఉన్నతోద్యోగులను విడనాడకుండా, తానే తిరిగి ప్రెసిడెంట్‌గా ఉంటేనే తప్ప పరిస్థితుల అన్వయం కుదరని స్థితి దాపరించింది. జఫర్సన్ హామిల్టన్ లేగాక - రాన్‌డాల్ఫ్, మాడిసన్, తదితరులూ, ఆయనకు సన్నిహితులైన వారనేకులు యీజాతిని ఉద్ధరించేందుకు ఆయన్నే ప్రెసిడెంట్‌గా ఉండమని బతిమాలారు. ఈ విధంగా ఆయనా, ఆయనతోపాటు జాన్ ఆడమ్స్ మరో నాలుగేళ్లు, భవిష్యత్తు అంధకారబంధురంగా ఉండే ఒంటరిపాటు వైభోగాన్ని స్వీకరించేందుకు వాగ్దానాలు చేయవలసి వచ్చింది. తన స్వంత కాన్‌స్టిట్యూషన్‌కు విరుద్ధంగా, వాషింగ్టన్ అమెరికన్ కాన్‌స్టిట్యూషన్‌ను కాపాడేందుకు నడుం బిగించారు.

## ద్వితీయ పరిపాలన (1793 - 1797) :

వాషింగ్టన్ ఆయన ద్వితీయకార్య నిర్వహణ కాలంలో జీవితంలో ఎరుగనన్ని విమర్శలను ఎదుర్కొని బాధపడవలసివచ్చింది. ఆయన ప్రెసిడెంట్‌గా ఉంటూ, ఇంతకు పూర్వమే దేశంలోని చీలికలతో - ముఖ్యంగా ప్రభుత్వ నిర్వాహక వర్గంలోని చీలికలతో అం

దోళనచెంది ఉన్నారు. ఇప్పుడు పరదేశ సమస్యలలో అనుసరించే ధోరణికారణంగా జాతిలో అనేక భేదాభిప్రాయాలు ఏర్పడటంతో యీ చీలికలు మరింత దారుణంగా రూపొందినవి.

1789 లో, వాషింగ్టన్ ప్రారంభోత్సవానంతరం కొద్ది కాలానికే ఫ్రాన్స్‌లో విప్లవం జరిగింది. 1792 ఆఖరాలే కాలంలో-జఫర్సన్ హామిల్టన్‌లమధ్యఉండే అభిప్రాయభేదాలను తుడిచి వేసేందుకు వాషింగ్టన్ గట్టిప్రయత్నాలు చేస్తున్న సమయంలో ఫ్రాన్స తనకు తాను రిపబ్లిక్‌గా ప్రకటించుకున్నది. జఫర్సన్ రూపొందించిన 'స్వాతంత్ర్య పత్రం' ఆధారంగానే ఫ్రాన్స 'మానవుని హక్కుల పత్రం' తయారుచేసింది. ఇంతవరకూ ప్రజాస్వామ్యాన్ని అనుసరించిన దేశం అమెరికా ఒక్కటే ఐతే, ఇప్పుడు ఫ్రాన్స్‌కూడా రిపబ్లిక్ కావటంతో అమెరికా ప్రపంచంలోని మొదటి రిపబ్లిక్‌గామాత్రమే ఉన్నది.

ఇంకా బాల్యదశలోనే ఉన్న అమెరికాకు ఇప్పుడు క్లిష్టపరిస్థితి దాపరించింది. తాటస్థ్యవిధానాన్ని అనుసరించటం తేలికనేది ఏనాడూ అమెరికాకు తెలిసిరాలేదు; నిజానికి యూరప్‌లో బయలుదేరిన పెద్దఎత్తు పోరాటాలన్నిటా తాటస్థ్యవిధానం అసంభవమనే విషయాన్ని అమెరికా చరిత్ర యందంతటా రుజువుచేసేఉన్నది. ఇక 1793 లో పరిస్థితులు అత్యంత భీకరంగానూ, ఎటుమొగ్గినా ప్రమాదకరంగానూ ఉండేటట్లున్నవి. ఒకవైపున చూస్తే అమెరికన్ విప్లవపు

తుదిదశల్లో అమెరికా పట్ల ఫ్రాన్స్ మిత్రత్వాన్ని ప్రదర్శిం చింది. యార్క్‌టౌన్ విజయంతాలూకు కృతజ్ఞత నూతన ప్రపంచంలోని రిపబ్లిక్‌ల ఆశయాలకు దోహదంచేయాలని చెపుతోంది. యునైటెడ్ స్టేట్స్‌కూ, ఫ్రాన్స్‌కూ మధ్య జరిగిన సంధిషరతులుకూడా యునైటెడ్ స్టేట్స్‌కు ఇలాటి బాధ్యతనే ఆపాదిస్తున్నవి. తమను నిరంకుశత్వంతో ఎదుర్కొన్న శాత్రవులైన బ్రిటిష్‌వారిని, నిన్న మొన్న ఫ్రెంచివారు బాసటగానిలబడి ఎదుర్కొని, తమకు ఎంతో సహాయ పడి నపుడు, యీ నాడు ఫ్రాన్స్ కష్టదశలోఉంటే, యునైటెడ్ స్టేట్స్ ఎలా చూస్తూ ఊరుకోగలదు?

మరొకవైపుచూస్తే – అమెరికాకు బ్రిటన్‌తో దగ్గరి సంబంధాలున్నవి. స్వాతంత్ర్య సమరానికి పూర్వం – మాతృ దేశంగా భావించబడే బ్రిటన్‌తోపాటే అమెరికన్‌లు కూడా ఫ్రాన్స్‌తో తమకు వంశపారంపర్యంగా విరోధమున్న దనే భావాన్నే వ్యక్తంచేస్తూ వచ్చారు. స్వాతంత్ర్యాన్ని సాధించటమంటే – అంతమాత్రాన బ్రిటన్‌తో అమెరికన్‌లు తెగతెంపులుచేసుకున్నట్లు కాదు. అనేకమంది అమెరికన్‌ల దృష్టిలో మూడవజార్జ్ రాజు, విలియమ్ పెట్‌ల భూమంటూ ఉన్నదనీ, లోపాలెన్ని ఉన్నప్పటికీ, వారు తమకు ప్రియ బాంధవులేననే అభిప్రాయాలున్నవి. అమెరికన్‌ల సముద్రాం తర వాణిజ్యంలో అధికభాగం బ్రిటన్‌తో జరుగుతూన్నది. ఇది సక్రమంగా జరగనట్లయితే హామిల్టన్ వేసిన ఆదాయపు పథకాలు కూలిపోతవి. అపుడు అమెరికాలోని రిపబ్లికానిజమ్

యూరప్‌లోని రిపబ్లికానిజమ్‌కన్న ఎంతగానో భేదిస్తుంది. యూరప్‌లోని రిపబ్లికానిజమే రక్తపాతంతో సాధించబడింది. అమెరికన్ టోరీలు అవమానపడి తేలికచేయ బడినారు; ఫ్రెంచ్ జమీందారులూ, మహాదైశ్వర్యవంతులూ, వారి రాజుగారి వలెనే వధ్యశిలలకు ఎరలైనారు. వాషింగ్టన్ పాతమిత్రుడైన లాఫయెట్టీ ఫ్రాన్సులోని నాయకుల్లో ఒకరై, 1792 లో పతనమై నాలుగేళ్ళపాటు ఆస్ట్రియాలోని ఖైదులో ఉన్నాడు.

అమెరికా అనుసరించవలసిన పంథా – వాషింగ్టన్ దృష్టిలోనూ, తమలో తాము వాగ్వాదాలు జరుపుకునే సలహాదారుల దృష్టిలోనూ – తాటస్థ్య విధానమే! ప్రకటనలో ఆయన ఒప్పుకున్న రాజ్యనీతికూడా ఇదే. ఫ్రెంచ్ అభిప్రాయాన్ని కూలద్రోయకుండాను, జఫర్సన్ పట్టుబట్టినందువల్లా ఆ ప్రకటన పత్రంలో 'తాటస్థ్య విధానం' అనే పదం మాత్రం ప్రయోగించ బడలేదు. కొత్తగా ఏర్పడిన యీ ఫ్రెంచ్ ప్రభుత్వంలోని మంత్రి ఐన సిటిజన్ జెనెట్‌కు స్వాగతాన్నిచ్చే ప్రయత్నాలుచేసి వాషింగ్టన్ ఆ ప్రభుత్వ ప్రాముఖ్యతను ఆమోదించారు. ఇంతవరకూ అంతా ఖండితంగానూ స్పష్టంగానూ ఉన్నది; ఆ తరువాత అంతాకూడా కలగాపులగమై, క్రోధోద్రిక్తతతో అమెరికా ఉడికిపోయింది. ఎందుకంటే అధికారపూర్వకంగా అమెరికా తాటస్థ్య విధానాన్ని అనుసరించి నప్పటికీ, అమెరికన్సు వ్యక్తిగతంగా దాన్ని ఆమోదించటంలేదు. ఫ్రెంచ్ విప్లవారంభ దశనుంచే

వారు పక్షాలు వహించసాగారు. ఇప్పుడు వారి శూరత్వాలు ఆశ్చర్య పరిచే స్థాయిని అందుకున్నవి. కొంతమంది 'గల్లోమెన్' టామ్‌పైనీ చెప్పిన 'మానవునిహక్కులు' అనేదాన్ని పరమపవిత్ర గ్రంథంగా భావిస్తూ, మహదైశ్వర్యవంతుల్ని తెగడుతూ, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను పొగుడుతూ, డెమోక్రెటిక్ క్లబ్‌లను ఏర్పరచి, జెనెట్ అమెరికాకు వచ్చినప్పుడు ఆయనకు ఘనమైన స్వాగతాన్ని ఇచ్చారు. ఇతరులు (ఆంగ్లోమెన్) భయభ్రాంతులై, వీరి ప్రతిపక్షీయుల్ని దేశవినాశకర కార్యకలాపాలలో పాల్గొనే పిచ్చివారని అన్నారు.

ఒకటిన్నర శతాబ్దాల అనంతరంకూడా, ఈ సందర్భంలో వాషింగ్టన్ వహించిన పాత్ర సరిగా అంచనాలు వేయబడలేదు. ఫెడరలిజమ్‌లో అతివాదులు మినహా మిగతా వారికి ఆయన కథానాయకుడుగానూ, ఆదర్శప్రాయుడుగానూ ఉన్నారు. ఆయన పేరుకున్న కీర్తి ప్రతిష్ఠలే వారి వాదాలు జనసమ్మత మయేందుకు చివరి సాధనంగా ప్రయోగించబడుతూన్నవి. 1793 లో ఆయన దీర్ఘ నిర్వహణలో మొట్టమొదటిసారి, వాషింగ్టన్ మీద బహిరంగమైన విమర్శ బయలుదేరింది. 1789 లో అమెరికన్లు "భగవానుడు యీగొప్ప వాషింగ్టన్‌ను రక్షించుగాక!" అని పాటలు పాడారు. 1793 లో వీరు రిపబ్లికన్ వార్తా పత్రికల్లో - వాషింగ్టన్‌లో భగవంతుని స్వరూపం లేదనీ, ఆయన కేవలం మానవమాత్రుడుగానే ఉంటూ

అధికారుల నక్షత్రకూటమి మధ్య కుక్కగొడుగు లల్లే ఉద్భవించిన మహదైశ్వర్య వంతుల మధ్య జీవిస్తున్నారనీ రిపబ్లికన్‌లు ఒకరి కొకరు జ్ఞాపకం చేయసాగారు. రెండేళ్ల అనంతరం ఒకానొక ఫిలడెల్ఫియా జర్నలిస్టు వాషింగ్‌టన్‌ను 'రాజకీయంగా పిచ్చి ప్రేమగలవాడు' అనీ, 'నిరంకుశత్వాన్ని ప్రదర్శించే క్రూరుడు' అనీ అన్నాడు. ఆ జర్నలిస్టే 1796 లో ఒకజాతి ఒక వ్యక్తిచేత కళంకితమైన దంటే – అమెరికన్ జాతి వాషింగ్‌టన్‌వల్ల కళంకిత మైనది అన్నాడు.

సమకాలీనమైన విమర్శల్లో అత్యధికభాగం కాస్త గౌరవ ప్రదమైన ధోరణిలో నడిచినవి. ఏనప్పటికీ ఆ కాలానికి సంబంధించిన ఉద్రేకాలకు యీ ఉదాహరణలు ఒక కొలపాత్ర. ప్రధాన న్యాయమూర్తి రాజకీయ పక్షంలో నాయకుడుగా రూపొందాడనీ, తమను ఆకర్షించని దేశభక్తి బురఖాలో ఫెడరలిస్టులు బ్రిటిష్‌వారి చేతుల్లో కీలుబొమ్మలౌతున్నారనీ రిపబ్లికన్‌లు అన్నారు. ఫ్రాన్స్ ప్రవర్తన ఆందోళనకరంగానూ, నిందాయోగ్యంగానూ ఉన్నదని వారు అభిప్రాయ పడ్డారు. ఏమైనప్పటికీ వారు బ్రిటన్ కన్న ఫ్రాన్సే నయమనీ, భూతకాలంకన్న భవిష్యత్ కాలమే ఎన్నుకోదగిందనీ అభిప్రాయపడ్డారు. అమెరికా తన మంత్రులపట్ల ముభావంగా ఉంటూ, శత్రువులపట్ల నిశ్చితాభిప్రాయంతో ఉన్నదని వారు గమనించారు. 1794 లో వాషింగ్‌టన్ ప్రసిద్ధికెక్కిన ఫెడరలిస్ట్,

ఆంగ్లో ఫైల్ ఐన జాన్ జేను చాలాకాలంగా ఉన్న కొన్ని అభిప్రాయభేదాల విషయమై సంప్రదింపులు చేసే నిమిత్తం లండన్‌కు పంపటంతో వారు రెచ్చిపోయారు. జాన్ జే చేసిన సంప్రదింపుల ఫలితంగా ఆయన సంతకాలు చేసిన రాజీ పత్రాలు 1795 లో అమెరికా చేరినప్పుడు— వారి సందేహాలన్నీ నిశ్చితరూపాలు దాల్చినవి.

అమెరికా హక్కులను ఖండితంగా ఉదాహరించేందుకుమారుగా, ఆయన వాటిని సాత్త్వికమైన ధోరణిలో తెలియపరిచాడు. ఐతే బ్రిటిష్‌వారు అమెరికా పశ్చిమ దిశలో ఉన్నవారి స్థావరాలను ఖాళీచేస్తామనీ, ప్రస్తుతం వాటినుంచి తాము ఇండియన్స్‌ను తరిమివేస్తున్నామనీ చెప్పినమాట నిజం. కాని బ్రిటిష్‌వారు చేసిన వాగ్దానం పది సంవత్సరాలకు పైగా ఐంది. దాన్నిప్పుడు అమలు జరిపేందుకు వారు సిద్ధపడుతూన్నారు. ఇది మినహా మిగతా అనుకూలతలు అమెరికాపక్షానే ఉన్నవి. ఆంగ్లోమెన్ అమెరికాలో ప్రకాశమానంగా ఉండే భాగాలను అమ్మజూపుతున్నారు. జేను వారు దేశద్రోహిగా ముద్రవేసి, ఆయన బొమ్మను తగలబెట్టారు. ఫెడరలిస్ట్‌లు దుర్మార్గులు; వాషింగ్టన్ రాజకీయబురఖాలో ఉన్న ద్రోహి; ఆయన దేశానికి పితృసమానుడుకాదు ; సవతితండ్రి! జే చేసుకొచ్చిన రాజీనిగూర్చిన తీవ్రమైన చర్చలు 1795 లోనూ, 1796 లో కొంతభాగంవరకూ జరిగినవి; సెనేట్ ఈ రాజీని ఆమోదించటం, వాషింగ్టన్ సంతకంచేయటం జరిగాక,

చాలా కాలంవరకూ యీ గొడవ కొనసాగింది. ఎన్ని గట్టి ప్రయత్నాలు చేసినప్పటికీ, జరిగిన రాజీ అమలుజరుప బడటం, జే బలపరచబడటం జరిగినవి. జే చేసుకొచ్చిన యీ రాజీ అమెరికాకు సంబంధించిందే కాని, ఫెడరలిస్టులకు సంబంధించింది కాదనే అసాధ్యమైన వాదాన్ని ఫ్రెంచ్ వారిచేత వొప్పించలేకపోయిన కారణంగా, ఫ్రాన్స్‌లో ఉన్న అమెరికన్ రాయబారి వర్జినియావాసీ, రిపబ్లికన్ ఐన జేమ్స్‌మన్రో అవమానించబడి 1796 లో వాషింగ్‌టన్ చే స్వదేశానికి మరలించబడినాడు.

వాషింగ్‌టన్ ద్వితీయ కార్యనిర్వహణ కాలంలో - పరదేశవ్యవహారాలపట్ల రిపబ్లికన్‌ల దృక్పథం ఇలా ఉన్నది. స్వదేశంలో ఫెడరలిస్టుల ద్వేషాన్ని వారు కనుగొన్నారు. హామిల్టన్ ప్రవేశపెట్టిన ఎక్సైజ్ చట్టంతో ప్రజలు ఎంతో అసంతృప్తి జెందినకారణంగా, 1792లో వాషింగ్టన్ తన ద్వితీయ ప్రకటనలో కఠినమైన పదజాలాన్ని ఉపయోగించవలసివచ్చింది. రెండేళ్ల తరువాత విస్కీ-విషయంలో ఏర్పడిన తిరుగుబాటుదారులు, పశ్చిమ పెన్సిల్వేనియా ప్రాంతంనుంచి అల్లరులు రేపి, యూనియన్ సంక్షేమాన్ని బెదిరిస్తూన్నారనీ, వారిని అణచవలసిన అవసరం ఎంతో ఉన్నదనీ హామిల్టన్ పోరుపెట్టగా - వాషింగ్టన్ ప్రత్యేకమైన సైన్యాలను సమకూర్చి, వాటి నొకసారి నిర్ణీతస్థలాలలో పర్యవేక్షించి ఈ తిరుగుబాటుదారులమీదికి పంపారు. కాని నిజమైన పోరాటమనేది జరగలేదు. ఎందుకంటే -

రిపబ్లికన్‌లు చెప్పిన వాదప్రకారం – నిజమైన తిరుగుబాటు లేనేలేదు; అదంతా హామిల్టన్ స్వప్రయోజనాలకోసం ఊహించిందిమాత్రమే! 150 మంది పెన్సిల్వేనియావాసులు అరెస్టుచేయబడినారు. ఇద్దరు మరణదండనకు పాత్రులైనారు; ఐతే వాషింగ్టన్ వారిని క్షమించారు. ఇప్పటికీ ఆయనకు హామిల్టన్ దృక్పథంమీదనే గురిఉన్నది. జాతికి నాయకుడుగా ఉన్న స్థానంనుంచి వాషింగ్టన్‌ను తొలిగించి, అందుకుమారుగా ఆయన్ను రాజకీయపక్షనాయకుడుగా చేయటమే హామిల్టన్ ఉద్దేశమని ఒకసంవత్సరంక్రితమే జఫర్సన్ ప్రెసిడెంట్‌కు చెప్పిఉన్నాడు. స్వప్రయోజనాల సాధనకొరకై ఏర్పడిన కొన్ని సంఘాలే తిరుగుబాట్లకు కారణమని 1794 నవంబర్‌లో వాషింగ్టన్ కాంగ్రెస్‌కు నివేదించాడు. "బహుశా ఇది వాషింగ్టన్ రాజకీయ జీవితంలో చేసిన గొప్పతప్పు" అని మాడిసన్ భావించాడు.

ఈ సంఘటనలనుగూర్చి రిపబ్లికన్‌లు ఏర్పరుచుకున్న అభిప్రాయాలు ఇంతవరకూ ఉన్నవి. ఐతే వాషింగ్టన్ దృక్పథమేమిటి? ఆయన ఆంగ్లోమన్ కాదు; గల్లోమనూ కాదు. స్వాతంత్ర్య సమరానంతరం కొనసాగుతూన్న యుద్ధమిది. ఐతే నిజమైన రణరంగమనేది లేకుండానే పోరాడవలసి ఉన్నది. అమెరికా సుస్థిరత బైటినుంచి బెదిరించబడుతూన్నది. ఎందుకంటే అమెరికాకు నిర్ణీతమైన, తీవ్రమైన ఆలోచనల లోపమున్నది. ఏదో జానపదకథలో చెప్పబడిన విధంగా అమెరికా ఒక కథానాయకి. ఆమెకు వారసత్వపు

హక్కున్న మహదైశ్వర్యమైతే ఉన్నది కాని అనేకమంది హుళక్కి సంరక్షకులు ఆమెను బలాత్కారంగా భార్యను చేసేందుకూ, లేదా ఖూనీచేసేందుకూ ప్రయత్నించి, ఆమెకే ఆస్తిహక్కులు దక్కకుండా చేద్దామని చూస్తున్నారు.

ఈవిధంగా తమకు తాము సంరక్షకులుగా చేసుకున్నవారిలో ఫ్రాన్సు మరింత ప్రమాదకరమైనది. బ్రిటన్ ఈర్ష్యాద్వేషాలతో కుమిలిపోతూ, తాటస్థ్యమైన హక్కుల కొరకై తన చిత్రమైన ధోరణిలో తంటాలు పడుతూన్నది. ఐతే అమెరికా బ్రిటనును సవాల్ చేయలేదు. అమెరికా గురి చేసిందిది: వాణిజ్య సంబంధ బాంధవ్యాలను చెడగొట్టుకోకుండా వాటిని అభివృద్ధిచేసుకోవటం, పశ్చిమాన ఉన్న కోటలలోనుంచీ, స్థావరాలనుంచీ బ్రిటిష్‌వారిని ఖాళీచేయించటం, తీవ్రమైన వాగ్దానాలకు లొంగిపోకుండా ఉండటం, మొత్తంమీద కొంత కాలయాపన జరపటమూను. జే చేసుకొచ్చిన రాజీతో వాషింగ్టన్ నిరాశపడినప్పటికీ – అమెరికా అద్భుతాలను జరిపించేందుకు తగిన శక్తిసామర్థ్యాలను కలిగి ఉండలేదనే విషయాన్ని వాషింగ్టన్ గుర్తించారు.

ఇక ఫ్రాన్సుకు – యీ దుష్టశక్తులు మరింత చమత్కారంగానూ, పోరాడి గెలిచేందుకు కష్టతరంగానూ ఉన్నవి. వాషింగ్టన్ తాటస్థ్యవిధానంమీదనే నొక్కి వక్కాణిస్తున్నారు; ఫ్రెంచ్‌వారు స్నేహపూర్వకమైన తాటస్థ్యవిధానంమీద నొక్కి చెపుతూన్నారు. అప్పటికి అమల్లో ఉన్న రాజీషరతులను అమలుజరిపేందుకు వారు సంసిద్ధులు

కాలేదు; ఎందుకంటే వారికి యునైటెడ్‌స్టేట్స్‌లో ఉన్న సంబంధాలతాలూకు సందేహాస్పదమైన విషయాలద్వారా తాము లాభసాటి బేరాన్ని పొందాలని వారి ఆశయం కనుక, వారికి సరఫరాలు అందుతవి. అంతకన్న ముఖ్యమైనది - వ్యక్తిగతమైన వ్యాపారాలకు అమెరికాను తాము ఉపయోగించుకోవచ్చు; ప్రభుత్వసాహసాలను కరీబియన్, తదితర అమెరికన్ ప్రాంతాలలో బహుశా అమలుజరుపుకోనూవచ్చు. జెనెట్‌కు యీ రెండు అవకాశాలనుగూర్చిన ఊహలు తీవ్రంగా ఉన్నవి; తన తరువాతి అధికారులవలెనే ఆయనకూడా అమెరికాలోని తిరుగుబాటుధోరణీ, ఆ రణగొణధ్వనులమీద ఆధారపడొచ్చని భావించాడు. ఒకవేళ వాషింగ్టన్, ఫెడరలిస్టులా దారికి అడ్డంగా ఉన్నట్లయితే తాము అమెరికన్ పౌరులకే తమ నివేదికలను అందివ్వవచ్చు. నిజానికి 1796 లో ఫ్రెంచ్ ఏజెంట్లు ఎన్నికల్లో రిపబ్లికన్ల గెలుపుకుగాను శక్తివంచనలేకుండా శ్రమపడ్డారు.

వాషింగ్టన్‌కు ఎదురైన సమస్యలు మరింత క్లిష్టంగా రూపొందినవి. హామిల్టన్ బ్రిటిష్ రాయబారులలో కలిసిమెలిసి ఉంటున్నాడు. ఇక రిపబ్లికన్‌లు ఫ్రెంచ్ వారిని పరిపూర్ణమైన మిత్రులుగా భావిస్తున్నారు. 1793 చివర జఫర్సన్, 1795 ఆరంభంలో హామిల్టన్ రాజీనామాలిచ్చినప్పటికీ జాతీయ సమస్యలమీద వారి పలుకుబడులు ఇంకా ప్రసరిస్తూనే ఉన్నవి. హామిల్టన్ పట్టు ఇంకా విడివడలేదు.

హామిల్టన్ అదృశ్యరూపాన ఉన్న సలహాదారుల సంఘంలో పాల్గొంటూనే ఉన్నాడు. జఫర్సన్ తరువాత సెక్రటరీ ఆఫ్ స్టేట్ పదవిని అలంకరించిన ఎడ్మండ్ రాన్‌డాల్ఫ్ చిత్రమైన పరిస్థితుల్లో 1795 లో తొలగించబడినాడు. తప్పో ఒప్పో రాన్‌డాల్ఫ్ ఫ్రెంచ్ మంత్రితో, జే చేసుకొచ్చిన రాజీకి విరుద్ధంగా కుట్రపన్నిన నేరానికి వాషింగ్టన్ ఆయన్ను నిందించాడు.

ఎన్ని ఆటంకాలూ, అవాంతరాలూ ఏర్పడినా, ఎన్ని నిందలను ఎదుర్కోవలసివచ్చినప్పటికీ వాషింగ్టన్ తన ధోరణిని విడనాడలేదు. ఆ తరువాతి చరిత్ర కాంతిలో చూసినట్లయితే వాషింగ్టన్ ఒప్పులుచేశారని, రిపబ్లికన్‌స్‌లో అతివాదులు ఎలాగైనా అమెరికాను ఫ్రెంచ్ వారి వృత్తంలోకి లాగాలని ప్రయత్నించి తప్పులుచేశారనేది సుస్పష్టమైంది. వాషింగ్టన్ విజ్ఞుడు; ధైర్యసాహసాలుగలవాడు. ఆయన రాజ్యనీతి విరుద్ధఫలితాలకు దారితీయనూ లేదు. జే తెచ్చిన కొద్దిపాటి లాభాలు ఎలా ఉన్నా, 1795 లో థామస్ పిన్‌కినే స్పెయిన్‌తో చేసిన రాజీ దాన్ని పూరించింది. ఈ రాజీ షరతులప్రకారం మిసిసిపీమీది జలమార్గాన్ని అమెరికా స్వేచ్ఛగా ఉపయోగించవచ్చు. పోతే అమెరికాకు పశ్చిమసరిహద్దుగా మిసిసిపీనదిని స్పెయిన్ గుర్తించింది. అదే సంవత్సరంలో జనరల్ ఆంథోనీవైనీ జయించి ఇండియన్‌స్‌తో చేసుకున్న రాజీప్రకారం ఇప్పుడు ఓహియో అని పిలువబడే ప్రదేశంలో పశ్చిమోత్తరసరిహద్దు మరింత సురక్షితం చేయబడింది.

ఇలాటి పరిస్థితుల్లో దేశం ముందుకు సాగటంలో అపజయాన్ని ఎదుర్కొ్కదు. ఆయన ద్వితీయ కార్యనిర్వహణ కాలాంతానికి మరో మూడు కొత్తరాష్ట్రాలు (వెర్మాంట్, కెంటుకీ, టెన్నెసీలు) యూనియన్లో కలిసినవి. మిగతా రాష్ట్రాలు కూడా యీ ధోరణినే అనుసరించే సూచనలెన్నో ఉన్నవి. పెన్సిల్వేనియాలో బొగ్గుగనులు కనుగొనబడినవి. ఓహియో కంపెనీ ఇంకా సజీవంగానే ఉన్నది. ఇక ఫెడరల్ మహానగరనిర్మాణంలో అందచందాలూ, హుందాతనం మిళితమైనవి. ఇందులో వాషింగ్టన్ ఎంతో ఆసక్తి చూపారు.

ఈ విజయాలతాలూకు కీర్తి వాషింగ్టన్‌కే చెందాలి. ఎందుకంటే ఆయన అనుసరించిన విదేశ వ్యవహారాలధోరణి అన్వయంలో ఏమాత్రం తప్పినా, యీ పెంపుదలలో ఎన్నో ఆటంకాలు ఏర్పడేవి. జేచేసుకొచ్చిన రాజీతో ఫ్రెంచ్‌వారు మరింత శత్రుత్వాన్ని చూపసాగారు. స్వదేశంలోనూ, సముద్రాంతర దేశాలలోనూ కూడా ఆందోళన భరించ రానిదిగా తయారైంది.

రిపబ్లికన్‌లు శక్తివంతంగా ఎదుర్కొవటం దుఃఖ పూరితమైన ఆశ్చర్యంగా ఉన్నది. ఐతే వారు హామిల్టన్ మీది దాడులను కేంద్రీకరించినంతకాలమూ, వాషింగ్టన్, తక్కెడ ఒక పక్కకు వొరిగిపోకుండా సమర్థించగలిగారు. కాని ఆయన రెండవ కార్యనిర్వహణకాలంలో రాజకీయ వాదప్రతివాదాలు పెంపొంది, ఆయనకూడా తీవ్రవిమర్శకు గురైనప్పుడు, వాషింగ్టన్ అభిప్రాయాలు క్రమంగా కఠిన

రూపాలు దాల్చినవి. 1793 లోనే ఫ్రీనేవార్తా పత్రికా ప్రచురణ నిలిచిపోయింది; ఐతే ఇతర రిపబ్లికన్ పత్రికలు యీ ఎదుర్కోవటాన్ని కొనసాగించినవి. విమర్శలతో కోపోద్రిక్తుడై, రిపబ్లికన్‌లు బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్నారనే కారణాలను నమ్మి, వాషింగ్టన్, చిట్టచివరకు యీ రిపబ్లికన్‌లు వేరొక పక్షీయులుకారనీ, కేవలం ఒక పక్షంవారేననీ, లేదా అభిప్రాయభేదాలున్న పక్షంవారనే ఫెడరలిస్టుల దృక్పథంతో ఏకీభవించారు. బహుశా ఒకనాడు ప్రభుత్వం వీరి చేతుల్లోకే రావచ్చు. అందుకనే ఆయన డెమోక్రటిక్ సొసైటీలు – దాదాపు హానిచేయని రాజకీయమైన క్లబ్‌లమీద విరుచుకొనిపడ్డారు. చివరకు ఆయన ఏర్పరిచిన మంత్రివర్గంలో ఫెడరలిస్టులకే స్థానమున్నది.

ఇందువల్ల – మరొక్క అడుగు ముందుకు వేసి చూసినట్లయితే ఆయన తనకు తెలియకుండానే తాను ఫెడరలిస్ట్‌నని తెలియజెప్పకున్నట్లే అర్థమవకపోదు. 1799 లో, అంటే అప్పటికి రెండేళ్ళక్రితమే ఉద్యోగ విరమణచేసిన సమయాన 1800 లో జరగబొయ్యే ప్రెసిడెంట్ ఎన్నికలకు అభ్యర్థిగా ఉండమనీ, యూనియన్ పరిస్థితులు మహాప్రమాదావస్థలో ఉన్నవనే కారణం చూపబడింది. ఆయన "సిద్ధాంతమే కాని, వ్యక్తులు పోటీలు చేయరాదు" అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చి నిరాకరించారు.

ఆయ నింకా ప్రెసిడెంట్‌గానే ఉన్నట్లయితే తాను ఫెడరలిస్ట్ అనే ముద్రవేయించుకునేందుకు ఆయన అంగీక

రించి ఉండేవారుకారు; ప్రెసిడెంట్ వీటికి ఎంతో దూరంలో ఉండాలనే విషయాన్ని అమలు జరిపి ఉండేవారు. నిజానికి పెద్ద నింద లేవీ ఆయనమీద పడలేదు. ఐతే ఈ విషయంలో కొంతమంది జీవితచరిత్రకారులు చెప్పినట్లు ఆయన ప్రశాంత చిత్తుడుగా ఉండలేకపోయ్యారు. ఆ దశాబ్దాన్ని వాషింగ్టన్ దృక్పథంనుంచి, లేదా ఫెడరలిస్ట్ల దృక్పథంనుంచి చూసినట్లయితే – ఆయన రాజకీయపక్షాలమధ్య సామరస్యాన్ని నిలబెట్టటంలో న్యాయాన్ని అనుసరించారనే విషయాన్ని మనం అంగీకరించవలసి ఉంటుంది.

తుది విరమణ:

ఊహించిన విషయాలు అనేకం ఉన్నవి. ఏ ఇతర విషయం సందేహాస్పదంగా ఉన్నప్పటికీ, వాషింగ్టన్ ప్రెసిడెంట్ పదవినుంచి విరమించటమనేవిషయంలో మాత్రం ఎంతో ఆనందిస్తున్నారు. ఆయన మూడవ సారికూడా కార్యనిర్వాహణకాలంలో ఉంటారని చాలామంది అనుకున్నారు. ఆయన అభ్యర్థిగా నిలబడితే, తప్పక ప్రెసిడెంట్‌గా ఎన్నికవుతారనీ అందరికీ తెలుసు. కొన్ని విమర్శలు తీవ్రంగా ఉన్నప్పటికీ, ఆయనింకా అమెరికన్‌లకు ప్రేమాస్పదుడుగానే ఉన్నారు. ఆయన తరువాత ప్రెసిడెంట్ కాబోయ్యే జాన్ ఆడమ్స్ తనకురాబోయ్యే కీర్తిప్రతిష్ఠల్ని గూర్చి శ్లాఘించుకున్నాడేకాని, ముందున్న ముసళ్ళపండుగనుగూర్చి ఊహించనైనా లేదు. ఇతరసందర్భాలలో

వాషింగ్టన్ ఎంతగానో చలించారు. ఐతే ఇప్పుడు ఆయన కంటనీరు పెట్టలేదు.

ఆయన ఉద్యోగవిరమణను చిర్రుబుర్రులాడుతూ చేయలేదు. ఏదికానీ, ఎవరుకానీ-అమెరికాకు ఆయన లేనిదే గొప్ప లోటు ఉండగలదనే విషయాన్ని నచ్చజెప్పలేకపోయ్యారు. అప్పుడు ఆయన తన 65-వ జన్మదినోత్సవం జరుపుకున్నారు. ఇలాంటివి ఇకముందు అధికసంఖ్యాకంగా జరగగలవనే ఆశ ఆయనకు లేదు ఇక జీవితంలో మిగిలిన కొద్దిసంవత్సరాలకాలాన్నీ ఆయన మౌంట్ వెర్నన్‌లో గడపదలిచారు. ఆయన యవ్వనదశ అత్యద్భుతంగా ఉన్నది; కాని కాలగమనమూ ప్రజాసేవలూ ఎక్కువకాలాన్ని హరించినవి. ఆయన పాత స్నేహితుల్లో చాలామంది చనిపోయ్యారు. ఫెయిర్‌ఫాక్స్ కుటుంబీకుల్లో ఒకరు వర్జీనియాకు తిరిగి వచ్చారు; ఐతే బెల్‌వాయిర్ అంతా శిథిలావస్థలో ఉన్నది; శాలీఫెయిర్ ఫాక్స్ ఇంగ్లండ్‌నుంచి ఎన్నడూ తిరిగి రాలేదు. లాఫెయిట్టే ఇప్పుడు స్వేచ్ఛను అనుభవిస్తున్నాడు. కాని, తనకూ ఆయనకూ మధ్య ఒక మహాసముద్రమున్నది. ఇక ఆయనకు మిగిలిందల్లా - మౌంట్ వెర్నన్, ఎంతో ఉత్సాహాన్నిచ్చే ఆయన భార్య మార్తా, వారి తాలూకు కొంతమంది యువతీయువకులున్న బంధువర్గమూను.

ఆయన ముసలివాడుగా కనిపించినట్లయితే, ఆయన్ను ఒంటరిగా వదిలేసేవారు. అందుకుమారుగా ఆయన పూర్వం వలెనే ఎంతో శక్తిసామర్థ్యాలను ప్రదర్శిస్తూ - తన

క్షేత్రాలను తనిఖీ చేసుకోవటంలోనేమి, అతిథిమర్యాదల్లోనేమి, ఉత్తరప్రత్యుత్తరాల్లోనేమి, ఎంతో ఉత్సాహాన్ని ప్రదర్శించారు. ఇంతవరకూ ఆయన ఆక్రమించిన అత్యున్నత స్థానాన్నిబట్టి ఆయన కొన్ని జాగ్రతలు తీసుకొన్నారు; కాని ఇప్పుడు ఆయన కా బరువుభారాలు లేనందువల్ల ఎంతో స్వేచ్ఛగా ఉండగలిగారు. ఏదెలా ఉన్నప్పటికీ 1798 లో ఆయన తిరిగి యూనిఫారం ధరించవలసిన అవసరం ఏర్పడింది. ఫ్రెంచ్ వారి ప్రవర్తన ఎంతో అతిక్రమించి, దాదాపు యునైటెడ్ స్టేట్స్‌తో యుద్ధవాతావరణాన్ని కల్పించింది. ఇదీ నౌకాయుద్ధం! అమెరికాకు సైన్యంలేదు; కాకపోతే కొద్దిమంది రెగ్యులర్లను ఉంచేందుకు వాషింగ్టన్ ఎంతో శ్రమపడ్డారు–వారుమాత్రమే ఇప్పుడున్నారు. ఇప్పుడాయన సైనికులను సమకూర్చుకొని, సర్వసేనాపతిత్వాన్ని వహించాలని కోరబడింది. ఇందువల్ల ఎదురయే అభివృద్ధిని తలుచుకొని ఆయన మూలిగారు. మరొకసారి వాషింగ్టన్ ఆహ్వానించబడతారని హామిల్టన్ ఆయనకు జ్యోతిషం చెప్పినపుడు 'ప్రస్తుతం నేనున్న యీ ప్రశాంత వాతావరణంనుంచి నాపూర్వీకుల సమాధుల దగ్గరకు వెళ్ళేందుకు నేనేం లెక్క చెయ్యను' అని ఆయన జవాబు చెప్పారు. ముందుగా తనను సంప్రదించకుండానే ప్రెసిడెంట్ ఆడమ్స్ తనను సర్వసేనాపతిగా నియమించటం వాషింగ్టన్‌కు రుచించలేదు. తిరిగి అధికారాన్ని స్వీకరించినట్లయితే – తన ప్రతిపక్షీయులు తనను దురాశాపరుడుగా వేలెత్తి చూపుతారేమోననీ,

తానిచ్చిన వీడ్కోలు ఉపన్యాసంలో కొటిల్యాన్ని గుర్తించే అవకాశాలుంటవేమోననీ ఆయన ఆందోళనపడ్డారు. ఐతే ఇప్పుడు తాను భరించవలసిన యీ బాధ్యతను తప్పించుకునే సావకాశాలు లేవు. ఎక్కువ తర్జనభర్జనలకు పాలుగాకుండా, తన బాధ్యతను వెనువెంటనే గుర్తించి, కార్యభారాన్ని ఆయన తన భుజస్కంధాలకు ఎత్తుకున్నారు. ఇదివరకువలెనే, అలెగ్జాండర్ హామిల్టన్, తెరవెనుక అమర్చవలసిన సంఘటనలన్నిటినీ అమర్చి తాను వాషింగ్‌టన్‌కు రెండవ సర్వసేనానిగా ఉండేవిధంగా చేసుకున్నాడు. పాపం! ఆడమ్స్‌కు ఇదంతా ఎంతో కలత పెట్టిన కాలం. ఆయనస్థానంలో వాషింగ్‌టన్ ఉన్నట్లయితే, యీదూషణలు ఆయనకూడా తప్పేవి కావు.

ఏమైనప్పటికీ 1798 లో కానీ, 1799 లో కానీ యుద్ధం జరగలేదు. వాషింగ్టన్ జీవితం పూర్వపుస్థాయిని అందుకున్నది. సర్వే చేయటం, గుర్రపుస్వారీ, అతిథులు, విందులు మొదలైనవీ, మేనకోడలైన బెట్టీ లూయిస్‌కు ఆడపిల్ల జన్మించటం మొదలైన సంఘటనలూ జరిగినవి; ఆతరువాత డిసెంబర్ 13–వ తారీకున డైరీ ఆగిపోయింది. అక్కడ కొద్దిగా మంచుకురవటంవల్ల థర్మామీటర్‌లోని పాదరసం కిందికి జారిందని ఉదాహరించబడింది. అప్పుడు నిజంగానే తెర ఎంతో వేగంగా జారింది. వాషింగ్టన్‌కు జలుబుచేసింది; గొంతు మారిపోయింది; డాక్టర్లు నెత్తురు కక్కించారు; విశ్వప్రయత్నాలు చేసినా ప్రయోజనం లేక పోయింది. డిసెంబర్ 14–వ తారీకున సాయంత్రం 10 గంట

లకు ఉధృతమనేది లేకుండానే ఆయన మరణించారు. చివరకు ఆ తుదిదశలో గుర్తుంచుకోవలసిన ఒక్కమాట కూడా ఆయన నోటినుంచి వెలువడలేదు. ఆనాటి క్రూర మైన వైద్యవిధానానికి బలవుతూ, ఆ బాధతోనే ఆయన స్వర్గస్థులయ్యారు.

అంతకన్న తక్కువ విజ్ఞానంతో కూడిన రక్షణలో ఉండిఉన్నట్లయితే మరికొద్ది సంవత్సరాలవరకూ ఆయన బ్రతికిఉండేవారు. ఫెడరల్ ప్రభుత్వ ముఖ్యపట్టణం క్రొత్తగా కట్టబడిన నగరానికి మార్చటాన్ని ఆయన చూసి ఎంతో ఆనందపడి ఉండేవారు. ఐతే ఆతరువాతి రిపబ్లికన్‌లు ఎన్నికై, 1801 లో థామస్ జఫర్సన్ ప్రెసిడెంట్ కావటాన్నిగూర్చి ఆయన ఆనందించలేకపోయేవారు.

ఆయన శతాబ్దం గడిచిపోయింది; దాంతోపాటే ఆయనా శాశ్వతనిష్క్రమణ చేశారు. అనేకమంది ప్రముఖ వ్యక్తులు, ఉపన్యాసకులు ఆయన మరణాన్నిగూర్చి ఉపయోగించిన పదజాలాలకన్న, స్పెన్సర్ కవి చెప్పిన పదజాలమే ఆసందర్భానికి సరిపోతుంది. దాని భావమిది:

"శ్రమించాక నిద్ర, అల్లకల్లోలిత సముద్రంలో బాధలు పడ్డాక రేవుజేరటం, జీవితం ఎంతో తృప్తికరంగా కొనసాగాక మరణం—"

---

# 5. పరిపూర్ణ పురుషుడు

జార్జ్ వాషింగ్టన్‌కు కృతజ్ఞతలున్నవి - కాని వాటి వెనుక సున్నా ఉన్నది; ఆయనకు మిగిలింది నిష్కళంకమైన కీర్తి. ఆయన దేశానికి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను సంపాయించిపెట్టారు.

—(బైరన్, డాన్ జూన్ కాటో IX లో వ్రాసినదాని భావం)

మౌనం :

లభ్యమైన వ్రాతపూర్వకమైన కాగితాలను పరిశీలించి, తమ అభిప్రాయాలను ఏర్పరుచుకొన్న జార్జ్ వాషింగ్టన్ జీవితచరిత్రకారులు తమనుంచి తప్పించుకున్నదేదో ఉండిపోయిందనే అసంతృప్తభావానికి గురవుతూంటారు. వ్రాతపూర్వకమైన రికార్డులు ఒకదానొకటి ఖండించటంకానీ, లేదా అసంపూర్ణంగానూ, ఖండఖండాలుగానూ ఉండటంకానీ జరగలేదు. వాషింగ్టన్ బాల్యదశ గడిచాక - ఆయన జీవితకాలంలో ఏయే కాలాల్లో, ఏమేం చేశారో మనకు స్పష్టంగా తెలుసు. ప్రతి సంఘటనలోనూ ఆయన ఆలోచనలు ఏవిధంగా పనిచేసినవో కూడా చాలవరకు మనకు రూఢిగా తెలుసు. ఐతే ఆయన తన భార్య ఐన మార్తాతో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలు భద్రపరుచబడినట్లయితే, లేదా జె. పి. మోర్గన్ 30 సంవత్సరాలక్రితం ఆ పాత ఉత్తరాల కట్టల్ని అగ్నికి ఆహుతిగా వేసిఉండనట్లయితే, బహుశా మనకు వాషింగ్టన్ అంతరం మరింత స్పష్టంగా తెలిసిఉండే అవకాశముండేది. ఐతే ఇవన్నీ కలిసి స్థూలదృష్టిలో

దృశ్యవిశేషాన్ని మార్చినవా అనే విషయం సందేహాస్పదం. వాషింగ్టన్ కార్యనిర్వహణకాలంలోని – ముఖ్యంగా ఆయన ప్రెసిడెంట్ పదవిని అలంకరించినకాలంలోని కొన్ని సంఘటనలు సరిగా విశదీకరించబడలేదు. ఐనప్పటికీ ఆయన తాలూకు పరిపూర్ణమైన చిత్రం ఉండనే ఉన్నది. ఆయన మాటలే గాక, ఇతరులు ఆయన్ను గూర్చి అన్న మాటలద్వారాకూడా మనం యీ చిత్రాన్ని ఊహించుకోగలం.

ఆయన కుటుంబం గౌరవనీయమైన దైనప్పటికీ, పూర్వీకులవలె గొప్పస్థాయిలో కలవలేదు. వాషింగ్టన్ బొడ్డులో బంగారంతో జన్మించలేదు; కేవలం బంగారు పూతతో మాత్రమే జన్మించారు. త్వరలోనే ఆయనకు పితృవియోగం సంభవించటంతో అదీ పోయింది. ఆతరువాత ఆయన బంధుమిత్రులనుంచి దూరం చేయబడటం, అత్యంతాధికారంలో ఉన్న ఫెయిర్ ఫాక్స్ కుటుంబం నుంచి విడిపోవడంకూడా జరిగినవి. పోతే ఆయన ఆశయాలు రూపురేఖలుదిద్దుకొని, మిలిటరీలో చేరటంతో ఎంతో ఎత్తుకు ఎగసినవి. కాని బ్రిటిష్ రెగ్యులర్స్‌లో ఆయనకు స్థానం లభించకపోవటంతో ఆయన దిగజారారు; ఆతరువాత మంచి సంబంధం దొరికి వివాహం చేసుకున్నారు. అటుపిదప ఆయన మంచిస్థానమున్న పెద్దమనిషిగా, విజ్ఞుడైన స్వేచ్ఛాస్వాతంత్ర్యపిపాసిగా, మాతృదేశానికి ఎదురొడ్డి నిలిచి పోరాడవలసిన స్థితిలో తనను ఎన్నుకోగా తార్కికమైన ఆలోచనలతో ఆయన సంసిద్ధుడవటం జరిగింది. పోతే పరిపక్వత లేనందువల్ల చేసిన తప్పుల కారణంగానే ఆయన ఎంతో

నేర్చుకొని, క్రమంగా హుందాతనాన్నీ, ఆత్మవికాసాన్నీ సాధించారు.

వాషింగ్టన్ అభిరుచులు జమీందారుగారి అభిరుచుల్లో నాణ్యమైనవిగా ఉండేవి. ఆయనకు మంచిభోజనం, ద్రాక్షాసవం, మంచిస్నేహబృందం, పేకాట, థియేటర్, రేసులు, నక్కలవేట మొదలైనవంటే ఎంతో ఇష్టం. పోతే ఆయన హాస్యాన్ని ఆస్వాదించగల సమర్థుడు. ఆయన అనుభూతులు అప్పుడప్పుడు ఎంతో లోతులకుపోయి, ఆయన కంటినుంచి నీరు తెప్పించేవి. వీటినన్నిటినీ సమన్వయిస్తే ఇప్పుడున్న సర్వజనాభిప్రాయం – హాలీవుడ్‌లో చారిత్రాత్మకతను నవలారూపాన రూపొందించిన అమెరికన్ నాయకుడుగా ఆయన్ను గుర్తించేందుకు అవకాశాలు లేవు.

ఆయన ధైర్యశాలి; ఐతే అడివిపిల్లి మాత్రం కాదు. ఆయనకు సరిహద్దుప్రాంతం తెలుసు. అవసరమైన పరిస్థితుల్లో సరిహద్దురక్షణదళంలో ఉండటంవల్ల కలిగే లాభాలు ఆయన ఎరుగును. కాని, ఆయనమాత్రం డేవిడ్ క్రానెట్ కాదు. బ్రిటిష్‌వారిదృష్టిలో ఆయ నొక తిరుగుబాటుదారుడు; ఆయనమాత్రం తిరుగుబాటుదారని ఎన్నడూ అనుకోలేదు.

కొన్ని విషయాల్లో వాషింగ్‌టన్ చాలా సామాన్య వ్యక్తిగా, తనను తాను గొప్పగా ప్రదర్శించనివిధంగా కనిపిస్తారు. క్షేత్రాలమీదికి వెళ్ళేప్పుడు ఆయన ధరించే దుస్తుల్లోని నిరాడంబరత్వాన్నిగూర్చి మౌంట్ వెర్నన్‌ను దర్శించిన అతిథులు ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారు. విందు

సమయంలో దుస్తులు మార్చుకునేవారనికూడా ఆ అతిథులు ఒక విశేషంగా పేర్కొన్నారు. ఆయన మహామేధావికాదు; కాని, ఇతరులు ప్రదర్శించే మహామేధావితనంతో ఆయన ఓర్పును కోల్పోలేదు. కొన్నిసందర్భాలలో సుందరమైన పదజాలంతో నిండి ఉండకపోయినా, ఆయన సంప్రదింపులూ, ఉత్తరాలూ నిరాశను ధ్వనించలేవు. ఆయన ప్రతిజ్ఞచేస్తే అది ప్రత్యేకతను ధ్వనించేది.

ఆయన ఉల్లాసంగా ఉండేవారు; కాని కేకలువేసి గొడవచేసి దాన్ని వెల్లడించేవారు కారు. ఆయన జీవిత మందంతటా సమవయస్కుడైన ప్రాణమిత్రుడు ఆయనకు లేడనే మనం చెప్పగలం. వాషింగ్టన్ లాఫయెట్టేకి తన హృదయాన్నిచ్చారు. స్టాఫ్ఆఫీసరైన జాన్ కారెన్స్‌మీద ఆయన కెంతో ఆపేక్ష. వీరుభయులతోనూ ఆయన సంబంధాలు పైతృకంగానే ఉన్నవి.

మన శకానికి విరుద్ధంగా వాషింగ్టన్ శకం ధారాళంగా మాటలాడనిదిగా ఉన్నది. కనుక ఆయన్ను ఆయన సమకాలీనులతో పోల్చిచూసినప్పటికీ, ఆయన అనుసరించిన పద్ధతిలోని భేదం కొట్టొచ్చినట్లుంటుంది. వాషింగ్టన్ 'తీవ్ర వాంఛలతో, ప్రతిచిన్నవిషయానికీ చలిస్తూ, ఐహికంగా' ఉన్నట్లయితే – అప్పుడు ఫ్రాంక్‌లిన్, జఫర్‌సన్, మాడిసన్, హామిల్‌టన్‌లు గొడవలేపేవారు; లేదా అర్థంకాని భాష మాట్లాడేవారూను!

వాషింగ్‌టన్‌కు కేవలం మానవత్వపు కొలబద్దనే ఉపయోగించటమంటే - ఆయన వ్యక్తిత్వాన్ని సత్యదూరం చేయటం, లేదా వ్యక్తిత్వంలోని ముఖ్యాంశాలైన సత్యాలను విడనాడటమౌతుంది. ఆయన మానవత్వపుగుణాలు బహుళంగా పెంపొంది, ఒక కట్టడనిర్మాణమే జరిగిందనే దాన్ని కాదనలేము. ఐతే యీ సుగుణాలే యీ కార్య నిర్వహణభారాన్ని వహించి నడిపినవి; ఆయన సత్యమైన వ్యక్తిత్వమూ, పురాణపురుషత్వాలతో సరిబోలే ముఖ్యాంశాలు అనేకం ఉన్నవి.

## కావ్యస్మృతి :

ఈవిషయాన్నిగూర్చి కొద్దిలో చెప్పాలంటే — యీ రెండూ కూడా కావ్యసంబంధంగానే ఉన్నవి; లేదా ఆకార విశేషాల్లో రోమన్‌ల తత్వానికి విస్పష్టంగా ఉన్నవి. వాషింగ్టన్ జీవితంనుంచి తిరిగి తిరిగి ఈ వర్జీనియన్ ప్లాంటర్ రెండవ సిన్‌సిన్నటస్ అని తెలుసుకోవటం విసుగెత్తుతుంది. ఐనప్పటికీ యీపోలిక శక్తివంతమైనది. నిజానికి ఈవిషయాన్ని తరిచి తరిచి చూసేకొద్దీ ఈ ఉభయులకూ సమానాంతరత మరింత అధికంగా కనిపిస్తుంది. 18-వ శతాబ్దపు ఆంగ్లేయుడైన పెద్దమనిషి, ఇంటిదగ్గరా, లేదా వర్జీనియా లాటి వలసలోకూడా, పౌరసత్వపు విషయంలో ద్విపాత్రాభినయం చేశారనే అనాల్సి ఉంటుంది. ఆయన గౌరవనీయుడైన రోమన్‌కూడాను. నిజానికి ఆయన అలాగే కనిపించేవారు; బలమైన ముఖం, గడ్డం లేకపోయినా, కండలు దేరిన

ఆ 18-వ శతాబ్దపు శిల్పాలలోని ముఖాన్ని బోలి, రోమన్ విగ్రహాలను అనేకసందర్భాలలో గుర్తుకుతెస్తూ, ఆ పురాతన ప్రపంచంలోకి ఊహల్ని మళ్లిస్తుంది. తెలిసో, తెలియకో - వాషింగ్టన్ కాలంనాటి శిల్పి తాను రూపొందించిన శిల్పాల లోని చాతుర్యాన్నీ, అనుసరించిన స్మృతినీ చాలావరకు రోమ్‌నుంచే దిగుమతి చేసుకున్నాడు.

ఆయన ఎడిసన్ విరచితమైన 'కేటో' నుంచీ, బెల్ వోయిర్‌లోని ఫెయిర్‌ఫాక్స్ కుటుంబీకులు అతిథులకుగాను కేటాయించిన పుస్తకంలో, వాషింగ్టన్ పెద్దన్నగారు వ్రాసిన 'ధైర్యసాహసాలు అన్ని ప్రమాదాలనూ అధిగమిస్తవి' అన్నమాటల్నీ తరుచు ఉదాహరిస్తూండటం కేవలం యాదృచ్ఛికంకాదు. ఆ శతాబ్దంలో బహు జనాదరణ పొందిన నాటకాల్లో 'కేటో' ఒకటి. యువకుడైన కన్నెక్టికట్ నాయకుడు నాథన్ హేల్ మనస్సులో అది సుస్థాపితమై ఉండి ఉండొచ్చు; ఏమైనప్పటికీ హేల్ మాట్లాడిన తుదిపలుకులు ("నాదేశం కోసం బలిపెట్టేందుకు నాకు ఒకే ఒక ప్రాణం ఉండటాన్ని గూర్చి నేను విచారిస్తున్నాను") ఎడిసన్ ప్రయోగించిన యీ మాటలను ప్రతిధ్వనిస్తూన్నవి; "మనదేశాన్ని రక్షించే నిమిత్తం మనం ఒకే ఒకసారి మాత్రమే చావగలగటం ఎంత శోచనీయం!"

పోతే సౌశీల్యమనేది ప్రసిద్ధికెక్కిన రోమన్‌ల సుగుణాలలో ఒకటి - అనుభవ పూర్వకంగా అది వర్జీనియా రాష్ట్రానికి సంబంధించిన సుగుణాలలో ఒకటి. సౌశీల్యాన్ని

బట్టే వాతావరణం కూడా ఉంటుంది. రోమ్ నాగరికత మార్షల్ నాగరికత; అది కొంచెం కఠినంగానూ, చమత్కార రహితంగానూ కనిపిస్తుంది. ఏమైనప్పటికీ దాని వేళ్ళు వాస్తవికతలో ఉన్నవే కాని, కవిచేసే ఊహాగానంలో లేవు. రోమ్ వానిసలుండే సమాజం; పోతే ముఖ్య పట్టణానికి ఆవలా, రాష్ట్ర కేంద్ర పట్టణాలకు ఆవలి పరిసర ప్రాంతాలలో క్షేత్రాలున్న ఎస్టేట్లు ఉండేవి. కుటుంబమే శక్తి సంపన్న మైనదనీ, దానిమీదనే ఆధారపడి ఉండాలనీ భావించే సమాజ మిది. ఈ సమాజం సుస్థిరమైన, ఒప్పుగా ఆలోచనలు చేసే పౌరులను రూపొందించి, పౌరధర్మ పరాయణత్వం, సద్గుణసంపద, తమ ముక్కుకన్న చూపు కాస్త ముందుకు పారించే తత్వమున్నప్పటికీ, కేవలం ఊహాగానాల మీద ఆధారపడిన వ్యక్తుల్ని తయారు చేసింది.

విశాల దృక్పథంతో చూసినట్లయితే ఆయన వ్యక్తిత్వ చిత్రణలో – యోధుడుగా, భూస్వామిగా, రాజకీయ విజ్ఞుడుగా – యీ మూడింటా ఆయన రోమన్‌ను బోలే ఉంటారు. వాషింగ్‌టన్ కుటుంబ పరిస్థితుల్లోనే రోమన్ తత్వానికి సంబంధించింది ఏదో ఉన్నది. ఆయనకు మౌంట్ వెర్నన్ మీద ఉండే అంతులేని ఆపేక్ష, తల్లి పట్ల ఆయన గుర్తెరిగిన తన విధులు, ఎన్ని కష్టాలు ఎదు రైనప్పటికీ కుటుంబీకులు - సోదరులు, చెల్లెళ్ళు, దాయా దులు, మేనకోడళ్ళూ, మేనల్లుళ్ళూ, సవితి సంతానమూ, ఇతర బంధువులపట్ల ఆయన విసుక్కోకుండా, ఫిర్యాదు

చేయకుండా వర్షించిన అనురాగమూ మొదలైనవి ఇందుకు తార్కాణాలు. సహృదయత – కేవలం మంచితనంగా ఉండటమేగాక – బాధ్యతా నిర్వహణను కూడా కోరుతుంది; అది వాషింగ్టన్ జీవితం పట్ల విస్పష్టమైంది.

ఇక వాషింగ్టన్ ఒక సామాజికజీవి. ఆయన యీ సమాజంలో కలిసినవారు కారు; మొదటినుంచీ సభ్యుడుగా ఉంటూన్నవ్యక్తి. ఈ పద్ధతులమీద అభివృద్ధిచెందిన వ్యక్తిత్వం పరిపూర్ణతను పొందినప్పుడు ఎంతో హుందాతనంతో గంభీరంగా కనిపిస్తుంది. ధైర్యసాహసాలు వాటంతటవే ఏర్పడటం, మరణం భయాందోళనలులేని విధివిలాసంగా పరిగణించబడటం జరుగుతుంది.

పోతే ఆశయం, కీర్తిప్రతిష్ఠలవిషయం అదొక పౌరధర్మంగా భావించబడిందేకాని, వ్యక్తిగతమైన పీడగా భావించబడలేదు. యువకుడుగా తనను నలుగురూ గుర్తించాలనే తీవ్రవాంఛనుంచి బైటపడ్డాక, పైచెప్పిన విషయం వాషింగ్టన్ పట్ల సత్యంగా పరిణమిస్తుంది. జాగ్రత్తగా ఆలోచనలుచేసి, తనకున్న కీర్తిప్రతిష్ఠలకు ఎలాటి భంగమూ కలగకుండా కాపాడుకోవాలనే వాంఛ పౌరాణికసంబంధమైనది. అంతేకాని బహుజనాభిప్రాయానికి అనుగుణంగా ప్రవర్తిస్తేనే తప్ప వీల్లేదనీ, లేదా ప్రముఖవ్యక్తులు ఇతరత్రా ఆ బహుజనుల్ని ఆకట్టుకునేందుకు చేసే ప్రయత్నాల్లాటివి– కేవలం నలుగురినోళ్లాపడటమే ఆశయంగా ప్రవర్తించటం, విరివిగా అమ్మే పుస్తకాలను వ్రాయాలనే వాంఛల్లాటివి –

వాషింగ్టన్ ఆశయాల్లో కనిపించవు. వాషింగ్టన్ యోధుడుగా ఉన్నప్పుడు, తన ఆఫీసర్లతో సంప్రదింపులు చేసే పథకాలు వేశారనేది నిజమే. ఇక ప్రెసిడెంట్ పదవిలో ఉండగా దేశం ఏ ధోరణిలో ఉన్నదో తెలుసుకుంటూండటమూ జరిగింది. కాని క్లిష్టపరిస్థితుల్లో ముందు వెనుకలు ఆలోచించని ఎంతో ఎత్తున ఆలోచనలు చేసే రోమన్ వలెనే వాషింగ్టన్ ప్రవర్తించారు. ప్రజలనుగూర్చి ఆయన మాట్లాడేప్పుడు ఆయనెప్పుడూ అలక్ష్యం చేయలేదు; అందుకని లొంగి లొంగి ఉండనూ లేదు.

వాషింగ్టన్ తాలూకు వర్జీనియా కేవలం ఆ పురాతన ప్రపంచపు ధోరణినీ, ఆయా అనుభవాలనుమాత్రమే అప్పగించిందనీ, లేదా ఆయన సమకాలీనులందరూ ఆయన వలెనే 'పురాణపురుషత్వాన్ని' ప్రదర్శించారనీ అనటం ఉబుసుపోక చేసే నటనలే అవుతవి. ప్లాంటేషన్ ముఖ్య వృత్తిగా ఉన్న వర్జీనియాను ఆయనమాతృదేశమైన బ్రిటన్‌కు పోల్చటంకన్న రోమ్‌కు పోల్చటమే సమంజసం. రోమ్ తాలూకు చిత్రణ ఇక్కడొక ఆదర్శంగా కనిపిస్తుంది.

రోమ్‌నుంచి నేర్చుకోదగిన పాఠాలున్నప్పటికీ కేవలం రోమే ఆదర్శంగానూ, అనుసరించి తీరవలసిందిగానూ భావించబడలేదు. రాజరికంనుంచి రిపబ్లిక్‌గా మార్పులు చేసేందుకు మధ్య ఎన్నో పనులు చేయవలసివచ్చింది; బలమైన సంబంధాలు లేని వలసలను బలమైన యూనియన్‌గా 1790 నాటికి రూపొందించేందుకూడా ఎంతో శ్రమపడవలసివచ్చింది.

కనుక స్వాతంత్ర్యంకోసం పోరాడటం అవసరమై, విజయాన్ని సాధించాక అది సత్యమైంది. ఉద్రిక్తపూర్వకంగా అమెరికా ఒకజాతిగా ఏర్పడేందుకు ముందే అది చట్టసమ్మతంగా జాతిగా రూపొందిందని చెప్పవలసిఉంటుంది. 'అమెరికనైజేషన్' అనేపదం మొట్టమొదటిసారిగా వాషింగ్టన్ కాలంలో రూపొందించబడి, యూరప్‌లో జరిగే పోరాటం నుంచి అమెరికాలో జరిగే పోరాటం భేదిస్తూన్నదని సూచించేందుకు ఉపయోగించబడింది.

ఆయన నిర్వహించిన కార్యకలాపాలకు అనుగుణంగానే ఆయన్ను తూచటం, తదనుగుణంగానే ఆయనపట్ల భక్తివిశ్వాసాలను ప్రదర్శించటంలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఆయన జీవితకాలంలోనే జ్ఞాపకం ఉంచుకోవలసిన ఇతిహాసంగా ఆయన మార్చివేయబడినారంటే అదీ ఆశ్చర్యపడవలసిన విషయంకాదు. 1775 లో ఆయన సర్వసేనాపతిత్వాన్నివహించిన కొద్దిమాసాలలోనే ప్రముఖస్థానాన్ని అలంకరించారు; సమరం సాగిన సంవత్సరాలందంతటా యీ స్థానం మరింతగా బలపడసాగింది. ఆయన మంచి యోధుడు, లేదా కార్యనిర్వహణలో అందెవేసినచేయిగా ఉండటం వల్ల మాత్రమే కాదు. ఆయన సమక్షంనుంచి సైనికులకు సరాసరి అందివ్వబడిన ఉద్విగ్నతలేదు. ఆయన ధైర్యసాహసాలు మెచ్చుకోదగ్గవే; కాని అవి విద్యుత్ ప్రవాహంవలె విస్తరించటం – కొంతమంది ఉన్నత సైనికోద్యోగుల్లో వలె-చూడనవదు. ఆయనకాలంలో ఆయనిచ్చిన ఆజ్ఞలకు' నగారాలమోతకు అనుగుణంగా సైనికులు హాహాకారాలు

చేయలేదు; ఐతే వాటినిగూర్చి వారు తీవ్రంగా ఆలోచించ వలసిన అవసరం ఏర్పడింది.

1776 జూలై 9 న ఇవ్వబడిన ఆజ్ఞలప్రకారం స్వాతంత్ర్యపత్రం చదివేముందు సైనికవిన్యాసం జరగవలసి ఉన్నది. ఆసమయాన స్పష్టమైన కంఠస్వరం అనేకసైనికపటాలాలకూ, మిగిలిన ఆయా ఆఫీసర్లకూ సైన్యంలో చేరిన ప్రతివ్యక్తీ ఇప్పుడు ప్రభుత్వసేవలో ఉన్నాడనీ, ఆయా సైనికుల యోగ్యతలను అనుసరించి వారిని తగినవిధంగా బహూకరించే అధికారం అందుబాటులో ఉన్నదనీ, ఇంకా ముందు ముందు దేశంలోని అధికగౌరవాలను అందుకునేందుకు ముందుకు సాగిస్తుందనీ చెప్పబడింది.

ఆయనమీదనే అమెరికా అభివృద్ధి అంతా ఆధారపడిఉన్నది. ఐనప్పటికీ భూతభవిష్యత్తులను మేళవించే ఆయన వ్యక్తిత్వం, వర్తమానకాలంలో ఎంతో హుందాతనంతో విలసిల్లింది. ఆయన అమెరికాకు సాంకేతికంగా ఉన్నారు; ఏ ఇతరసంకేతమూ ఇంతకన్న సత్యమైనదీ, అర్థంకాగలదీ, పదునైనదీ కాదు. స్వేచ్ఛాస్వాతంత్ర్యమనేది కొంతమంది భావించినట్లుగా కేవలం పగటికలగాకుండా, ఆయన అనుసరించినపంథావల్ల దానికొక సత్యమైన రూపధారణ లభ్యమైంది. ఊహాగానం చేసినవారికూడా సందేహాస్పదంగా ఉన్నవిషయాలను అంగీకారంగానే భావించి ఆయన నిర్వహించారు: చిత్రమేమంటే, భూమిమీద కాళ్లుమోపి ఉన్నప్పటికీ, స్వదేశీయులు ఆయన్ను ఆకాశంలోకి ఎత్తారు.

1777 లో వెలువడిన ఒకానొక పెన్సిల్వేనియా పత్రికలో ఇలా వ్రాయబడింది :

"ఆయన సౌశీల్యంలో ఏవైనా మచ్చలున్నప్పటికీ అవి చందమామలోని మచ్చల్లాటివి. దుర్భిణిలో చూస్తేనే తప్ప అవి కనిపించవు. ఆశయాలకు ఎంతో ప్రాముఖ్యత నిచ్చేకాలంలో ఆయన జీవించి ఉన్నట్లయితే, భగవంతునివలె పూజింప బడేవారు."

విమర్శలు :

కొంతమంది అమెరికన్‌లు ఆయన పూజించబడుతూన్నారని తలిచారు.

"ఈ సభలోని కొంతమంది సభ్యులు తమకుతామై రూపొందించిన ఆశయాలతో ఏర్పరిచిన ఒకానొక విగ్రహాన్ని పూజచేస్తున్నారని తెలిసి ఎంతో బాధపడుతున్నాను. ఈసందర్భంలో నేను మూఢ విశ్వాసంతో కొన్ని సంఘటనల్లో జనరల్ వాషింగ్‌టన్ పూజించబడటాన్ని గూర్చి మాట్లాడుతున్నాను. ఆయన సద్గుణాలకు నేను ఆయన్ను ఎంతో గౌరవించినప్పటికీ, ఈ సభలో మాత్రం నేను ఆయనకన్నా అధికుణ్ణని భావిస్తున్నాను. (జాన్ ఆడమ్స్)

దీని ద్వారా మనం వాషింగ్‌టన్‌నుగూర్చి కొంత తెలుసుకోగలం. మొట్టమొదటిది ఆయన్ను మాట్లాడుతూ విమర్శించినవారెవరు? యుద్ధసమయంలో ఇలాటి విరోధ భావం ఆయనకిందపనిచేసిన ఆఫీసర్లనుంచీ, ఆయన తాలూకు కాంగ్రెస్ సభ్యులైన స్నేహితులనుంచీ ప్రదర్శించబడింది. ఆతరువాత ఇలా ఎదుర్కొన్నవారిలో అత్యధికులు – మహామేధావులు, లేదా కనీసం వెనువెంటనే మాటకుమాట అంటించగలసమర్థులు. వీరు ఆయన్ను వేచుకుంటున్నారని

కానీ, లేదా ఏవగించుకుంటున్నారనికానీ చెప్పటం చాలా దూరం వెళ్లటమౌతుంది. ఆరాన్ బర్ నుగూర్చిరాస్తూ, జేమ్స్‌పార్టన్-వీరందరూ ఏవిధంగా తలపోసేవారో సంక్షిప్త పరిచాడు :

“ఆయన దృష్టిలో......వాషింగ్టన్ ఎంతో నిజాయతీ పరుడైన, సదుద్దేశాలున్న పెద్ద మనిషి; కాని ఆయన గొప్పయోధుడుకాదు - సగం భగవత్ స్వరూపమనే దానికి నిజంగానే చాలా దూరంలో ఉన్నారు. మందమతిగా కనిపించే వ్యక్తిని, పిరికివాని తరువాతివాడుగా బర్ ఏవగించుకొనేవాడు; ఆయన దృక్పథంలో వాషింగ్టన్ నిరుత్సాహాన్ని ప్రదర్శించే వ్యక్తి. హామిల్టన్ ఇలాటి ఇతర యోధత్వము, పాండిత్యమూ ఉన్న మరికొందరు-విప్లవ పోరాటంలో పాల్గొన్నవారు - పై చెప్పిన అభిప్రాయాల్లాటి వాటినే కలిగి ఉన్నారు.”

గొప్ప తెలివి తేటలు లేని వ్యక్తి వాషింగ్టన్‌కు ఇంత గొప్పకీర్తి లభించినందుకు వీరందరికీ కన్నెర్రనై ఒక తరగతిగా ఏర్పడినారు. ఆయన తిరిగి 1787 లో ప్రజాసేవను కోరే కార్యనిర్వహణకు పూనుకొన్నప్పుడు కొంతమంది తమ వ్యక్తిగతమైన ఉత్తరప్రత్యుత్తరాలలో వాషింగ్టన్‌ను ఎదిరించటమంటే అమెరికాకు అవిశ్వసనీయంగా ఉండటం లాటిదిగా పరిగణించబడుతూండటంవల్ల, అది అసాధ్యమైన పనిగా ఉన్నదని ఫిర్యాదులుచేశారు. హామిల్టన్ ఈ ఆయుధాన్నే ఉపయోగించి వాదప్రతివాదాల్లో నెగ్గుతూ, ఆ మహావ్యక్తిత్వంమీదనే రక్షణను పొందే ఉద్దేశ్యంతో ఆధారపడినాడు. 1785 లో జాన్ ఆడమ్స్ యీవిధంగా అసంతృప్తిపడ్డాడు :

"వాషింగ్టన్‌ను పూజించటంకన్న, ఆయనకు సరైన విద్యాబుద్ధులు గరిపిన జాతిని అభినందించవలసి ఉన్నది...ఆయన సౌశీల్యతను నేనెంతో కీర్తిస్తాను. ఎందుకంటే, అమెరికన్ సౌశీల్యతలో అంత ఉత్తమ శ్రేణిది మరొకటి కనిపించదు...పాంపే కాలంనాడైతే, వాషింగ్టన్ సీజరై ఉండేవారు; ఛార్లెస్ కాలంలో ఐతే ఆయన క్రామ్‌వెల్ ఐ ఉండేవారు; రెండవ ఫిలిప్ కాలంలో ఐతే, ఆరంజ్ యువరాజుగా, హాలెండ్‌లో ఒక పెద్ద జమీందారుగా ఉండాలని వాంఛించేవారు. కాని అమెరికాలో - కార్య నిర్వహణనుంచి నిష్క్రమిద్దామనే ఆశ మినహా మరొకటి ఆయనకు లేదు."

దీనిప్రకారం వాషింగ్టన్‌పట్ల పూజ్యభావాన్ని ప్రదర్శించటం అన్యాయమూ, పిల్లతనం, ప్రమాదకరంకూడానన్నమాట! ఐతే అమెరికన్‌లు సమదృష్టిగలవారు కానట్లయితే - వారు తిరిగి రాజరికాన్నీ, దాన్ని అంటిపెట్టుకొని ఉన్న అనేకచెడులనూ అధికారంలోకి తమ ఓట్లద్వారా తోడ్కొనివచ్చి ఉండేవారు. వాషింగ్టన్ విమర్శకుల్లో అత్యధికులు - అంతకుముందే యీ ప్రమాదాలు ఏర్పడి ఉన్నవనీ, యీ కలగాపులగమనేది అలవాటుగా మారిందనీ ఒప్పుకున్నారు. ఐతే వాషింగ్టన్‌మాత్రం మోసంవల్ల ఉప్పొంగలేదనీ, ఎప్పటికీ అలా జరగదనీ వారు తీర్మానించారు. ఏమైనప్పటికీ ఆయన కీర్తి పెంపొందసాగాక ఆయనకు ప్రజాసంబంధమైన తళతళ వచ్చిపడింది. ఆయన మానవమాత్రులనబడేవారినుంచి అధిగమిస్తున్నారు.

ఇలాటి అనేకఫిర్యాదులు ద్వేషకారణంగానో, లేదా రాజయకీయపక్షకారణంగానో ఏర్పడినందువల్ల ఏటిని చాలా

వరకు మనం గణనకు తీసుకోనవసరంలేదు. ఒకవిధంగా ఆడమ్స్ సరిగ్గా చెప్పినప్పటికీ, ఆయన వెలిబుచ్చిన అభిప్రాయం దయారహితంగానే ఉన్నది. వాషింగ్టన్ నిరాకరణ అమెరికన్‌లు రిపబ్లికన్ పద్ధతులమీద నడిచే ప్రభుత్వానికి విముఖులై ఉన్నారనేదాన్ని నిరూపించే పనికానేరదు. తన ఖర్చులుగాక, కొంత వేతనాన్నికూడా అంగీకరించమని ఆడమ్స్ వాషింగ్టన్‌ను కోరగా, వాషింగ్టన్ నిరాకరించారు; యీ రెండోసారికూడా ఆడమ్స్ సరిగ్గానే అన్నారు. ఇందువల్ల వాషింగ్టన్ కేవలం ప్రజాసేవకుని పాత్రనే వహించకుండా, అంతకన్న కాస్త పైకి పోయ్యే అవకాశం ఉంటుందనేది ఇందులో వ్యక్తమౌతూన్నది. ఐతే వాషింగ్టన్‌ను ప్రోత్సాహపరిచినవి అత్యున్నతాశయాలు. ఖండానికి సంబంధించిన కాంగ్రెసే తనకు యజమానులనే విషయాన్ని ఆయన అంగీకరించక తన సూక్ష్మబుద్ధిని ఉపయోగించారు.

ఆయన దృష్టిలోనూ, అనేకమంది అమెరికన్‌ల దృష్టిలోనూ అదంతా కేవలం దేశభక్తి ప్రాధాన్యమైన విషయమే. తన స్వగౌరవప్రతిష్ఠల్ని ఆయన దేశగౌరవ ప్రతిష్ఠలతో కలిపివేశారు. ఒకవేళ ఆయన ప్రమాదకరమైన పొరపాటుచేసిఉంటే – నిజంగానే ఆయన ఉద్యోగంనుంచి తొలిగించబడిఉండేవారా? ఆడమ్స్‌కూ, ఖండానికి సంబంధించిన ఇతర కాంగ్రెస్ సభ్యులకూ ఎదురైన సమస్య ఇది. వాషింగ్‌టన్‌ను తొలిగిద్దామని వారేం తీవ్రంగా ఆలోచనలుచేశారనికాదు; కాని యుద్ధసమయంలో తాను రాజీ

నామా ఇస్తాననే సూచనల్లాటివేవీ ఆయన చేయకుండటాన్ని వారు గమనించి ఉండాలి. కాన్వొకాబల్ కాలంలో విశ్వాస తీర్మానాన్ని ఓటుకు పెట్టాలని కానీ, లేదా యార్క్‌టౌన్ సంఘటనానంతరం ప్రచండ యుద్ధసమాప్తి జరిగిన సమయానకానీ ఆయనకు అలాటి విషయమే ఎందుకు స్ఫురించి ఉండలేదో వారిని ఆశ్చర్యపెట్టింది.

ఇందుకు జవాబిది: ఆయన తన బాధ్యతలను పరిపూర్ణంగా ఎరుగును; అందుకనే అలాటి పనులేమీ చేయలేకపోయ్యారు. తన అదుపాజ్ఞలే లేనట్లయితే అమెరికన్‌లు చేసిన యీ విప్లవపోరాటం సమూలంగా కూలిపోతుందనే ఆయన గాఢవిశ్వాసం సమర్థనీయమైనది. ఐతే ఆయన చుక్కాని పట్టుకొని ఎంత దీర్ఘకాలం ఉంటారో, ఆయన కామన్‌వెల్త్‌లో అంత గాఢంగానూ ఇరుక్కోవటమో, లేదా అందుకు సూచనగా నిలబడటమో జరుగుతుంది. దీన్నే కాస్తమోటుగా చెప్పాలంటే – వాషింగ్టన్ వ్యక్తిగా అంతర్ధానమై, ఒక సిద్ధాంతానికి దారిచేసి, అమెరికన్ యోగి జార్జ్‌గా రూపొందారు. ఈ సిద్ధాంతీకరణకు ఆయన ఎర అయ్యారు. ఐతే దీన్ని ఆయన స్వహస్తాలతోనే కొంత వరకూ తీసుకొచ్చుకున్నారు; కాని ఆయన గొప్పవిజయాలను సాధించినందువల్లా, లేదా రాజకీయవిజ్ఞుడుగా మౌనం వహించి గాంభీర్యతను ప్రదర్శించినందువల్లా, వేరొక ప్రక్క తన వ్యక్తిత్వాన్ని ప్రాముఖ్యతతో ప్రదర్శించినందువల్లా ఇదంతా సంభవించలేదు. ఆయన వ్యక్తిత్వానికి తగినట్లుగా,

వేరేదీ ఆయన చేయలేకపొయ్యారు. ఈ బరువు బాధ్యతలు మీాదపడగా ఆయన ఎంతగా తన ఆక్షేపణలను వెలి బుచ్చినా, ఎంత మూలిగినప్పటికీ ఫలితాలుమాత్రం తప్పిం చుకోలేనివైనవి. అమెరికా సంక్షేమలక్ష్యాన్ని ఎప్పుడైతే ఆయన ఆదర్శంగా స్వీకరించారో, అప్పుడే ఆయన తనను తానొక అభ్యర్థిగా రూపొందించుకున్నారు. మరణము, లేదా దీర్ఘకాల వ్యాధిగ్రస్తత, లేదా తీరని కళంకం సంభ వించి ఉంటేనే తప్ప - యీ సర్వసేనాని తిరిగి ప్రెసిడెంట్ పదవిని అలంకరించకుండటమనేది సంభవమై ఉండేదికాదు.

ఆయన ఎప్పుడైతే ప్రెసిడెంట్ అయ్యారో ఆక్షణానే ఆయన జ్ఞాపకార్థం నిర్మించబడిన కట్టడంలోనుంచి విడదీసేం దుకు వీల్లేకుండా లీనమైపొయ్యారు. వాషింగ్టన్ అధి కారంలో ఉండగా తానుకూడా ఫెడరలిస్టేనని ఎన్నడూ అంగీకరించకపోయినప్పటికీ, ఫెడరలిస్టుల ఆశయాలకు తన కీర్తిప్రతిష్ఠలను ఆయన ఎరువివ్వటం జరిగింది - ఇంతకన్న మంచి ఆదర్శం, అంగీకార యోగ్యమైనది లేదని ఆయన అభిప్రాయపడినకారణాన. ఆయన మరణానంతరం ఫెడర లిస్టులు ఆయన్ను నాయకుడుగా చేసిన పురాణాన్ని వాషింగ్టన్ బెనివొలెంట్ సమాజాలద్వారా స్వప్రయోజ నాలకు ఉపయోగించటాన్ని రిపబ్లికన్‌లు కళ్లారా చూడ వలసివచ్చింది. అమెరికన్‌లు వాషింగ్టన్‌ను ఎదుర్కోవ టంలో ఎంతో నిర్లక్ష్యతను ప్రదర్శించారు. కాంగ్రెస్‌లో రిపబ్లికన్‌లు ఇచ్చిన ఉపన్యాసాలు మొదట్లో వాషింగ్‌టన్‌ను అభినందించే ధోరణిని కనబరిచినవి; ఉత్తరోత్తరా అవి

ఆయన్ను ఎదుర్కొనేవిగా ఉన్నప్పటికీ అంత తీవ్రమైన వేం కావు. నిజానికి రిపబ్లికన్‌లుకూడా వాషింగ్‌టన్‌ను కీర్తించే వాంఛలకులోనయ్యారు; కాని అందువల్ల రాబోయే ఫలితాలను తెలుసుకోని ఆందోళనజెందారు. ఆయన ఫెడరలిస్ట్‌లకోట వెనుక ఉండగా ఆయ నెంతో కఠినుడుగానూ, దరిజేరలేని మహాపురుషుడుగానూ, తనను ఎదుర్కొనే విమర్శలవిషయంలో నిర్లక్ష్యతను ప్రదర్శించే వ్యక్తిగానూ కనిపించసాగారు. చిత్రమేమంటే, 1794 లో విస్కీవిషయంలో పెన్సిల్వేనియాలో జరిగిన తిరుగుబాటులో ప్రెసిడెంట్ ఆజ్ఞానుసారంగా అరెస్టయిన పురుషుల్లో సగంమంది వాషింగ్‌టన్ గౌరవార్థంగా పేరుపెట్టబడిన జిల్లా-వాషింగ్‌టన్ వాసులేకదా!

విషాదం :

ఏమైనప్పటికీ వాషింగ్‌టన్‌ను విమర్శించినవారు సహృదయత్వానికి సుదూరంగా ఉన్నారు. ఈ ధోరణి ముందుగానే ఊహించబడిందనీ, లేదా మొత్తంమీద దీన్ని ప్రోత్సాహపరచాలనేవిషయాన్ని వారు గ్రహించలేదు. అలాటిదాన్ని ఆమోదించేందుకు వారు ఏవగించుకున్నారు. వాషింగ్‌టన్ ఫెడరలిస్ట్‌లచేతుల్లో కీలుబొమ్మకాదు. దాదాపు అందరు అమెరికన్‌లకూ ఆశాజనకంగా ఉండే విషయాలను ఆయన సమీకరించారు. ఆయన ఒకవేళ బలహీనుడూ, మూర్ఖుడూ, తలనెప్పి తెప్పించే వ్యక్తీఐనప్పటికీ – ఆయన అలాటివాడుకానేకాదు–వాషింగ్‌టన్ పట్ల జనసామాన్యంలో

ఉండే అభిమానం ఎంతో బరువైనది. దీన్నిగూర్చి ప్రత్యేక దృక్పథమున్న అమెరికన్‌లు చేసిన ఫిర్యాదులు ఒక చెడును గూర్చికాదు; ఒక మంచి మితిమీరినందుకు కారణమైన ఒక వరాన్నిగూర్చి. వారు నిజమైన అమెరికన్ పంథాలో అక్రమంగా, బాధ్యతారహితంగా, క్రూరంగా, పూజ్యభావాన్నే పారద్రోలినవిధంగా ప్రవర్తించారు.

ఇంకా లోతులకు వెళ్లి ఆలోచించక వాషింగ్‌టన్ సమకాలీనులు ఆదులో ఇమిడిన విషాదాన్ని గ్రహించలేదు. ఇతరులు-ముఖ్యంగా యూరపియన్‌లు ఆయన అందుకున్న ఉన్నతశిఖరాలలో విలక్షణంగా ఉండే యీ విషాదాన్ని స్పష్టంగా అర్థంచేసుకోగలిగారు.

ఆయన తన విధులను సక్రమంగా నిర్వర్తించి నందుకూ, తదనుగుణంగా నలుగురిచేతా శ్లాఘించబడినందుకూ ఎంతో తృప్తిపడ్డారు. ఐతే కొంతమందివలె ఆయన బాహాటమైన జీవితాన్ని జీర్ణించుకోలేకపోయ్యారు. ముఖ్యంగా ఆనందాన్ని అనుభవించటమనేవిషయం ప్రాముఖ్యతను వహించలేదు. జాతిపితగా భావించబడే వాషింగ్‌టన్ సంతానహీనుడు. ఆయన చారిత్రాత్మకపురాణంలో ఇది ఎంతోచక్కగా అమరే విభాగమైనప్పటికీ, నిజమైన వ్యక్తిత్వానికి తనకు ప్రత్యక్షవారసులు లేకుండటమనేది ఎంత నిరాశాపూరితంగా ఉండగలదో మనం ఊహించగలం. మౌంట్ వెర్నన్‌ను అభివృద్ధిచేద్దామని ఆయన దీర్ఘకాలం ఎంతో శ్రమించారు; ఆయన జీవితంలోని తుదిభాగాల్లో ఆ

స్వగృహంనుంచి ఆయన దూరదూరాలకు తరిమివేయబడ్డారు. కొద్దికాలంపాటు లభ్యమైన మనశ్శాంతి యుద్ధభయంవల్ల చెడగొట్టబడింది.

ప్రతిమానవజీవితంలోనూ విషాదభాగ మనేది ఉండక పోదు. ఐతే వాషింగ్టన్ జీవితంలో ప్రాముఖ్యత వహించిన విషాదం - ఆయన బహిరంగ జీవితాన్నీ, వ్యక్తిగత జీవితాన్నీ విడదీసేది ఉన్నది. రాజకీయంగా ఆయన ముట్టిన దంతా విజయవంతమైంది; ఆయన తనకుతాను చేసుకున్న దంతా చిత్రంగా బుద్బుదప్రాయమైంది. వెస్ట్‌మోర్‌లాండ్ జిల్లాలోని ఆయన జన్మస్థలం 1779 లో అగ్నికి ఆహుతైంది. ఆయనెంతో మనసుపడిన మౌంట్ వెర్నన్ ఎస్టేట్ లాభదాయకంగా లేదు; అక్కడి నేల నిస్సారంగా ఉండటం, గాలి వాటులు అనుకూలంగా లేకుండటంతో వాషింగ్టన్ ఆలోచనలూ, వహించిన జాగ్రతలూ, పడినశ్రమా సత్ఫలితాలను ఇవ్వలేదు. అనావృష్టి, క్షుద్రజీవులు, రోగగ్రస్తతా - మానవ శత్రువులకన్న ఘోరమైన శత్రువులుగా పరిణమించినవి.

ద్రాక్షతోటలో చుట్టూవేసిన హనీలోకస్ట్ కంచెలు అంతరించినవి. ఆయన దిగుమతి చేసిన కొన్ని ప్రత్యేకమైన చెట్లు క్షీణించిపోయినవి. ఆయన లేళ్లునివసించే పార్కు నిర్మించారు; ఆ లేళ్లు తప్పించుకోవటం, ఆ పరిసరాల్లోని మొక్కల్ని పాడుచేయటం ఎప్పుడూ జరుగుతూనే ఉండేది; కొద్ది సంవత్సరాల తరువాత ఆపార్కును వొదిలివేయవలసి వచ్చింది. ఈ శ్రమంతా నిరాశాపూరితంగానూ, ఫలితం

లేకుండానూ తయారైంది; జార్జ్ వాషింగ్టన్‌కు శాశ్వత మైన నివాసమనేది లేకుండా చేయాలని బహుశా విధి ఉద్దేశించిందేమో! సమర్థుడైన వారసుడంటూ ఉన్నప్పటికీ, ఆ వారసుడు ఎంత శ్రమపడినా, మౌంట్ వెర్నన్ మీద అయ్యే ఖర్చులను ఏవిధంగానూ సమర్థించలేక, చివరకు దాన్ని శిథిలావస్థలో, లేదా అదంతా ఒక అడవిగా మారటాన్ని, అదీకాకుంటే కృత్రిమంగా రూపొందించబడిన ఒక ఆలయాన్ని చూసి ఉండేవాడు!

అమెరికా భూభాగం పశ్చిమానికి విస్తరించసాగింది. అక్కడ కూడా వాషింగ్టన్ చేతికి ఇంద్రజాలం లోపించింది. పశ్చిమాన ఆయనకు ఎంతో విలువైన భూఖండాలున్నవి. కాని ఆయన మరణానికి కొన్ని సంవత్సరాల క్రితమే ఆభూములు తనకు మరింత ఆవేదనను తెచ్చిపెడుతవనీ, ఆదాయంకన్న బాధ ఎక్కువనీ ఆయన నిశ్చయించుకున్నారు. అల్లెఘనీ పర్వతశ్రేణులకు పశ్చిమాన నదీజలాల్ని మళ్లించి, జలమార్గం - ప్రయాణ సౌకర్యాలున్నదాన్ని - సృష్టించేందుకు సిద్ధపడిన పొటొమాక్ కంపెనీ ఏమైంది? ఈ పథకంమీద వాషింగ్టన్ ఎంతో శ్రమదానంచేశారు; ఎన్నో ఆశలు మోపుకున్నారు. వర్జీనియా శాసన సభ వారు ఇందువల్ల వచ్చే ఫలితాలు ఆయన కీర్తిని శాశ్వతపరుస్తవని అభిప్రాయపడ్డారు. ఐతే ఆయన మరణానికి ముందే యీ కంపెనీ వ్యవహారాలు ఏమీ బాగాలేవు; ఆ తరువాత 30 సంవత్సరాలకు అది దివాళా తీసింది.

ఆయన వేళ్లుపెట్టిన ఇతర వ్యవహారాలలో కూడా ఫలితాలు ఇలాగే ఉన్నవి. అవి సరైన పథకాలు కాకుండటం, లేదా జాగ్రత్తగా ఆలోచనచేసి ఉండక పోవటంవల్ల గాక – వాటి విధివ్రాలు అలా ఉండటం జరిగింది. వాషింగ్టన్ హృదయ పూర్వకంగానూ, శ్లాఘనీయమైన ఉద్వేగంతో జాతీయ విశ్వ విద్యాలయాన్ని స్థాపించాలనీ, అది కొలంబియా జిల్లాలో ఉండి, యూనియన్‌లోని నలుదిశల నుంచీ విద్యార్థుల్ని ఆకర్షించాలనీ ఉద్దేశించారు. పోటొమాక్ కంపెనీలోని ఆయన తాలూకు 50 షేర్లను ఇందు కొరకు ఆయన వీలునామాలో కేటాయించారు; కాని అనేక కారణాలు వీలునామాలోని యీ విభాగం అమలు జరుగకుండా అడ్డుపడినవి.

పోతే ఫెడరలిస్టులతోడి ఆయన కలుపు గోరుతనం. దీన్ని చివరకు ఆయన ఒప్పుకున్నారు. ఆయన మరణానంతరం యీ రాజకీయ పక్షం తాలూకు అపజయం ప్రతిధ్వనించి, ఆ తరువాత ఎప్పుడూ ప్రెసిడెంట్ పదవిని సాధించ లేదు. నిజానికి అది ఒక రాజకీయ శక్తిగా ఉండలేక విడిపోయింది. ఈ శిథిలావస్థలో కొన్ని సంవత్సరాలపాటు వాషింగ్‌టన్ తాలూకు కీర్తికూడా దెబ్బతిన్నది; నూతన శతాబ్దంలోని మొదటి దశాబ్దంలో వాషింగ్‌టన్ జ్ఞాపకార్థం నిర్మించబడిన కట్టడం దాదాపు మరుగునపడిపోయింది.

ప్రవర్తనలో, మంచి మర్యాదలలో చూపవలసిన స్వల్ప విషయాలను అనుసరించడం ద్వారా వాషింగ్‌టన్

తన కష్టపరంపరను బహుశా అధికం చేసుకున్నారు. మరొక సారి వేతనం లేకుండానే తాను సేవచేస్తానన్న వాషింగ్టన్ మాటల్ని కాంగ్రెస్ అంగీకరించి ఉన్నట్లయితే ఆయన కష్టాలు మరింత అధికమై ఉండేవి. ఆయన ప్రెసిడెంటు పదవి అంతమయేసమయానికి – అంతకు క్రితం ఆయన ఎంత బాగా అమెరికా భూత, వర్తమాన కాలాలకు చిహ్నంగా ఉన్నప్పటికీ, ఇప్పుడు అమెరికా భవిష్యత్తుకు చిహ్నంగా ఉండటం నుంచి విరమించారు.

కొద్దిలో చెప్పాలంటే – యీ ప్రెసిడెంట్ పాత్ర ఒక చిత్రమైన, తక్కువరకం అభిరుచులతో కూడుకొన్నదని తలచబడుతూ, అమెరికన్ గూఢ రహస్యాలలో జమ కట్టబడవలసి ఉన్నది. అది గాంభీర్యాన్ని కోరుతుంది; అదే సమయాన దుర్భాషలనూ ఆహ్వానిస్తుంది. ఫ్రేజర్ విరచితమైన 'గోల్డెన్ బౌ' గ్రంథంలోని రాజువలె – మరణదండన విధించబడే వరకూ మహా వైభవంగా రాజ్యపాలన సాగుతుంది; భేదమల్లా అమెరికన్ పాలకుడు ఒక్కసారిగాగాక చిత్రవధ గావించబడిన విధంగా, అధికారం నుంచి తొలగించబడే వరకూ బాధపడవలసి ఉంటుంది. పూజించాలనే తీవ్రవాంఛా, అపకీర్తిపాలు చేయాలనే తీవ్రవాంఛా యీ రెండూ కూడా చెట్టాపట్టాలు వేసికొని వాషింగ్టన్‌ను ఎన్నో ఇబ్బందుల పాలు జేసినవి. ఎందుకంటే ఆయన ఏ ఇతర అమెరికన్ రాజకీయ వాది వలెగాక, జనహితుడైన నాయకుడుగా అధికారంలోకి వచ్చారు. ప్రెసిడెంట్ అత్యద్భుతమైన మేధాశక్తిని ఉపయోగించి, అద్భుతాలు చేయ

గలిగి ఉండాలనీ, వేరొకవైపున సామాన్యుడుగానూ ఉండాలనీ భావించబడటంలో మొదటి నిర్ణతకాలంలోని కార్య నిర్వాహణసమయంలో వాషింగ్టన్‌కు మినహాయింపు ఇవ్వబడలేదు. ఆయన నుంచి ప్రతిదీ ఆశించబడింది. ఐతే ఆయనకు ఇవ్వబడిన ఆధారం అప్పుగా తప్ప మరేవిధం గానూ ఇవ్వబడ లేదు; ఇళ్లుకానీ, అలంకరణలుకానీ, బిరుదులుకానీ లేవు. దేశానికి ఆయన బలిపెట్టబడి, సజీవ చిహ్నంగా మాత్రం ఉన్నాడు.

జాన్ ఆడమ్స్ ముక్కోపంతో వాషింగ్టన్ పట్ల చేసిన పరిశీలనలు ఇక్కడ ప్రాధాన్యతను వహిస్తవి. వేతనం లేకుండానే సేవచేస్తాననటం వాషింగ్టన్ ఆత్మాభిమానాన్ని నిరూపిస్తుంది; అదే విధంగా ఎనిమిదేళ్లపాటు సర్వసేనాపత్యాన్ని వహించాక తాను విరమిస్తాననటం కూడ అంత పెద్ద తప్పేను - అన్నాడాయన. (ఇదంతా వాషింగ్టన్ ప్రెసిడెంట్ కాకపూర్వం ఆడమ్స్ వ్రాసింది.)

అమెరికన్ దృక్పథం సారవంతమై భూమిమీదనే వేళ్లు తన్నుకున్నదిగా చూసేందుకు మనం అలవడివున్నాము. ఒక విధంగా అది అంతే. వాషింగ్టన్ హృదయంకూడా నిజానికి అలాగే వున్నది. ఐతే అది దట్టంగాను, నిశితంగాను, ఐహికసంబంధమైన బ్రిటిష్ నేతనుంచి ఉద్భవించింది కావటంతో— అది ఆశ్చర్యపడేటంత సన్నగాను విస్తరించివుండే సాహసికతతో కూడివున్నది. ఎబాకెర్ బేదగ్గిర యుద్ధం జరిగిన నాటి సాయంత్రం రియర్ ఎడ్మిరల్ హారేషియో

నెల్సన్, సి. బి., తన డిన్నర్ టేబిల్ దగ్గర లేచి నిలబడి, మూతితుడుచుకొని ఇలా అన్నాడు : "రేపీపాటికి నేనొక పీర్ నన్నా అవుతాను; లేదా వెస్ట్‌మినిస్టర్ అబ్బేలో నా సమాధన్నా నిర్మించబడుతుంది." బ్రిటిష్ సమాజంలోని అంచనాలు వాస్తవికతకు దరిదాపుల్లో ఉండటంవల్ల, ఆయన వేసిన అంచనా సరిగ్గా సరిపోయింది. ఆ యుద్ధంలో ఆయన విజయాన్ని పొందటమూ, జమీందార్ నెల్సన్ కావటమూ కూడా జరిగినవి. అంతకన్న చెప్పుకోవలసింది-పార్లమెంట్ ఆయనకు ఏటా 2,000 పౌనుల పెన్షన్ యిచ్చింది ; ఈస్టిండియా కంపెనీ ఆయనకు 10,000 పౌనుల బోనస్ యిచ్చింది. నేపిల్స్ రాజు ఆయనకు ఒక జమీందారీ యిచ్చాడు — దాని మీది ఆదాయం ఏటా 3,000 పౌనులుంటుంది ; ఆ తరువాత ఆయనకు లేడీహామిల్టన్ ప్రియురాలైంది. ఆ తరువాత ఆయన ట్రెఫాల్గరీలో మరణించగా - వెస్టుమినిస్టర్‌ను ఆయన చేరలేకపోవటం నిజం ; ఐనప్పటికీ అంత గౌరవంతోను ఆయన సెయింట్ పాల్స్ కెథీడ్రల్ లో సమాధిచేయబడినారు.

ఈ జీవితంతో వాషింగ్‌టన్ జీవితాన్ని పోల్చి చూస్తే తేలిగ్గా అర్థమవగలదు. వాషింగ్‌టన్ ఒంటరిగా, యోధుడుగా తాను వేసిన పథకాలతో ఎంతో బాధపడుతూ, ఒక పక్క జాగ్రతా, మరొకవైపు విజ్ఞతా, ఇంకోవైపు కుంగిపోవటాలు అసంభవమైన నివృత్తిలో ఆయన్ను ఎంత వేధించివుంటవో ఊహించవచ్చు. అదేవిధంగా ప్రధాన కార్యనిర్వాహకుడుగా ఆయన ఒంటరిగా, కొద్దిమంది సహా

యకులతో మోయలేని బరువుభారాలతో కుంగిపోయారు; ముద్దులొలికే యీ కొత్తజాతికి పితృత్వాన్ని వహించి, ఎంతో ప్రశాంతచిత్తంతో, హుందాతనంతో దాన్ని ఆదరిస్తూ, ఎంతో తక్కువ ఆదర్శాలతో కాలం గడపవలసిన దారుణపరిస్థితుల్ని ఆయన అనుభవించారు. నెల్సన్‌కు లభ్యనవి అందమైనవీ, నిజమైనవీను. వాషింగ్‌టన్‌కు లభ్యమైనవి ఉత్ప్రేక్షలుమాత్రం. ఆయన గుండెలమీద మెరిసే నక్షత్రాలంకరణలేమీ లేవు. చివరకు ఆయనకు సిన్సిన్నటీ చిహ్నాలంకరణకూడా లేదు. ఆయన్ను సంబోధించటంలో కూడా బరువైన పదజాలమేమీ - వైకౌంట్ నెల్సన్, డ్యూకాఫ్ బ్రొంటీలాటివి-లేదు. కేవలం మిస్టర్ ప్రెసిడెంట్ మాత్రమే ఆయనకు దక్కింది. ఆయనమంచంమీదమాత్రం యోధులు ధరించే ఆయుధాలు పెయింట్ చేయబడినవి; ఆ తరువాత ప్రెసిడెంట్ పదవులను అలంకరించినవారిపట్ల ఇలాటిది హాస్యాస్పదంగా పరిగణించబడింది. ఆయన సురక్షితంగా చనిపోయ్యేవరకూ ఆయనతల నాణాలమీద ముద్రించబడలేదు. బాల్యదశలోవున్న రిపబ్లిక్ తన కీ గౌరవాలన్నీ చేయలేదని వాషింగ్‌టన్ కించపడలేదు. మానవులు దురాశాపరులు కావటంవల్ల ప్రముఖకార్యనిర్వహణ జరిగే యీ అధికారం ఎంతో తక్కువ ఆకర్షణీయంగా ఉండటమే శ్రేయస్కరమనే విషయంలో ఎలాటి సందేహమూలేదు. ఐతే ఇదంతా ఎంత నిరుత్సాహకరంగా, ఆహ్లాదరహితంగా ధ్వనిస్తుంది! 1783 లో వాషింగ్‌టన్ శిలావిగ్రహాన్ని వేయాలని కాంగ్రెస్ నిర్ణయించింది; కాని 1860 దాకా అందుకు తగిన ఏర్పా

ట్లను కాంగ్రెస్ చేయలేదు. 1885 కు కాని వాషింగ్టన్ డి. సి. లో ఆ బ్రహ్మాండమైన వాషింగ్టన్ శిలావిగ్రహం స్థాపించబడలేదు. అంటే ఏ వ్యక్తికి ఆ విగ్రహం సంబంధించిందో—ఆయన చనిపోయిన 87 సంవత్సరాల తర్వాత కాని అది స్థాపించబడలేదు!

ఎండకుఎండి, వానకుతడిసి, చుట్టూవున్న క్షేత్రంలో చెదలు పుట్టలుపెట్టగా, భవనంచుట్టూ పిచ్చిమొక్కలు గుబుర్లుగా పెరగ్గా మౌంట్ వెర్నన్ ఎలాఉండేదో ఊహించు. మౌంట్ వెర్నన్ ఒక మేనల్లునికి సంక్రమించి, ఆ తరువాత ఆ మేనల్లుని మేనల్లునికి సంక్రమించింది. ఆయన యోగ్యుడే ఐనా దరిద్రుడు. ఈస్థితిలో అది కాంగ్రెస్‌చే ఉద్ధరించబడ లేదు. మౌంట్ వెర్నన్ మ హి ళా సమాజంవారు ఉపన్యాసాలనుఏర్పాటుచేసి,తద్వారా లభ్యమైన ఆర్థికసహాయంతో దాన్ని పునరుద్ధరించారు.

విజయం :

అది అంతేనా? నిజంగానే—కాదు. వాషింగ్టన్ విషయంలో అది రిపబ్లిక్ ఐనప్పటికీ సామ్రాజ్యం అక్కడ ఉండనే ఉన్నది. అదేవిధంగా వారసులు గూడాను—వారందరూ కలిసి ఒకే జాతి ఐనప్పటికీ!

సమతలంమీాది శబ్దంతో దీన్ని పూర్తిచేయటం నిజంగానే ఒక తప్పుగా పరిణమిస్తుంది. ఏ గొప్పవాని జీవితంలో నుంచైనా సరే ఒక విషాద వీచిక వాషింగ్టన్ జీవితం

మీదికి ప్రసరిస్తుంది. గాఢానురాగాన్ని ఆవేశింప జేయటం కన్న భయాన్ని రేకెత్తించటం, ఉడుకురక్తాన్ని గడ్డకట్టించటం కఠినమే అవుతుంది. ఎందుకంటే ఒకరి తత్వం అలాంటిది. అలాటి గడ్డకట్టిపోయిన అద్భుతంమీదనే అమెరికా బరువుమోపింది. వాషింగ్టన్ తన లోపాలను తాను గ్రహించిన వ్యక్తి; అలాటి వ్యక్తికి ఎన్నో బాధ్యతలు తల మీద మోపటం విషాదకరం. అంతులేని సమరంలోకి ఉరకటం, చర్చలూ, వివాదగ్రస్తమైన హంశాలూ, క్లిష్టపరిస్థితుల్లో ఇరుక్కోవటం మొదలైనవి కత్తిమీది సాములు.

ఐనప్పటికీ వాషింగ్టన్ వొదిలిన రికార్డులు ఎంతో తృప్తికరమైనవి. తనను ఏం చేయమన్నారో ఆ పనిచేసిన వ్యక్తి ఇక్కడ మనకు సాక్షాత్కరిస్తారు. ఆయన బలాతిశయాలు నిగూఢంగా ఉంటూ, కొంతమందిచేత ప్రమాదకరమైన నిరుత్సాహంగా అంచనాలు వేయబడినవి. ఐతే ఆయన వ్యక్తిగతంగా అమెరికా సుస్థిరత్వాన్ని రుజువు చేశారు. ఆయన మంచివారు—కాని యోగికాదు; ఆయన సమర్థుడైన యోధుడు – గొప్ప యోధుడుకాదు ; ఆయన నిజాయితీపరుడయిన కార్యనిర్వాహకుడు; రాజకీయ విజ్ఞుడేం కాదు ; వివేకంతో మాట్లాడగలవ్యక్తి; చండప్రచండుడైన సంస్కారికాదు. యీ మొత్తమంతా కూడుతే ఒక అసాధారణమైన వ్యక్తి.

ఇక ఆయనకు మిగిలిన ఓదార్పులివి: తాను ముక్కుసూటిగా వ్యవహరించి, ఎంతో గౌరవాన్ని పొందాడు ;

తాను ఎంతో మనసుపడిన స్వగృహంలో చనిపోబోతు న్నాడు—ప్రపంచంలో మరెక్కడో యీ మరణం తనకు ప్రాప్తించలేదు; తన యీ అంత్యక్షణాల్లో 40 సంవత్సరాల పాటు తానెంతో విశ్వాసనీయుడుగా ఉన్న తన భార్య సమ క్షంలోనే యీ మృత్యువు తనకు ఆసన్న మౌతున్నది. ఆయన బహిరంగజీవితం తలక్రిందుల ధోరణిలో ఉన్నది. అమెరికన్ ఐక్యత నిశ్చలంగా ఉన్నదనీ, ఇతర వ్యక్తుల వలెనే అమెరికాను రూపొందించేందుకు తానుకూడా తన పాలు శ్రమను వినియోగించాననీ, తన కాలం తీరిపోయినప్ప టికీ, కాలమనేది తనదేశంవైపుకి మొగ్గి ఉన్నదనీ తెలుసు కొనే ఆయన శాశ్వతంగా కన్నుమూశారు. చరిత్రలో కని పించే అనేక వ్యక్తిత్వ విజయాలకన్న శాశ్వత రూపాన ఉన్న విజయమిది!

ఈ కీర్తిలో ఆయనకు చెందవలసింది ఎంతో మనం చెప్పలేము; తుదిపరిశీలనల్లో యీ ప్రశ్న అసంబద్ధమై నదిగా పరిణమిస్తుంది. ఆయన అమెరికాలో ఎంతగా లీనమై పొయ్యారంటే — భూమిమీద పేళ్ళల్లో ఆయన దొకటి; గాలిలోకూడా ఆయనసమక్షం ప్రత్యక్షమౌతుంది. వాషింగ్ టన్‌ను అపౌరాణిక వాతావరణంనుంచి విడదీద్దామనీ, ఆయా ఇతర విగ్రహాలనుంచి వేరుచేద్దామనీ చరిత్రకారులు ప్రయ త్నాలు చేసుకోవటం మినహా — పోస్టేజిస్టాంప్‌మీదా, డాలర్ బిల్ మీదా, కాన్ ఫెడరేట్ సీల్ మీదాఉండే ఆగుర్రపు రౌతు బొమ్మ ఎంతో పరిచితమైనది. అందుకనే దాన్ని పరీ

ష్కగా చూసేందుకు ఎవ్వరూ ప్రయత్నించరు. ఆండ్రూ జాక్సన్ ప్రెసిడెంట్ పదవికి ఆత్రపడుతూ, 'రెండవ వాషింగ్టన్' కావాలనే ఉద్దేశ్యంతో — ఛర్రీచెట్టు, సిన్సిన్నటస్ నాగలిపట్టుకోవటం, డిలావేర్‌లోని మంచుగడ్డల్ని నలగ్గొట్టటం, ఊహించబడిన ఇండియన్‌నాయకుడు మోనన్ ఘొలాలో 'మానవమాత్రుని తుపాకిగుండేదీకూడా జార్జ్ వాషింగ్టన్ ప్రాణాలను తీయలేదు' అన్న ఆయన అభియోగాలు ఆయన్నేమీ చేయలేవు. ఆ వ్యక్తే జ్ఞాపకార్థం నిర్మించబడిన ఆ కట్టడం; ఆ కట్టడమే అమెరికా.

చరితార్థుడు జార్జ్ వాషింగ్టన్.



---



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPCA108B143 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 327 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV, BCJ |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Heena |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |